# నిత్యప్రార్థన - ద్వాదశ నామావళి

(ప్రతిరోజు ఉదయం ప్రతి ఒక్కరు తప్పనిసరి చేయాల్సిన పన్నెండు నమస్కారాలు)

1. ఓం భూదేవ్యై నమః (శ్రీ భూమాతకు నమస్కారం!)
2. ఓం జలదేవాయ నమః (శ్రీ జల దేవునకు నమస్కారం!)
3. ఓం అగ్నిదేవాయ నమః (శ్రీ అగ్ని దేవునకు నమస్కారం!)
4. ఓం వాయుదేవాయ నమః (శ్రీ వాయు దేవునకు నమస్కారం!)
5. ఓం ఆకాశదేవాయ నమః (శ్రీ ఆకాశదేవునకు నమస్కారం!)
6. ఓం సూర్యదేవాయ నమః (శ్రీ సూర్యదేవునకు నమస్కారం!)
7. ఓం చంద్రదేవాయ నమః (శ్రీ చంద్రదేవునకు నమస్కారం!)
8. ఓం కాలదేవాయ నమః (శ్రీ కాలదేవునకు నమస్కారం!)
9. ఓం మాతృదేవ్యై నమః (శ్రీ మాతృదేవతకు నమస్కారం!)
10. ఓం పితృదేవాయ నమః (శ్రీ పితృదేవునకు నమస్కారం!)
11. ఓం ఆత్మదేవాయ నమః (శ్రీ ఆత్మదేవునకు నమస్కారం!)
12. ఓం పరమాత్మదేవాయ నమః (శ్రీ పరమాత్మదేవునకు నమస్కారం!)

శ్రీ సిద్ధకుంజికా విశ్వరూప మహాకాలాభ్యాం నమః

# దివ్యజ్ఞాన రహస్యము

## ఆనందమయ జీవన మార్గం....




**గౌరీభట్ల విట్ఠలశర్మ సిద్ధాంతి**

దివ్యజ్ఞాన పంచాంగకర్త





ప్రచురణ

**'దర్శనమ్'** ఆధ్యాత్మిక వార్తా మాసపత్రిక

**29-105/4/1, శ్రీరామసిద్ధాంతి భవనం, న్యూ విద్యానగర్, నేరేడ్‌మెట్, సికింద్రాబాద్ - 56.**

ఫోన్: 040–27220401, 94410 15469

Email: d_darshanam@yahoo.co.in, editordarshanam@gmail.com

**'దివ్యజ్ఞాన రహస్యం'**


| | |
|---|---|
| రచన, సేకరణ | : **గౌరీభట్ల విట్ఠలశర్మ సిద్ధాంతి** (దివ్యజ్ఞాన పంచాంగకర్త) |
| సర్వహక్కులు | : ప్రచురణకర్తవి |
| ప్రతులు | : వేయి |
| వెల | : **రూ॥ 200/-** |
| అక్షరాలకూర్పు | : **ఆరవేటి వెంకటసుబ్బయ్య** 98496 92028 |
| టైటిల్ కవర్ | : **సునీతావాసు** |
| ముద్రణ | : **సాయితిరుమల ప్రింటింగ్ ప్రెస్** చిక్కడపల్లి, హైదరాబాద్ |

**ప్రతులకు :**

1. **జ్యోతిర్మయ మహాపీఠమ్**
   విశ్వం విహార్, మేడిపల్లి,
   ఉప్పల్ బస్‌డిపో దగ్గర,
   హైదరాబాద్ - 500 098.
   మొబైల్ : 98495 67669,
   040-65443313

2. **'దర్శనమ్'**
   ఆధ్యాత్మిక మాసపత్రిక
   29-105/1/1, న్యూ విద్యానగర్,
   నేరేడ్‌మెట్, సికిందరాబాద్ - 56.
   94410 15469,
   040-27220401

# విషయసూచిక


| | | |
|---|---|---|
| | వి'జ్ఞప్తి' | ........ 5 |
| | నివేదన | ........ 7 |
| 1. | ఆగమశాస్త్ర పరిచయం | ........ 9 |
| 2. | సృష్టివిజ్ఞానం | ........ 16 |
| 3. | ప్రళయ పరిజ్ఞానం | ........ 23 |
| 4. | కాలాఽధీనం జగత్సర్వం | ........ 28 |
| 5. | కాలగణనమే పంచాంగవిశేషం | ........ 41 |
| 6. | సంపూర్ణగ్రహణ రహస్యం | ........ 45 |
| 7. | సంధ్యావందనం | ........ 54 |
| 8. | సంధ్యాతత్త్వం | ........ 58 |
| 9. | గాయత్రీ రక్షమాం | ........ 63 |
| 10. | శాస్త్రాధ్యయన ఆవశ్యకత | ........ 67 |
| 11. | గీతలో దేవుని రూపాలు | ........ 71 |
| 12. | దేవతార్చనం | ........ 80 |
| 13. | భక్తుల లక్షణాలు | ........ 101 |
| 14. | వివాహ వ్యవస్థలో రాశికూటాలు | ........ 136 |
| 15. | గృహస్థాశ్రమముత్తమం | ........ 148 |
| 16 | సనాతన ధర్మ సా(గ)రం | ........ 156 |
| 17. | ధర్మేణ లభతే సర్వం | ........ 163 |

18. శరీరమాద్యం ఖలు ధర్మసాధనం ........ 168

19. పరోపకారార్థమిదం శరీరం ........ 174

20. ఏకాదశీ వ్రతమాహాత్మ్యం ........ 184

21. అధ్యాత్మ విద్యా విద్యానాం ........ 193

22. మనలోనే దేవతలు - రాక్షసులు ........ 200

23. నా(లో) ఆత్మ ఎక్కడుంది? ........ 208

24. ఆత్మోపదేశం ........ 212

25. ఈశావాస్యమిదం సర్వం ........ 221

26. శ్రీపరంధామ రహస్యం ........ 225

27. శ్రీమహాకాల మహాత్మ్యం ........ 231

28 నవసంఖ్యా వైభవం ........ 238

29. ధర్మసూక్ష్మాలు ........ 242

30. సులభ మోక్షసాధన ........ 255


**అనుబంధం**


శ్రీ మహాకాల మందిర విశేషం ........ 260

దివ్యజ్ఞాన సేవా కేంద్రమ్ ........ 263




# వి'జ్ఞప్తి'

**దై**వానుగ్రహంతో, పెద్దల ఆశీస్సులతో, ఆత్మీయుల సహకారంతో, అభిమాన పాఠకులందరి ప్రోత్సాహంతో 'దర్శనమ్' ఆధ్యాత్మిక మాసపత్రిక 10సం॥లు పూర్తి చేసుకున్నందున సంతోషం. అందరికి హృదయపూర్వకవందనాలు!

గత 10 సం॥లలోని అనేక శీర్షికలతో, ఎందరో మహానుభావులందించిన అద్భుత వ్యాసాలు, అందరి మన్ననలను చూరగొన్నాయి. అంతేగాక ఎల్లప్పుడు 'జ్ఞప్తి' యందుంచుకోవాల్సిన అంశాలెన్నో ఉన్నాయి. దీన్ని దృష్టియందుంచుకొని కొందరు ఆత్మీయ అభిమానులు ముఖ్యమైన శీర్షికలన్నింటిని ఒకచోట చేర్చి గ్రంథరూపం చేస్తే బాగుంటుందని సూచించారు. వారి సూచనమేరకు - ముఖ్యంగా జ్ఞానోదయాన్ని కలిగించి, ఆధ్యాత్మిక సాధనకుపయోగపడే వ్యాసాలు మనకేగాక భావితరాల వారికిగూడ అందించాలనే 'సత్సంకల్పం' కలిగింది.

ప్రప్రథమంగా మనకు అత్యంత ఆత్మీయులు, బంధువులైన దైవజ్ఞ స్వరూపులు **బ్ర॥శ్రీ॥ గౌరీభట్ల విట్ఠలశర్మ సిద్ధాంతి**గారు అందించిన వ్యాసాలన్నింటిలో ప్రస్తుత కాలానికి అత్యవసరమైనవానిని గ్రంథస్తం చేయడానికి పూనుకోవడం జరిగింది.

సిద్ధాంతిగారు 'దర్శనమ్' పత్రిక ఆరంభమైన నాటినుండి నేటివరకు ఎన్నో జనాదరణ పొందే అద్భుత వ్యాసాలందించి పత్రికకు మిక్కిలి వన్నె తెచ్చారు. వారికి ఈ సందర్భంగా కృతజ్ఞతాభివందనాలు!

**'దివ్యజ్ఞాన సిద్ధాంతి'**గా అందరికి వీరు సుపరిచితులు. కేవలం జ్యోతిశ్శాస్త్రంలోనే గాక, ఆగమ, ఆధ్యాత్మిక, ధార్మిక శాస్త్రాలయందు గొప్ప పండితులు, నిరాడంబరులు, నిరంతరం జ్ఞానాన్వేషణతో పాటు చక్కని అనుష్ఠానపరులు. సాత్త్విక హృదయులు, సత్యనిష్ఠగలవారు.

సుమారు 30 సం॥ల నుండి జ్యోతిష, ఆధ్యాత్మిక విషయాల్లో కృషి చేస్తూ, సమాజానికి విశిష్ఠ సేవలందిస్తున్నారు.

ఈ మధ్యనే హైదరాబాద్‌లో జ్యోతిర్మయ మహాపీఠాన్ని స్థాపించారు. ప్రశాంత వాతావరణంలో, అనువైన స్థలాన్ని ఎంపికచేసి, అందరికి అందుబాటులో

వుండేవిధంగా, వ్యక్తిగత సాధనకు అవకాశం కల్పిస్తూ, అత్యంత సుందరంగా శ్రీవిశ్వరూప మహాకాల మందిరాన్ని నిర్మింపజేసారు.

జ్యోతిర్మయ మహాపీఠంలోనే భాగంగా దివ్యజ్ఞాన సేవాకేంద్రాన్ని ఏర్పరచి, దైవసేవతోపాటు లోకకళ్యాణార్థం జ్ఞానసేవలందించుటకు ప్రయత్నిస్తున్నారు. పూర్తి వివరాలు ఈ గ్రంథం వెనుక అనుబంధంలో వున్నాయి. నిరంతరం దైవానుగ్రహం, మహాత్ముల ఆశీస్సులను పొందుతూ, సంకల్ప బలానికి ప్రాధాన్యమిస్తారు. ఆధ్యాత్మిక, జ్యోతిష, ధర్మశాస్త్ర విషయాల్లో ఎవరికైనా, ఎల్లప్పుడు అందుబాటులో వుండి సేవలందించుటకు సిద్ధంగా వున్నారు. వీరిని సద్వినియోగపరచుకోవడమే మనవంతు.

**'దర్శనమ్'** ఆధ్యాత్మిక మాసపత్రిక ద్వారా శ్రీసిద్ధాంతిగారి 'దివ్యజ్ఞాన రహస్యము' అను గ్రంథాన్ని మొట్టమొదట ముద్రించి అందించు అవకాశం లభించడం మన అదృష్టం. దాదాపు ఇందులో సమస్త విషయాలు పొందుపరచబడ్డాయి. 'ఆగమశాస్త్ర పరిచయం' అను శీర్షికతో మొదలై 'సులభ మోక్షసాధన' అనే విషయంతో 30 వ్యాసాలుగా పూర్తి చేయబడింది.

ఈ గ్రంథాన్ని మొదటినుండి చివరివరకు వరుసగా చదివినా, విషయాలు ఒకదానివెనుక ఒకటి ఒక క్రమపద్ధతిలో మనకు అవగాహన అవుతాయి. లేదా ఏ శీర్షికకు ఆ శీర్షికగా కూడా చదువుకునే అవకాశం వుంది. పాఠక అభిమానులందరూ ఈ సదవకాశాన్ని సద్వినియోగపరచుకోవాలని ప్రత్యేకంగా మా విజ్ఞప్తి.

గ్రంథముద్రణకు సహకరించినా ఆత్మీయులు, సహృదయులందరికి ప్రత్యేక ధన్యవాదములు. ముఖ్యంగా ఓపికతో అక్షరకూర్పు అందించిన **శ్రీ ఆరవేటి వెంకటసుబ్బయ్య**గారికి, ఆకర్షణీయమైన ముఖాచిత్రాన్నందించిన **శ్రీ వాసు**గారికి, అందంగా ముద్రించి ఇచ్చిన **శ్రీ సాయి తిరుమల ప్రెస్** వారికి కృతజ్ఞతలు.

భవిష్యత్తు 'దర్శనమ్' తరఫున ఇంకా అద్భుత గ్రంథాలను అందించాలనే సత్సంకల్పానికి పాఠకులందరూ తగిన ప్రోత్సాహాన్నివ్వాలని కోరుకుంటూ సెలవు!

దైవజ్ఞ విధేయుడు
**మరుమాముల వెంకటరమణశర్మ**
ప్రధాన సంపాదకులు **'దర్శనమ్'**

# ని'వేదన'

**శ్లో॥ మాతా చ పార్వతీదేవీ, పితాదేవో మహేశ్వరః ।**
**బాంధవా శ్శివభక్తాశ్చ, స్వదేశో భువనత్రయమ్ ॥**

– శ్రీ ఆదిశంకరుల అన్నపూర్ణాష్టకమ్

ఈ లోకంలో జన్మ తరింపచేసికొనుటకు వీలుగా జన్మనిచ్చిన తల్లి ఆ దేవదేవి పార్వతీదేవియే. అద్భుతజ్ఞానాన్ని ప్రసాదించిన తండ్రియే దేవదేవుడైన మహేశ్వరుడు. ఎంతగానో అభిమానించి, ఆదరించి, ప్రోత్సహిస్తున్న ఆత్మీయులందరూ బంధువులే. మూడు లోకాలలో ప్రాప్తమున్న ప్రదేశాలందు సంచరిస్తూ, నివసిస్తున్న పవిత్ర ప్రాంతాలన్నీ మనవే.

సమాజంలోని వారందరిని మనమొక్కరమే సంపూర్ణంగా మెప్పించలేం. అలాగని అభిమానించే కొందరిని మెప్పించకుండా ఊరుకోలేం. ఆత్మీయులైన అభిమానుల కోరిక మేరకు మనలోని జ్ఞానాన్ని యథాశక్తి గ్రంథరూపం చేయాల్సి వచ్చింది. పూర్ణప్రజ్ఞావంతులం కాకపోయినా, తెలిసిన విషయాలను తెలుపుటకు చేసే ప్రయత్నమే ఇది.

గత 10 సం.ల క్రితం అనగా సుమారు అక్టోబరు 2004 నుండి 'దర్శనమ్' అను ఆధ్యాత్మిక మాసపత్రిక ప్రారంభమైంది. దీని ప్రధాన సంపాదకులు, ఆత్మీయులు, బంధువులు అయిన శ్రీమరుమాముల వేంకటరమణశర్మగారి ప్రోత్సాహంతో వ్యాసాలు వ్రాయవలసి వచ్చింది. నాటినుండి నేటి వరకు అనగా ఏప్రిల్ 2014 వరకుగల వ్యాసాలన్నింటిలో ప్రస్తుత కాలానికి అవసరమగువానిని ఎంపికచేసిన గ్రంథస్వరూపమే ఈ "దివ్యజ్ఞాన రహస్యము".

ఆగమశాస్త్ర పరిచయంతో దివ్యజ్ఞానరహస్యం ప్రారంభమైంది. ప్రస్తుత కాలంలో ప్రతి ఒక్కరికి ఆగమశాస్త్రం యొక్క సంపూర్ణ పరిచయం తప్పనిసరి అవసరం. సృష్టి ప్రారంభ, ప్రళయ పరిజ్ఞానాలను పొందిన తర్వాతనే మనం ఇతర విషయాలను సంపూర్ణంగా అవగాహన చేసుకోగలం. ఇందులో కేవలం

జ్యోతిష విషయాలేగాక ఆధ్యాత్మిక, ధార్మిక, నైతిక విషయాలను విశ్లేషించుట జరిగింది. సృష్టి కాలంపైనే ఆధారపడివుంది. కాలపరిజ్ఞానం, కాలగణనకు సంబంధించిన పంచాంగ స్వరూప, స్వభావాలు తెలుసుకుంటాం.

ప్రత్యక్షకాలస్వరూపుడైన శ్రీసూర్యభగవానునికి చేయాల్సిన సంధ్యావందన విశేషాలతో పాటు గాయత్రి ఉపాసన కూడా అవసరం. నేటి ఆధునిక యుగంలో శాస్త్రాధ్యయనం యొక్క ఆవశ్యకతను తెలుసుకోవాలి. శ్రీకృష్ణభగవానుడు గీతలో విభూతియోగంద్వారా తన స్వరూపాలను ఆరాధన నిమిత్తం తెలియజేశారు. దేవతార్చనా విధానాన్ని సమగ్రంగా తెలుసుకొని చేసే అవకాశం కలిగింది. స్వార్థచింతనతో చేసే భక్తి గాకుండా, భక్తులకుండవలసిన లక్షణాలు ప్రత్యేకంగా ఉన్నాయి. ఉత్తమమైన గృహస్థాశ్రమాన్ని స్వీకరించాలంటే వివాహం తప్పనిసరి. వివాహ విషయంలో వధూవర పొంతనకు గావలసిన రాశికూటాలపై సంపూర్ణ అవగాహన యుండాలి.

ధర్మాచరణకు సంబంధించిన విషయాలన్నీ వేర్వేరుగా తెలుసుకోవచ్చు. వ్రతాలన్నింటిలో కెల్లా ఉత్తమమైన ఏకాదశీవ్రత మాహాత్మ్యం, విధానం తెలుపబడినవి. అన్ని విద్యలలో 'అధ్యాత్మవిద్య'నే గొప్పది. అధ్యాత్మవిద్యకు సంబంధించిన ఆత్మస్వరూపంతోపాటు ఆత్మోపదేశాన్ని కూడా తెలుసుకుంటున్నాం. ఉపనిషత్తులు, గీతలోని ముఖ్యాంశాలను గ్రహిస్తే, మనలో మార్పు రావడానికి అవకాశముంది. శ్రీపరంధామ సాక్షాత్కారంవల్ల జన్మ ధన్యమవుతుంది. శ్రీమహాకాల మాహాత్మ్యంలో కాలాతీతుడైన పరమాత్మ వర్ణన మనకు సులభంగా అర్థమయ్యే పద్ధతిలో ఉంది. సులభంగా మోక్షాన్ని పొందుటకు తగిన సాధనోపాయాలు తెలుపబడినవి.

ఈ 'దివ్యజ్ఞాన రహస్యము' ధర్మార్థకామమోక్షాలను సులభంగా పొందుటకు తగిన ఉత్తమ ఏకైక సాధనం. విజ్ఞులు లోపాలోపాలను మన్నించి, దీన్ని సద్వినియోగం చేసుకుని ఆనందమయ జీవనమార్గంలో పయనిస్తారని సవినయంగా నివేదిస్తున్నాను.

"సర్వేజనాస్సుఖినోభవంతు"



# 1. ఆగమశాస్త్ర పరిచయం

శ్లో॥ వాగీశాద్యా స్సు మనసః సర్వార్థానా ముపక్రమే ।

యం నత్వా కృతకృత్యాస్స్యుః తం నమామి గజాననమ్ ॥

భారతీయ సంస్కృతి యొక్క ప్రధాన కీలకమే ఆగమశాస్త్రం. వేదాలకు మరియు సమస్త విద్యలకు ఆగమశాస్త్రమే మూలాధారమైయుంది. ఇది పురాణములన్నింటి చేత అభివృద్ధి చెందింది. కాని వేదశాస్త్ర పురాణ వాఙ్మయాలన్నియు ఆగమశాస్త్ర పరిచయం లేకుండా అవగాహన అసంభవం. అనేక వేదశాస్త్ర పారిభాషియగు పదాలు ఆగమశాస్త్రంలోనే ఇమిడియున్నవి. ఆగమశాస్త్రమునే తంత్రం అని కూడా అంటారు. ఇది వేదంతో సమానంగా భారతీయధర్మం, సంస్కృతి మరియు సభ్యతలకు ఆధారభూతమై యుంది. మానవులకు ధర్మార్థకామమోక్షాలనే చతుర్విధ పురుషార్థాలు సులభంగా సాధింపజేయుటే ఆగమశాస్త్రం యొక్క ప్రధాన లక్ష్యం. శుభాశుభకర్మ పరిపక్వం చేత యుత్పన్నమై, విభిన్న మనోవృత్తులచే నిరంతర సుఖదుఃఖాల ననుభవించుచున్న జనుల అనుగ్రహార్థమై పరమ కరుణాసముద్రుడైన పరమేశ్వరుడు సకల విద్యలను సృజించాడు. సాధారణమైన మానవులు వారివారి శక్త్యానుసారం, అత్యంత సులభపద్దతిలో, అతితక్కువ సమయంలో సంసార సుఖాలతోపాటు మోక్షాన్ని పొందు మార్గాన్ని బోధించుటయే ఆగమశాస్త్రంయొక్క ప్రధాన ఉద్దేశం. వేదాలవలె ఆగమం లేదా తంత్రాలకు కూడా సంపూర్ణ సార్వభౌమత్వముంది. కేవలం భ్రమ లేదా అజ్ఞానంచేత ఈ రెండింటి విషయంలో ఏవిధమైన సందేహం కలిగినా అది అనుచితం మరియు నింద్యం. వేదం మరియు తంత్రం ఒకదాని వెనుక ఒకటి రెండు పరస్పరం కలసియే ఉన్నవి. వాని కార్యక్షేత్రంలో విభజించుట వ్యావహారిక దృష్టితో సర్వదా అసంభవం.

ఈ రెండింటిని గూర్చి ఒకటి తక్కువ, ఒకటి ఎక్కువయని స్వేచ్ఛాపూరిత తర్కంద్వారా, ఆర్షవాణినిగాని, ఆగమోక్త నిగూఢతత్త్వ విషయాలనుగాని విపరీత వ్యాఖ్యలతో విమర్శించుట శాస్త్రసమ్మతంకాదు.

**శ్లో॥ ఆగతం పంచవక్త్రత్తు గతం చ గిరిజాననే ।**
**మతం చ వాసుదేవస్య తస్మాదాగమ ఉచ్యతే ॥**

ఐదు ముఖాలు కలిగిన పరమేశ్వరుని నుండి వచ్చినదై, పార్వతీదేవి ముఖాన్ని పొందినట్టి, వాసుదేవునికి సమ్మతమైందేది కలదో అదియే ఆగమమని, యామిళంలో ఆగమశబ్దార్థం వివరించబడింది. **'ఆగచ్ఛంతి బుద్ధిమారోహంతి యస్మాదభ్యుదయ నిశ్శ్రేయసోపాయాః స ఆగమః'** దేనినుండి క్షేమం, మోక్షోపాయాలు వచ్చుచున్నవో, చక్కగా తెలియుచున్నవో అది 'ఆగమమని వాచస్పతి మిశ్ర తన తత్త్వ వైశారదిలో పేర్కొన్నాడు.

**శ్లో॥ సృష్టిశ్చ, ప్రళయశ్చైవ దేవతానాం తథార్చనమ్ ।**
**సాధనం చైవ సర్వేషాం పురశ్చరణ మేవ చ ॥**
**షట్కర్మ సాధనం చైవ ధ్యానయోగ శ్చతుర్విధః ।**
**సప్తభిర్లక్షణైర్యుక్తమాగమంతం విదుర్బుధాః ॥**

ఈ చరాచర ప్రపంచం యొక్క సృష్టి,ప్రళయ విషయాలు దేవతల యొక్క పూజావిశేషాలు, సకలదేవతా మంత్ర పురశ్చరణం, షట్కర్మ సాధనం (1. శాంతి 2. వశీకరణము 3. స్తంభనము 4. విద్వేషణము 5. ఉచ్చాటనము 6. మారణము), నాలుగు విధాలైన ధ్యానయోగ సాధనం. (1. ప్రాణాయామం 2. హఠయోగం 3. అష్టాంగయోగం 4. కుండలినీ) పై ఏడు లక్షణాలతో కూడిన ఆగమశాస్త్రాన్ని పండితులు తెలిసికొనిరి. దేశ, కాల, పరిస్థితుల ననుసరించి ఉపాసనా విధానంలో అనేక మార్పులు జరుగుతున్నవి.

**శ్లో॥ శృత్యుక్తస్తు కృతే ధర్మః త్రేతాయాం స్మృతి సంభవః ।**
**ద్వాపరేతు పురాణోక్తః కలావాగమ సంభవః ॥**

(ప్రపంచసారతంత్రం శ్రీఆదిశంకరులు) కృతయుగనందు వేదోక్తధర్మం, త్రేతాయుగంలో స్మార్త కర్మాదికంనందు, ద్వాపరయుగం నందు పౌరాణిక పద్ధతిని,

కలియుగంలో ఆగమోక్త విధానమే ఆచరణీయమని తెలిపిరి. ఆగమశాస్త్రం ప్రధానంగా మూడు విధాలుగా విభజించడమైంది. అవి శైవం, వైష్ణవం మరియు శాక్తం.

**1. శైవాగమం:** అభీష్టదైవారాధన అనుసరించి ఇష్టదేవతోపాసనను దృష్టియందుంచుకొని ఆగమశాస్త్ర సంబంధమైన ధర్మం మరియు దార్శనిక చింతనం ఆధారపడియుంది. శైవాగమ సాహిత్యంలో పది శైవాగమాలు, పదునెనిమిది రుద్ర ఆగమాలు తెలుపబడినవి. ఇవి మొత్తం కలసి ఇరువది ఎనిమిది శైవాగమాలున్నాయి. ఈ ఆగమంలో అక్కడక్కడ ద్వైత మరియు ద్వైతాద్వైతదృష్టితో సమర్థస్వరూపం నిర్దేశించబడింది కాని వీటన్నింటి యొక్క ప్రామాణికత మాత్రం సర్వత్రైకరూపమనే అంగీకరించబడింది. పౌష్కరాగమానుసారం సిద్ధాంత శాస్త్రరూపంలో పై రెండింటికి శైవమతమే మూలమై యుంది. ఒక్కొక్క ఆగమం విద్య, యోగ, క్రియ, మరియు చర్య అని నాలుగు పాదాలున్నప్పటికి సర్వాంగ సమన్విత ఆగమస్వరూపం లభించుటలేదు. కొన్ని ఆగమాలలో ఒకటి లేదా రెండు పాదాలు మాత్రమే లభ్యమగుచున్నవి. ఆగమశాస్త్ర సాహిత్యం చాలా విశాలమైన వానికి సంబంధించిన అనేక గ్రంథాలు లుప్తమగుటవలన లభించినవానినే ఆచరణకు ప్రామాణికంగా స్వీకరించుచున్నారు. ప్రస్తత కాలంలో కారణ, కామికాగమాలు రెండు మాత్రమే ప్రచారంలో ఉన్నవి. భారతీయ సంస్కృతియొక్క విశ్లేషణ వైదిక సాహిత్యంలోపలే, ఆగమశాస్త్ర సాహిత్యంలో కూడా జరుగవలసియుంది. ప్రపంచసృష్టి, తర్వాత పరమేశ్వరుడు ప్రప్రథమంగా పది శివులను సృష్టించి, వారిలో ప్రత్యేకంగా తన అవిభక్త మహాజ్ఞానాన్ని ఒక్కొక్క భాగం చేసెనని కిరణాగమంలో పేర్కొనబడింది. వేదం ఏవిధంగా అఖండ మహాజ్ఞాన స్వరూపమై మూడు లేదా నాలుగు భాగాలుగా విభక్తమైందో, అదేవిధంగా ఆగమశాస్త్రంయొక్క మూలస్వరూపం కూడా విభక్తమై అనేక రూపాలుగా పరిణతి చెందింది. బ్రహ్మయామిళంలో ఇరువది ఎనిమిది శైవాగమాలున్నాయి. 1. కామిక 2. యోగజ 3. చింత్యా 4. కారణ 5 అజిత

6. దీప్త 7. సూక్ష్మ 8. సహస్ర 9. అంశుమద్భేద 10. సుప్రభేద 11. విజయ 12. నిశ్వాస 13. స్వాయంభువ 14. అనిల 15. వీర 16. రౌరవ 17. ముకుటక 18. విమల 19. చంద్రజ్ఞాన 20. బింబ 21. ప్రోద్గీత 22. లలిత 23. సిద్ధ 24. సంతాన 25. సర్వోక్త 26. పరమేశ్వర 27. కిరణ 28. వాతూలాగమాలు. ఇవిగాక ఇంకా అనేకాలున్నటుల శాస్త్రాలు తెలుపుచున్నవి.

**2. వైష్ణవాగమం :** ఆగమశాస్త్ర సాహిత్యానికి మూలం సంహితా గ్రంథాలు. ఇవి ఎన్ని ఉన్నవి? అందులో ప్రస్తుతము మనకు లభించున నెన్నియో నిశ్చయించుట కష్టం. అయినను అందుబాటులోనున్న సంహితలు అహిర్బుధ్న్య, ఈశ్వర, కపింజల, జయా, పారాశర్య పాద్మ, బృహద్బ్రహ్మ, భారద్వాజ, సాత్వత, శ్రీప్రశ్న, విష్ణు, విష్ణుతిలక, లక్ష్మీ, మరీచ, అత్రి, పరమ, పౌష్కర సంహితలు ప్రధానమైనవి. వైష్ణవాగమం ప్రధానంగా రెండు భాగాలుగా విభజించబడింది. 1. వైఖానసం 2. పాంచరాత్రం.

**వైఖానసం:** విఖనస మహర్షి ప్రవర్తకుడైనందున వైఖానసమనే పేరు వచ్చింది. ఛాందోగ్యోపనిషత్తు, వైఖానస గృహ్యసూత్రాలు వైఖానసాగమ అర్థాన్ని విశ్లేషించింది.

**పాంచరాత్రం :** ఇది ఎక్కువ ప్రాచుర్యంలో ఉంది. అహిర్బుధ్న్య సంహిత మరియు నారద పాంచరాత్ర అనుసారం రాత్ర పదం జ్ఞానానికి సంబంధించింది. ఐదు విధాల జ్ఞానమును 1. పరతత్త్వం 2. ముక్తి 3. భుక్తి 4. యోగము 5. సంసారం (విషయము) బోధన చేయుచుంది. పాంచరాత్రమైంది. ఇంకా అనేక అర్థాలు వివరించబడినవి. ప్రస్తుతం ఈ రెండు వైష్ణవాగమాలకు గల ప్రధాన భేదం పరిశీలించుట అవసరం. స్థూలంగా రెండూ భగవద్భక్తిని ఉపదేశించునవే అయినను సూక్ష్మభేదాలు కలవు.

1. దేవపూజనం లేదా అర్చనంను వైఖానసులు వైదిక పూజనం అనియు, పాంచరాత్రులు శుద్ధపూజనం అని అంటారు.

2. వైఖానస మతానుసారం ఐదు మూర్తులను (శ్రీవిష్ణు, పురుష, సత్య, అచ్యుత, అనిరుద్ధులను) అర్చిస్తారు. కాని పాంచరాత్రంలో వాసుదేవ, సంకర్షణ, ప్రద్యుమ్న, అనిరుద్ధ అను నాలుగు మూర్తులనే అర్చిస్తారు.

**3. యజ్ఞో వై విష్ణుః :** వైష్ణవ మతంలో శ్రీమహావిష్ణు పూజనమే యజ్ఞం. యజ్ఞంలోని పంచాగ్నులు గార్హపత్య, ఆహవనీయ, అన్వాహార్య, సంభ్య, ఆవసత్య ఆధారంగా విగ్రహాలు కూడా ధృవ, కౌతుక, ఉత్సవ, స్నపన, బలి అను ఐదు విధాలుగా నుంటాయి. ఇది వైఖానస సంప్రదాయం, పాంచరాత్ర సంప్రదాయంలో ధృవార్చ, కర్మార్చ, ఉత్సవార్చ, బల్యర్చ, తీర్థార్చ,శయనార్చలను ఆరు మూర్తులను అర్చిస్తారు. రెండింటిలో ధృవబేరం ప్రధానమైంది.

4. విగ్రహాలు తిరిగి నిర్మాణంలో చిత్ర, చిత్రార్థ, చిత్రాభాస అను మూడు విధాలుగా నుండును. వైఖానస మతానుసారం మూర్తులు మూడువిధాలు. అవి 1. నిలుచున్నస్థితి, 2. కూర్చున్నస్థితి 3. శయనస్థితి, పాంచరాత్రమతానుసారం పై మూడు స్థితులతోపాటు వాహనస్థితి అను నాలుగు విధాలైన మూర్తులను గ్రహించారు.

ఇవిగాక పాంచరాత్ర గ్రంథాలలో కొన్ని విశేషభేదాలు కల్పించబడినవి. ప్రస్తుతం విస్తారభీతి చేత ఇచట ఉదహరించుట లేదు. ఈ రెండు విధాలైన వైష్ణవాగమాలు లోకహితార్థం, కార్యసిద్ధి మరియు విశేష ఫలాల కొరకు విగ్రహారాధన విధానం విశేషంగా వర్ణించబడింది. ఆయా ప్రత్యేక గ్రంథాలు, ఆచార్యులద్వారా ప్రస్తుతం ఆచరించబడుతుంది. పాంచరాత్రాగమంలో నారద పాంచరాత్రం సుప్రసిద్ధమైంది.

**3. శాక్తాగమం :** ఆగమశాస్త్రాన్నే తంత్రం అన్నారు. కాని విశేషంగా వాడుకలో శాక్తాగమానికే తంత్రాలని ప్రసిద్ధి కలిగింది. తంత్రశాస్త్ర గ్రంథాలనేకం లభించుచున్నవి. శ్రీకంఠీసంహితానుసారం 64 (అరువది నాలుగు) భైరవాఖ్య అద్వైతాగమాలు పేర్కొనబడినవి. కులమార్గానుసారం జగద్గురు ఆదిశంకరాచార్య ఆనందలహరి స్తోత్రంలో ఈవిధంగా తెలిపారు.

**శ్లో॥ చతుషష్ట్యా తంత్రైః సకలమను సంధాయ భువనం ।**
**స్థితస్తత్తత్ సిద్ధి ప్రసభపరతంత్రం పశుపతిః ॥**
**పునస్త్వన్నిర్బంధాదఖిల పురుషార్థైక ఘటనా ।**
**స్తంత్రం తే తంత్రం క్షితితల మవతీతరదిదమ్ ॥**

భగవానుడైన శంకరుడు పార్వతీదేవికి తెలిపినవే ఈ 64 తంత్రాలు. సౌందర్యలహరి టీకాకారుడైన లక్ష్మధరుడు చతుఃశతిలో పేర్కొనిన 64 తంత్రాలు ఈ విధంగా ఉన్నవి.

1. మహామయాతంత్రం 2. శంబర తంత్రం 3. యోజినీజల శంబరం 4. తత్త్వశంబరం 5. సిద్ధిభైరవం 6. వవటుకభైరవం 7. కంకాల భైరవం 8. కాలభైరవం 9. కాలాగ్ని భైరవం 10. యోగినీ భైరవం 11. మహాభైరవం 12. శక్తి భైరవం (భైరవ అష్టకం) 13. (బహురు పాష్టకం) బ్రాహ్మీ 14. మాహేశ్వర 15. కౌమారి 16. వైష్ణవి 17. చాముండా 18. చంద్రఘంటీ 19. శివదూతి 20. వారాహి 21. (యమలాష్టకం) బ్రహ్మ 22. విష్ణు 23. స్వచ్ఛంద 24. రురు 25. అధర్వణ 26. రుద్ర 27. భేతాళ 28. అతి 29. చంద్రజ్ఞానము (16 విద్యలు) 30. మాలనీ విద్య 31. మహాసమ్మోహనం 32. వామజుష్ట తంత్రము 33. మహదేవతంత్రం 34. వాతులతంత్రం 35. వాతు లోత్తరం 36. కామికం 37. హృద్భేదం 38. తంత్రభేదం 39. గృహ్యాతంత్రం 40. కలావాదం 41. కలాసారం 42. కుండికామతం 43. మతోత్తరమతం 44. వీణాఖ్యతంత్రం 45. త్రోతల తంత్రం 46. త్రోతలోత్తరం 47. పంచామృతం 48. రూపభేదం 49. భూతోడ్డామర 50. కులసారం 51. కులోడ్డీశం 52. కులచూడామణి 53. సర్వజ్ఞానోత్తరం 54. మమాకాలీమతం 55. అరుణేవ 56. వికుంతేశ్వరం 57. పూర్వ 58. పశ్చిమ 59. దక్షిణ 60. ఉత్తర 61. విమల 62. నిరుత్తర 63. విమలోగ 64. దేవీమతం.

ఈ 64 తంత్రాలు కేవలం ఐహిక ఫలాల నిస్తాయి. అధికార భేదాన్ననుసరించి అవస్థా భేదముంటుంది (ప్రస్తుత కాలంలో) ఈ 64 తంత్రాలు వేరువిధంగా నున్నాయి. సమయమార్గాన్ననుసరించి ఆగమాలు ఐదు విధాలు. వీటి వివరాలు తెలుపుటకు ప్రస్తుతం అవకాశంలేదు. జగద్గురు శంకారచార్య అన్ని మతాలను

సమన్వయ రూపంతో షణ్మతాన్ని స్థాపించారు. ఇందులోని పంచాయతన విధానం ప్రస్తుత కాలంలో సుప్రసిద్ధం. శైవ, విష్ణు, శాక్త, సౌర, గాణాపత్య, షణ్ముఖులనే ఆరుగురు మూర్తులను ఒకే వేదికపై అనగా ఒకే ఆలయంలో అర్చించే అవకాశం కల్పించారు. ప్రతి విషయంలోను ఋషిమతాలు భిన్నభిన్నాలుగా ఉన్నాయి. అందుకే

**శ్లో॥ శృతిశ్చ భిన్నాః స్మృతయశ్చ భిన్నాః మహామునీనాం మతయశ్చభిన్నాః।**
**ధర్మస్య తత్త్వం నిహితం గుహాయాం మహాజనోయేన గతస్స పంథాః ॥**

శ్రుతులు, స్మృతులు, మహామునుల మతాలు భిన్నభిన్నాలు, ధర్మం యొక్క తత్త్వం అత్యంత రహస్యమైంది కావున మన పెద్దలు నడిచిన మార్గాన్ని ఆశ్రయించుటే శరణ్యం.



# ౨. సృష్టి విజ్ఞానం

సృష్టి విజ్ఞాన, ప్రళయ పరిజ్ఞానం, సకల దేవతల యొక్క ఆరాధనం, సకల దేవతల సాధనం (ఉపాసన), పురశ్చరణ, ఆరు కర్మల సాధన, నాలుగు విధాలైన ధ్యానయోగం అను ఏకైక లక్షణాలతో కూడిన ఆగమశాస్త్రాన్ని పండితులు తెలిసికొన్నారు.

పై ఏడింటిలో మొట్టమొదటిది సృష్టి రహస్యం. ప్రతి ఒక్కరికి సృష్టిని గూర్చిన రహస్యం తెలిసి ఉండాలి. సృష్టి ఎలా జరిగింది? ఎందుకు జరిగింది? అనే ప్రశ్నలకు సూటిగా సమాధానం చెప్పుట చాలా కష్టం. కాని తెలుసుకొనవలెనని జిజ్ఞాస ప్రతి ఒక్కరిలో ఉంటుంది. దీనికి మనం చేయవలసిందల్లా ఒక్కటే. మన పూర్వీకులైన ఋషులు అందించిన విషయాలను పరిశీలించడమే.

**శ్లో॥ ఆసీదిదం తమోభూత మప్రజ్ఞాత మ లక్షణమ్ ।**
**అప్రతర్క్య మవిజ్ఞేయం ప్రసుప్త మివ సర్వతః ॥**

ఈ ప్రపంచమంతయు ప్రళయకాలమందు పెనుచీకటై ఉంది. ప్రకృతి అంతయు బ్రహ్మాకారంతో అవ్యాకృతమై వేరుపడక ఉంది. కనుకనే ప్రత్యక్ష ప్రమాణ గమ్యం కానిది. లక్షణం లేనిది, ఊహింపనలవికానిది, శబ్దము చేత గమ్యం కానిదై అంతయు నిద్రించుచున్నట్లుంది.

ప్రాణికాని, పరబ్రహ్మ కాని లేరు. పరబ్రహ్మ యున్నను అవాఙ్మానస గోచరుడే. కాన మన ఇంద్రియాలకు కనబడదు. ఆ సమయంలో ఐశ్వర్యాదులతో కూడినవాడు, యోగాభ్యాసంచే ఎరుగదగినవాడు, ఎదురులేని సృష్టి సామర్థ్యం కలవాడు అగు పరమాత్మ తనంతట తానే ఉత్పన్నుడైనాడు. పంచమహాభూతాలైన ఆకాశ, వాయు, అగ్ని, జల, భూములను ప్రకాశపరచుచూ ప్రకృతి ప్రేరకుడై ఆవిర్భవించాడు.

ఇక్కడ మనకు కొంత సమాధానం లభించినది. ఎలా జరిగింది? అనగా పరమాత్మ తనంతట తాను తనను సృష్టించుకున్నాడు. దీనికి భగవద్గీతలో కూడా..

**'మయాధ్యక్షేణ ప్రకృతిః సూయతే సచరాచరమితి'** అని స్వయంగా భగవానుడే చెప్పాడు.

ఆవిర్భవించిన ఆ పరమాత్మ సకల వేదపురాణ ఇతిహాస ప్రసిద్ధమైనవాడు, పరిశుద్ధమనసుచే తెలియదగినవాడు, బహిరింద్రియాలకు కనబడనివాడు, అవయవ రహితుడు, నిత్యుడు, సకలభూతాత్ముడు, ఇంతటివాడని ఊహింపరానివాడు. అట్టి పరమాత్మ మహదాది రూపాలతో ఆవిర్భవించాడు.

ఆ పరమాత్మ సకలజీవ జంతువులను సృష్టించదలచి, ముందుగా నీటిని సృజించెను. ఆ నీటియందు స్వశక్తిరూపమైన బీజమునుంచాడు. ఆ బీజం సూర్యసమప్రభయైన బంగారువన్నెగల అండమైంది. ముందు జన్మమున 'నేను హిరణ్యగర్భుడను అవుదునుగాక' అని యే ప్రాణి పరమేశ్వరోపాసన చేసెనో ఆ లింగశరీరముగల జీవాన్ని ప్రవేశింపజేసి పరమాత్మ తానే సర్వలోకాలకు కారణభూతుడైన హిరణ్యగర్భుడుగ జన్మించాడు.

**శ్లో॥ ఆపో నారా ఇతి ప్రోక్తా ఆపో వై నర సూనవః ।**
**తా యదస్యాయనం పూర్వం తేన నారాయణం స్మృతః ॥**

ఆపములు అనగా నీటిని 'నారములని' అందురు. ఆపములు నరసూనువులు. ఇట్టి నారములు ఈ పరమాత్మకు ఉనికి అయినందున 'నారాయణుడు' అని పిలువబడుచున్నాడు.

ఉత్పత్తిగల వానికెల్లా కారణమైన పరమాత్మ, బాహ్యేంద్రియాలకు అగోచరమై ఉత్పత్తినాశ రహితమై, నిత్యానిత్య వస్తురూపమై ఉన్నాడో ఆ పరమాత్మచే సృజించబడిన ఈ పురుషుడు లోకమునంతట 'బ్రహ్మ' అని వ్యవహరింపబడు చున్నాడు.

సువర్ణచ్ఛాయగల అండమున ఆ భగవంతుడగు బ్రహ్మ బ్రహ్మమానం ప్రకారం ఒక సంవత్సరం వసించి అండం రెండుగా అగునుగాక! అని తలంచిన మాత్రాన రెండుగా అయింది. పై చీలికను ఆకాశంగా, క్రింది చీలికను భూమిగా,

నడుమ బయలును, ఎనిమిది దిక్కులను శాశ్వతమైన నీటిపట్టు అనగా సముద్రాన్ని నిర్మించాడు.

బ్రహ్మ పరమాత్మ సన్నిధి నుండియే ఆ రూపంతో సదసదాత్మకమైన 'మనస్సు'ను గ్రహించెను. ఆ మనస్సునుండి తాననెడి అభిమానంతోగూడి, స్వకార్యము లొనర్చుటయందు నేర్పరియగు అహంకారాన్ని గ్రహించాడు.

**శ్లో॥ మహాంతమేవ చాత్మానం సర్వాణి త్రిగుణాని చ ।**
**విషయాణాం గృహీత్రూణి శనైః పంచేంద్రియాణి చ ॥**

మహత్తత్త్వం, ఆత్మకుపయుక్తాలైన సత్త్వరజస్తమోగుణాలు, విషయగ్రహణశక్తిగల అన్ని ఇంద్రియాలను క్రమంగా సృజించాడు.

**'తస్మాద్వా ఏతస్మా దాత్మన ఆకాశ స్సంభూతః, ఆకాశాద్వాయుః, వాయోరగ్నిః అగ్నేరాపః, అద్భ్యః పృథివీ'**

**సృష్టిక్రమం**

పరమాత్మ, హిరణ్యగర్భం, జ్ఞానేంద్రియాలు.. చెవి, ముక్కు, నోరు, చర్మం, నాలుక, అహంకారం, సత్యం, రజస్సు, తమస్సు, కర్మేంద్రియాలు.. వాక్కు, పాణి, పాద, పాయు, ఉపస్థ... అంతంలేని కార్యాలను నిర్మించుటచే ఎక్కువ వీర్యంతో నిండిన ముందు వచ్చిన అహంకారం యొక్క, దాని మాత్రలయొక్క, సూక్ష్మావయవాలను ఆరు వికారాలు చేర్చి మనుష్య, తిర్యక్‌స్థావరాలు మొదలగు సకలభూతాలను నిర్మించాడు.

అహంకార తన్మాత్రరూపాలగు సూక్ష్మావయాలు, ఆరును, ప్రకృతి సహితుడైన బ్రహ్మయొక్క మూర్తిని, ముందు చెప్పిన భూతేంద్రియాలు, కార్యరూపాన ప్రవేశిస్తున్నాయి. కావున ఆ బ్రహ్మమూర్తిని 'శరీరమని' అన్నారు.

సర్వోత్పత్తికారణంను, నాశరహితమైన ఆ బ్రహ్మను పంచభూతాలు తమ కార్యాలలోను, మనస్సు శుభాశుభాల నెంచుట, సుఖదుఃఖాలు మొదలగు రూపాలుగలవై, బహిరింద్రియాలకు కనబడని సూక్ష్మరూపాలగు అవయవాలతోను ప్రవేశిస్తున్నాయి. ఆత్మనుండి పుట్టింది, ఆత్మవృత్తిచే తెలియదగినవి కనుక పురుషాలను, స్వకార్య సంపాదనచేత వీర్యవంతాలనైన పంచమహాభూతాలు, మహతత్త్వం, అహంకారం అను ఏడింటియొక్క నిత్యాలైన కారణంబులగు

మూర్తిమాత్రలవలన అనిత్యమైన 'కార్యరూప' ప్రపంచం జన్మించింది.

**శ్లో॥ ఆద్యాద్యస్య గుణం త్వేషా మవాప్నోతి పరంపరః ।**
**యో యో యావతిథశ్చైషాం సస తావద్గుణః స్మృతః ॥**

పంచమహాభూతాలలో ఆకాశ, వాయు, తేజో, జల, పృథివీలలో ముందటి దాని గుణాన్ని, వెనుకటిది కలిగియుండును, మరియు ఏదియేది ఎన్నవదో అది అంతవరకు చెప్పినదాని గుణాలుండును. అనగా రెండవది మొదటిగుణం, తన గుణం కలిగియుండును. మూడవది మొదటిదాని, రెండవదాని గుణాలు, తన గుణం కలిగియుండును.

**ఉదా:** ఆకాశం శబ్దగుణాన్ని, వాయువు–స్పర్శగుణాన్ని, తేజస్సు–రూపగుణం, జలం–రసగుణం, పృథివి–గంధగుణాన్ని స్వగుణాలుగా కలిగియుంటాయి. కాని పైనచెప్పిన ప్రకారం ఆకాశం శబ్దగుణం కలది, వాయువు శబ్ద, స్పర్శ గుణాలను, తేజస్సు శబ్దస్పర్శ గుణాల రూపాలను, జలం శబ్దస్పర్శరూపరస గుణాలను, పృథివి శబ్దస్పర్శరూప, రసగంధాలను ఐదు గుణాలు కలిగియుంటాయి. అదేవిధంగా భూమి మొదలు ఆకాశం వరకు, పృథివి శబ్దస్పర్శ రూపరసగంధాలును, జలం శబ్దస్పర్శరూప రసంలను, తేజస్సు, శబ్ద, స్పర్శ రూపాలను, వాయువు శబ్దస్పర్శములను, ఆకాశం శబ్ద గుణము మాత్రమే కలిగియుంటుంది.

ఆ పరమాత్మ హిరణ్యగర్భ రూపంతోనున్నవాడై తనచే సృష్టమైన అన్నింటికి నామాలను వేదాలందు చెప్పిన తీరును ఏర్పరచి కర్మలను వేరువేరువిధంగా వేదంనందు చెప్పిన తీరును కల్పించి, వేరు వేరు లౌకికవృత్తులు మొదటనే కల్పించాడు. ఆ పరమాత్మ బ్రహ్మాత్ముడై కర్మాత్మలైన దేవతలను, ప్రాణిసమూహాలను, పాషాణాదులను, సూక్ష్మాలైన సాధ్యులను, నిత్యాలైన యజ్ఞాలను సృజించాడు. మరియు యజ్ఞాలు వేదాలచే నెరవేర్పదగినవైనందున ఆ యజ్ఞాల నిమిత్తం ఋగ్యజుస్సామాలనెడి వేదత్రయాన్ని అగ్ని, వాయు, సూర్యుల వద్ద నుండి గ్రహించాడు.

**శ్లో॥ కాలం కాల విభక్తీశ్చ నక్షత్రాణి గ్రహాంస్తథా ।**
**సరితస్సాగరాన్ శైలాన్ సమాని విషయాణి చ ॥**

**తపోవాచం రతిం చైవ కామం క్రోధమేవ చ ।**
**సృష్టిం  ససర్జచైవేమాం స్రష్టు మిచ్ఛన్నిమాః ప్రజాః ॥**

బ్రహ్మదేవుడు సమస్త ప్రజలను సృజింపగోరి కాలాన్ని, కాలాన్ని లెక్కించుటకు మాసాలు, ఋతువులు, అయనాలు మొదలగు కాలవిభాగాలను, నక్షత్రాలను, సూర్యాదిగ్రహాలను, నదులను, సముద్రాలను, స్థలాలను, ఎత్తులను, పల్లాలను, తపస్సును, వాక్కును, శ్రద్ధను, కామాన్ని, కోపాలనెడి గుణాలను సృజించాడు. ఇంకను యజ్ఞాదులగు సత్కార్యాలను చేయవలెయునని, బ్రహ్మహత్యాది అసత్కార్యాలు చేయరాదనియు, తెలియుటకై, ధర్మాధర్మాలను వేరుపరచాడు. ఈ ప్రజలను సుఖదుఃఖాదులగు ద్వంద్వాలతోను, రాగద్వేషాలతోను చేర్చాడు. పంచమహాభూతాలయొక్క ఏ నశ్వరమూర్తులైన పంచతన్మాత్రలు కలవో వానితో గూడ ఈ చెప్పబోవునది అంతయు క్రమంగా సృజింపబడింది. సృష్టికర్తయగు బ్రహ్మ ఏయే జాతిని, ఆది సృష్టియందు ఏయే కార్యమునందు నియమించెనో, ఆయా జాతి మరల సృజింపబడుచు ఆయా కార్యమునందే స్వకర్మవశమున ప్రేరేపించుచున్నాయి. సృష్ట్యాదియందు చంపెడు స్వభావం, కనికరం, మెత్తదనం, కఠినం, ధర్మం, అధర్మం, అబద్ధం, నిజాలను వీనిలో ఏయే జాతికి ఏయే గుణాలను నియమించెనో తర్వాత కూడా ఆయా జాతికి ఆయా గుణాలనే పొందుచున్నాయి. ఏవిధంగా వసంతాదులగు ఋతువులు తామే తమతమ గుర్తులను మారుచున్నవో, అదేవిధంగా ప్రాణులు తామే తమతమ గుణాలను పొందుచున్నవి.

**శ్లో॥ లోకానాం తు వివృద్ధ్యర్థం ముఖ బాహూరుపాదతః ।**
**బ్రాహ్మణం క్షత్రియం వైశ్యం శూద్రం చ నిరవర్తయత్ ॥**

భూలోక విస్తారం గోరినవాడై బ్రహ్మ తన ముఖం, బాహువు, ఊరువులు, పాదాలు వీనియందు వరుసగా బ్రాహ్మణులు, క్షత్రియులు, వైశ్యులు, శూద్రులను సృజించాడు. ఆ బ్రహ్మ తన దేహాన్ని రెండుగా విభజించుకొని, ఒక భాగంచే పురుషుడుగను, మరియొక భాగంచే స్త్రీగను మారెను. ఆ పురుషుడు తన స్త్రీయందు విరాట్టును సృజించాడు.

విరాట్పురుషుడు తపం చేసి యెవరిని సృజించెనో అతడు సకలలోక సృష్టికర్తయైన బ్రహ్మదేవుడే అని తెలియాలి. ఇతడు ప్రజలను సృష్టించుటకై దివ్యమైన తపమాచరించి మొదట పదిమంది ప్రజాపతులను సృజించాడు. వారు మరీచి, అత్రి, అంగిరసుడు, పులస్త్యుడు, పులహుడు, క్రతువు, ప్రచేతసుడు, వసిష్ఠుడు, భృగువు, నారదుడు, మహాతేజస్సుగల ఈ పదిమంది ప్రజాపతులు తమవలె తేజరిల్లెడి మరి యేడుగురు మనువులను, దేవతలను, దేవతలకు ఉనికి పట్టులను, ఎక్కువ తేజస్సుగల మహర్షులను సృజించిరి.

కుబేరాదులగు యక్షులు, రావణాది రాక్షసులు, వారికంటే తక్కువవారగు అశుచి, నిర్జలదేశవాసులైన పిశాచులు,చిత్రరథాదులగు గంధర్వులు, అప్సరసలు, విరోచనాదులగు అసురులు, వాసుకి మున్నగు నాగులు, నీటిపాములు మున్నగు సర్పాలు, గరుడాది పక్షులు, పితృదేవతలను వేర్వేరు గణాలను కూడా సృజించారు.

ఇంకను మెరుపులను, పిడుగులను, మేఘాలను, రోహితమను నిడివియైన నక్షత్రాన్ని, ఇంద్రధనుస్సులను, తోకచుక్కలను, ఉత్పాతాలను,మంటలుగల జ్యోతిస్సులను, నానావిధ నక్షత్రాలను, కిన్నరులను, వానరులను, మత్స్యాలను, పెక్కు తెగల పక్షులను, పశువులను, మృగాలను, పై పండ్లు, క్రింది పండ్లుగల మనుష్యులను, క్రూరమృగాలను, క్రిములను, వానికంటే కొంచెం పెద్దదగు కీటకాలను, మిడుతలను, జట్టి మిడుతలు, పేలు, ఈగలు, దోమలు, నల్లులు మొదలగు క్షుద్రజంతువులను, వేర్వేరు తెగలగు స్థావరాలైన వృక్షపర్వతాదులను మరీచ్యాది ప్రజాపతులే సృష్టించిరి.

**శ్లో॥ ఏవమేతైరిదం సర్వం మన్నియోగాన్మహాత్మభిః ।**
**యథా కర్మ తపోయోగా త్సృష్టం స్థావర జంగమమ్ ॥**

ఈవిధంగా మహాత్ములగు మరీచ్యాది ప్రజాపతులు తపంబొనర్చి, బ్రహ్మదేవుని ఆజ్ఞమేరకు వానివాని కర్మానుసారంగా ఈ కనబడుచున్న స్థావరజంగమ రూపమగు ప్రపంచమునెల్ల సృజించిరి. ఏ భూతాలను ఎట్టి కర్మ ఈ సంసారమున పూర్వాచార్యులచే చెప్పబడియుందో, ఆయా భూతాలు ఆయా కర్మలను మరియు జన్మయందలి క్రమయోగాన్ని తెలుసుకొందాం!

**ఉత్పత్తిక్రమం**

**శ్లో॥ పశవశ్చ మృగాశ్చైవ వ్యాళాశ్చోభయతో దతః ।**
**రక్షాంసి చ పిశాచాశ్చ మనుష్యాశ్చ జరాయుజః ॥**

పైనను, క్రిందను, దంతాలుగల పశువులు, మృగాలు, క్రూర జంతువులు, రక్కసులు, పిశాచాలు, మనుష్యులు మొదలగువారు మావినుండి జన్మించారు. పక్షులు, సర్పాలు, చేపలు, తాబేళ్ళు, మొదలగునవి అండజాలు అనగా గ్రుడ్డునుండి పుట్టినవి, ఈ అండజాలలో కొన్ని భూమిపైన ఉంటాయి. కొన్ని నీటిలో ఉంటాయి. అడవి ఈగలు, దోమలు, పేలు, ఈగలు, నల్లులు మొదలైనవి ఏవి ఆవిరికి పుట్టునో వానిని స్వేదజాలు అంటారు. ఇవి చెమటకు లేదా ఉక్కపోతకు పుడతాయి. స్థావరాలు అనగా వృక్షాలు, కొండలు మొదలగునవి నేలనుగాని, విత్తనాలనుగాని పెకలించుకొని పుట్టుచున్నవి. ఇవి రెండు విధాలు, కొన్ని విత్తనం నుండి పుట్టును, మరికొన్ని కొమ్మలనుండి పుడతాయి. వడ్లు మొదలగు ధాన్యములెల్ల పంటపండుటతో వచ్చుచున్నవి. ఎక్కువ పుష్ప ఫలములు గలవిగా ఉన్నవి. పుష్పాలు లేకయే ఫలాలను ఇచ్చు వృక్షములు ఓషధులు లేదా వనస్పతులంటారు, కొన్ని వృక్షాలు పుష్పించి, ఫలాలను ఒసుగుచున్నవి. ఇవి వృక్షాలు అనబడతాయి, ఈవిధంగా ఉద్భిజాలు రెండు విధాలుగా ఉన్నవి, వేళ్ళనుండియే తీగలు వచ్చునవి గుచ్ఛాలు అనియు, వీనిలో మొల్లలు మొదలగునవి ఉన్నాయి, అనేక వేళ్ళనుండి పుట్టినవి గుల్మాలు అనియు, ఇందురెల్లు, చెరకు మొదలైనవి ఉంటాయి. దర్భ మొదలగు తృణజాతులు, పొర మొదలగు ప్రతాపాలు, గుమ్మడి మొలగు వల్లులు, విత్తనములనుండియే పుట్టినవి, మరియు కొమ్మలే నాటగా కూడా పెరుగునవి ఉన్నాయి.



# 3. ప్రళయ పరిజ్ఞానం

సృష్టి, స్థితి, ప్రళయాలు దైవ నిర్ణయాలు. సృష్టిలోని చరాచర జగత్తు బ్రహ్మదేవుని రూపంలో పరబ్రహ్మం సృజించిందే. సృజించిందంతయు కొంతకాలానికి లయమొందవలసిందే. ఆ లయ విషయాన్ని సంపూర్ణంగా తెలుసుకోవటానికి ఈ ప్రళయ పరిజ్ఞానం. నిఘంటువుననుసరించి 'ప్రళయం' యొక్క అర్థాన్ని పరిశీలించగా సంవతర్తః, ప్రళయః, కల్పః క్షయః, కల్పన్తః అనునవి ప్రళయకాలం పేర్లు.

1. ప్రళయం – ప్రలీయతే జగదత్ర ప్రళయః (లీఙ్ శ్లేషణ) అనగా జగత్తు దీనియందు విలయమొందును.

2. ప్రళయో నష్టచేష్టతాః, ప్రతీయంతే క్రియా అత్రేతి ప్రళయః, దీనియందు క్రియలు లీనమగును.

3. ప్రళయనం ప్రళయః (లీజ్ శ్లేషణే) పంచభూతాలు కలియుట ప్రళయం అని అనబడును.

స్థావర జంగమాత్మకమైన ఈ చరాచర ప్రపంచాన్ని సృజించి, అమితమైన పరాక్రమంగల బ్రహ్మదేవుడు సృష్టికాలాన్ని ్రపళయకాలంతో జేర్చుతూ తనలోతాను అంతర్ధానమయ్యెను.

**శ్లో॥ యదా సదేవో జగర్తి త దేవం చేష్టతే జగత్ ।**
**యదా స్వపితి శాంతాత్మా తదా సర్వం నిమీలతి ॥**

ఎపుడు ఏ దేవుడు మేల్కాంచునో, అప్పుడు ఈ జగత్తు సకల వ్యాపారం గలదగును. ఎప్పుడు నెమ్మదిగలవాడై నిద్రించునో అప్పుడు సర్వం లయం నొందుతుంది.

సృష్టిలో పుట్టిన ప్రతిప్రాణి మరియు ప్రతి వస్తువు గిట్టవలసిందే. ఇది సృష్టి ధర్మం. సకలప్రాణులను, సర్వవస్తువులను సృష్టించిన ఆ పరమాత్మ, సృష్టించిన వాటినన్నింటిని కాలక్రమేణ ఒకానొకప్పుడు లయమొందించును. సర్వం లయమొందుటయే ప్రళయం. ఈ ప్రళయం మూడు విధాలు 1. దినప్రళయం 2. దేహప్రళయం 3. మహాప్రళయం. మన నిత్య జీవితంలో ఉదయం లేచింది మొదలు పగలంతయు సకల వ్యాపారాలను చేస్తాం. రాత్రి సమీపించి నంతనే అన్ని వ్యాపారాలకు స్వస్తి చెప్పి విశ్రాంతి తీసుకుంటాం. పగలంతా అలసిపోయిన ఇంద్రియాలు, వాటి అధిష్ఠానమైన మనస్సు రాత్రి అలసట తీర్చుకొంటాయి. దీనినే 'దిన ప్రళయం' అంటారు.

ప్రతి జీవికి వ్యక్తిగతంగా దేహాన్ని విడుచు సమయం ఆసన్నమగును. దీనినే 'ప్రాణోత్క్రమణం' అందురు. ఎప్పుడు జీవుడు ఇంద్రియాలతో కూడా జ్ఞానం లేని స్థితి (దీర్ఘమూర్ఛ)తో పాటు ఉచ్ఛ్వాస, నిశ్వాస రూపమైన క్రియ ఆగిపోవునో అపుడు ఈ జీవుడు దేహంనుండి తొలగిపోవును. ఇదియే మరణం. దీనినే దేహప్రళయం అంటారు.

దేహాన్ని విడిచిన ఆత్మ (జీవుడు) సూక్ష్మాలైన భూతేంద్రియాదులు గలవాడై వృక్షాదులకు కారణమైన స్థిర బీజంగాని, మనుష్యాదులకు కారణమైన జంగమబీజంగాని ప్రవేశించునో అపుడు స్థూలశరీరాన్ని ధరిస్తుంది.

మహాప్రళయం జరుగు వరకు జీవుడు అనేక దేహాలు మారును. జనన, మరణ ప్రవాహాన్ని పొందుతాడు. దేహం మరణించునుగానీ, ఆత్మకు మరణంలేదు. దీనినే గీతలో భగవానుడు ఉదాహరణతో తెలిపాడు.

**శ్లో॥ వాసాంసి జీర్ణాని యథా విహాయ నవాని గృహ్ణాతి నరోపరాణి ।**
**తథా శరీరాణి విహాయ జీర్ణాన్ అన్యాని సంయాతి నవాని దేహి ॥**

లోకంలో మానవులు పాతవై, చిరిగిపోయిన దుస్తులను వదలి ఇతరాలైన కొత్త దుస్తులను ధరిస్తారు. అదేవిధంగా జీవాత్మ జీర్ణించిన పాత శరీరాలను వదలి, నూతనాలైన ఇతర శరీరాలను పొందుతుంది అనగా జీవాత్మ ఎల్లప్పుడు నిర్వికారుడై, మార్పులేనివాడై ఉండునని తాత్పర్యం.

పరమాత్మయొక్క సంకల్ప మాత్రముననే కలిగిన ఈ సృష్టి అంతయు పంచభూతాత్మకమైంది. తిరిగి సృష్టించిన ప్రతిజీవి ఆ పరమాత్మ సంకల్పముననే, పంచభూతాలతోపాటు తనలోనే లయమొందును. సృష్టి అంతయు ఏకకాలాన లయమొందుట అనునది కూడా పరమాత్మ సంకల్పాన జరగవలసినదే. సృష్టి రచన ఏ విధంగా జరిగింది తెలుసుకొనుట ఎంత కఠినమో, ప్రళయాన్నిగూర్చిగానీ, ప్రళయకాల నిర్ణయాన్ని గూర్చిగానీ తెలుసుకొనుట అంత కష్టం. సృష్టి అంతయు ఒకేసారి లయమగుటకు 'మహాలప్రళయం' అందురు.

సృష్టి, ప్రళయాల మధ్య జరిగే జీవనవిధానమే చాలా విచిత్రమైంది. ఎప్పుడు ఈ జీవులెల్ల ఏకకాలాన మహాత్ముడగు పరమాత్మయందు లీనమగుచున్నవో, అప్పుడీ పరమాత్మ జాగ్రదాది వ్యాపారాలనెల్లమాని హాయిగా నిద్రించును.

**శ్లో॥ ఏవం స జాగ్రత్స్వప్నా భ్యామిదం సర్వం చరాచరమ్ ।**
**సంజీవయతి చా జస్రం ప్రమాపయతి చావ్యయః ॥**

నాశరహితుడైన పరబ్రహ్మ ఈవిధంగా జాగ్రత్తు, స్వప్నావస్థలచేత ఎప్పుడూ స్థావర జంగమాత్మకమైన ఈ ప్రపంచాన్ని, సృజించును, నశింపజేయను.

**కాలపరిమాణం**

మన్వంతర సృష్టి కాలపరిమాణాన్ని ధర్మశాస్త్రాలు వివరించాయి. 18 రెప్పపాట్ల కాలాన్ని ఒక కాష్ట అంటారు. 30 కాష్టలు ఒక కళ, 30 కళలు = ఒక ముహూర్తం, 30 ముహూర్తాలు ఒక అహోరాత్రం (అనగా ఒకరోజు) సూర్యుడు ఈ అహోరాత్రాలను మానుషాలుగా, దైవికాలుగా విభజించారు. ఇందులో పగలు ప్రాణుల కార్యముల నిమిత్తము, రాత్రి ప్రాణులయొక్క నిద్ర నిమిత్తం ఏర్పడింది. మానవుల మాసం అనగా 30 రోజులు పితృదేవతలకు ఒక రేయింబవలు (అనగా ఒక రోజుతో సమానం) కృష్ణపక్షం (పితృదేవతలకు) కర్మానుష్ఠానానికి, శుక్లపక్షం నిద్ర నిమిత్తముంటుంది. మానవులకు ఒక సంవత్సరం 365 రోజులు దేవతలకు ఒక రేయింబవలగును. (అంటే ఒకరోజు) ఉత్తరాయణము దేవతలకు పగలగును, దక్షిణాయనము రాత్రి అయినవి.

### యుగపరిమాణం

నాలుగువేల దైవ సంవత్సరాలు 'కృతయుగ' పరిమాణం. ఇందులో మొదటి నూరేళ్లు సంధ్య అనియు, చివరి నూరేళ్లు సంధ్యాంశమనియు అగుచున్నవి. మొత్తం కలిపి నాలుగువేల ఎనిమిది వందలు కృతయుగ ప్రమాణమైంది. ఇదేవిధంగా మిగిలిన మూడు యుగాల ప్రమాణాలు కూడా ఈ దిగువ యున్నాయి.

| యుగము | దైవ సంవత్సరము | మానుష సంవత్సరములు |
|---|---|---|
| 1. కృతయుగం | 4800 | 17,28,000 |
| 2. త్రేతాయుగం | 3600 | 12,96,000 |
| 3. ద్వాపరయుగం | 2400 | 8,64,000 |
| 4. కలియుగం | 1200 | 4,32,000 |

మానుష చతుర్యుగాలు కలిసి ఒక దివ్య యుగమగును. ఇది దేవమానమున 12 వేల సంవత్సరాలగును.

దైవయుగాలు రెండు వేలయిన బ్రహ్మకు ఒక అహోరాత్రమని చెప్పబడును. ఇందులో వేయింటితో ముగిసినవి బ్రహ్మయొక్క పగటిని పుణ్యదినమనియు, ఇంతే సంఖ్యగల బ్రహ్మయొక్క రాత్రిని స్వప్నకాలమని అంటారు. ఈ బ్రహ్మమయిన అహోరాత్ర సంఖ్యతెలిసినవారు అహోరాత్రజ్ఞులు అవుతాయి.

మానుష సంవత్సరాలలో బ్రహ్మ అహోరాత్ర సంఖ్య నాలుగు వందల ముప్పయి రెండు సంవత్సరాలు – బ్రహ్మదేవునికి రాత్రి యగును. ఈ అహోరాత్ర సంఖ్యతెలియుట అవశ్యకమగుటయే గాక అత్యంత పుణ్యప్రదమైంది.

బ్రహ్మదేవుడు అహోరాత్రానర రాత్రికాలమందు నిద్రించి, మేల్కాంచిన పిదప అవాంతర మహాప్రళయాన భూరాదిలోకాల సృష్టి నిమిత్తమై సదసదాత్మకమైన మహత్తును సృజిస్తాడు. బ్రహ్మచే పురికొల్పబడిన ఈ మహత్తు సృష్టిని చేయనారంభిస్తుంది.

మహత్తునుండి శబ్దగుణం కలిగి ఆకాశం జన్మించింది. మార్పులను చేయు ఆకాశం నుండి సుగంధ దుర్గంధాలను గొనిపోవు పవిత్రమైన, బలమైన సర్పగుణం కలిగిన వాయువు పుట్టింది. మార్పు జనించు వాయువు నుండి ప్రకాశంగల, తేజోమయమైన జ్యోతిస్వరూపం అగ్ని కలిగింది. మార్పు కలిగించెడు అగ్ని నుండి రసగుణంగల జలం ఉద్భవించింది. మార్పులున్న జలంనుండి గంథగుణంగల భూమి జనించినది. ఇదియే మహాప్రళయాంతరం. మొదట భూత సృష్టి పంచభూతాలవలనే అవాంతర సృష్టికి పిదప కిగి భూరాధిలోకత్రయ నిర్మాణం జరిగింది.

పైన తెలిపిన 12,000 సంవత్సర పరిమాణంగల మనుష్యుల చతుర్యుగం కలది ఒక దైవయుగమని ఏది చెప్పబడిందో, అట్టి దైవయుగంలో 71 అయినచో ఒక మన్వంతరం అనబడుతుంది.

**శ్లో॥ మన్వంతరాణ్య సంఖ్యాని సర్గ స్సంహార మేవ చ ।**
**క్రీడన్ని వైత త్కురుతే, పరమేష్ఠీ పునఃపునః ॥**

సృష్టి మరియు ప్రళయాలు అనంతాలైనందున మన్వంతరాలు లెక్కలేనివి. ఇట్టి సృష్టిని బ్రహ్మ ఆటలాడువానివలె మాటిమాటికీ చేస్తాడు. ఇది సృష్టి వైచిత్రం.



# 4. కాలాధీనం జగత్సర్వం

**శ్లో॥  అచింత్యావ్యక్త రూపాయ, నిర్గుణాయ గుణాత్మనే ।**
**సమస్త జగదాధార, మూర్తయే బ్రహ్మణే నమః ॥**

ఊహించనలవిగాని, అగోచరరూపంగల గుణాతీతమైన సచ్చిదానంద స్వరూపుడు, లోకాధారమూర్తి అయిన పరమేశ్వరునకు నమస్కరిస్తున్నాను.

ప్రపంచంలోని దేశాలన్నింటికీ, మతాలన్నింటికీ తండ్రి స్థానం అలంకరించిన దేశం మన భారతదేశం. హిందూ దేశస్థుల మతం వైదికమతం. మనం హైందవులం.

**"హీనం చ దూషయ త్యేవ హిందురిత్యభిధీయతే ॥**

అను మేరుతంత్రాదులలో పేర్కొన్నట్లుగా హీనదూషకులగుటను హిందువులని ఉత్పత్తి నిరూపించబడి ఉన్నా, కేవలయౌగికంగాక ఆర్యులయందే రూఢిగా ఈ శబ్దం ప్రయోగించబడుతుంది. ఆర్యశబ్దం మహర్షులచే విస్తరించబడింది. ఆర్యులు అనగా హిందువులందరికీ మతగ్రంథాలు మొదట వేదాలు. తర్వాత వాని అర్థాలను వివరించే సకలశాస్త్ర పురాణేతిహాసాదులు. ఇవి సర్వమానవ సాధారణ ధర్మాలైన అహింసా, సత్య, అస్తేయాది గుణాలను, హిందూ జాతి విశేషధర్మాలైన వర్ణాశ్రమ ధర్మాలను, ముఖ్యంగా కర్మ, భక్తి, జ్ఞాన యోగాలను వివిధ విషయాలను నిరూపిస్తున్నాయి. ఐహిక, ఆముష్మిక, నిర్వాణరూప సుఖత్రయప్రాప్తి సాధనాలను, ఆధ్యాత్మిక, ఆధిబౌతిక, ఆదిదైవికరూప దుఃఖత్రయ నివారణోపాయాలను అనేక సులభ మార్గాలతో బోధించాయి.

హిందూమత గ్రంథాలన్నీ అన్ని జాతులవారికీ అనుకూలమైన కర్మకాండను విధించి మతగ్రంథ విశ్వాసం, మతగ్రంథోక్త కర్మకాండాన్ని విడిచి, మతాంతర విశ్వాసంతో, మతాంతాచారాల నవలంబించువారు ఏ మతమందైనా భ్రష్టులవుతారు.

ప్రపంచంలోని ప్రతి మతానికీ మతంతో సంబంధించిన కర్మకాండ కొంతైనా లేనివారు లేరు. ఏ మతమందైనా తప్పొప్పులను తెలుసుకొనుటకు శాస్త్రమే ఆధారం గానీ వేరే గతిలేదు.

**"తస్మాచ్ఛాస్త్రం ప్రమాణం తే కార్యాకార్య వ్యవస్థితౌ"** అని గీతలో భగవానుడు చెప్పాడు.

హిందూమతం సృష్ట్యాదినుంచి ఏర్పడిన సకల మతాలకు ప్రకృతిస్థానం అవుతుంది. ఇది నిత్య సిద్ధం. అనాది నిధనాలగు వేదాల ఆధారంగా రూపొందింది. హిందూ మతస్థుల కొరకు ఏర్పడిన కర్మకాండను విధించునది హిందూ ధర్మశాస్త్రం.

**'శాసనాత్ శాస్త్ర ముచ్యతే"** శాస్త్రమనగా శాసించునది. హిందువులకు ధర్మాలను శాసించునది కనుక హిందూ ధర్మశాస్త్రమన్నారు. ధర్మమనగా **"అభ్యుదయ నిశ్రేయసే సాధ కత్వేన ధారయతీతి ధర్మః"** జీవులకు అభ్యుదయం, మోక్షం, ధర్మాన్ననుష్ఠించువారికి లభింపజేయునది ధర్మం.

పరమేశ్వరుడు తాత్వికంగా నిర్గుణ బ్రహ్మమే అయినా, **"ఉపాసకానాం కార్యార్థః బ్రహ్మణో రూప కల్పనా"** అని ప్రార్థించువారి యొక్క సౌకర్యం కొరకు నామరూపాలేర్పడినవి. వేదాలు పరమేశ్వరునివలన వ్యక్తమైనాయి. వేదమే పరమేశ్వరుడు. వేదంలో **"ధర్మో విశ్వస్య జగతః ప్రతిష్ఠా"** అని ఉంది. అనగా సకల జగత్తునకు ధర్మమే ఆధారం. వైదిక ధర్మానుష్ఠానమే జగత్కల్యాణ కారణమని స్పష్టమవుతుంది.

వేదంలోని ఉత్తరభాగం జ్ఞానాన్ని బోధించగా, అట్టి జ్ఞానానికి సాధనం కర్మకాండ. కనుక ఆ భాగం కర్మకాండమైంది. ధర్మానుష్ఠానమైన కర్మకాండవలన చిత్తశుద్ధి గలిగి తద్వారా జ్ఞానమార్గానికి అర్హులవుతున్నారు.

వేదోక్త కర్మానుష్ఠానానికి భరతఖండం మాత్రమే యోగ్యభూమి. అందుకే హిందూదేశమే కర్మభూమి. గర్భాధానం మొదలు అంత్య కర్మాంతం మానవుని బాహ్యాంతశ్శుద్ధులను బోధించు సంస్కార స్వరూపం. సంస్కార కర్మల నాచరించుటకు కాలనిర్ణయం అత్యంతావశ్యకం.

శ్లో॥ యః శాస్త్ర విధి ముత్సృజ్య, వర్తతే కామ కారతః ।
నససిద్ధి మవాప్నోతి న సుఖం న పరాం గతిం ॥

ఎవరు శాస్త్రవిధిని వదలి స్వేచ్ఛానుసారంగా కర్మలు చేయుచున్నారో, వారికి సిద్ధి లభింపదు. సుఖం లేదు. ఉత్తమగతి లభించదని గీతాచార్యుడు స్పష్టపరిచాడు.

**కర్మసాక్షియైన సూర్యభగవానుడే కాలస్వరూపుడు**

కాలమనేది నరాది ప్రాణులు, వృక్షాది జడ పదార్థాలనబడు గుణాశ్రయ వస్తువుల పరిణామానికి కారణభూతమై ఉంది. దీనిని ఎల్లప్పుడూ ఊహించి తెలుసుకొనదగిన కేవల పరబ్రహ్మ స్వరూపం అంటారు. ఇది అఖండ కాలమని, ఖండకాలమని రెండు విధాలు. అఖండకాలం సర్వవ్యాపకమైన సచ్చిదానంద స్వరూపమే. ఇది వెలుగుల గనియైన సూర్యభగవానుడు.

అఖండకాలస్వరూపుడగు పరమేశ్వరునివల్ల జనించిన సూర్యభఘవానునిచే తృటి మొదలు కల్పాంతం వరకు వ్యావహారికంగా కల్పింపబడింది ఖండకాలం, దీనినే జన్యకాలమంటారు.

**కాలవిభాగం**

సూటియైన, మిక్కిలి పదునుగల సూదితో ఒక తామరపూవు యొక్క దళాన్ని గుచ్చగా, అందు సూదిమొన ఒక దళాన్ని విడిచి, రెండవ దళాన్ని తాకడానికి ఎంతకాలం పడుతుందో ఆ కాలానికి 'తృటి' అని పేరు.

100 తృటులు = 1 లవం, 30 లవాలు = 1 నిమేషం (మనం వాడుతున్న గడియారంలోని నిమిషం వేరు) 27 నిమేషాలు = 1 గుర్వక్షరోచ్చారణకు పట్టు కాలం. 10 గుర్వక్షరోచ్చారణ కాలాలు = 1 ప్రాణకాలం. 6 ప్రాణాలు (ఆసువులు) = 1 వినాడి (వికల). 60 వినాడులు (వికలలు) = 1 నాడి (కల). 60 నాడికలు (60 ఘడియలు) = 1 రోజు (అహోరాత్రకాలము) ప్రస్తుత 24 గంటలు గడియార సమయం.

ప్రస్తుతం మనం వ్యవహరిస్తున్న కాలం కేవలం సెకనుల వరకే పరిమితమైంది. కానీ మన పూర్వీకులు ఇంకా సూక్ష్మంగా (అనగా 2/25 సెకను

= 1 తృటితో సమానం) గ్రహించి ఆచరించారు. కనురెప్పపాటు కాలాన్ని నిమేషమందురు.

2 నిమేషాలు = 1 తృటి, 2 తృటులు = 1 లవం, 2 లవాలు = 1 క్షణం, 10 క్షణాలు = 1 కాష్ఠ, 30 కాష్ఠలు = 1 కళ, 30 కళలు = 1 ముహూర్తం, 30 ముహూర్తాలు = 1 రోజు (అహోరాత్రం) = 24 గంటలు.

ముహూర్తమనగా రెండు ఘడియల కాలం = 48 నిమిషాలు. నిమి అనగా జనకమహారాజునకు పూర్వీకుడైన రాజు. **"నిమిః సీదతియేషు తే నిమిషాః"** అని వ్యుత్పత్తి. ఐతే ఆ నిమి చక్రవర్తి దేవతల వరప్రసాదంవలన ఏ రెప్పపాటు కాలమందుండెనో, ఆ రెప్పపాటును నిమిషం అని, నిమేషం అని అంటారు. రెప్పపాటు కాలమైన నిమేషం, అంతకంటె పెద్దవైన కలలు, కాష్ఠలు, ముహూర్తాలు, అహోరాత్రాలు, పక్షాలు, మాసాలు, ఋతువులు, సంవత్సరాలు అన్నీ స్వయంప్రకాశమానుడు, పరిపూర్ణుడు ఐన పరమేశ్వరుని వలన జనించినాయి. పరమేశ్వరునివలన పుట్టుటచేతనే ఈ సంవత్సరాలన్నీ తమ తమ ప్రయోజనాలందు సమర్థమగుచున్నవి. కాలవిశేషంలో సంవత్సరం ప్రధానమైంది.

**సంవత్సర విశేషం**

**"కాలాస్సంవత్సరగ్ం శ్రితాః"** ఏవిధంగా గంగాది మహానదులు ఇతర చిన్న నదులతో కూడి విశాలములై ఎల్లప్పుడూ ప్రవహిస్తున్నాయో అలానే అనేక విధాలైన రూపాలతో ఏర్పడిన కాలవిశేషాలు 'సంవత్సర"మన పేరుగల ప్రధాన కాలాన్నాశ్రయించి ఉన్నాయి.

నిమేషం మొదలుకొని అయనం వరకుగల కాలవిశేషాలు సంవత్సరం కంటే చిన్నవి. యుగం మొదలుకొని పరార్థ: వరకు గల కాలవిశేషాలు సంవత్సరం కంటె గొప్పవి. అవన్నీ సంవత్సరంలోనే ప్రవేశించి ఉన్నాయి. అణుకాలాలు సంవత్సరం అను శరీరికి అవయవాలగుటచే శరీరమందు ప్రవేశిస్తున్నాయి. యుగాది మహత్కాలాలు సంవత్సరం యొక్క ఆవృత్తిచే ఏర్పడుతున్నందున యుగాది మహత్కాలాలకు అధ్యక్షం సంవత్సరమే అగుటచే అందు ప్రవేశం చెప్పబడింది.

**"సంవత్సరః ప్రజాపతిః ప్రజాపతిర్యజ్ఞః । యజ్ఞో వై ప్రజాపతిః"** (తైత్తిరీయ సంహిత)

సంవత్సరం, యజ్ఞం అను రెండు పదాలు సమానార్థాలుగా చెప్పబడ్డాయి. వేదకాలారంభం నుండి (సృష్ట్యాదినుండి) వైదికులు తమ గృహాలందు సదా అగ్నిహోత్రాన్ని పోషించేవారు. ఆ అగ్నిహోత్రం నందు సంవత్సరం పొడవునా హోమం చేస్తూ, కాలమానాన్ని అనుసరించి యజ్ఞయాగాది క్రతువులను చేసేవారు.

**"సంవత్సరో నామాయనాద్యవయవ యుక్తోఽవయ వీకాల విశేషః సమ్యగ్వసంత్యస్మిన్నయనర్తు మాసాదయ"**

అని సంవత్సర శబ్దానికి వ్యుత్పత్త్యర్థం. అనగా అయనం, ఋతువు, మాసం మొదలగునవి దీనియందు నివసించి యున్నందున ఇది "సంవత్సర" మనబడుతుంది.

వార్షిక సత్రాలే వేదకాలంనాటి పంచాంగం యొక్క ప్రథమదశ అని తెలుస్తుంది. యాజ్ఞికులు యజ్ఞాలు చేయడమే కాక కాలమానం తెలుపు 'పంచాంగం'ను సంరక్షించుట కూడా విద్యుక్తధర్మంగా ఆచరించారు.

**పంచవత్సరాత్మక యుగం**

**శ్లో॥ యుగం భవేద్వత్సర పంచకేన ।**
**యుగాని తు ద్వాదశ వర్ష షష్ట్యా ॥**

ప్రభవ సంవత్సరం మొదలుకొని అక్షయ వరకుగల అరవై సంవత్సరాలను ఐదు భాగాలు చేయగా, ఒక్కో భాగానికి 12 సంవత్సరాలు వస్తాయి. ప్రతి భాగం 'యుగం' అనే సంజ్ఞ కలిగి ఉంది. అందుకే దీనిని పంచవత్సరాత్మక యుగమని పేరు.

1. సంవత్సరం = ప్రభవతో ప్రారంభమై దుందుభితో సమాప్తం. ఇవి అగ్ని సంవత్సరాలు, తిలదానం శ్రేష్ఠం.

2. పరివత్సరం = విభవతో ప్రారంభమై రుధిరోద్గారితో సమాప్తం. ఇవి సూర్య సంవత్సరాలు, గోధుమ దానం శ్రేష్ఠం.

3. ఇడావత్సరం = శుక్లతో ప్రారంభమై రక్తాక్షితో సమాప్తం. ఇవి చంద్ర సంవత్సరాలు. వస్త్రదానం శ్రేష్ఠం.

4. అనువత్సరం = ప్రమోదూతతో ప్రారంభమై, క్రోధనతో సమాప్తం. ఇవి ప్రజాపతి సంవత్సరాలు. ధాన్యదానం శ్రేష్ఠం.

5. ఇద్వత్సరం = ప్రజోత్పత్తితో ప్రారంభమై, అక్షయతో సమాప్తం. వి రుద్ర సంవత్సరాలు. రజతదానం శ్రేష్ఠం.

ప్రతి సంవత్సరం ఆరంభం యుగారంభమే కనుక సంవత్సరారంభాన్ని 'యుగాది' అన్నారు. కాలక్రమేణా దానిని 'ఉగాది' అని పిలుస్తున్నాం. మన భారతదేశంలోని పలు ప్రాంతాలలో 'ఉగాది' నిర్ణయం పలువిధాలుగా ఉంది. ఇది కూడా కాలమానంలోని వ్యత్యాసమే తప్ప వేరుగాదు. కాలమానం తొమ్మిది విధాలుగా ఉంది.

**నవమాన ప్రత్యేకత**

**శ్లో॥ బ్రాహ్మం దైవం మానుషం చ పిత్ర్యం సౌరం చ సావనం ।**
**చంద్రమార్క్షం గురోర్మానం ఇతి మానాని వై నవ ॥**

బ్రహ్మమానం, దివ్యమానం, ప్రజాపతి మానం, పితృమానం, సౌరమానం, సావనమానం, చాంద్రమానం, నక్షత్రమానం, బార్హస్పత్యమానం అని మానాలు తొమ్మిది విధాలు.

**1. నక్షత్రమానం :** అశ్వినీ నక్షత్రం తూర్పున ఉదయించింది మొదలు తిరిగి ఆ నక్షత్రమే తూర్పున ఉదయించడానికిగల మధ్య కాలమే నక్షత్రమానాబ్దం. దీనికి 359 సావన దినములు. వర్షఫణి మరియు మనుషుల ఆయుర్దాయానికి ఈ నక్షత్ర మానాన్ని ఉపయోగిస్తారు.

**2. సావన మానం :** సూర్యోదయం నుండి తిరిగి సూర్యోదయం వరకుగల మధ్యకాలం సావనదినమని పేరు. ఇవి 360 దినములైన ఒక సావన సంవత్సరమగును. ఈ మానంచే యుగాదులందు దినగణనం, జాతామృతా శౌచాదులందు దినగణనం, గ్రహాల దినగతి, దిన, మాస, అబ్ధాధిపతుల సాధన, స్త్రీ గర్భదినగణనం మొదలగునవి తెలుస్తాయి.

**3. చాంద్రమానం :** రవి, చంద్రుల కలయిక రూపమగు దర్శాంతకాలం (అమావాస్య తెల్లవారి) నుండి, తిరిగి దర్శాంతం వరకుగల మధ్య కాలానికి చాంద్రమానమకని పేరు. ఆ మాసం నందు 30వదగు తిథికే చాంద్రమాన దినం అని పేరు. చాంద్రమానాబ్దానికి 354 రోజుల 11 ఘడియల 38 విఘడియలు. ఇది స్ఫుత చంద్రగతిచే మారుతుంది. ఈ చాంద్రమానం వల్ల తిథి నక్షత్రాదుల గణనం, సమస్త తకర్మలు, వ్రతాలు, శ్రాద్ధాదులు నిర్ణయించబడతాయి.

**4. సౌరమానం :** సూర్యుడు మేషరాశిలో ప్రవేశించురోజు నుండి తిరిగి మేషరాశిలో ప్రవేశించురోజు వరకుగల మధ్య కాలాన్ని సౌర సంవత్సరమందురు. సౌర సంవత్సర ప్రమాణం 365 రోజుల 15 ఘడియల 31 విఘడియలు. సౌరమానం 30 రోజుల 29 ఘడియల 19 విఘడియలు. సూర్యుడు రెండు రాశులను అతిక్రమించు కాలం ఋతువని, ఆరు రాశులను అతిక్రమించు కాలాన్ని అయనం అని అంటారు. మకర సంక్రమణ రోజు నుండి కర్కాటక సంక్రమణం వరకుగల ఆరు మాసాలకాలం ఉత్తరాయణం. కర్కాటక సంక్రాంతి నుండి మకర సంక్రాంతి వరకుగల ఆరు మాసాల కాలం దక్షిణాయనం. సౌరమానంచే మహాయుగాది సంవత్సర గణనం, అయనాలు, సంక్రాంతులు, దినరాత్రి ప్రమాణ సాధనం, షడశీతులు మొదలగునవి వ్యవహరించబడతాయి.

**5. బార్హస్పత్యమానం :** మధ్యమ గురుని ప్రవేశకాలమే బార్హస్పత్య మానాబ్దానికి ఆరంభదినం. ఈ బార్హస్పత్యమానంచే ప్రభవాది షష్ట్యబ్ద గణనం తెలుస్తుంది.

**6. పితృమానం :** ఒక చాంద్రమానం పితృదేవతలకు ఒక రోజు. అందు అమావాస్య పితరులకు మధ్యాహ్నకాలం.

**7. దివ్యమానం (దేవమానం) :** ఒక సౌర సంవత్సరం వదేవతలకు అహోరాత్రమగును (ఒకరోజు). ఇందు మేషాది ఆరు రాశులు కాలం పగలు, తులాది ఆరు రాశుల కాలం రాత్రి. మేష సంక్రమణ కాలం దేవతలకు సూర్యోదయ కాలం, కర్కాటక సంక్రమణం మధ్యాహ్నకాలం, తులా సంక్రమణ కాలం

సూర్యాస్తమయకాలం, మకర సంక్రమణ కాలం అర్ధరాత్రి కాలం అవుతుంది.

**8. ప్రజాపతి మానం :** 71 మహాయుగాలు, ఒక కృతయుగతుల్య సంధియు కలిసి మన్వంతరం అవుతుంది. ఇది ప్రజాపతి లోకానికి ఒక దినం. అనగా 30,84,48,000 సంవత్సరాలగును.

**9. బ్రహ్మమానం :** 14 మన్వంతరాలు, ఒక కృతయుగ తుల్యసంధి కలిసి బ్రహ్మకు ఒక పగలు, ఇదియే కల్పం. తిరిగి ఇంతే కాలం రాత్రి. బ్రహ్మయొక్క ఈ అహోరాత్రాలతో నూరు సంవత్సరాలు ఆయుర్దాయమగును. భూలోకంలో ప్రస్తుతం పై తొమ్మిది మానాలలో చాంద్ర, సౌర, సావన నక్షత్రాలను నాలుగు మానాలచే సకల వ్యవహారాలు జరుగుతున్నాయి. ఇందులో మనది చాంద్రమానం, సౌరమానం దక్షిణదేశవాసులది. ప్రత్యేకించి బార్హస్పత్యమానాన్ని ఉత్తరదేశవాసులు వ్యవహరిస్తున్నారు.

**చాంద్రమాన పంచాంగ స్వరూం**

ఆదిపురుషుడు మహాకాలాన్నాధారంగా చేసుకుని, మూల ప్రకృతిని గుణవైషమ్యంగా నొనర్చి, చతుర్ముఖ బ్రహ్మద్వారా అనేక బ్రహ్మాండాలు సృష్టించాడు. ఇందున్న సమస్త ప్రాణికోటి కాలాధీనంగా నడుస్తున్నాయి. చంద్రసూర్యులు, గ్రహతారలు, ఆకాశాన నిదర్శనాలు. జీవనదులు ప్రవహించడం, కొండలు, సముద్రాలు నిలిచి ఉండడం, భూభాగాన దృష్టాంతాలు. ఇట్టి కాలగతికి విరుద్ధంగా నడిచేవారు ఎట్టి మేధావంతులైనా, బలశాలురైనా క్లిష్టపరిస్థితిని ఎదుర్కొంటారు.

**పంచాంగంవలన లాభాలు :**

- ప్రతి మానవుని జీవితం కొన్ని సంవత్సరాల కాలపరిమితి మాత్రమే ఉంది.
- మానవుని పరిమితకాల జీవితంలో ఎట్టి మహోన్నత కార్యాలను ఏ రీతిగా ఎప్పుడు చేయాలనే విషయాలు తెలుపుతుంది.
- జాతకర్మాది సకల సంస్కారాలకు శుభముహూర్త నిర్ణయం చేయడానికి అవకాశం ఉంటుంది.

- శుభకార్యారంభానికి, ప్రయాసతో కూడిన ప్రయాణాలకు శుభసమయాలు నిర్ణయిస్తుంది.
- వర్షయోగ విశేషాల వివరాలు – కార్తి ఫలాలు.
- ధరల నిర్ణయ సూచనలు
- గ్రహణ, మౌఢ్య, పుష్కర విశేష సమయాలు.
- సంవత్సర రాశిఫలాలు, గ్రహస్థితి, శుభకార్య సూచనలు.
- పండుగలు – వ్రత విశేషాల నిర్ణయం.
- సంవత్సరం ఫలం – ఆదాయ వ్యయవివరాలు.
- శ్రాద్ధదిన నిర్ణయాలు – అశౌచ విషయాలు.
- దేశకాల వాతావరణ పరిస్థితుల వివరాలు.
- జాతక, గోచార, మేళన, వాస్తు, సంఖ్యా, ప్రశ్న విషయాలు.

**పంచాంగం అనగానేమి?**

**శ్లో॥ తిథిర్వారం చ నక్షత్రం, యోగః కరణ మేవ చ ।**
**పంచాంగమితి విఖ్యాతం కాలోఽయం కర్మసాధకః ॥**

తిథి, వారం, నక్షత్రం, యోగం, కరణములను ఐదు అంగాలతో కూడిన పంచాంగం, కర్మసాధకులకు కాలవిశేషాలను తెలుపుతుంది.

**1. తిథి :** సూర్యచంద్రుల కలయికను అనుసరించి అనగా అమావాస్య మొదలు తిరిగి అమావాస్య వరకుగల దూరాన్ని తిథిరూపంలో పాడ్యమి, విదియ మొదలగు పేర్లతో లెక్కించబడుతుంది. పాడ్యమి నుండి పౌర్ణమివరకు 15 తిథులు, శుక్లపక్షం, తిరిగి పాడ్యమినుండి అమావాస్య వరకు 15 తిథులు కృష్ణపక్షం మొత్తం 30 తిథులతో కూడింది చాంద్రమాసం.

**2. వారం :** సూర్యోదయం నుండి తిరిగి సూర్యోదయం వరకు గల కాలం ఒక రోజు. ఇందులో ఆదివారాది 7 వారాలు వరుసగా ఉంటాయి.

**3. నక్షత్రం :** చంద్రగతిని ఆధారంగా చేసుకుని అశ్విని మొదలు రేవతి వరకు 27 నక్షత్రాలలో సంచరించు కాలం.

**4. యోగం :** రవి, చంద్రుల కలయికనే యోగం. విష్కంభాది 27 యోగాలు వరుసగా ఉంటాయి.

**5. కరణం :** చంద్రగతి ననుసరించి బవాది 11 కరణాలు వరుసగా తిథిలో సగభాగంగా లెక్కించబడతాయి.

**యుగాది (ఉగాది) ప్రాశస్త్యం**

చాంద్రమానం అనుసరించి చైత్రశుక్ల పాడ్యమి రోజున ఉగాది పండుగ జరుపుకుంటాం. తెలుగు సంవత్సరాదిగా ప్రస్తుతం వ్యవహరిస్తున్నాం. ప్రభవాది సంవత్సరారంభదినం కావడం విశేషం. ఇట్టి పర్వదినాన చేయవలసిన విధివిధానాన్ని శాస్త్రమే నిర్దేశించింది.

**శ్లో॥ ప్రాప్తే నూతన వత్సరే, ప్రతిగృహే కుర్యాద్ధ్వజాతోరణం ।**
**స్నానం మంగళమాచరేద్ద్విజ నరై స్సార్థం సుపూజోత్సవం ॥**
**దేవానాం గురు యోషితాం చ శిశవోఽలంకార వస్త్రాదిభిః ।**
**సంపూజ్యో గణకః ఫలం చ శృణుయాత్తస్మాచ్చ లాభప్రదం ॥**

నూతన వత్సరారంభ రోజున ప్రతి ఇంటిలో పచ్చని మామిడాకుల తోరణాలతో, ధ్వజాలతో అలంకరించాలి. మంగళస్నానమాచరించి బ్రాహ్మణులతో కలిసి దేవాలయంలో భక్తిశ్రద్ధలతో పూజలు చేయాలి. దేవతలను, గురువులను, స్త్రీలను, పిల్లలను నూతన వస్త్రాలతో అలంకరింపచేయాలి. దైవజ్ఞులైన పంచాంగకర్తలద్వారా పౌరోహితులద్వారా పంచాంగ శ్రవణమాచరించి సంవత్సర శుభాశుభఫలాలను తెలుసుకోవాలి.

**నింబ కుసుమ భక్షణ ఫలం**

**శ్లో॥ వర్షాదౌ నింబకుసుమ, శర్కరామ్ల ఘృతాన్వితం ।**
**భక్షితం పర్యయామే చ తద్వర్షం సౌఖ్యదాయకం ॥**

**శ్లో॥ మరీ చ హింగు లవణా అజామోదా స శర్కరైః ।**
**త్రింత్రిణీ మేళనం కృత్వా, భక్షయే ద్రోగ శాంతయే ॥**

ఉగాది పర్వదినాన కుటుంబసభ్యులందరూ కలిసి, మిరియాలు, ఇంగువ, ఉప్పు, ఓమ, చక్కెర, చింతపండు రసంలో వేపపువ్వును కలిపి (పచ్చడి) సేవిస్తే

సమస్తరోగాలు నశించి, సంవత్సరమంతా సుఖశాంతులతో ఉంటారు.

**శ్లో॥ శతాయుర్వజ్ర దేహాయ, సర్వసంపత్కరాయ చ ।**
**సర్వారిష్ట వినాశాయ నింబకం దళ భక్షణమ్ ॥**

సంవత్సరారంభ దినాన వేపపువ్వు భక్షించుటవలన వజ్రశరీరంతో కూడి దీర్ఘాయుష్షును పొందుతారు. ధనధాన్య సంపదలు కలుగుతాయి. సకల అరిష్టాలూ తొలగుతాయి.

**పంచాంగ శ్రవణ ఫలం**

**శ్లో॥ తిథేశ్చ శ్రియమాప్నోతి, వారాదాయుష్య వర్ధనం ।**
**నక్షత్రాద్ధరతే పాపం, యోగాద్రోగ నివారణం ।**
**కరణాత్కార్య సిద్ధి స్యా త్పంచాంగ ఫలముత్తమం ॥**

ఉగాదిరోజున పంచాంగ శ్రవణంలో తిథి వలన సంపద్వృద్ధి, వారం వలన ఆయుష్యాభివృద్ధి కలుగుతాయి. నక్షత్రం వలన పాపం నశిస్తుంది. యోగం వలన రోగనివారణ, కరణం వలన సకల కార్యసిద్ధి కలుగుతుంది. నవనాయక ఫలశ్రవణం వలన రాజ్యసంపదలు సుస్థిరమవుతాయి. శక్తిసామర్థ్యాలు పెరుగుతాయి. ధనధాన్యాలు వర్ధిల్లుతాయి. వాక్సంపద సిద్ధిస్తుంది. ధర్మబుద్ధి కలుగుతుంది. దీర్ఘాయుష్షుతో పాటు విశేషకీర్తి లభించి సౌఖ్యం కలుగుతుంది.

**శ్లో॥ శ్రౌతం స్మార్తం చ గార్హస్థ్యం యద్వినా నైవ సిద్ధ్యతి ।**
**తత్కాలాఖ్యేశ్వర స్యాంగం వందే తిథ్యాది పంచకం ॥**

కాలస్వరూపుడగు ఈశ్వరునికి అంగభూతమైన తిథి, వార, నక్షత్ర, యోగ కరణాత్మకమైన పంచాంగం లేనిచో శ్రౌతకర్మలు, స్మార్తకర్మలు, గృహస్థధర్మాలు నిర్వర్తింపబడవో అట్టి తిథ్యాది రూపక పంచాంగానికి నమస్కారం.

**దైవజ్ఞ లక్షణం**

**శ్లో॥ అద్వేషీ నిత్యసంతోషీ గనితాగమ పారగః ।**
**సౌమ్యశ్చ సత్యభాషీ చ సదైవజ్ఞః ప్రకీర్తితః ॥**

ద్వేషరహితుడు, ఎల్లప్పుడు సంతోషంగా ఉండేవాడు, గణితశాస్త్ర నిపుణుడు, సౌమ్యుడు, సత్యం మాట్లాడేవాడు దైవజ్ఞుడుగా పిలువబడుచున్నాడు.

దైవజ్ఞ లక్షణం గలవారే పంచాంగ గణన చేయడానికి అర్హులు. వీరినే సిద్ధాంతులుగా వ్యవహరిస్తారు. పంచాంగకర్తగా జగత్కళ్యాణం కొరకు నిరంతరం కృషి చేయడాన్నే ప్రధాన కర్తవ్యంగా భావించినపుడే దైవజ్ఞనామం సార్థకమవుతుంది. మన పూర్వీకులైన ఋషులేర్పరచిన జ్యోతిశ్శాస్త్ర గణితభాగం సంపూర్ణంగా ఫలవంతమైంది.

**పంచాంగ వ్యత్యాసాలకు కారణం?**

పంచాంగం అనేది సర్వజనులకు శ్రేయోదాయకమైన ధర్మకర్మలను ఆచరింపజేసే సిద్ధాంత గ్రంథం. పంచాంగంలో ప్రధానమైనవి పండుగ వ్రత విశేష నిర్ణయాలు. ఇవి సకలజనులు ఆచరించే పరమపవిత్రమైన కార్యాలు. వీటి నిర్ణయంలో పంచాంగాలలో వ్యత్యాసం ఉండుట వలన ప్రజలకు అయోమయస్థితి ఏర్పడుతుంది. దీనికి కారణాలనేకం ఉన్నాయి.

**శ్లో॥ శృతిశ్చ భిన్నాః స్మృతయశ్చ భిన్నాః మహామునీనాం మతయశ్చభిన్నాః ।**
**ధర్మస్య త్తవం నిహితం గుహాయాం, మహాజనోయేన గత స్సపంథా ॥**

శృతులు భిన్నాలు, స్మృతులు భిన్నాలు, మహామునుల మతాలూభిన్నాలు, ధర్మంయొక్క రహస్యాన్ని తెలుసుకోవడం చాలా కష్టం. కాబట్టి మన పూర్వీకులు నడచిన మార్గమే మనకు శరణ్యం.

వ్యత్యాసమనేది అనాదినుంచీ ఉన్నదే. కాని ప్రాంతాన్ననుసరించి మన పూర్వీకులు తెలిపిన మార్గాన్ని మనం ఆచరించడం ఉత్తమం. వేదకాలం నుండి కూడా 'పంచాంగం' అనేది ప్రతి సంవత్సర ప్రామాణిక గ్రంథం. పండితుల నుండి పామరుల వరకు తమ తమ నిత్యకర్మానుష్ఠానాచరణకు పంచాంగాన్ని విధిగా ఉపయోగించుకుంటారు. అట్టి పంచాంగ రచనను సకల జనుల సౌకర్యార్థం సమగ్రవంతంగా సిద్ధాంతీకరించాలి. సందేహ నివృత్తికే పంచాంగ సిద్ధాంతం. ఐతే పంచాంగకర్తలు కూడా వారి వారి పూర్వీకుల మార్గానుసారం లేదా గ్రంథానుసారం పంచాంగరచన చేస్తున్నారు. కానీ వ్యక్తిగత ప్రతిభకు ప్రాధాన్యమివ్వడం లేదని మనం గ్రహించాలి.

సిద్ధాంత విషయంలో కూడా సూర్యసిద్ధాంతమే పరమ ప్రామాణికమైంది. సనాతనమైంది. దీనినే సిద్ధాంతులందరూ ఆధారం చేసుకుని గణన చేస్తున్నారు. ఆధునిక కాలంలో యంత్రయుగం అభివృద్ధి చెందిన కారణంగా గ్రహగతులను దృక్పద్ధతి ద్వారా గణన చేయడం వలన వ్యత్యాసం కనబడుతుంది. రవి చంద్రులకు మాత్రం దృక్పద్ధతిలో కాకుండా పూర్వపద్ధతిననుసరించి, దృక్సంస్కారం లేకుండా గతిస్ఫుటం చేయుట పూర్వీకుల సంప్రదాయమై ఉంది. ప్రస్తుతం చాలా వరకు పంచాంగాలు రవి, చంద్రులు పూర్వపద్ధతిలోను, కుజాది మిగతా గ్రహాలకు దృక్పద్ధతిద్వారా నిర్ణయించటం జరుగుతుంది. అయినపుడు వ్యత్యాసానికి తావులేదు.

పౌరోహితులు, ప్రజలు కూడా తమకు నచ్చిన ఏదో ఒక పంచాంగాన్ని విశ్వసించి, దాని ప్రకారమే నడుచుకుంటే ఇబ్బందులుండవు. ప్రస్తుతం అనేక పంచాంగాలు, పంచాంగకర్తలు వెలుగులోకి వచ్చారు. ఐతే కేవలం తమ తమ కీర్తిప్రతిష్ఠలకొరకు లేదా ధనార్జన కొరకు కాకుండా 'సర్వేజనాస్సుఖినో భవంతు' అనే దృష్టితో, దైవజ్ఞలక్షణాలు కలిగియుండి మన పూర్వీకుల మార్గాన్ని అనుసరించినవారినే మనం ఆశ్రయించాలి.



# 5. కాలగణనమే పంచాంగ విశేషం

మనమంతా కాలాన్ని ఆధారంగా చేసుకుని అన్ని పనులూ చేసుకుంటు న్నాం. అంటే కాలానికి లోబడి ఉన్నామన్నమాట. ఎంతటివారైనా కాలానికి బద్ధులై ఉండాల్సిందే. కాలాన్ని ఎవరూ ఆపలేరు. నడపలేరు. అం దుకే కాలాన్ని మనం దైవంగా భావిస్తాం, పూజిస్తాం. కాలాన్ని కొలవడానికి మనకు సూర్యచంద్రులే ఆధారం. వీరు ప్రత్యక్ష దైవాలు. సూర్యుడు ఉదయించక పోతే కాలం ఆగిపోతుంది. సూర్యుని ఉదయాస్త మయాలే కాలాన్ని నిర్ణయి స్తున్నాయి. సూర్యుని వలనే చంద్రుడు ప్రకాశిస్తున్నాడు. సూర్యచంద్రు లిరువురూ ఆకాశంలోని పన్నెండు రాశులు గల చక్రంలో తిరుగుతున్నారు. మొత్తం 27 నక్షత్రాలతో పన్నెండు రాశులు ఏర్పడ్డాయి. వీటికే మేషం, వృషభం, మిథునం, కర్కాటకం, సింహం, కన్య, తుల, వృశ్చికం, ధనస్సు, మకరం, కుంభం, మీనం అని పేర్లు.

సూర్యుడు మేషం నుండి మీనం వరకు ఒకసారి ప్రయాణం చేయడంతో సంవత్సరం పూర్తవుతుంది. అంటే ఒక రాశి పూర్తి చేయడానికి సుమారు ఒక నెల (30 రోజులు) పడుతుంది. 12 రాశులు పూర్తయ్యేసరికి 30 × 12= 360 రోజులు అవుతుంది. దీనినే సౌరమానం అంటారు. సుమారు ఏప్రిల్ 14వ తేదీ నుండి మేషరాశినుండి సూర్యప్రయాణం మొదలై తిరిగి ఏప్రిల్ 13తో ముగుస్తుంది. ఈ కాలాన్ని మేష మాసం, వృషభమాసం అని మీనమాసం వరకు పిలుస్తారు. దీన్ని దక్షిణాది వారు అంటే శేషాచలానికి దిగువ ప్రాంతాల వారు మాత్రమే ఆచరిస్తారు.

చంద్రుడు సుమారు ఒక నక్షత్రాన్ని పూర్తిచేయడానికి ఒకరోజు (24 గంటలు) అవుతుంది. ఒక రాశిని పూర్తి చేయడానికి రెండు రోజుల ఆరు గంటలు సమయం పడుతుంది. చంద్రప్రయాణంలో ఎక్కువ తక్కువలు ఉ

ంటాయి కాబట్టి సమయాలు మారుతుంటాయి. 27 నక్షత్రాలూ పూర్తి చేయడానికి మొత్తం 27 రోజులు లేదా అంతకంటే ఎక్కువ అవుతుంది. దీనినే చాంద్రమానం అంటారు.

మనం ప్రస్తుతం ఆచరి స్తున్నది చాంద్రమానం. ఇది మధ్యప్రాంతం వారు అంటే శేషాచలానికి పైభాగాన, వింధ్యాచలానికి దిగువ భాగాన కలవారికి వర్తిస్తుంది. చాంద్రమానం విశేషం ఏమి టంటే కేవలం సూర్య సంచారం లేదా చంద్ర సంచారం కాకుండా రెండింటినీ కలిపి ఒకరోజును లెక్కిస్తారు. దీనికే 'తిథి' అని పేరు. మనం తిథి లెక్కించాల్సిన రోజున ఖచ్చితమైన సూర్య ప్రయాణ సమయంలో నుండి ఖచ్చితమైన చంద్ర ప్రయాణ సమయాన్ని తీసివేస్తారు. వచ్చిన దానికి 'వ్యర్కేందు' అని పేరు. అలాగే సూర్యగతి నుండి చంద్రగతిని తీసివేయగా వచ్చిన వ్యర్కేందు గతి చేత ముందున్న వ్యర్కేందు సమయాన్ని భాగించగా తిథియొక్క ఘడియలు, విఘడియలు వస్తాయి. ఈ ఘడియ, విఘడియలను ఆ రోజు దినసమయంలోని సగ భాగంలో కలపడం లేదా తీసివేయడం చేసినట్లయితే తిథి యొక్క చివరి సమయం వస్తుంది. ప్రతిరోజూ సూర్యోదయ, సూర్యాస్తమయ సమయాలు మారుతూ ఉంటాయి. ప్రతిరోజూ పగలు ఒకేవిధంగా ఉండదు. అయితే ఇక్కడ 'తిథి' నిర్ణయం లో సూర్యచంద్రుల గమనం లెక్కలోకి వస్తుంది. అందుకే పౌర్ణమి, అమావాస్యలు ఖచ్చితంగా ఏర్పడతాయి.

పాడ్యమి తిథి నుండి పౌర్ణమి వరకు 15 తిథులు – ఇది శుక్లపక్షం. పౌర్ణమి తెల్లవారి పాడ్యమి నుండి అమావాస్య వరకు 15 తిథులను కృష్ణపక్షం అంటారు. ఈ రెండు పక్షాలు కలిపి ముప్పది తిథులకు ఒక చాంద్రమాసం పూర్తవుతుంది. ఇలాంటి 12 చాంద్రమాసాలైతే ఒక చాంద్ర సంవత్సరం. దీనికే 'చాంద్ర మానం' అని పేరు.

ఈ చాంద్రమానంలో చంద్రగమనం ఎక్కువ తక్కువలున్న కారణంగా ప్రతి నెలా ఖచ్చితంగా 30 రోజులూ పూర్తికాదు. ఒక నెల 29, లేదా ఒక నెల 31 రావచ్చు. సూర్య చంద్రులు ఒకే రాశిలో ఉన్న కాలం అమావాస్యగా

ఒకరికొకరు ఎదురెదురుగా ఏడవ రాశిలో ఉన్నప్పుడు పౌర్ణమి అవుతుంది. సౌరమానానికి, చాంద్రమానానికి గల తేడానే 'అధిక మాసం'గా పిలుస్తాం. సుమారు ప్రతి రెండు సంవత్సరాల మూడు మాసాలకొకసారి అధిక మాసం వస్తుంది. చాంద్రమానంలోని ఒక చాంద్రమాసం అంటే అమావాస్య నుండి తిరిగి అమావాస్య వరకు సూర్యుడు రాశి మారనట్లయితే ఆ కాలాన్ని అధికమాసంగా గుర్తిస్తారు.

**శ్లో॥ తిథిర్వారంచ నక్షత్రం యోగః కరణ మేవచ ।**

**పంచాంగ మితి విఖ్యాతం, కాలోఽయం కర్మసాధకః॥**

కాలాన్ని అనుసరించి పనులు చేసుకునే వారికి తిథి, వారం, నక్షత్రం, యోగం, కరణం అనే ఐదు విషయాలతో 'పంచాంగం' ప్రఖ్యాతిగావించబడింది.

వారాలు నికరంగా ఉన్నాయి. ఆదివారం నుండి శనివారం వరకు ఏడు వారాలు ఏడు గ్రహాలకు సంబంధించినవి. పంచాంగంలో ఒకరోజును సూర్యోదయం నుండి తిరిగి సూర్యోదయం వరకు లెక్కిస్తారు. వారం కూడా ఈ రోజు సూర్యోదయం నుండి ప్రారంభమై రేపటి సూర్యోదయం వరకు ఉంటుంది. ప్రస్తుతం వారాల పేర్లు వాడుకలో మారలేదు. కానీ రాత్రి పన్నెండు గంటలు దాటితే వారం మారింది అనుకుంటారు. వారాన్ని మార్చేది మన గడియారాలు కావు. ఆ సూర్యభగవానుని వల్లనే వారం మారుతుందని గుర్తించాలి.

ఈ కాలంలో ఇన్ని రకాల పంచాంగాలను ఎంతో మంది సిద్ధాంతులు కృషిచేసి రూపొందించినా కంప్యూటర్లలో కూడా పంచాంగాలు కనిపిస్తున్నా తిథులు మరచి తేదీలను పట్టుకుంటున్నారు మనవాళ్లు. ఆధునిక కాలానుగుణంగా తేదీలను వాడ కూడదని కాదు. కానీ తిథులను మర్చి పోకుండా ఉండాలి. తెలుగు పద్ధతి సరిగా లేదు. ఆంగ్ల పద్ధతే సరైందని అనుకుంటే కూడా ప్రమాదమే. ఎందుకంటే చాంద్ర మానం ప్రకారం తెలుగు నెలలు ఎక్కువ, తక్కువ వస్తున్నాయి కదా! మరి ఆంగ్ల నెలలు కూడా నెలకు సరిగా 30 రోజులు లేకుండా ఒక నెల 30, మరొకనెల 31, ఇంకొక నెలకు 28 లేదా 29 అని చెబుతూ ప్రతి నాలుగు సంవత్సరాలకు ఒకసారి మారుతుందని చెబుతారు. ఇది కూడా నికరంగా

లేదుకదా! కాబట్టి మన పూర్వీకులైన ఋషులు ఏర్పరచిన సత్సంప్రదాయాన్ని యథా విధిగా కాకపోయినా ప్రస్తుత కాలానికి అనుగుణంగా ఆచరించడం మన ప్రధాన కర్తవ్యం.

తెలుగు చాంద్రమాసాల నిర్ణయానికి కూడా ఆధారం చాలా చక్కగా ఉ ంది. చిత్తా నక్షత్రంతో కూడిన పౌర్ణమి గల మాసానికి చైత్ర మాసం అని పేరు. అలాగే ప్రతి మాసానికీ కూడా ఆయా నక్షత్రాలతో కూడిన పౌర్ణమిలు ఆధారమయ్యాయి. చైత్ర మాసం శుక్లపక్షం పాడ్యమి తిథి రోజు నుండి ఫాల్గుణ మాసం కృష్ణపక్షం అమావాస్య వరకు చాంద్ర సంవత్సరం అవుతుంది.

మన సంప్రదాయం ప్రకారం ప్రతి చైత్ర శుద్ధ పాడ్యమి రోజున తెలుగు చాంద్ర సంవత్సరాది సందర్భంగా 'ఉగాది' అనే పండుగను జరుపుకుంటాం.

మనమందరం గమనించాల్సిన అంశం ఒకటుంది. చంద్ర గమన తేడాలు సహజంగానే జరుగుతున్నాయి. ఇవి గణితంలో వచ్చే తేడాలు. అవి తెలిసిన సిద్ధాంతులు, పంచాంగకర్తలు చూసుకుంటారు. మనం అవన్నీ పక్కనబెట్టి సాధారణంగా ఆలోచిద్దాం. కాలగణనం అంటే రోజుల్ని లెక్కబెట్టడం కదా. అమావాస్య తిథి అంటే సంవత్సరం చివరి రోజు. కొత్తసంవత్సర ఆరంభం తెల్లవారి కావలసింది. తిథుల్లో హెచ్చుతగ్గులు, తేడాలు వచ్చినా అందరూ జరుపుకునే పండగల విషయంలో తేడాలుండ కూడదు. ప్రజల్ని అయోమయంలో పడవేయడానికి పంచాంగాలు, సిద్ధాంతులు అవసరం లేదు. ప్రజలకు ఖచ్చితమైన నిర్ణయం సందేహాలకు తావులేకుండా చెప్పడానికే సకల శాస్త్రాలు, ధర్మాలు, పంచాంగాలు ఉన్నాయి. సిద్ధాంతులూ ఉన్నారు.



# ౬. సంపూర్ణ గ్రహణ రహస్యం

చంద్రగ్రహణం పౌర్ణమి తిథియందు, సూర్యగ్రహణం అమావాస్య తిథియందు సంభవిస్తాయి. ఈ రెండు గ్రహణాలలో దర్శనయోగ్యమగు కాలమంతయు పుణ్యకాలం. మేఘాలవలన కనిపించకపోయినను పంచాంగాలలో సూచించిన విధంగా స్పర్శ మోక్షాలను తెలుసుకుని స్నానాదికాలు ఆచరించాలి. ఆదివారం రోజున సూర్యగ్రహణం, సోమవారం రోజున చంద్రగ్రహణం సంభవించినచో దానిని 'చూడామణి' అంటారు. ఇందు చేసిన దానాదికాలు అనంతఫలాలనిస్తాయి. గ్రహణ స్పర్శకాలస్నాన, మధ్యకాలహోమం, దేవతార్చనం, శ్రాద్ధం, మోక్షకాలంలో దానం చివర తిరిగి స్నానం చేయాలి. స్నానం గూర్చి వాడవలసిన నీటికి తేడాలున్నాయి.

**శ్లో॥ శీతముష్ణోదకాత్పుణ్య మపారక్యం పరోదకాత్ ।**
**భూమిష్ఠ ముద్ధృతాత్పుణ్యం తతప్రసవణోదకం ॥**
**తతోఽపి సార సంపుణ్యం తతఃపుణ్యం నదీజలం ।**
**తతస్తీర్థనదీ గంగా పుణ్యాపుణ్యస్తతోంబుధి ॥**

వేడినీటికంటే చల్లని నీరు, ఇతరుల నుండి కాకుండా స్వయంగా తీసికొనినవి, బావి, బోరింగ్‌లోనివి కాకుండా కొలనులు, సెలయేరులు ఒమదలగు స్వతఃసిద్ధమైనవి, దీనికంటే సరోవరంలో నుండు జలం విశేషం. ఇంతకంటే నదీజలం శ్రేష్ఠం, నదీజలంలో తీర్థజలమైన గంగానదీజలముత్తమం. గంగానదీ జలం కంటే సముద్రజలం క్రమంగా పుణ్యతమములని తాత్పర్యం.

గ్రహణస్నానం ధరించిన వస్త్రాలతోనే చేయాలి. ఇది ముక్తి స్నానపరం. ముక్తిస్నానం చేయనిచో సూతకం నివర్తించదు. గ్రహణస్నానం మంత్రపూర్వకంగా చేయవలసిన అవసరంలేదు. సువాసినులగు స్త్రీలు కంఠస్నానం చేయవచ్చును. శిష్టస్త్రీలు మాత్రం సశిరస్నానం చేయుచున్నారు.

జాతాశౌచంగాని, మృతాశౌచంగాని కలిగియున్నను గ్రహణ నిమిత్తమైన స్నానాదానాదికాలు విధిగా చేయాలి. రజస్వలతో కూడిన వారు కూడా చేయాలి.

**శ్లో॥ స్నానే నైమిత్తికే ప్రాప్తే నారీ యది రజస్వలా ।**
**ప్రాత్రాంతరితతోయేన స్నానం కృత్వా వ్రతం చరేత్ ॥**
**నవ స్త్రీ పీడనం కూర్యా న్నాప్య ద్వాసశ్చ ధారయేత్ ॥**

గ్రహణాది నైమిత్తిక స్నానం చేయవలసి వచ్చినపుడు స్త్రీ రజస్వలయై యున్నను పాత్రలు వేర్వేరుగానున్న నీటితో స్నానం చేసి వ్రతమాచరించవచ్చును. తడిసిన వస్త్రం విడువగూడదు. మరియొక వస్త్రం ధరించగూడదని పై శ్లోకంయొక్క అర్థం.

గ్రహణానికి ముందు మూడు రోజులుగాని, ఒకరోజుగాని ఉపవాసం చేసి గ్రహణ స్నానదానాదులు చేసినయెడల మహాఫలితం లభిస్తుంది. ఒకే రోజున రాత్రి గ్రహణమైనపుడు కేవలం పూర్వం పగలునందుపవాసం సరిపోతుంది. అహోరాత్రాలు ఉపవాసమున్నచో విశేషం. సంతానం కలిగిన గృహస్థులు ఉపవాసం చేయనవసరం లేదని చెబుతున్నారు. సహజంగా బాల, వృద్ధ, రోగస్థులకు ఉపవాస నియమాలు వర్తించవు. గ్రహణమందు దేవ, పితృతర్పణం చేయాలి.

**"సర్వేషామేత వర్ణానాం సూతకం రాహుదర్శనే"**

గ్రహణ దర్శనమందు సర్వవర్ణాలవారికి జాతాదిశౌచముండును. కనుక ఈ సమయమందు తాకిన వస్త్రాలు తప్పనిసరిగా తడుపాలి. గ్రహణకాలమందు గో, భూ, హిరణ్యాది దానములు చేసిన గొప్ప ఫలం లభిస్తుంది. తపస్సంపన్నులైన విద్యావంతులకు దానమొసంగుట శ్రేష్ఠం. సత్పాత్రదానం పుణ్యాతిశయము నిచ్చుటలో సందియంలేదు.

**శ్లో॥ సర్వం గంగా సమం తోయం, సర్వే వ్యాస సమాద్విజాః ।**
**సర్వం భూమి సమం దానం, గ్రహణే చంద్ర సూర్యయోః ॥**

సర్వజలమును గంగాసమం, సకలద్విజులు వ్యాసాచార్యునితో సమానులు. సర్వదా భూదానతుల్యాలు. సూర్యచంద్ర గ్రహణములందుంటాయి. ఇది సామాన్య

విషయం. సత్పాత్రదాన విషయంలో తారతమ్యాన్ని ఇతర స్థలములందు చెప్పబడింది.

**శ్లో॥ సమను బ్రాహ్మణే దానం ద్విగుణం బ్రాహ్మణ బ్రువే ।**
**శ్రోత్రియే శత సాహస్రం పాత్రేచానంత్యమశ్నుతే ॥**

నమస్కారాదులు లేక జాతి మాత్రంచే బ్రాహ్మణుడగువాడు అబ్రాహ్మణుడనబడును. వీరికి దానాన్ని ఇచ్చినచో యథాస్థిత ఫలం లభిస్తుంది. గర్భాధానాది సంస్కారాలు కలిగి వేదాధ్యయనాధ్యాపనాదులు లేని బ్రాహ్మణబ్రువునికి ఇచ్చు దానం వలన రెట్టింపు ఫలం వస్తుంది. వేదాధ్యయనాదులు కలిగిన శ్రోత్రియుడైన బ్రాహ్మణునికిచ్చిన దానం వలన సహస్రగుణ ఫలం లభించును. విద్యయు, సముదాచార సంపత్తియు కలిగిన పాత్ర అను బ్రాహ్మణునకిచ్చిన దానానికి అనంతఫలం లభిస్తుందని అర్థం.

గ్రహణశ్రాద్ధమే అమద్రవ్యంచేతగాని, హిరణ్యంచేతగాని చేయాలి. సంపన్నుడైన యెడల పక్వాన్నం చేతనైనను చేయవచ్చు. గ్రహణశ్రాద్ధం తీర్థయాత్రాంగ శ్రాద్ధంవలె ఘృతప్రధానంగా చేయాలి. గ్రహణశ్రాద్ధమందు భోక్తకు మహాదోషం కలుగును. గ్రహణమందు తులాపురుషాది మహాదానాలు సంపన్నుడు చేయాలి. గ్రహణకాలమందు మంత్రపురశ్చరణం మొదలగు దీక్షలకు విశేషం.

**శ్లో॥ చంద్ర సూర్యగ్రహే తీర్థే మహాపర్వాదికే తథా ।**
**మంత్ర దీక్షా ప్రకుర్వాణక్ష మాసర్క్షానీనన శోధయేత్ ॥**

చంద్రసూర్య గ్రహణకాలమందును, తీర్థమందును, మహాపర్వం మొదలగువాని యందును మంత్రపురశ్చరణ దీక్షనుగాని, ఉపలక్షణంచే మంత్రోపదేశంగాని చేయువారికి మాసనక్షత్రాది శోధనం అవసరంలేదు. దీక్షాక్రమాన్ని మంత్రశాస్త్రోక్త ప్రకారంగా తెలియాలి.

**శ్లో॥ యుగే యుగే తు దీక్షాసీ దుపదేశః కలౌయుగే ।**
**చంద్ర సూర్యగ్రహే తీర్థే సిద్ధక్షేత్రే శివాలయే ।**
**మంత్రమాత్ర ప్రకథనముపదేశస్య ఉచ్యతే ॥**

ప్రతి యుగమందును మంత్రోపదేశం దీక్షారూపమై అనేక నియమాలు కలిగి ఉంటాయి. కలియుగమందు మాత్రం మంత్ర కథనమే ఉంది. అదియును చంద్ర, సూర్యగ్రహణాలలో, తీర్థమందు, సిద్ధక్షేత్రమందు, శివాలయమందు చేయవలయునని తాత్పర్యం.

మంత్రగ్రహణ విషయమై సూర్యగ్రహణమే ముఖ్యం. చంద్రగ్రహణ మందైనచో దారిద్ర్యదోషాలున్నను ప్రభావం స్వల్పంగా ఉంటుంది.

**శ్లో॥ చంద్ర సూర్యోపరాగే చ స్నాత్వా పూర్వముపోషితః ।**
**స్పర్శాది మోక్ష పర్యంతం జపేన్మంత్రం సమాహితః ॥**
**జపాద్దశాంశతో హోమః తథా హోమాచ్చ తర్పణం ।**
**హోమాశక్తౌ జపం కుర్యాత్, హోమ సంఖ్యా చతుర్గుణం ॥**

చంద్ర, సూర్యగ్రహణదినమందు భోజనం చేయకుండా స్పర్శకాకముందే స్నానం చేసి, జపం ప్రారంభించి, శుద్ధమోక్షమగునంతవరకు మంత్రాన్ని ఏకాగ్రచిత్తంతో జపించాలి. జపసంఖ్యకు పదవవంతు హోమాన్ని దానికి పదవ వంతు తర్పణాన్ని చేయాలి. హోమం చేయుటకు శక్తిలేనివారు హోమసంఖ్య ఎంతో ఆ సంఖ్యకు నాలుగురెట్లు అధికంగా జపమే చేయవచ్చును. తర్పణం చేయునపుడు మూలమంత్రాన్ని ఉచ్చరించి మంత్రదేవత నామాన్ని ద్వితీయాంతంగ చెప్పాలి.

**"అముకాం దేవతాం తర్పయామి"**

అని చెబుతూ యవాదులతో కూడిన జలాన్ని దోసిలితో అర్పించాలి. ఈవిధంగా నమశ్శబ్దము అంతమందుండునట్లు మూలమంత్రముచ్చరించి, "అముకాం దేవతాం అహమభిషించామి" అని తన శిరస్సుపై చల్లుకొనుటనే మార్జనం అంటారు. దీనిని తర్పణానికి పదవభాగం చేయాలి. మార్జన సంఖ్యకు పదవ భాగం బ్రాహ్మణ భోజనం జరుపాలి. ఈవిధమైన జప, హోమ, తర్పణ, మార్జన, విప్రభోజనరూపంగా ఐదు భాగములుండుటను 'పురశ్చరణం' అంటారు.

తర్పణాదులలో ఏదైనా సంభవించనియెడల దాని సంఖ్యకు నాలుగురెట్లు అధికంగా జపమే చేయాలి. ఈవిధమైన పురశ్చరణ విధానం గ్రస్తోదయ,

గ్రస్తాస్తమయాలందు సంభవింపదు. పురశ్చరణాంగమైన ఉపవాసాన్ని పుత్రవంతుడైన గృహస్థుడుగను చేయవచ్చును. పురశ్చరణం చేయువానికి స్నానదానాది నైమిత్తిక లోపంచే ప్రత్యవాయం కలుగును. కనుక వానిని భార్య పుత్రుడు మొదలగు ప్రతినిధులచే చేయించాలి.

**జపపురశ్చరణ విధానం**

గ్రహణ స్పర్శకు ముందే స్నానం చేసి, ఆసనంపై కూర్చుండి, సంకల్పించాలి.

**సంకల్పం :** "అముకగోత్రో-ముకశర్మాహం రాహుగ్రస్తే దివాకరే / నిశాకరే వా అముక దేవతాయా అముక మంత్రసిద్ధి కామోగ్రాసాది ముక్తి పర్యంతం అముక మంత్రస్య జపరూపం పరశ్చరణం కరిష్యే" అని సంకల్పించి స్పర్శ మొదలుకుని మోక్షపర్యంతం జపం చేయాలి. (అముక అని ఉన్నచోట సంకల్పించు వారి పేరు, పురశ్చరణ చేయు దేవత మంత్రం, పేర్లను చెప్పాలి.)

పరదినమందు స్నానాది నిత్యకర్మలు చేసి, "అముక మంత్రస్య కృతై తద్రగహణ కాలిక అముక సంఖ్యాక జప సాంగతా సిద్ధ్యర్థం తద్దశాంగహెూమ, తద్దాశంశతర్పణ, తద్దశాంశ మార్జన, తద్దశాంశ విప్రభోజనాని కరిష్యే" అని సంకల్పించి హెూమాదులైనను లేదా తత్తచ్చతుర్గుణ మంత్ర జపమైనను చేయాలి.

ప్రతినిధిగా ప్రేరణ చేయబడిన పుత్రాదులు గ్రహణకాలమందే "అముక గోత్రస్యాముక శర్మణో గ్రహస్పర్శ స్నానప్రయుక్త శ్రేయః ప్రాప్త్యర్థం స్పర్శ స్నానం కరిష్యే" అని సంకల్పించి స్నానదానాదికం చేయాలి.

పురశ్చరణం చేయనివారు తమ తమ ఇష్టదేవతా మంత్రం జపంగాని, గాయత్రీ జపంగాని చేయుట మంచిది. లేనిచో మంత్రం మాలిన్యమవుతుంది.

గ్రహణమూలమందు భోజనం చేసిన నరకప్రాప్తి కలుగుతుంది. పడుకొనినచో రోగం సంభవించును, మూత్రం విసర్జించిన దారిద్ర్యం అనుభవింతురు. మలం విసర్జించిన కృమి జన్మ కలుగుతుంది. మైధునం చేసిన పశుజన్మమెత్తుతారు.

## గ్రహణం సంభవించిన రాశులు – దోష వివరాలు

| జన్మ/నామ రాశి | శుభప్రదం (3,6,10,11) | మధ్యమం (2,5,7,9) | దోషం (1,4,8,12) |
|---|---|---|---|
| మేషం | మిథున, కన్య, మకర కుంభములు | వృషభ, సింహ, తుల ధనుస్సు | మేష, కటక, వృశ్చిక మీనములు |
| వృషభం | కటక, తుల, కుంభ మీనములు | మిథున, కన్య, వృశ్చిక మకరములు | వృషభ, సింహ, ధనూ మేషములు |
| మిథునం | సింహ, వృశ్చి, మీన వృషభములు | కటక, తుల, ధనుస్సు మీనములు | మిథున, కన్య, మకర మిథునములు |
| కటకం | కన్య, ధనుస్సు, మేష వృషభములు | సింహ, వృశ్చి, మకర మేషములు | కటక, తుల, కుంభః కటకములు |
| కన్య | వృశ్చి, కుంభ, మిథున కటకములు | తుల, మకర, మీన వృషభములు | కన్య, ధనుస్సు, మేష కన్యలు |
| తుల | ధనుస్సు, మీన, కటక, సింహములు | వృశ్చిక, కుంభ, మేష మిథునములు | తుల, మకర, వృషభ కన్యలు |
| వృశ్చికం | మకర, మేష, సింహ కన్యలు | ధనుస్సు, మీన, వృషభ కటకములు | వృశ్చిక, కుంభ, మిథున తులలు |
| ధను | కుంభ, వృషభ, కన్య తులలు | మకర, మేష, మిథున సింహములు | ధను, మీన, కటక వృశ్చికములు |
| మకరం | మీన, మిథున, తుల వృశ్చికములు | కుంభ, వృషభ, కటక కన్యలు | మకర, మేష, సింహ ధనుస్సులు |
| కుంభం | మేష, కటక, వృశ్చిక ధనుస్సులు | మీన, మిథున, సింహ తులలు | కుంభ, వృషభ, కన్య మకరములు |
| మీనం | వృషభ, సింహ, ధను మకరములు | మేష, కటక, కన్య వృశ్చికములు | మీన, మిథున, తుల కుంభములు |

పై పట్టిక ప్రకారం జన్మరాశి లేదా నామరాశినుండి ఏ రాశి గ్రహణం పట్టినదో చూచి తెలుసుకోవాలి. జన్మ/నామ నక్షత్రం లేదా జన్మ/నామ రాశిలో గ్రహణం సంభవించినచో దోషమవుతుంది. గ్రహణ నక్షత్రమే గాకుండా ఆ రాశిలోని నక్షత్రంగల వారికందరికీ వర్తించును. శాస్త్రప్రకారం గ్రహణశాంతి జరిపించాలి లేదా బింబదానం చేయాలి.

**బింబదాన విధానం**

చంద్రగ్రహణమందు వెండిచేత చంద్రబింబాన్ని, బంగారం చేత నాగబింబాన్ని చేయించాలి. సూర్యగ్రహణమందు, బంగారంచేత సూర్యబింబం, నాగబింబాన్ని చేయించి, నెయ్యితో నిండిన రాగిపాత్రతో నువ్వులు, వస్త్రం, దక్షిణ కలిపి "మమ జన్మరాశి, జన్మనక్షత్రస్థితి అముక గ్రహణ సూచిత సర్వారిష్ఠ, శాంతి, పూర్వకం ఏకాదశస్థాన స్థితగ్రహణ సూచిత శుభఫలావాప్తయే బింబదానం కరిష్యే" అని సంకల్పించి, సూర్యుని లేదా చంద్రుని, రాహువుని ధ్యానించి నమస్కరించాలి.

**ప్రార్థన**

**శ్లో॥ తమోమయ మహాభీమ సోమసూర్య విమర్థన ।**
**హేమతార ప్రదానేన మమశాంతి ప్రదోభవ ॥**
**విదుంతుద నమస్తుభ్యం సింహదానంద నాచ్యుత ।**
**దానే నానేన నాగస్య రక్షమాం వేధజాద్భయాత్ ॥**

ఈ రెండు శ్లోకములు పఠించి ప్రార్థించాలి.

"ఇదం సౌవర్ణం రాహుబింబం నాగం సౌవర్ణం రవిబింబం రాజతం చంద్రబింబం వా ఘృతపూర్ణ తామ్రపాత్ర నిహితం యథాశక్తి తిలవస్త్ర దక్షిణా సహితం గ్రహణ సూచి తారిష్ట వినాశార్థం శుభఫల ప్రాప్త్యర్థం చ తుభ్యమహం సంప్రదదే" యను దానవాక్యంచే పూజించిన బ్రాహ్మణునకు దానమీయాలి.

అభ్యంగనం చేసినచో కుష్ఠురోగం కలుగుతుంది. గ్రహణానికి ముందు వండిన అన్నం గ్రహణం తర్వాత భుజింపకూడదు. అదేవిధంగా గ్రహణకాలంలో నిలువయున్న నీరు త్రాగరాదు. మీగడ, మజ్జిగ, తైలపక్వ (నూనె పదార్థాలు), పాలు, ముందుగా యున్నను గ్రహణం తర్వాత తీసికొనవచ్చును. కాని గ్రహణకాలానికి ముందుగా ఆయా పదార్థాలపై దర్భముక్కలు వేయాలి.

## గ్రహణవేధ

సూర్యగ్రహణం నందు స్పర్శ కనిపించు సమయం కంటే సుమారు పండ్రెండు  గంటల ముందు వేధ కలిగియుంటుంది. చంద్రగ్రహణమందు సుమారు తొమ్మిది గంటలు ముందు వేధయుంటుంది. కాబట్టి సూర్యగ్రహణం ప్రాతఃకాలం అనగా సూర్యోదయమైన తర్వాత అయినచో ముందు రాత్రి భోజనం చేయకూడదు. పగలు సుమారు పదిగంటల తర్వాత సూర్యగ్రహణమైనచో ముందు రాత్రి పదిగంటల తర్వాత భుజించగూడదు. ఈవిధంగానే సూర్యాస్తమయం తర్వాత చంద్రగ్రహణమైనచో ఉదయం పదిగంటల తర్వాత భుజింపకూడదు. రాత్రి పదిగంటల తర్వాత చంద్రగ్రహణమైనచో మధ్యాహ్నం ఒంటిగంట తర్వాత భుజించుట పనికిరాదు. బాలురు, వృద్ధులు, అనారోగ్య పీడితులు మొదలైన అశక్తులు గ్రహణ స్పర్శకు సుమారు మూడు గంటల ముందు కాలం భుజించకుండా ఉండాలి. సమర్థులైనవారు పైన తెలిపిన వేధాకాలంనందు భుజించినచో ప్రాయశ్చిత్తం కొరకు మూడు రాత్రులు ఉపవసించాలి. గ్రహణకాలమందే భుజించినచో ప్రాజాపత్యకృచ్ఛం ప్రాయశ్చిత్తం. చంద్రునకు గ్రస్తోదయమైనచో ముందు పండ్రెండు గంటలు అనగా పగలంతయు వేధయున్నందున  ఉపవసించాలి.

**శ్లో॥ గ్రస్తావే వాస్తమానం తు రవీందూ ప్రాప్నుతో యది ।**
**పరేర్యుదయే స్నాత్వా శుద్ధోభ్యవహరేన్నరః ॥**

సూర్యచంద్రులు గ్రస్తులై అస్తమయం నొందినయెడల తెల్లవారి శుద్ధబింబం చూసి, స్నానంచేసి పరిశుద్ధుడై భుజించాలి. కావున శుద్ధబింబం చూడకముందు శుద్ధిలేనందున జలాహరణం మొదలైనవి చేయగూడదని తాత్పర్యం.

సూర్యరస్తాస్తమయమందు, చంద్రగ్రస్తోదయమందు ఆహితాగ్ని, అన్వాధానం చేసి, జలంచే వ్రతం చేయాలి. కాని భోజనం చేయకూడదు. చంద్రగ్రస్తాస్తమందు తెల్లవారి సంధ్యాహోమాది నిత్యకర్మలకు నిషేధం లేదు. అల్పకాల ముక్తియగునెడల పంచాంగాలద్వారా ముక్తి సహాయం తెలిసికొని స్నానంచేసి, హోమాదికం చేయాలి. చిరకాల ముక్తియైన హోమకాలాతిక్రమం

గూడదు కనుక గ్రస్తోదయమందు వలెనే గ్రహణకాలమందే హెూమాదికం చేసి, పంచాంగంలోని మోక్షసమయం తర్వాత స్నానంచేసి, బ్రహ్మయజ్ఞాదికాన్ని ఆచరించాలి. అమావాస్య యందు గ్రహణ శ్రాద్ధం సంభవించినచో, దీనిచేతనే అమావాస్య (దర్శ) శ్రాద్ధమునకు, సంక్రాంతి శ్రాద్ధమునకు కలిసివచ్చును. గ్రహణదినమందు పిత్రాదుల ఆబ్దికం సంభవించినచో అన్నం చేతనే చేయవచ్చును. గ్రహణదినమైనందున బ్రాహ్మణాదులు దొరకనియెడల ఆమద్రవ్యంచేగాని, హిరణ్యంచేగాని చేయాలి.

**గ్రహణ సందర్భంగా వర్జిత దినాలు**

సంపూర్ణ చంద్రగ్రహణం వచ్చినపుడు ముందు అనగా శుద్ధద్వాదశి మొదలుకొని తర్వాత అనగా బహుళ తదియ వరకు ఏడురోజులు శుభకార్యం చేయకూడదు. సంపూర్ణ సూర్యగ్రహణం సంభవించిన యెడల ముందు అనగా బహుళ ఏకాదశి మొదలుకొని తర్వాత అనగా శుద్ధ చవితి వరకు శుభకార్యాలకు పనికిరాదు. ఖండగ్రహణాలు సంభవించినపుడు చతుర్దశి మొదలు పాడ్యమి వరకు అనగా మూడు రోజులు శుభకార్యాలు చేయకూడదు. ఇందు ఇంకా విశేషాలున్నాయి.

గ్రస్తాస్త గ్రహణమందు ముందుగా మూడు రోజులు, గ్రస్తోదయ గ్రహణమందు తర్వాత మూడు రోజులు శుభకార్యాలు చేయకూడదు. సంపూర్ణ గ్రహణమైన నక్షత్రాన్ని ఆరు నెలల వరకు శుభకార్యాలకు ఉపయోగించకూడదు. గ్రహణం తగ్గినకొలదీ మాసాలు కూడా తగ్గుతాయి.



# 7. సంధ్యా వందనం

మన వేదాలన్నీ ప్రధానంగా రెండు భాగాలు. ఒకటి ప్రవృత్తి అయితే మరొకటి నివృత్తి. ప్రస్తుతం మనం చేస్తున్న కర్మకాండ అంతా ప్రవృత్తి కిందకి వస్తుంది. ఇకపోతే ఒక్క జ్ఞానమే నివృత్తి అవుతుంది. శాస్త్రోక్తంగా కర్మకాండ నాలుగు విధాలు. అవే నిత్య నైమిత్తిక కామ్య నిషిద్ధ కర్మలు. ఇందులోని నిషిద్ధకర్మలు ఇటు కర్మిష్ఠులకు, అటు జ్ఞానులకు పనికిరావు. వానిని ఎప్పుడూ వదిలిపెట్టవలసిందే. పనికిరాని కర్మలను కూడా ఇవి చేయకూడదని వేదంలో చెప్పడం విశేషం. మిగిలిన వానిలో కామ్యకర్మలు జ్ఞానులకు నిషిద్ధకర్మల లాగా వదిలివేసేవే. కర్మిష్ఠులు మా త్రం చేస్తే చేయవచ్చు లేదా మానవచ్చు. అది వారి వారి కోరికను బట్టి ఉంటుంది. కాని మిగిలిన నిత్య నైమిత్తిక కర్మలు రెండూ మాత్రం వదిలివేయడానికి వీల్లేదు. ఖచ్చితంగా చేసి తీరవలసిందే. వీటిని కూడా ఆత్మజ్ఞాన సాధనమే లక్ష్యంగా ఉండే జిజ్ఞాసువులైన జ్ఞానులు మా త్రం చేయాలనే నియమం లేదు. అనగా వీరికి నిత్యనైమిత్తిక కర్మలు ప్రధానం కావు.

కర్మిష్ఠులకు కామ్యకర్మలు ఎలా అవసరం లేదో, అలాగే జ్ఞానులకు నిత్య నైమిత్తిక కర్మలు అవసరం లేదు. చేసినా, చేయకున్నా నష్టం లేదు. తాము ప్రయాణం చేయాలనుకున్న జ్ఞాన మార్గం వదిలితేనే నష్టం. అప్పుడు ఇటు కర్మకు, అటు జ్ఞానానికీ రెంటికీ పనికి రాకుండా పోతారు.

'సంధ్యా వందనం' నిత్య కర్మ అవుతుంది. 'అహరహ స్సంధ్యా ముపాసీత' అనగా ప్రతిరోజూ మూడుసార్లు సంధ్యావందనం చేయాలని శాస్త్రం చెప్పింది. ఉపనయనం అయిన వారంతా తప్పనిసరిగా చేయాలి. ప్రస్తుతకాలంలో కొందరు శ్రద్ధగా చేస్తున్నారు. మరికొందరు యాంత్రికంగా చేస్తున్నారు. ఇంకొందరు రెండుపూటలే చేస్తున్నారు. చాలామంది సంధ్యకే 'వంద నం' చేశారు, చేస్తున్నారు.

ఎవరైనా సంధ్యావందనం చేసేవారు, మన పెద్దలు చేశారు కదా! అందుకే మనం చేస్తున్నాం అంటారు. కాని అందులోని అంతరార్థమేమిటో తెలుసుకోవడా నికి ప్రయత్నించడం లేదు. వదిలివేసినవారికి వెంటనే నష్టం జరగడం లేదు కావున వదిలివేసి నిశ్చింతగా ఉన్నారు. ఇప్పుడు సంధ్యా వందనం చేయక పోతే దీని ప్రభావం వారి తరతరాల వరకు ఉంటుంది. ఎలాగంటే మన పెద్దలు చేస్తున్నారనే మనం ఇప్పటి వరకు ఎలాగ చేస్తున్నామో! అలాగే చేయక పోవడం కూడా అంతేకదా! ఎందుకీ దుర్గతి పట్టిందని బాగా ఆలోచిస్తే– 'జ్ఞాత్వా కుర్వీత కర్మాణి' అని శాస్త్ర వచనం. మనం ఏ పని చేస్తున్నా, ఆ పని యొక్క సంపూర్ణ వివరాలు తెలిసి చేయాలి అని అర్థం. అర్థం తెలియకుండా ఏ పని చేసినా వ్యర్థం అవుతుంది. దీని గూర్చి వేదం లోనే ఒక వాక్యం ఉంది. 'స్థాణు రయం భారహరః కిలాభూత్ – అధీత్య వేదం న విజానాతి యోర్థమ్' అనగా అర్థం తెలి యకుండా ఎవరు వేదాధ్యయనం చేస్తుంటారో, వారు కేవలం వేద శబ్ద భారాన్ని మోస్తున్నారని తాత్ప ర్యం. శబ్దం ఎంత ప్రాధాన్య మో, అర్థమూ అంతే ప్రాధా న్యం అవుతుంది. ఉచ్ఛారణ తో పాటు అర్థం కూడా తెలియాలి. ఐతే అర్థం తెలియకపోయినా ఫరవాలేదు కేవలం శబ్దోచ్ఛారణతో కర్మలు చేస్తే ఫలితముం టుందని వేదంలోనే చెప్పబడింది అని అంటారు. ఇది కర్మలు చేయకుండా బద్ధకించే వారిని ప్రోత్సహించడం కొరకు చేయు ప్రశంస తప్ప యథార్థం కాదు. శబ్దార్థ జ్ఞానం అనేది అత్యంత ఆవశ్యకమని అందరూ గుర్తుంచుకోవలసిందే.

మనకు ఈ సంధ్యావందనం యొక్క సంపూర్ణ అంతరార్థం తెలియకపోయినా క్రమేణా దానిని వదులుటకు సిద్ధపడుతున్నా మనేది యదార్థం. 'సంధ్యావందనం' యొక్క ప్రధానోద్దేశ్యం సంపూర్ణ ఆయురారోగ్యైశ్వర్యాలని నిరూపించవచ్చు.

ప్రతిరోజూ ఉదయం, మధ్యాహ్నం, సాయంకాలం మూడు వేళల్లో సంధ్యా సమయం ఉంటుంది. ఆ సమయాల్లో మనం సంధ్యావందనం ఆచరించాలి. అయితే సంధ్యావందనంలో ప్రధానంగా చెప్పబడింది 'ప్రాణాయామం'. ఇది

ఆరోగ్యానికి అత్యంత కీలకమైంది. ప్రస్తుతం కేవలం ప్రాణాయామ సాధనకు లక్షల మంది శిక్షణ పొంది, సఫలీకృతులవుతున్నారు. మన గురించి మన పూర్వీకులేర్పరచిన ఒక చక్కని విధానమే సంధ్యా వందనం. ఇందులో రెండవది సూర్య నమస్కారాలు. సూర్యునికై చేసే అర్ఘ్యప్రదానం, నమస్కారం అంతా కూడా సూర్య నమస్కారాలతో సమానమైనవి. మూడవది గాయత్రీ ఉపాసన. ఇది ఉత్తమమైన ధ్యాన ప్రక్రియ. అద్భుతమైన శక్తిసాధనకు చాలా సులభమార్గం సంధ్యావందన ప్రక్రియలో లేనిది లేదు. మన పూర్వీకులైన ఎందరో ఋషిపుంగవులేర్పరచిన సులభ సాధనా ప్రక్రియ. ఇహపరాలు రెండూ ఈ సంధ్యావందనంతో సాధించగలం.

అందుకే సంధ్యావందనం యొక్క సంపూర్ణ అంతరార్థాన్ని, మూలతత్త్వాన్ని గ్రహించాలి. ప్రతి విషయంలో 'అర్థం' అనేది మూడు విధాలుగా ఉంటుంది. అవి వాచ్యార్థం, అంతరార్థం, పరమార్థం. ఏదో ఒక అర్థాన్ని తెలుసు కుని ఊరుకోకుండా, పరమార్థం దాకా ప్రయాణం చేయాలి. అందుకే ప్రతి ఒక్కరికీ సంధ్యావందనం యొక్క 'పరమార్థం' తెలియాలి. కర్మ యొక్క స్వరూపాన్ని, దాన్ని ఆచరించే విధానాన్ని తెలుపుతుంది వాచ్యార్థం దీన్నే బాహ్యార్థం అంటారు. ఆయా కర్మలు ఏ దేవత నుద్దేశించి చేయబడుతున్నవి, వాని సంపూర్ణ స్వభావాలను వివరించేది అంతరార్థం. కాని వాటికి అతీతమైన తత్త్వాన్ని పరమార్థం వివరిస్తుంది.

పరిపూర్ణమైంది ఒక్క పరమార్థమే. సంధ్యావందనం యొక్క పరిపూర్ణ తత్త్వాన్ని మనం సమగ్రంగా తెలుసుకున్నట్లయితే తప్పకుండా 'సంధ్యావందనాన్ని' ఆచరిస్తాం. ఇతరులను ఆచరింపజేయడానికి ప్రోత్సహిస్తాం. పరమార్థంలో అన్ని అర్థాలు ఇమిడి ఉంటాయి. ఇది ద్వైతమా? అద్వైతమా? విశిష్టాద్వైత మా? అనే మీమాంస మనకక్కర్లేదు. మనకు సంధ్యావందనం ఎలా ఉ పయోగపడుతుంది? ఎందుకు ఆచరించాలి? ఆచరిస్తే ఏయే లాభాలున్నాయనేది అవసరం. ప్రతి మతంలో ప్రతి జాతిలో సంధ్యావందన ప్రక్రియ ఉంది. అనగా ఇది సార్వజనీనమైంది. దీన్ని వదిలివేయడానికి ఎంత మాత్రం వీల్లేదు.

అందుకే దీనికి ప్రత్యవాయం లేదు. మిగతా కర్మలన్నింటికీ శాస్త్రంలో పరిహారాలున్నాయి. కానీ సంధ్యావందనానికి మాత్రం పరిహారం లేదు. చేసి తీరవలసిందే. చేయకపోతే తగిన ప్రాయశ్చిత్తం అనుభవిస్తారు. అనగా దానివల్ల లభించే సుఖాలు కోల్పోతారు. అది మరి ఎందులోనూ దొరకదు. ఉదయకాల సంధ్యా సమయం దాటిన తరువాత ఆ రోజు తిరిగి రాదు. మధ్యాహ్నం వస్తుంది, సాయంత్రం వస్తుంది. అనగా సంధ్యావందనం కూడా ఆ సమయంలోనే దానికి ప్రాధాన్యం తప్ప, ఇతర కాలాల్లో ఉండదు. అందుకే కాలానికి మిక్కిలి ప్రాధాన్యత ఉంది. సంధ్యాకాలంలోనే సంధ్యావందనం చేయాలి గాని, ఇతర సమయాల్లో చేసినా వ్యర్థమే అని సారాంశం. ప్రస్తుత కాలంలో ఉపనయనం అనే సంస్కారం కేవలం 'తంతు'గా మారింది. నేటి పిల్లలు సంధ్యావందనం అనగానే బద్ధకిస్తున్నారు, భయపడుతున్నారు, లేదా పారిపోతున్నారు. దీనికి కారణం ఏమిటి? ఎంత మాత్రం భయపడాల్సిన అవసరం లేదు. సంపూర్ణ సంధ్యావందన తత్త్వాన్ని తెలుసుకుంటే చాలు.



# 8. సంధ్యాతత్త్వం

**చతురశీతి లక్షేషు శరీరేషు శరీరిణాం ।**

**న మానుష్యం వినాప్యత్ర తత్త్వజ్ఞానంతు లభ్యతే ॥**

సృష్టిలోని ఎనభై నాలుగు లక్షల జీవ రాసుల్లో మానవజన్మ విశేషమైంది. తత్త్వ జ్ఞానాన్ని పొందడానికి మనుష్యులకు తప్ప ఏ ఇతర జీవులకు సాధ్యంకాదు.

"జంతూనాం నరజన్మ దుర్లభం" అని శ్రీ జగద్గురు ఆదిశంకరుల వారు వివేక చూడామణిలో తెలిపారు. అనేక జన్మల పుణ్యకర్మల వల్ల మానవజన్మ లభించింది. ఈ జన్మలో మనం సాధించ వలసింది నాలుగువిధాలైన పురు షార్థాలు.

**"వినా దేహేన కస్యాపి పురుషార్థో నవిద్యతే"**

ఇక ఏ జీవి కూడా పురుషార్థాలు సాధించలేదు. ధర్మ, అర్థ, కామ, మోక్షాలనే నాలుగు విధాలైన పురు షార్థాల్లో 'మోక్షమే' మానవజన్మ పరమార్థం. జీవితంలో అర్థ, కామాలను ధర్మబద్ధంగా సాధిస్తూ, పరమార్థమైన మోక్షానికి ప్రయత్నించాలి. మన జన్మ సార్థకం చేసుకోవాలంటే, శాశ్వత సుఖాన్నిచ్చే మోక్షాన్ని సాధించాల్సిందే. వేరే గత్యంతరం లేనేలేదు.

పైన తెల్పిన ధర్మార్థ కామమోక్షాలు సులభంగా పొందడానికి మన పూర్వీకు లైన ఋషులు ఒక అద్భుతమైన గొప్ప ప్రక్రియ నేర్పరిచారు. అదే మనం రోజూ ఆచరించే "సంధ్యావందనం." అందుకే సంధ్యావందనాన్ని మించిన సాధన లేదు. గాయత్రిని మించిన మంత్రం లేదు. ఇహ, పరాలను రెంటిని ఒక్క సంధ్యావందనం వల్ల సులభంగా పొందగలం. ఇందులో ఇతర సాధనాలన్నీ ఇమిడియున్నవి. "సర్వ సాధనల సారమే సంధ్యావందనం." ఇది చేయకుండా ఏ ఇతర సాధనలు చేసినా ప్రయోజనముండదు, పైగా ఫలించవు. అందుకే ఇది

చేయకపోతే వేరే పరిహారం కూడా లేదు. ఖచ్చితంగా చేసి తీరవలసిందే. మోక్ష సాధనకు సంధ్యావందనమే సులభ సాధనా ప్రక్రియ.

అయితే ఒక సందేహం? ఇంత సులభమైన సాధన సంధ్యావందనాన్ని మనవాళ్ళు ఎందుకు అశ్రద్ధ చేస్తున్నారు. అని మనకు అనుమానం వస్తుంది. దీనికి కారణం ఒక్కటే. మనకు సంధ్యావందనం యొక్క సంపూర్ణ పరిజ్ఞానం లేకపోవడమే. యథార్థతత్వం తెలియకపోవడం వల్ల మనం దానియందు సరియైన శ్రద్ధ వహించక నిర్లక్ష్యం చేస్తున్నాం.

మనకు ఎల్లప్పుడూ కావలసిన ఆయురారోగ్యైశ్వర్యాలను సంధ్యావందనం తప్పక ప్రసాదిస్తుంది. సంధ్యావందనం ద్వారా సంపూర్ణ మానసిక, శారీరక ఆరోగ్యాలు లభిస్తాయి. తెలిసిగాని, తెలియకగాని, చేసిన పాపాలు ఏ రోజుకు ఆ రోజే నశిస్తాయి. పగలు చేసిన పాపాలు రాత్రి సంధ్యావందనం వల్ల, రాత్రి చేసిన పాపాలు ఉదయ సంధ్యావందనం వల్ల పటాపంచలవుతాయి. సంధ్యావందనం శ్రద్ధగా చేస్తే పితృదేవతలు మిక్కిలి సంతోషిస్తారు. కర్మసాక్షి, జగచ్ఛక్షువైన శ్రీ సూర్యభగవానుడు తప్పక అనుగ్రహిస్తాడు. గాయత్రీదేవి మనలను ఎప్ప టికప్పుడు రక్షిస్తుంది.

**"సంధ్యా రక్షతి రక్షితా"**

సంధ్యావందనాన్ని మనం రోజూ శ్రద్ధగా చేస్తే, అది మనల్ని తప్పక రక్షిస్తుంది. ఇంతటి గొప్ప ప్రక్రియయైన సంధ్యావందనం యొక్క తత్త్వ రహస్యాన్ని మనమందరం తప్పక తెలుసు కుని తీరాలి. ప్రతి ఒక్కరికి ఇది అత్యవసరం.

**"జ్ఞాత్వా కుర్వీత కర్మాణి"** అన్నట్లుగా తెలిసి చేసే కర్మలకు ఫలితం ఎక్కువగా ఉంటుంది. ఇకపోతే ఎప్పు డూ వదిలిపెట్టకుండా చేస్తాం. మరొకర్ని చేయుటకు ప్రోత్సహిస్తాం. సంధ్యావందనం వల్ల జ్ఞానోదయమై, అంతరాత్మ ప్రకాశిస్తుంది. మరి ఆ సంధ్యావందన రహస్యార్థమేమిటో తెలుసుకుందాం!

"సంధ్య" అనగా–

**"సమ్యక్ ధ్యాయంత్యస్యా మితి సంధ్యా"**

బాగుగా ధ్యానం ఎప్పుడు చేస్తామో అది సంధ్య. ధ్యానం ఎందుకు చేయాలి? **"ధ్యానే నాత్మని పశ్యంతి"** కనుక. ధ్యానం వల్ల ఆత్మ సాక్షాత్కారం కలుగుతుంది. ఆత్మ సాక్షాత్కారమే మోక్షం. మానవ జీవిత లక్ష్యమే మోక్షం. నిరంతర ధ్యానం చేయవలసిందే. కాని ఎక్కువ సమయం ప్రశాంతంగా ధ్యానం చేయుటకు 'సంధ్యాకాలమే' సరియైంది. కావున ఆ కాలానికి 'సంధ్య' అని పేరు వచ్చింది.

"సంధ్యా కాలం" ఎప్పుడు?

**"సంధీయతే అహోరాత్రాభ్యామితి వా సంధ్యా".**

అహోరాత్రులచే సంధింపబడునది సంధ్యాకాలం.

అహస్సు అనగా పగలు (సూర్యోదయం నుండి సూర్యాస్తమ యం వరకు గల కాలం) రాత్రి అనగా సూర్యాస్తమయం నుండి సూర్యోదయం వరకు గల కాలం. ఈ రెండు కాలాల యొక్క సంధి అనగా రాత్రికి పగలుకు మధ్య, పగలుకు రాత్రికి మధ్య ఉండే వ్యవధి. రాత్రి సమాప్తానికి చివర పగలు ఆరంభానికి ముందు, అనగా చీకటితో రాత్రి సమాప్తమవుతుంది. చీకటి పోయిన తర్వాత, సూర్యోదయంతో పగలు ప్రారంభం అవుతుంది. సూర్యోదయానికి ముందు 1 గంట 12 ని॥లు సూర్యోదయం తర్వాత 1 గం. 12 ని॥లు కాలాన్ని "ప్రాతః సంధ్యా కాలం" అంటారు.

పగలు సూర్యాస్తమయంతో సమాప్తమవుతుంది. చీకటి అనగా రాత్రి ప్రారంభానికి ముందు మరియు తర్వాత 1 గంట 12 ని.ల కాలాన్ని "సాయం సంధ్యాకాలం" అంటారు. ఇవి రెండు కాలాలుగాక

**"ప్రాహ్ణాపరాహ్ణౌ మధ్యాహ్నే స్త్రి సంధ్యమ్"**

పగలు యొక్క ప్రారంభ సమయం, పగలు యొక్క చివరి సమయంలోని మధ్య భాగకాలమే "మధ్యాహ్న సంధ్యా కాలం." అనగా సూర్యోదయం మరియు సూర్యాస్తమయం సరిగ్గా 6 గంటలకు అయినప్పుడు మధ్యాహ్నం 12 గంటలకు మధ్యాహ్న సంధ్యాకాలం అవుతుంది. అయితే సూర్యోదయ, సూర్యాస్త మయ కాలాల్లో హెచ్చుతగ్గులైనప్పుడు మధ్యాహ్న సంధ్యాకాలం కూడా మారుతుంది.

ఈ మూడు కాలాలను త్రిసంధ్యలు అంటారు. మూడు సంధ్యల ఏకీభవంను "త్రిసంధ్యం" అంటారు. కాలాలు మూడైనా, మూడు కాలాలందు చేయవలసిన ధ్యానప్రక్రియ ఒకటే కాబట్టి ఈ మూడింటికి ఏకకాలత్వం వచ్చింది.

'సంధ్య'కు మరొక విశేషార్థముంది.

"పితౄన్ ప్రసూత ఇతి పితృ ప్రసూః" అని, అనగా పితృదేవత లను పుట్టించునది. సంధ్య అనేది బ్రహ్మశరీరం. కనుక పితృలోకాన్ని పుట్టిస్తుంది. అందువల్ల దీనికి పితృ ప్రసూః అని పేరు.

సంధ్యాకాలాల్లో చేయవలసిన ఉపాసనా విధానం

**అపవిత్రః పవిత్రోవా సర్వావస్థాంగతోపివా ।**

**యః స్మరేత్ పుండరీకాక్షం సబాహ్యాభ్యంతరః శుచిః ॥**

మనం పరిశుభ్రంగా ఉన్నా, అపరిశుభ్రంగా ఉన్నా ఎట్టి స్థితిలో ఉన్నా కేవలం పుండరీకాక్షుని మనస్సులో స్మరిస్తే, లోపల, వెలుపల పరిశుద్ధులమవుతాం అని తాత్పర్యం.

శరీరం మలినంతో కూడింది. రాత్రి నిద్రించి తెల్లవారి లేచిన తర్వాత కాలకృత్యాలు తీర్చుకోవాలి. నోరు, ముఖం దుర్వా సనను తొలగించుట కొరకు ముఖం కడుక్కుంటాం. శరీరం యొక్క చెమట పోవడానికి స్నానం చేస్తాం. ఇదంతా బాహ్య శుద్ధి. దీనివల్లనే మనం పరిశుద్ధులమైనామని అనుకుంటాం. కాని దీనితోపాటు అంతశ్శుద్ధి కూడా అవసరం. అదెలాగ? అంటే. మన మనస్సు పదే పదే ఏవో సంసార సంబంధమైన ఆలోచనలు చేస్తూనే ఉంటుంది. ఇవిగాక అనవసరమైన ఊహలను కలిగిస్తుంది. దీనివల్ల కాలం అంతా వృధా అవుతుంది. మనస్సులో కలిగే ఇవన్ని కూడా మలినాలే. వీటిని శుద్ధి పరచడానికి ఒక్క పుండరీకాక్షుని స్మరణమే శరణ్యం.

'పుండరీకాక్షుడు' అనగానే కేవలం విష్ణుపరమైన దేవుడు అనుకుంటే పొరపాటే. పుండరీకాక్షుడు అంటే తెల్లని తామర పువ్వు, అక్షి అంటే 'జ్ఞానం' అని అర్థం. తెల్లని తామరపువ్వులాగా వికసించి, అంతటా వ్యాపించే ఆకాశంలాగా

ఉన్న పరమాత్మకు సాక్షియైన జ్ఞానమే పుండరీకాక్షుడు. అనగా పరమాత్మనే పుండరీకాక్షుడు. ఆయన సర్వసాక్షి. ముడుచుకునే స్వభావం లేనిది. అట్టి పరమాత్మను మనం మన మనస్సులో స్మరిస్తే చాలు. లోపల, వెలుపలా రెండింట పరిశుద్ధులమై పోతాం.

స్మరించడమంటే– నోటితో బిగ్గరగానో, పెదవులాడిస్తూనో అనడం, అనుకోవడం కాదు. మనస్సులో వచ్చే ఆలోచనా ప్రవాహాన్ని ఆపేసి, పైన తెలిపిన పరమాత్మ గూర్చిన ఆలోచనను చేయడం. దీన్నే ధ్యానించడం అని కూడా అంటారు. అందుకే ఒకసారిగాదు. మూడుసార్లు పుండరీకాక్షుని స్మరించాలి. ఒకసారి అయితే గట్టిపడదు. మూడుసార్లు అయితేనే మరచిపోకుండా ఉంటాం.

సంధ్యావందనాన్ని చేసే ముందు మూడుసార్లు తప్పక పుండరీకాక్షుని భావన చేసిన తర్వాతనే మిగతా ప్రక్రియను చేయాలి అని సారాంశం.

ఉదయం చేసిన స్మరణ వల్ల ఆ రోజంతా అదే భావంలో, చింతనలో మన కార్యాలన్నీ జరుగుతాయి. అలాగే సాయం కాలం చేసే స్మరణతో రాత్రి నిద్రలో కూడా పరమాత్మ చింతన లో మన కార్యాలన్నీ జరుగుతాయి. అలాగే సాయంకాలం చేసే స్మరణతో రాత్రి నిద్రలో కూడా పరమాత్మ చింతనలో ఉంటాం.



# 9. గాయత్రీ రక్షమాం

శ్లో॥ ముక్తా విద్రుమ హేమనీల ధవళాచ్ఛాయైః ముఖైః త్రీక్షణైః
యుక్తామిందు నిబద్ధ రత్న మకుటాం తత్త్వార్థ వర్ణాత్మికామ్ ।
గాయత్రీం వరదాభయాంకుశ కశాః శుభ్రం కపాలం గదామ్
శంఖం చక్రమథార వింద యుగళం హస్తైర్వహంతీం భజే ॥

అమ్మా! గాయత్రీదేవీ! నీ ఐదు ముఖాల రహస్యమేంటో తెలిసిందమ్మా! నీ ముత్యం రంగు ముఖం ఎరుపును జయించిన తెలుపమ్మా! రజోగుణాన్ని జయించిన సత్త్వగుణం కదా తల్లీ! ముత్యానికి నీరే స్థానమైనందున, నీటికి అధిపతియైన 'గణపతి'వమ్మా! ప్రకృతి, పురుషులకతీతవమ్మా! నిన్ను ధ్యానించిన యోగి శ్రేష్ఠుడు తల్లీ! అభయ, వరద ముద్రలు శివశక్తుల హస్తాలమ్మా! వేదమాతవైన నీవు ఈ ముఖంతో వ్యాకరణ శాస్త్రాన్ని అందిస్తున్నావమ్మా! నీ ప్రథమ ముఖానికి నమస్కారం తల్లీ!

నీ రెండవ ముఖం విద్రుమ వర్ణం అంటే, ఎరుపు రంగు కదమ్మా! రజోగుణ ప్రధానమైందమ్మా! ఒక చేత అంకుశంతో, మరొక చేత పాశంతో దుష్ట శిక్షణ చేసి, శిష్ట రక్షణ చేస్తావు తల్లీ! శిక్షా శాస్త్రంతో మాకు మంచి శిక్షణ నిస్తావమ్మా! ఇది అగ్ని ముఖమే. నమ్మా! ఇందులో సందేహం లేదు తల్లీ! ఈ రెండవ ముఖంతో మమ్మల్ని రక్షించు తల్లీ! నీ తేజో రూపమైన పరమేశ్వరివమ్మా! నీకు మరోసారి నమస్కారమమ్మా!

బంగారు రంగుతో నీ మూడవ ముఖం మెరుస్తున్నదమ్మా! కపాలం గదతో దర్శనమిస్తావు తల్లీ! మాకు ఆహార లోపం లేకుండా చూస్తావుగదమ్మా! ఎలాంటి దుష్టశక్తులు మా వద్దకు రానీయవు గదా తల్లీ! వాయు రూపంతో సూర్యుడిగా ప్రకాశిస్తావవమ్మా! ప్రతి రోజు సంధ్యోపాసనలో నీకు వందనాలర్పిస్తాం తల్లీ! కల్ప శాస్త్రాన్నందిస్తున్న నీకు నమస్కారమమ్మా!

నీ నాల్గవ ముఖం నీలి రంగులో ఉందమ్మా! ఆకాశ రూపమై విష్ణుమూర్తివైనావమ్మా! విష్ణుమూర్తి ఆయుధాలైన శంఖ చక్రాలు ధరించావు కదమ్మా! అనుక్షణం లోకరక్షణ చేస్తున్నావు తల్లీ! మాకు వేదార్థాన్ని బోధించే నిరుక్తశాస్త్రానివైనావమ్మా! శూన్య స్వరూపంలో నుండే జ్ఞాన సుఖాన్నందిస్తున్న నీకు నమస్కారం తల్లీ!

తెలుపు రంగే నీ ఐదవ ముఖమైందమ్మా! ఇది త్యాగానికి గుర్తుగా శివస్వరూపమైనావమ్మా! రెండు చేతులలో వికసించిన రెండు పద్మాలను ధరించావు తల్లీ! పరబ్రహ్మ భావనను మాకు రోజు అందిస్తున్నావమ్మా! కమలం సూర్యతేజస్సు నాకర్షించినట్లు, జ్యోతి స్వరూపుడైన సూర్యునిలో చేరి, జ్యోతి శ్యాస్త్రం ద్వారా మమ్మల్ని ఆకర్షిస్తున్నావు కదా తల్లీ! ఈ విధంగా పంచాయతన దేవతవైన నీకు నమస్కారమమ్మా!

సృష్టికి మూలకారణమైన మహాకాలుని జ్ఞానరూపమే నీవమ్మా! ఈ జగత్తంతా నీ మయమేనమ్మా! ఏ దేవతను పూజించినా, నీకే నమ్మా! నిన్నుగాక ఏ దేవతను ఆరాధించినా ఏం ఫలమమ్మా? మహాకాల పరమాత్మ అంశయైన సూర్యునివల్ల ఏర్పడే సంధ్యాకాలంలోనే నిన్ను ఉపాసించవలసిందమ్మా! సంధ్యాకాలంలో నీ ధ్యానం తప్ప, మాకు వేరే శరణ్యం లేదు గదమ్మా!

కానీ నేడు అపరాధం జరుగుతుందమ్మా! తప్పు చేస్తున్నాం తల్లీ! నీన్ను మేం సక్రమంగా ఉపాసించడం లేదమ్మా! చేసిన తప్పు చెప్పుకుంటే శిక్షించవు గదా తల్లీ! పశ్చాత్తాపానికి మించిన ప్రాయశ్చిత్తం లేదంటారమ్మా! ఎందరో మహానుభావులు నిన్ను ఉపాసించి, నీ అనుగ్రహాన్ని పొంది మాకెల్లప్పుడూ ఉ పదేశిస్తూనే ఉన్నారు తల్లీ! ఏం ప్రయోజనం? ఏ మాత్రం మార్పు రావడం లేదమ్మా! ప్రస్తుత కాల పరిస్థితుల ప్రభావమో తెలియుట లేదమ్మా! ప్రతిరోజు పశ్చాత్తాపపడుతూనే ఉన్నాం తల్లీ! తిరిగి తెల్లవారి యథావిధిగా కాలం గడుస్తూనే ఉందమ్మా! ప్రధానంగా 'సోమరితనం' అనే రాక్షసి మమ్మల్ని ఆవహించిందేమో ననిపిస్తుందమ్మా! కలి మాయనా? కాల మహిమనా? తెలియుట లేదమ్మా! తెలియనివారు తెలుసుకోవడానికి ఏమాత్రం ప్రయత్నించుట లేదమ్మా! ఇక

తెలిసి, తెలియనివారి పరిస్థితి ఏం చెప్పమంటావు తల్లీ! అడుగడుగునా సందేహాలేనమ్మా! ఏం చేయమంటావు తల్లీ! ఏం చెప్పమంటావమ్మా!

తెలిసి చేసినా, తెలియక చేసినా తప్పు చేసిన వారు శిక్ష అనువించాల్సిందేనంటావా తల్లీ! మేం అను నిత్యం శిక్ష అనుభవిస్తూనే ఉన్నామమ్మా! ప్రస్తుత సమాజంలో గౌరవ మర్యాదలు లోపించినవమ్మా! సాంప్రదాయ దుస్తులు వేసుకునే వారే కరువైనారమ్మా! ఎవరైనా వేసుకుంటే వారిని విచిత్రంగా చూసేవారు, హేళన చేసేవారే ఎక్కువైనారమ్మా! మతాచారాలు మంటగలిసినవమ్మా! వర్ణసంకరం రాజ్యమేలుతుందమ్మా! కుటుంబ కలతలు పేట్రేగి పోతున్నాయమ్మా! కులాచారాలు కుమ్ములాటలకు దారి తీస్తున్నాయి తల్లీ! ఆచార సాంప్రదాయాలను లెక్కచేయకపోగా, ఆధునిక సౌకర్యాలకు బానిసలైనామమ్మా! మా యువతరం అంతా విలాసాలతో కాలక్షేపం చేస్తున్నారమ్మా!

ధనానికి ప్రాధాన్యమిచ్చి ధర్మానికి నీళ్లొదులుతున్నాం తల్లీ! వృద్ధులను సేవించాల్సింది పోయి, పిల్లల సేవలను అప్పగించి, విదేశాలకెళ్తున్నామమ్మా! ధనాశతో నీచ సేవలు చేస్తూ, భయభక్తులు కోల్పోతున్నామమ్మా! వేదాభ్యాసం చేసినవారు వివాహానికి నోచుకోవడం లేదమ్మా! స్మార్త విద్యనభ్యసించి, సన్న్యాసులు కావల్సిందేనా తల్లీ! ఆగమాలు నేర్చుకుని, అర్చకులైనవారు ఆగమైపోతున్నారమ్మా! ఏమిటి ఈ పరిస్థితి? ఎందుకీ దుఃస్థితి? నీవు, తప్ప మాకు లేదు వేరే గతి? ఇది గత జన్మ శాపమా? ఈ జన్మ పాపమా? చెప్పమ్మా! మాకు సరియైన దారి జూపమ్మా! తల్లులకు తల్లివైన నీవే నీ పిల్లల్ని రక్షించమ్మా! శపించకమ్మా! క్షమించు తల్లీ! మౌనం వహించక మన్నించుతల్లీ! ఆగ్రహించక అనుగ్రహించమ్మా! కులదేవతవైనా, కలి దేవతవైనా, ఇల దేవతవైనా నీవే కదమ్మా! మా భయాందోళనలు తొలగించి అభయమొసంగు తల్లీ!

నీకూ శాపాలున్నాయని తెలిసిందమ్మా! నిన్ను సృష్టించిన విశ్వామిత్రుడే, నిన్ను శపించాడా తల్లీ! మమ్ము సృష్టించిన బ్రహ్మదేవుడు నీకు శాపమిచ్చాడామ్మా! బ్రహ్మర్షి వశిష్టుడు కూడా నిన్ను శపించాల్సి వచ్చిందా తల్లీ! నిన్ను శపించిన వారిని మేం ఉరుకోమమ్మా! నీ శాపాలు తొలగించడానికి శాపవిమోచన

మంత్రాలున్నాయమ్మా! అవి మేమంతా జపిస్తే నీ శాపాలు తొలగిపోతాయమ్మా! మరి మా కష్టాలు తొలగించు తల్లీ! సరియైన మార్గాన్ని చూపించమ్మా! నీవు ఏది చెబితే అది, ఎలా చెబితే అలా! చేయడానికి సిద్ధంగా ఉన్నాం తల్లీ! కాకపోతే ప్రస్తుత కాల పరిస్థితుల కనుగుణంగా చెప్పమ్మా! జ్ఞానమే స్వరూపంగానున్న నీవు మమ్ము అజ్ఞానంలో పడదోయకమ్మా!

అమ్మా! గాయత్రీ మాతా! మమ్ము అనుగ్రహించావా తల్లీ! మా మొర ఆలకించావామ్మా! నీకు సాష్టాంగ ప్రణామం చేస్తున్నామమ్మా! నీవు చెప్పినదంతా రహస్యంగా ఉంచుతాం తల్లీ!

"నీ మంత్రాన్ని మా శ్వాసకు జోడించమంటావామ్మా! సంధ్యా కాలంలో తప్పనిసరి ధ్యానం చేయమంటావా తల్లీ! ప్రతిరోజు సూర్యభగవానునికి మూడు అర్ఘ్యాలివ్వమంటావామ్మా! భోజన కాలంలో నీ మంత్రంతో ప్రోక్షణ చేయమంటావా తల్లీ!

అలాగేనమ్మా! తప్పకుండా చేస్తాం తల్లీ! ఇంకా ఏం చేయాలో చెప్పమ్మా! నీ హృదయ పారాయణ చేయాలా తల్లీ! నీ జపం ఇరువది నాలుగు లక్షలు చేస్తే నీ అనుగ్రహం తప్పనిసరి కలుగుతుందమ్మా? ఇరువది నాలుగు గంటలు ఒక రోజుకు కేటాయించింది నీ సంఖ్యనే కదమ్మా! ఇరువది నాలుగు తత్త్వాల స్వరూపంగా ఇరువది నాలుగు అక్షరాలతో ప్రత్యక్షమవుతున్నావు తల్లీ! మేం ఏమి కోరకుండానే, మాకు ఏం కావాలో ఇచ్చే వరప్రదాయిని నీవమ్మా! ప్రణవ స్వరూపిణివైన నీకు ఓంకారమే ప్రాణంకదా తల్లీ! ఉదయ సంధ్యలో గాయత్రివి, మధ్యాహ్న సంధ్యలో సావిత్రివై, సాయం సంధ్యలో సరస్వతిగా మమ్ము అనుగ్రహించుటకు సిద్ధంగానున్నావమ్మా! మా అపరాధాలు మన్నించి, మాకు జ్ఞానోదయం కలిగించిన నీకు ఋణపడి యున్నాం తల్లీ! మేం ప్రతినిత్యం సంధ్యా కాలంలో నిన్ను ధ్యానించి, సేవించి, నీ ఋణం తీర్చుకుంటామమ్మా! నీవు సర్వశక్తిమంతురాలవు తల్లీ! మళ్ళీ జన్మ అంటూ లేకుండా చేసే శక్తి నీకే ఉంది తల్లీ! ఆ ఒక్కటీ చేసి, మమ్ము రక్షించమ్మా!

**జ్ఞానమయివైన ఓ గాయత్రీ! రక్షమాం!**

# 10. శాస్త్రాధ్యయనావశ్యకత

పారంపర్యంగా అభ్యసించబడుతున్న వేదం చేతనే మనం ధర్మాధర్మాలు వింటున్నాం, తెలుసుకుంటున్నాం. అందుకే-

**"వేదోఽఖిలం ధర్మమూలం"** అన్నారు.

అనగా వేదానికంతటికీ 'ధర్మమే' మూలమైయుంది. వేదవిహితమైన కర్మలను ఆచరించుటయే ధర్మం. ప్రధానంగా వేదాలు మూడు. వేనిచేత దేవతలను స్తోత్రం చేస్తామో అది ఋగ్వేదం. పాపాలను నశింపజేయునది సామవేదం. పూజ, హోమ, దానాలకు సంబంధించింది యజుర్వేదం. ఈ మూడు వేదాల సమూహానికే "వేదత్రయి" అని పేరు. లౌకిక పరమైన లాభాలను కలిగింపజేయు అధర్వణ వేదం కలిసి మొత్తం నాలుగు వేదాలైనవి.

వేదాలను పూర్తిగా తెలుసుకొనుటకు వేదాంగాలు అవసరం. వేదాంగాలు మొత్తం ఆరు.

**శ్లో॥ శిక్షా వ్యాకరణం ఛందో, నిరుక్తం జ్యోతిషం తథా।**
**కల్పశ్చేతి షడంగాని, వేదస్యాహుర్మనీషిణః ॥**

1. శిక్ష 2. వ్యాకరణం 3. ఛందస్సు 4. నిరుక్తం 5. జ్యోతిషం 6. కల్పం.

అకారాది వర్ణాలను విశేషంగా వివరించి చెప్పునది వ్యాకరణం వాక్య నిర్మాణం కూడా వ్యాకరణం ద్వారానే సాధ్యం.

పద్య వివేచకమైన శాస్త్రం ఛందస్సు, వర్ణాగమమనియు, వర్ణ వపర్యయమనియు, మొదలైన నిశ్చయంచేత చెప్పబడును.

గ్రహ నక్షత్రాలయొక్క ఉదయాస్తమయాదులను ప్రతిపాదించునది జ్యోతిష్యం.

సమర్థవంతంగా యజ్ఞయాగాది క్రియలను నిర్వహింపజేయునది కల్పం. ఇవి మనకు సూత్రరూపంలో అందుబాటులోనున్నాయి.

ఈ వేదాంగాలతో పాటు ఇంకా కొన్ని వేదాన్ని అర్థము చేసుకొనుటకు ఉపయోగపడే విషయాలు శాస్త్రాలుగా రూపొందించబడినాయి.

**శాస్త్రం అంటే ఏమిటి? "నిదేశ గ్రన్థయో శ్శాస్త్రమ్"** – అమరకోశం

శాస్త్రం అనగా ఆజ్ఞకును, వ్యాకరణాది గ్రంథములకును పేరు. 'శిష్యతే అనేనేతి శాస్త్రం' శిక్షించుటయు, శిక్షింపజేయును గనుక శాస్త్రం.

మనలను ధర్మమార్గంలో నడిపింపజేయునది, ధర్మాన్ని ఆచరింపజేయునది శాస్త్రం. అధర్మ మార్గాన్ని ఆచరింపజేయకుండా చేయునది కూడా శాస్త్రమే. శాస్త్రాలు అనేకంగానున్నను, ప్రధానంగా 'ఆరు శాస్త్రాలు' గొప్పగా మనకు ఉపయోగపడుతున్నాయి.

ఆరు శాస్త్రాల విషయంలో భిన్న అభిప్రాయాలున్నా ప్రస్తుతం శాస్త్రాధ్యయనం చేయుటకు అత్యంత ఆవశ్యకములైనవి, మనకు నిజజీవితంలో ఉపయోగపడేవి అవసరం. ఇందులో–

1. తర్క శాస్త్రం (న్యాయశాస్త్రం) 2. వ్యాకరణ శాస్త్రం 3. ఛందశ్శాస్త్రం 4. పూర్వమీమాంసా శాస్త్రం 5. ఉత్తర మీమాంసా శాస్త్రం. 6. జ్యోతిశ్శాస్త్రం.

ఈ ఆరు శాస్త్రాలు వేద విహితమైన కర్మలను ఆచరింపజేయుటకు, ధర్మాన్ని రక్షించుటకొరకు, మన జీవిత లక్ష్యమైన మోక్షాన్ని అందింపజేయుట కొరకు అను మూడు ప్రధాన ఉపయోగాలతో నున్నాయి. పై ఆరింటిలో మొదటి మూడు శాస్త్రాలు వేదానికి అంతరంగాలైతే, చివరి మూడు శాస్త్రాలు బహిరంగాలు. ప్రస్తుతం ఈ బహిరంగములైన మూడు శాస్త్రాలు ధర్మవిరుద్ధంగా మారి, మనలను తప్పుద్రోవ పట్టిస్తున్నాయి.

మనం అప్రమత్తంగా ఉండవలసిన సమయం ఆసన్నమైంది. ప్రస్తుత కాలంలో ప్రతి ఒక్కరికీ శాస్త్రాలపై సంపూర్ణ అవగాహన ఉండడం తప్పనిసరి. అందుకే 'శాస్త్రాధ్యయనావశ్యకత' గూర్చి మనమంతా ప్రయత్నించాలి. శాస్త్రాధ్యయనానికి స్త్రీ పురుష భేదం లేదు. దూరవిద్య ద్వారా కూడా

శాస్త్రాధ్యయనం చేయవచ్చు. కేవలం ధన సంపాదనకే కాకుండా, ధర్మరక్షణకు, శాస్త్ర అధ్యయనం అత్యంతావశ్యకం.

శాస్త్ర అధ్యయనం ద్వారా మరొక గొప్ప లౌకిక ప్రయోజనం దాగి ఉంది. ప్రస్తుతం వ్యవసాయం, వేద అధ్యయనం, స్మార్తవిద్య, ఆగమశాస్త్రం, అర్చక వృత్తి, పౌరోహిత్యం, న్యాయవాద వృత్తి, పత్రికారంగంలో ఉన్న అబ్బాయిలకు వధువు లభించడం కడు దుర్లభమైంది. ఇట్టి క్లిష్ట పరిస్థితుల్లో మనం మన అమ్మాయిలను శాస్త్ర అధ్యయనం చేయించినట్లయితే, శాస్త్ర విద్యను పూర్తి చేసిన అమ్మాయిలకు పై అబ్బాయిలతో వివాహం జరిపిస్తే లోకకళ్యాణం కాగలదు. భావితరాల వారికి వేద, శాస్త్రాలు రెండు అందించిన వారమవుతాం.

ఈ మధ్యకాలంలో శాస్త్రాధ్యయన ఆవశ్యకతను దృష్టియందుంచుకొని, 'శాస్త్ర సదస్సు'లు ఏర్పాటు చేయడమైంది. ప్రస్తుత కాలంలో శాస్త్ర పండితులు లభించడం కూడా కష్టంగా ఉంది. అయినా వృద్ధులైన పండితులను ఒక వేదికపైకి పిచ్చేసి, ఎవరి శాస్త్రమందు వారు, వారు చేసిన కృషిని ఆ శాస్త్ర ప్రయోజనాన్ని తెలియజేయడమైంది.

జరిగిన సదస్సులలో సభాముఖంగా కోరిందేమంటే? "ఎక్క డైతే వేద పాఠశాలలు చక్కగా నిర్వహింపబడుచున్నవో, అక్కడ తప్పకుండా శాస్త్ర పాఠశాలలు కూడా నిర్వహించాలి" అని.

వేదాలు, వేదాంగాలు, శాస్త్రాలు, పురాణాలు, ఇతిహాసాలు, అన్నీ కూడా ధర్మరక్షణ కొరకే గాని, వేరుగాదు. సమాజంలో ధర్మ స్థాపనం చేయుటకు, ఇహపర సౌఖ్యాలు పొందుటకు ఇంతకంటే వేరే శరణ్యం లేదు. ఆధునిక విద్యల వల్ల విలాసాలతో జీవితం గడుస్తుందేమో గాని, ధర్మరక్షణంగాని, మోక్షసాధనంగాని జరగదు. పై విషయసాధనకు వయో పరిమితితో కూడా పనిలేదు. అందుకే అందరం కలిసి శాస్త్రాధ్యయనానికి నడుం బిగిద్దాం.

**శ్లో॥ అనంతశాస్త్రం బహువేదితవ్యం, స్వల్పశ్చకాలో బహవశ్చ విఘ్నాః।**
**యత్సార భూతం, తదుపాసితవ్యం, హంసోయథాక్షీర మివాంబు మిశ్రమ్ ॥**

(ఉత్తర గీతా– 3–1)

శాస్త్రాలు అనంతాలు, తెలియదగింది మహా సముద్రమంతయుంది. కాలము చాలా స్వల్పం. విఘ్నాలు లెక్కలేనన్ని కావున కావలసినంత వరకు సారభూతమైన దానినే మనం తెలుసుకోవడానికి యత్నించాలి. హంస పాలను స్వీకరించి, నీటిని వదిలివేయడాన్ని చూస్తున్నాం కదా! అదేవిధంగా మనం కూడా చేయడం కర్తవ్యం.

సర్వజ్ఞుడు ఒక్క పరమాత్మనే అనగా మానవమాత్రులెవరూ సర్వజ్ఞులు కాలేరు. మనమంతా కించిజ్ఞులమేనని, ఎల్లప్పుడు మరవకూడదు. కాలానుగుణంగా అవసరానికి సరిపడే జ్ఞానాన్ని సంపాదించి సమాజానికి ఆ జ్ఞానాన్ని అందిస్తే మన జన్మ ధన్యమవుతుంది.



# 11. గీతలో దేవుని రూపాలు

శ్లో॥ హన్తతే కథయిష్యామి దివ్యం హ్యాత్మా విభూతయః ।
ప్రాధాన్యతః కురు శ్రేష్ఠ నాస్త్యన్తో విస్తరస్యమే ॥

(శ్రీమద్భగవద్గీత– 10 అ. 19 శ్లో.)

నా యొక్క దివ్య విభూతులు అనంతాలు గనుక సవిస్తరంగా తెలుపుట సాధ్యం గాదు. అట్టి దివ్యరూపాల్లో ప్రాధాన్యాన్ననుసరించి ఇప్పుడు చెప్పుచున్నానని గీతలో పరమాత్మ అర్జునునకు తెలిపాడు.

ఈ లోకంలో పరమాత్మను సులభంగా తెలుసుకోవడానికి, ధ్యానించడానికి వీలుగా తగినన్ని రూపాలున్నాయి. దేవుడెలా ఉంటాడు? ఎక్కడుంటాడు? అనే సందేహాలు కలవారికి ఇందులో సమాధానం లభిస్తుంది. లెక్కలేనన్ని రూపాలు గల పరమాత్మ మనకు అందుబాటులోని ముఖ్యమైన రూపాలను తెలియజేశాడు.

**అన్ని ప్రాణులలోని అంతరాత్మ**

మనతో పాటు జీవించే మనుష్యులందరిలోనే గాక సకల ప్రాణికోటిలోగల ఆత్మస్వరూపం దేవుడే. మనకు కనిపించేవి, కనిపించని జీవరాశులన్నీ కూడా దైవస్వరూపాలే. దీనివల్ల దైవం యొక్క ఉనికి సులభంగా తెలిసింది. ఇక చేయవలసిందల్లా దైవసేవ అనగా ప్రాణికోటి సేవయని గ్రహించాలి.

**ద్వాదశాదిత్యులలో విష్ణువు**

ఆదిత్యులు పండ్రెండుగురిలో విష్ణువు సాక్షాత్తూ పరమాత్మే. ఆదిత్యులు వరుసగా ధాత, మిత్రుడు, అర్యముడు, రుద్రుడు, వరుణుడు, సూర్యుడు, భృగుడు, వివస్వంతుడు, పూష, సవిత, త్వష్ట, విష్ణువు.

అందుకే ఉదయం లేవగానే సూర్యభగవానునికి నమస్కరించాలి.

**జ్యోతిస్వరూపులలో సూర్యుడు**

ఆకాశంలో గల జ్యోతిస్వరూపులైన గ్రహాలు, నక్షత్రాలు, మొదలైన వాటన్నింటిలో రశ్మియుక్తుడైన సూర్యభగవానుడు దైవస్వరూపం.

**సప్తమరుత్తులలో మరీచి**

ఏడుగురు మరుత్తులు వరుసగా ఆవహ, ప్రవహ, వివహ, పరావహ, ఉ ద్వహ, సంవహ, పరివహాలలో ఆహవమనే మరీచి పరమాత్మ. (మరుత్తు అనగా గాలి.)

**నక్షత్రాలలో చంద్రుడు**

మొత్తం ఇరవయ్యేడు నక్షత్రాలకు అధిపతియైన చంద్రుడు దైవస్వరూపం.

**వేదాలలో సామవేదం**

ఋగ్వేదం, యజుర్వేదం, సామవేదం, అథర్వణ వేదమను నాలుగు వేదాల్లో సామవేదం పరమాత్మ స్వరూపం.

**దేవతలందరిలో ఇంద్రుడు**

సకల దేవతలలో దేవరాజైన ఇంద్రుడు దైవస్వరూపంగా భగ వానుడు తెల్పుచున్నాడు.

**ఇంద్రియాలలో మనస్సు**

మనకు గల ఏకాదశేంద్రియాలలో ఇంద్రియాలకు అధిపతి యైన మనస్సే దైవస్వరూపం. ఎవరి మనసు నొప్పించగూడదు.

**ప్రాణులందరిలో చేతనం**

సకల ప్రాణులలోని చేతనత్వమైన జ్ఞానం అనగా తెలివి కూడా పరమాత్మ స్వరూపమే.

**ఏకాదశ రుద్రులలో శంకరుడు**

పదకొండుగురైన రుద్రమూర్తులలో శంకర భగవానుడు దైవ స్వరూపం. ఏకాదశరుద్రులు వరుసగా అజుడు, ఏకపాదుడు, అహిర్బుధ్న్యుడు, పినాకి, అపరాజితుడు, త్ర్యంబకుడు, మహేశ్వరుడు, వృషాకపి, శంభుడు, హరణుడు, శంకరుడు (ఈశ్వరుడు) అనువారు. రుద్రాభిషేకం చేయాలి.

**యక్ష రాక్షసులలో కుబేరుడు**

రాక్షసులు, యక్షులందరిలో ధనాధిపతియైన కుబేరుడు సాక్షాత్తూ పరమాత్మ స్వరూపంగా తెలిపాడు.

**అష్ట వసువులలో పావకుడు**

ఆపుడు, ధ్రువుడు, సోముడు, ధరుడు, అనిలుడు, అనలుడు, ప్రత్యూషుడు, ప్రభాసుడు అను ఎనమండుగురు వసువులలో పావకుడనే అగ్ని దైవ స్వరూపం.

**పర్వతాలలో మేరు గిరి**

శిఖరాలు గల పర్వతాలన్నింటిలో మేరు పర్వతం పరమాత్మ స్వరూపమైంది.

**పురోహితుల్లో బృహస్పతి**

అంగిరోమహర్షి పుత్రుడు, స్వారోచిషమన్వంతరంలోని సప్తర్షుల్లో ప్రధానుడు, ముఖ్య పురోహితుల్లో దేవ పురోహితుడు, వాహనావతారమైన విద్య చెప్పిన గురువు అయిన బృహస్పతి పరమాత్మ స్వరూపమే.

**సేనాపతుల్లో కుమారస్వామి**

దేవసేనా నాయకుడైన కుమారస్వామి సాక్షాత్తూ దైవస్వరూపం.

**జలాశయాలన్నింటిల్లో సముద్రం**

నీరు నిలవ ఉండే జలాశయాలన్నింటిలో పెద్దదైన సముద్రం పరమాత్మ స్వరూపం.

**మహర్షులలో భృగువు**

భృగువు, మరీచి, అత్రి, అంగిరుడు, పులహుడు, క్రతువు, మనువు, దక్షుడు, వశిష్ఠుడు, పులస్త్యుడనే మహర్షులలో భృగుమహర్షి దైవస్వరూపం.

**శబ్దాలన్నింటిలో ఓంకారం**

శబ్దాలన్నింటిలో ఏకాక్షరమైన, బ్రహ్మ వాచకమగు ఓంకారం పరమాత్మ స్వరూపం. ఓంకారాన్ని స్మరిస్తూ ఉండాలి.

**యజ్ఞాలన్నింటిలో జపయజ్ఞం**

శ్రౌత స్మార్తాది యజ్ఞాలన్నింటిలో మానసిక జపరూపమైన యజ్ఞం దైవ స్వరూపం. వీలైనపుడు యజ్ఞయాగాదులు చేయాలి. చేయించాలి.

**స్థావర పదార్థాల్లో హిమాలయం**

సృష్టిలోని కదలని వస్తువుల్లో శ్రేష్ఠమైన హిమాలయం పరమాత్మ స్వరూపం.

**చెట్లన్నింటిలో రావిచెట్టు**

రావిచెట్టు (అశ్వత్థ వృక్షం) పరమాత్మ స్వరూపంగా ఉంది.

**దేవర్షులలో నారదుడు**

నరనారాయణులు, వాలఖిల్యులు, కర్దమ పులహులు, పర్వత నారదులు దేవర్షులు. వీరిలో నారదుడు దైవస్వరూపుడు.

**గంధర్వులలో చిత్రరథుడు**

గంధర్వులకు అధిపతియైన చిత్రరథుడు పరమాత్మ స్వరూపుడైనాడు.

**సిద్ధులలో కపిలుడు**

సిద్ధులనగా జన్మతోడే ధర్మజ్ఞాన, వైరాగ్య, ఐశ్వర్యాలను కలిగినవారు. అట్టివారిలో కపిలుడు దైవస్వరూపుడు.

**గుర్రాలలో ఉచ్చైఃశ్రవం**

అమృతం కొరకు సముద్ర మథన సమయాన పుట్టిన ఉచ్చైఃశ్రవమనే గుర్రం పరమాత్మ స్వరూపమే.

**ఏనుగులలో ఐరావతం**

శ్రేష్ఠములగు ఏనుగులలో ఐరావతం సాక్షాత్తూ దైవస్వరూపం అయింది.

**మనుషుల్లో రాజు**

మనందరిలో మనల్ని పరిపాలించే రాజు లేదా పాలక శ్రేష్ఠుడు దైవస్వరూపుడు.

**ఆయుధాల్లో వజ్రాయుధం**

యుద్ధానికి ఉపయోగించే పలు రకాలైన ఆయుధాలలో దధీచి వెన్నుముక వలన ఏర్పడిన వజ్రాయుధం పరమాత్మ స్వరూపం.

**ఆవులలో కామధేనువు**

ఆవులన్నీ దైవస్వరూపాలే అయినా కామధేనువు సాక్షాత్తూ పరమాత్మే. యథాశక్తి గోసేవ చేయాలి.

**సంతాన కారకుడైన మన్మథుడు**

కేవలం సంతానోత్పత్తికి మాత్రమే ఉపయోగపడు కామ స్వరూపుడైన మన్మథుడు దైవస్వరూపుడు.

**పాములన్నింటిలో వాసుకి :**

విషంతో కూడిన పాములన్నింటికీ అధిపతియైన వాసుకి అనే సర్పం సాక్షాత్తూ పరమాత్మ స్వరూపం.

**నాగులన్నింటిలో అనంతుడు :**

విషంలేని నాగజాతికి అధిపతియైన అనేక తలలుగల నాగులలో అనంతుడు దైవస్వరూపుడు.

**జల దేవతలలో వరుణుడు :**

జలాధిష్ఠాన దేవతయైన వరుణ భగవానుడు కూడా సాక్షాత్తూ దైవస్వరూపుడే.

**పితృదేవతల్లో అర్యముడు :**

కవ్యవాహ, అనల, సోమ, యమ, అర్యమ, అగ్నిష్వత్త, బర్హిషత్తులనే పితృదేవతలలో అర్యముడు దైవస్వరూపుడు.

**శాసించువారిలో యముడు :**

శాసించు వారిలో శ్రేష్ఠుడు, మృత్యుదేవతయైన యముడు పరమాత్మ స్వరూపంగా ఉన్నాడు.

**దైత్యులలో ప్రహ్లాదుడు :**

రాక్షసజాతిలో జన్మించిన భక్తప్రహ్లాదుడు కూడా దైవస్వరూపుడే అయివున్నాడు.

**గణకులలో కాలం :**

లెక్కించు వారిలో కాలం దైవస్వరూపమే. జ్యోతిశ్శాస్త్రం అంతా ఈ కాలం పైననే ఆధారపడి ఉంది.

**మృగాలలో సింహం :**

మృగాలన్నింటిలోకెల్లా రాజైన సింహం దైవస్వరూపమే.

**పక్షులలో గరుడుడు :**

పక్షి జాతులన్నింటిలో వినతాసుతుడైన గరుడుడు దైవస్వరూపం.

**పవిత్రమొనర్చు వానిలో గాలి :**

పరిశుభ్రంగా ఉంచు వానిలో వేగవంతమైన గాలి పరమాత్మ స్వరూపం.

**ఆయుధధారులలో శ్రీరాముడు :**

ఆయుధాలు ధరించిన దేవతలలో శ్రీరామచంద్రమూర్తి సాక్షాత్తూ దైవస్వరూపమే.

**మత్స్యాదులలో మొసలి :**

చేప జాతి విశేష జంతువులలో మొసలి పరమాత్మ స్వరూపం.

**నదులన్నింటిలో గంగానది :**

నదులన్నింటిలోకెల్లా పవిత్రమైన గంగానది దైవ స్వరూపం.

**గోచర వస్తువులన్నింటికీ ఆది మధ్యాంతములు :**

సృష్టిలో గల సకల వస్తువులన్నింటికీ పుట్టుక, స్థితి, నాశములు మూడు పరమాత్మ స్వరూపమే.

**విద్యలన్నింటిలో అధ్యాత్మ విద్య :**

విద్యలన్నింటిలోకెల్లా మోక్షప్రదమైన అధ్యాత్మ విద్య పరమాత్మ స్వరూపం.

**తార్కికులలో వాదం :**

తార్కికుల వాద, జల్ప, వితండాలలో సత్యం నిరూపించ డానికి చేసే వాదం దైవ స్వరూపం.

**అక్షరాలన్నింటిలో 'అ'కారం :**

'అ' కారంతోనే అక్షరాలన్నీ మొదలవుతాయి. అట్టి 'అ' కారం అక్షరాలన్నింటిలో పరమాత్మ స్వరూపం.

**సమాసాలలో ద్వంద్వం :**

వ్యాకరణంలోని సమాసాలనే విషయాలన్నింటిలో ఉభయ పద ప్రధానమగు ద్వంద్వ సమాసం దైవస్వరూపం. (ఉదా: తల్లిదండ్రులు)

**ప్రవాహరూపమైన కాలం :**

కాలానికి అంతం లేదు. అనంత ప్రవాహరూపమగు కాలం పరమాత్మ స్వరూపమే. మనమంతా కాలాధీనులం.

**సర్వతోముఖుడైన కర్మ ఫలదాత :**

ప్రతి పనికి వచ్చే ఫలితాన్నిచ్చే సర్వతోముఖుడు పరమాత్మ స్వరూపం. కావున పనిచేయుట మనవంతు, ఫలితం దైవాధీనం.

**సర్వసంహారకమైన మృత్యువు :**

సంహారకులలో సర్వసంహార కారకుడైన మృత్యువు కూడా దైవస్వరూపమే.

**అభ్యుదయంనొందనున్న వారి అభ్యుదయం :**

అభివృద్ధిని కోరువారి యొక్క అభివృద్ధి కూడా దైవస్వరూపమై ఉంది.

**స్త్రీల యొక్క గుణాలు :**

కీర్తి, లక్ష్మి (సంపద), వాక్కు, జ్ఞప్తి, తెలివి, స్థైర్యం, ఓరిమి (సహనం) అన్ని స్త్రీ గుణాలు. ఇవన్నీ కూడా పరమాత్మ స్వరూపాలై ఉన్నవి.

**సామగీతాల్లో బృహత్సామం :**

మోక్ష ప్రతిపాదితమైన ఈశ్వరుని స్తుతిగీతాల్లోని బృహత్సామం దైవస్వరూపంగా ఉంది.

**ఛందస్సులలో గాయత్రి :**

ఛందో విశిష్టములైన ఋక్కులలో ద్విజత్వం ఇచ్చేది, సోమలతను తేవడానికి ప్రయోగింపబడింది, బ్రహ్మప్రాపకము అవడం వల్ల శ్రేష్ఠమైన గాయత్రి పరమాత్మ స్వరూపం.

**మాసాల్లో మార్గశీర్షం :**

మహాభారత కాలాన వర్షారంభం మార్గశీర్ష మాసంతో అవడం వల్ల, సమశీతోష్ణ కాలమవడం వల్ల మార్గశీర్ష మాసం దైవ స్వరూపమైంది.

**ఋతువులన్నింటిలో వసంతం :**

ఆరు ఋతువుల్లోకెల్లా చైత్ర, వైశాఖమాసాల్లోని వసంతఋతువు దైవస్వరూపం.

**వంచకులలో జూదం :**

మోసగాళ్లలో జూదం పరమాత్మ స్వరూపం. అయినా దీని జోలికి వెళ్లరాదు.

**తేజశ్శాలురలో ప్రభావం :**

తేజస్సుగల వారిలోని శక్తి, ప్రభావం దైవస్వరూపమే.

**జయశీలురుల విజయం :**

గెలుపొందేవారి యొక్క విజయం దైవస్వరూపం.

**ఉద్యమకారుల్లో ఉద్యమం :**

ఉద్యమాలు చేయువారిలోని ఉద్యమం కూడా పరమాత్మ స్వరూపమే.

**సాత్త్వికులలో సత్త్వగుణం :**

సాత్త్వికులైన సాధుపుంగవుల యొక్క సత్త్వగుణం దైవస్వరూపంగా ఉంది.

**యాదవులలో శ్రీకృష్ణుడు:**

సాక్షాత్తూ శ్రీకృష్ణుడే చెబుతూ, తిరిగి 'యాదవుల్లో శ్రీకృష్ణుడను నేనే' అని అన్నాడు. అనగా పరమాత్మ స్వరూపమని గ్రహించాలి.

**పాండవులలో అర్జునుడు :**

పాండవులైదుగురిలో అర్జునుడు దైవస్వరూపమై ఉన్నాడు.

**మునులలో వేదవ్యాసుడు :**

సర్వ పదార్థ జ్ఞానులు, వేదార్థ మననశీలుడైన గొప్ప ముని వేదవ్యాసుడు పరమాత్మ స్వరూపుడే.

**సూక్ష్మార్థ వివేకులలో శుక్రుడు :**

సూక్ష్మ జ్ఞానం కలిగి వివరించే శక్తిగల వారందరిలో శుక్రడు దైవస్వరూపుడు

**శిక్షకులలో రాజదండం :**

అసంయుతులను శాసించి, నియమించువారి దండనీతి పరమాత్మ స్వరూపం.

**జయింపగోరువారి రాజనీతి :**

ధర్మయుద్ధంతో జయం పొందాలనుకునే వారిలో రాజనీతి దైవస్వరూపం.

**రహస్యాలలో మౌనం :**

విషయాలను రహస్యంగా ఉంచడంలో ఉండే మౌనం దైవస్వరూపమే.

**జ్ఞానులందరిలో జ్ఞానం :**

తత్త్వజ్ఞానులందు జ్ఞానరూపం కూడా పరమాత్మ స్వరూపమే. జ్ఞానసేవ కూడా మోక్షప్రదమే.

**సర్వ భూతముల మూలకారణం :**

సృష్టిలోని ప్రాణులన్నింటికీ మూలకారణం పరమాత్మ స్వరూపమే.

**స్థావర జంగమాత్మక వస్తువుల శక్తి :**

సృష్టిలోని ప్రతి పదార్థానికి కలిగే సమస్త శక్తి కూడా దైవ స్వరూపమే. అన్నియు పరమాత్మనే.

పైన తెలిపిన 72 దైవ రూపాలను గమనించిన తర్వాత మనకు తెలిసేదేమంటే పరమాత్మ లేకుండా ఏమీ లేదు. అంతా దైవస్వరూపమే అని నిర్ణయమైంది. ఇంకా శ్రీకృష్ణ పరమాత్మ ఏమంటున్నాడంటే! ఇపుడు చెప్పినవన్నీ సంక్షిప్తంగా ఉన్నాయి. నా దివ్య విభూతులు అనంతాలు. సృష్టిలో మీరు ఏ వస్తువు, ఏ ప్రాణి, ఏ విషయం తీసుకున్నా సరే! నా అంశ లేకుండా లేనే లేదని ఖచ్చితంగా చెప్పాడు. చివరకు ఒక్క మాటలో చెప్పాలంటే... ఈ సమస్త విశ్వమంతా కూడా పరమాత్మ యొక్క ఒక్క అంశ చేతనే వ్యాపించి, ధరించి ఉంది. ఈ దివ్య విభూతుల తెలియడం వల్ల కలిగే లాభమేమీ లేదు అని భగవానుడు చెప్పాడు. ఇక దేవుడు లేడనడానికి గాని, ఎక్కడున్నాడని అనడానికి ఏమాత్రం అవకాశం లేదు. చివరకు అలా అనేవారు కూడా దైవస్వరూపులే కదా!



# 12. దేవతార్చనం

దేవుడున్నాడనే నమ్మకం కలిగినవారిని ఆస్తికులంటారు. దేవుడు కంటికి కనబడడుకదా! అందుకే లేడనేవారూ కొందరున్నారు. వీరినే నాస్తికులంటారు. కనబడనంత మాత్రాన లేడనడం ఎంతవరకు సమంజసం? ముందు 'ఉన్నాడు' అని ఉంటేనే కదా! తర్వాత లేడనేది వస్తుంది. ఇదియే దేవుడున్నాడనడానికి ఒక చక్కని నిదర్శనం. పైగా వేదాలు, శాస్త్రాలు, పురాణాలు,ఇ తిహాసాలు,ఆ గమాలు, ఆప్తులు, అనుభవజ్ఞులు, భక్తులు, ఇంకెందరో మహానుభావులు దేవుడున్నాడని అనేకవిధాలుగా నిరూపించారు కూడా. అయినా ఏ కొందరో లేడన్నంత మాత్రాన దేవుడు లేకుండా పోడు కదా! నాస్తిక మతం అనాదిగా వస్తూనే ఉంది. కాని విజ్ఞులు గ్రహించాల్సిన విషయాలు చాలా ఉన్నాయి.

సూర్యచంద్రులు క్రమం తప్పకుండా సంచరిస్తున్నారు. పంచభూతాలు తమ తమ ధర్మాలకు బద్ధులై ఉన్నాయి. మృత్యువు నిష్పక్షపాతంగా తన పని తాను చేస్తుంది. ఇంత క్రమబద్ధంగా జరుగుటకు ఎవరైనా ఒక నియంత తప్పక ఉండి తీరాలి. అతడు లోకైక వ్యక్తి అయి ఉంటాడు. ఎవరా నియంత?

ఇప్పుడు ప్రపంచంలో సర్వాధికారణాలున్న వ్యక్తులు కొందరున్నారు. వారి ఆజ్ఞమీద ఏ పని జరుగుటలేదు. కాని వారి నేతృత్వంలో సూర్యచంద్రులు సంచరిస్తున్నారా? లేదుకదా! ఒకవేళ వారి యజ్ఞాన్ని నమ్మినచో వారు కోరినవి జరగక పోవడం, కోరనివి జరుగుటయూ సంభవిస్తున్నాయి. అతివృష్టి, అనావృష్టి, భూకంపాలు, సునామీలు, తుఫానులు, అకాలమరణాలు, విచిత్ర రోగబాధలు ఇలా ఎన్నింటినో అనుభవించాల్సిన అవసరమేముంది? తమ పాలనలో దేశంకాని, రాష్ట్రంకాని సుభిక్షంగా ఉండాలని కోరుకుంటారుకదా! కాని అలా జరుగుటలేదే? కనుక సూర్యచంద్రులు వీరి అధీనంలో లేరు, అనేది స్పష్టమవుతోంది.

మానవాతీతమైన ఒక చైతన్యశక్తి సృష్టినంతా నడుపుతుందనేది సుస్పష్టం. ఈ విషయమే వేదంలో–

"ఈయన భయంతో వాయువు వీస్తుంది. ఈయన భయంతో సూర్యుడు ఉదయిస్తున్నాడు. ఈయన భయంతో అగ్ని, ఇంద్రుడు, మృత్యుదేవతయు తమ తమ పనులు జాగరూకులై చేయుచున్నారు". అని ఉంది. ఈయనే ఆ చైతన్యశక్తి. దీనినే 'దేవుడు' అన్నారు. కనుక దేవుడు లేదనుట ఎంతమాత్రం సరికాదు.

మనం బుద్ధిజీవులం. ఇతర ప్రాణులకంటే విశేషజ్ఞానం ప్రసాదించి, మనకు కావాల్సిన నిప్పు, నీరు, గాలి, వెలుతురు, అన్నం, వస్త్రం మొదలైన సౌకర్యాలను కల్పించిన ఆ దేవుని యెడల ఎంత కృతజ్ఞత కలిగివుండాలి? ఎంతో ఋణగ్రస్తులం కాకుండా ఆలోచించాలి. ప్రస్తుతం కరెంటు ద్వారా వెలుగుకు, గాలికి, డబ్బును చెల్లించుకుంటున్నాం. మరి ఈ లెక్కతో సూర్యుని వెలుతురుకు, చంద్రుని చల్లదనానికి, వాయుగాలికి, మనమెంత డబ్బు చెల్లిస్తే సరిపోతుంది? ఇలా విచారిస్తూ పోతే చాలా ఉంది, కాని గ్రహించాల్సింది ఒక్కటే! ఆ దేవుడి నుండి ఋణవిముక్తి యగుటకు 'దైవారాధనలే' శరణ్యం.

దైవారాధన చేయుటకు ఆస్తికత కావాలి. ముందు దేవుడున్నాడని నమ్మకం బలంగా ఉండాలి. నాస్తికత్వం కూడదు.

**శ్లో॥ సందిగ్ధేతు పరేలోకే హితమేవా చ రేద్బుధః ।**
**నాస్తిచేన్నాస్తినో హాని రస్తిచే న్నాస్తికోహతః ॥**

ఆస్తికులైనచో హానిలేదు, కాని నాస్తికులైనచో హతమగుట తప్ప మరి వేరే గత్యంతరంలేదు. పరలోకం ఉందా? లేదా? అని సందిగ్ధం వచ్చినపుడు విజ్ఞులైనవారు ఉన్నదనియే విహితకృత్యాలను నిర్వర్తిస్తారు. ఒకప్పుడు లేక పోయినచో ఉన్నదనుకునేవారికి జరిగే నష్టం ఏమిలేదు. కాని లేదనుకుని విహితకర్మలు చేయని పాపాన నష్టమవుతారు. చివరకు లేదనుకొనినవారు ఏమి చేసిన ఏమి ప్రయోజనం?

భగవంతుడున్నాడు, పరలోకముంది, పుణ్యపాపాలున్నాయి, పూర్వజన్మ, పునర్జన్మలున్నాయని భావించువారి ప్రవర్తన వల్ల లోకంలో హానిలేదు. మీదుమిక్కిలి

లోకోపకారమే అవుతుంది. ఇట్టివారు నీతినియమాలకు కట్టుబడియుంటారు, ఇతరులకు హాని తలపెట్టరు, పైగా చేతనైతే సహాయం చేస్తారు, మంచివారనిపించుటకు ప్రయత్నిస్తారు, పాపభీతి వలన చెడు పనులు చేయరు.

మరి నాస్తికులన్నచో పాపభీతి యుండదు, పుణ్యకాంక్ష లేక స్వేచ్ఛగా ప్రవర్తిస్తారు. ఇతరులకు హాని చేయుటలో వెనుకాడరు. ఒకరికి భయపడరు. లోకాన్ని భయపెట్ట ప్రయత్నిస్తారు. కనుక నాస్తికతను వదలి ఆస్తిక్యంగా ప్రవర్తించినచో ఇహపర సౌఖ్యాలుంటాయి. సమాజశ్రేయస్సు లభిస్తుంది. విశ్వశాంతి కలుగుతుంది.

ప్రతి ప్రాణియు కోరుకొనే కోరికలు రెండే రెండు. ఒకటి సుఖం కావాలి. రెండవది దుఃఖం వద్దు. ఈవిధంగా కోరుకొనుచున్నారేగాని, కోరికలు నెరవేరుటకు కావలసిన ప్రయత్నాలు మాత్రం ఇందుకు భిన్నంగా ఉండటం ఆశ్చర్యం. తద్వారా ఫలితాలు సక్రమంగా ఎలా ఉంటాయి?

**శ్లో॥ పుణ్యస్య ఫల మిచ్ఛంతి, పుణ్యం నేచ్ఛంతి మానవాః ।**
**న పాప ఫల మిచ్ఛంతి, పాపం కుర్వంతి యత్నతః ॥**

పుణ్యఫలమేమో కావాలి, కాని పుణ్యకర్మలు చేయం. పాపఫలం వద్దు కాని ప్రయత్నపూర్వకంగా పాపాలే చేస్తున్నాం. ఇదీ మానవ సహజమై యుంది. ఎవరైనను మంచినే కోరుకోవాలి కాని, మంచి పనులు చేయాలి కదా! పుణ్యకర్మలు చేసినచో సుఖం తప్పక లభిస్తుంది. కావున మానవుడెప్పుడు పుణ్యకర్మలు చేయుట చాలా కష్టసాధ్యం. పాపకర్మలకు ప్రయత్నమే అవసరంలేదు. మనకు తెలియకుండగానే పాపకర్మ చేయవలసివస్తుంది. నిత్యకృత్యాలలో మనం చేయు వృత్తిరీత్యా పాపసంపాదనకే ఎక్కువ అవకాశం గలదు. కావున అట్టి పాపకృత్యాలకు అవకాశమీయకుండా జాగ్రత్త పడాలి. మోక్షం లభించాలన్న జ్ఞానం ఉదయించాలి. పాపక్షయం అయితే గాని జ్ఞానం ఉదయించదు.

**శ్లో॥ యేషాం త్వతగతం పాపం జనానాం పుణ్యకర్మణాం ।**
**తేద్వందమోహ నిర్ముక్తాః భజంతే మాం దృఢవ్రతాః ॥**

పాపం ఏమీ లేకుండా ఉండాలి. పుణ్యం అధికంగా కావాలి. అప్పుడే భగవత్సేవాసక్తి కలుగుతుంది. తద్వారా 'దేవతార్చనం' చేయాలి. అనగా దేవతార్చనం చేయుటయందు ఆసక్తి కలగవలెనని పాపకర్మలు చేయకుండా ఉండాలన్నది సారాంశం.

**తేషాం సతతయుక్తానాం భజతాం ప్రీతి పూర్వకం ।**
**దదామి బుద్ధియోగంతం యేన మా ముపయాంతితే ॥**

ఎవరైతే పైన చెప్పినట్లు పాపకర్మలు చేయకుండా ఉంటారో వారికి తన్ను పొందగల ఉపాయాన్ని తానుగా తెలిపెదనని చెప్పుచున్నాడు. కనుక మానవజన్మ మెత్తినందులకు మానవత్వం నుండి దేవత్వం సాధించాలి.

ఆస్తికులు సాధకులుగా మారాలి. ఇలా సాధించుటకు కూడా వారు వారు చేసుకొనిన కర్మనుబట్టియే యుంటుంది.

**'వ్రజ త్యధః ప్రయాత్యచ్చైర్నరస్స్వైనైవ కర్మణా ।'**

ఉన్నత స్థితిని చేరుటకు గాని, అధోగతినొందుకు గాని తానొనరించు కర్మమే ఆధారం కాని వేరే కారణం లేదు. ఇందుకు ఒక ఉదాహరణ.

**'అధః కూపస్య ఖనకః ఉచ్చైః ప్రాసాద కారకః'** ఒకడు బావి త్రవ్వుచున్నాడు. మరియొకడు మేడ కట్టుచున్నాడు, ఇది సహజం. అయినంత మాత్రాన బావి త్రవ్వువాడు అధోగతి పాలగుటకుకాని, మేడ కట్టువాడు ఉన్నత స్థితినొందుటకు గాని కారణమెవరు? వారు వారు చేయుచున్న కర్మలేకదా! కావున ఎవరైనను ఈ జన్మలో అధోగతి పాలుగాకుండా, తన్నుతాను ఉద్ధరించు కొనుటకు ప్రయత్నించాలి.

**ఉద్ధరేదాత్మనాఽఽత్మానాం ఆత్మాన మవ సాదయేత్।** అని గీత బోధిస్తుంది.

మానవులు తమ తమ శుభాశుభకర్మల యొక్క ఫలితం తప్పక పొందుతారు. శుభకర్మల యొక్క పుణ్యఫలితం నుండి మనుషులు ఈ లోకంలోనే సుఖం, ఆరోగ్యం, ధనం, వైభవంతోపాటు సకలసంపదలు పొందుతారు. కోరిన కోరికలు సిద్ధిస్తాయి. పూర్వజన్మ శుభకర్మల ఫలితం కూడా మనలను రక్షిస్తుంది.

శ్లో॥ వనేరణే శత్రు జలాగ్ని మధ్యే మహార్ణవే పర్వత మస్తకేవా ।
సుప్తం ప్రమత్తం విషమస్థితం వా రక్షంతి పుణ్యాని పురాకృతాని ॥

దట్టమైన అడవియందు, భయంకరమైన యుద్ధమందు, భీకరమైన శత్రువులనుండి, ఘోరమైన సముద్రమందు, ప్రమాదమైన అగ్నిజ్వాలల మధ్యలో, నిండా మునిగియుండు నీటిలో, ఎత్తైన కొండ కొనయందు, బాగుగా నిద్రించినవానిని, శరీరం తెలియని మత్తులో నున్నవానిని, విషమస్థితిలో ఉన్నవానిని, గతజన్మలో చేసుకున్న పుణ్యఫల విశేషాలు రక్షిస్తాయి. ఘోరమైన ప్రమాదాలనుండి సురక్షితంగా బయటపడతారు.

యజ్ఞం, దానం, తపం మొదలగు వివిధ పుణ్యకర్మలలో 'దేవతార్చనం' అన్నింటికంటే సులభమైంది. మహత్త్వపూర్ణమైంది. ఏ మనుష్యుడు తన నిత్యజీవితంలో జరిగే అనే సంఘర్షణలనుండి, భయంకరమైన వ్యాధులనుండి, వివిధ విఘ్నబాధలనుండి, కఠినాలైన విషమ సంకటాలనుండి, ఇంకా అనేకానేక జటిల సమస్యలకు ఏవిధమైన లౌకిక ఉపాయాలు తెలియక సతమతమై దిక్కుతోచని పరిస్థితి ఏర్పడినప్పుడు చేయవలసింది ఒక్కటియే నిశ్చల హృదయంతో, సత్యనిష్ఠతో, పరమాత్ముని ప్రార్థన చేయుచూ, తన ఆరాధ్యదైవాన్ని ఉపాసించాలి.

యథాశక్తి పరిశుద్ధమైన తను, మనములతో, పూర్ణభక్తిభావంతో దైవారాధనం చేయునో అతనికి తప్పక ఫలితం లభిస్తుంది.

దేవతార్చనం మానవులకు అవశ్య కర్తవ్యం. మనస్సు ఎల్లప్పుడూ దేవుని పాదారవిందములందే యుండాలి. నాలుకపై నిరంతరం భగవన్నామ స్మరణ జరగాలి. కనులు మన ఇష్టమూర్తిని అవకాశం దొరికినప్పుడల్లా దర్శించాలి. చేతులు దేవమందిర శుభ్రతకు, పూజ చేయుటకు ఉపయోగించాలి. చెవులు హరికథాశ్రవణాన్నే చేయాలి. ముక్కు దేవునిపై అర్చించిన తులసీసుగంధాన్నే ఆఘ్రాణించాలి. కాళ్లు దైవదర్శనార్థం వెళ్లుటకు, దేవుని ప్రదక్షిణకు యత్నించాలి. మనకున్న పాండిత్యాన్ని దైవకృతులందు వినియోగించాలి. ఇవన్నీ జరిగినపుడే మానవజన్మ సార్థకమవుతుంది. ప్రియురాలు భర్తను, తల్లి శిశువును, పుత్రుడు తండ్రిని, శిష్యుడాచార్యుని, మిత్రుడు మిత్రునిపట్ల పరిపూర్ణమైన ప్రేమతో

ఎట్లు మెలగుదురో అదేవిధంగా దేవుని అనన్యభక్తితో అర్చించాలి. ఈవిధంగా నిరంతరం మనం చేయలేనిచో కనీసం ప్రతిరోజు దేవుని విగ్రహాన్ని లేదా ఫోటోలకు పూజించుట చేయవచ్చుగదా! ఇంతటి సులభోపాయం మరేది లేదు. దీనివలన క్రమక్రమేణా భగవదనుగ్రహం కలిగి, సంసార సాగరం నుండి తరిస్తాం.

పెద్ద పెద్ద అధికారులు, పాలకులు మన ప్రాంతానికి వచ్చినపుడు, అక్కడికి ప్రజలందరూ వచ్చి చేరతారు. ఆ ప్రాంతాన్నంతా అందంగా అలంకరిస్తారు. భయభక్తులు కలిగి ఉంటారు. ఇది మనం సహజంగా చూస్తున్న విషయమే. ఎందుకీవిధంగా చేస్తున్నారు? వారి ప్రేమను పొందడానికి, వారికి కృతజ్ఞతలు తెలపడానికే కదా! అలాగే ఈ అఖండ బ్రహ్మాండానికి అధినేత, మనకు సర్వమూ తానేయైన భగవంతుడే మన వద్దకు వచ్చుచున్నాడన్నపుడు మనమేవిధంగా ఉండాలో ఆలోచించాలి. మన పెద్దల చిత్రపటాలకు నమస్కరించాలి. పూజించాలి. దేవదేవుని విగ్రహం లేదా చిత్రపటాన్ని అంతగా, ఇంకా ఎక్కువగా పూజించాలి. అది మన ధర్మం. ప్రహ్లాదుడు దేవపూజా విషయంలో అనుసరించవలసిన పద్ధతులను స్పష్టంగా తెలియజేశాడు.

**శ్లో॥ శ్రవణం కీర్తనం విష్ణోఃస్మరణం పాదసేవనమ్ ।**
**అర్చనం వందనం దాస్యం సఖ్యమాత్మ నివేదనమ్ ॥**

వీనినే 'నవవిధ భక్తి' అన్నారు. అనగా తొమ్మిది విధాలైన దైవసేవలు. అవి వరుసగా 1) శ్రవణం = భగవత్కథలు వినుట 2) కీర్తనం = భగవంతుని గుణలీలలను కీర్తించుట 3) విష్ణోః స్మరణం = భగవంతుని నామరూపాలను జ్ఞప్తియందుంచుకొనుట 4) పాదసేవనం = దేవుని భక్తిశ్రద్ధలతో సేవించుట 5) అర్చనం = విగ్రహాది మూర్తులను శ్రద్ధగా పూజించుట 6) వందనం = పదేపదే దేవదేవుని నమస్కరించుట 7) దాస్యం = దేవమందిరాలలో పరిచర్యలు చేయుట 8) సఖ్యం = సర్వజనులపట్ల దైవభావంతో స్నేహంగా మెలగుట 9) ఆత్మనివేదనం = సకలకార్యాలను దేవునికి సమర్పించుట.

ఈ తొమ్మిదింటిలో 'అర్చనం' చాలా సన్నిహిత సంబంధం కలిగివుండటమేగాక, ఒక్క అర్చనం ద్వారా మిగిలిన ఎనిమిది సేవలు జరుగుతాయి. అందుకే దేవతార్చనానికి మిక్కిలి ప్రాధాన్యత ఏర్పడింది.

శ్లో॥ యో మోహా దథవాలస్యా దకృత్వా దేవపూజనమ్ ।
భుంక్తే సయాతి నరకాన్ సూకరేష్వభిజాయతే ॥

అనగా ఎవరైతే తెలియకగాని, సోమరితనంచేతగాని దేవపూజ చేయక భుజిస్తారో, అట్టివారు నరకం పాలై తిరిగి పశుయోనిలో జన్మిస్తారని శ్రీవ్యాసమహర్షి తెలిపాడు. దేవపూజకు అంతటి మహిమ వుంది.

శ్లో॥ గృహం శ్మశానం తవబింబ వర్జితం, కథావిహీనశ్చ గిరిశ్శివారుతమ్ ।
శ్వపుచ్ఛవద్దాస్య వినాకృతం వపు, ర్వదంతి హిత్వయ్య నివేదితం విషమ్ ॥

(శ్రీమద్భాగవతం)

"స్వామీ! నీ యొక్క బింబం లేని ఇల్లు శ్మశానం. నీ కథలు లేని వట్టి మాటలు నక్కల ఈలలు. నీ సేవ చేయని శరీరం కుక్కతోక వంటిది. నీకు నివేదింపని అన్నం విషమని పెద్దలు చెపుతారు. "దేవపూజ"లో ఇవన్నీ చక్కగా జరుగుతాయి. అనగా మూర్తిని బింబరూపంలో స్థాపించాలి. మంత్రాలు, కీర్తనలతో దేవుని భక్తితో స్తుతించాలి. దేవమందిర పరిశుభ్రం కొరకు సేవ చేయాలి. దేవునికి నివేదించిన పదార్థమే ప్రసాదంగా తీసుకోవాలి."

భగవంతుని ఆరాధించని గ్రామమందు, గృహమందు ఒక్క క్షణమైనను యుండరాదు. భోజనం చేయరాదు. నీరు కూడా త్రాగరాదని శాస్త్రం సెలవిచ్చింది. అనగా దేవతార్చన చేయకుండా భుజింపకూడదని స్పష్టమైంది. గీతలో "ఎవరు భగవంతునికి నివేదింపక భోజనం చేయుదురో వారు దొంగ"లని చెప్పబడింది.

దేహానికి ఆత్మాలయమైన హృదయమెట్టిదో, గృహానికి పూజామందిరం, గ్రామానికి దేవాలయమూ అట్టిదే. జీవం లేని దేహం, పూజామందిరం లేని గృహం, దేవాలయంలేని గ్రామం సమానమే.

### సాకార - నిరాకార తత్త్వం

దేవపూజా విషయంలో సామాన్యులమైన మనకు కొన్ని సందేహాలుండుట సహజం. దేవుడు నిర్గుణుడు, నిరాకారుడు అని కొందరంటారు. మరికొందరు సగుణుడు, సాకారుడు అంటారు. ఇందులో ఏది నిజం? నిరాకారుడైనచో మనం పూజించు విగ్రహం లేదా ఫోటోలు వ్యర్థమవుతాయి కదా! అనేది ప్రధాన సందేహం. మానవుని పూజింప సాధ్యమగునుగాని, సర్వవ్యాపియగు పరమేశ్వరుని

ఎలా పూజించాలి? అంతటి దేవుడు ఈ శిలావిగ్రహంలో ఉండుట ఎలా సాధ్యం? ఒకవేళ ఉండెననుకున్నా, మనకులాగా ఆ దేవదేవునికి ఆకలిదప్పికలెలా వున్నాయి? ఆకలి దప్పికలున్నాయనుకుందాం. ఆయన ఆకలి తీర్చుటకు మనం పెట్టే నైవేద్యం సరిపోతుందా? అంతటి శక్తి మనకుందా? ఆయనకేది రూపం? ఏది పేరు?

ఇలాంటి సందేహాలన్నింటినీ నివారించుటకే మహాత్ముల బోధలు, సద్గ్రంథాలున్నాయి. ఆగమశాస్త్రం యొక్క ప్రయత్నం కూడా పై సందేహాల నివారణయే. నిరాకార, నిర్గుణ పరమాత్మనే సగుణ, సాకార రూపాలను కలిగియుంది.

ప్రపంచాన అధర్మం తాండవించినపుడు, సాధువులను రక్షించుటకు, దుర్మార్గులను నాశనం చేయుటకు, ధర్మసంస్థాపనార్థం, తన నిజస్వరూప దర్శనకాంక్షులైన వారి నిమిత్తం, భక్తుల యెడల వాత్సల్యం చేత నిరాకారుడైన భగవంతుడు సాకారుడుగా అవతరిస్తున్నాడు. రామకృష్ణాది అవతారాలన్నియు ఇలాగే ఏర్పడినాయి. ఈ అవతార దర్శనం ఆ కాలంలోని ప్రజలకు మాత్రమే. ఇతర కాలంలోని వారికి దర్శనమిచ్చుటకై భగవంతుడు ప్రతి జీవిలో అంతర్యామిగా తేజోరూపంలో ప్రకాశిస్తున్నాడు. మనస్సు నిశ్చలంగా చేసుకొని, ధ్యానించు యోగులకు మాత్రమే ఇది గోచరిస్తుంది. ఈ రెండు విధాల భగవంతుని దర్శించలేని వారి కొరకు, అన్నివేళల దర్శనమిచ్చుటకుగాను భగవంతుడు అనేక రూపాలతో, అనేక ప్రదేశాలందు అర్చారూపంలో వెలసినాడు. దేవాలయాల్లో ప్రతిష్ఠించిన విగ్రహాలు, గృహాల్లో స్థాపించిన ప్రతిమలు, పటాలు అన్నింటి రూపంలో భగవంతుడున్నాడు. కనుక దేవతార్చనా రూపంలో ఇవి అన్నియూ సేవింపదగినవే. భగవానుడు భక్తవత్సలుడు. తనను అనన్యభక్తితో సేవించినవారిని రక్షిస్తాడు.

ఆత్మస్వరూపంలో నున్న పరమాత్మను సేవించువారిని, బింబరూపంలోనున్న భగవానుని పూజించువారిని దైవం సమానంగానే కాపాడుతాడు. భగవానుడు సర్వసముడు. యోగికి భగవంతుడు హృదయమందు గోచరిస్తాడు. భక్తునకు బాహ్యమందు గోచరిస్తాడు. ఈ స్వల్పభేదమేగాని, ఇందులో సందేహమే లేదు.

నిరాకారుడైన భగవానునకు భక్తులు ఆకారం కల్పించుట దోషం కాదు. అజ్ఞానం. భగవానుడు సాకారుడే అని గాని, నిరాకారుడే అని గాని నిర్ణయించలేం. ఆయన సాకారుడూ, నిరాకారుడూ రెండవుతాడు. సముద్రం నీరు, మంచుగడ్డ రెండును ఒకటే. భక్తుల భక్తియే ఆయనను సాకారుణ్ణి చేసింది. భగవంతుణ్ణి ఆకారరూపంలో సేవించుట దోషమని తలంచిన ఆయన సర్వశక్తిమత్త్వాన్ని నిరాకరించిన వారమవుతాం. సర్వవ్యాపియైన పరమాత్మ విగ్రహరూపంలోనూ ఉంటాడు. నామ, రూప, గుణాదులన్నియూ పరమాత్మ స్వరూపమే.

మానవుని పరమలక్ష్యమైన మోక్షసాధనకు రెండు మార్గాలున్నవి. ఇందులో నిర్గుణోపాసనం కంటే సగుణోపాసనమే సకలజనులకు సులభసాధనం. శీఘ్రఫలప్రదం. అన్ని పదార్థాల్లో అగ్ని ఉండుట వాస్తవమే అయిననూ కంటికి కనిపించు మంట లేకుండా, బండెడు కట్టెలైననూ అన్నం వండలేవు గదా! అదేవిధంగా హరిమయంగాని పదార్థం అణువైనను లేదనుమాట సత్యమే. కాని నిరాకారుడు, నిర్గుణుడైన భగవంతుని ఉపాసించుట కఠినమైన విషయం.

దేవుడు మనుష్యునివలె యుండునా? అని విచారించినపుడు నాలుగు వేర్వేరు రూపాలు కలిగిన పాత్రలను నీటిలో ముంచినచో వానియందలి నీరు ఆయా ఆకారాలనే కలిగియుంటాయి. కాని వేరే ఆకారాలు పొందవు. కావున మనం ఏ ఆకారంలో నున్నామో, మనమేవిధంగా ఇతర మన ఆకారంలోని వారిని చూస్తున్నామో, సేవిస్తున్నామో అలాగే దేవుని కూడా మానవాకారంలోనే సేవించుట, పూజించుట సులభంగా వుంటుంది. మనకు తెలియని రూపాన్ని మనం ఊహించలేం. మనశక్తి కేవలం భగవంతుని అవతారమూర్తులను సేవించుటకే సరిపోతుంది.

ఏనాడో అవతరించిన రామకృష్ణాదులు నేడు మనలనెలా రక్షిస్తారు? అనే సందేహం అక్కర్లేదు. వారి రూపాలు మన కన్నులకు ప్రస్తుతం గోచరం కాకపోవచ్చును కాని, వారి తేజస్సు సర్వాంతర్యామిగా నుంది కదా! భగవానుడు త్రికాలసత్యుడు. సాధారణ మానవులుగా నుండి మరణించిన మహాత్ములే తమ శిష్యులకు స్వప్నంలో దర్శనమిచ్చి, యోగక్షేమాలు తెలుసుకొనుచుండగా సాక్షాత్ భగవదవతారమూర్తుల విషయం వేరే చెప్పనేల?

ప్రస్తుత కాలాన అవతార పురుషులు లేరు. కావున వారి రూపాలను శాస్త్రాలు చెబుతున్నాయి. ఆ ప్రకారం వారికి ఆకారం కల్పించి, దేవతలు మంత్రాధీనులైనందున ఆగమశాస్త్ర ప్రాణప్రతిష్ఠాది కార్యాలు చేసి, భక్తిశ్రద్ధలతో అర్చించాలి.

**విగ్రహారాధన రహస్యం**

భగవద్భావం కలిగియుండి భక్తితో పూజింపబడు ఏ వస్తువైనను భగవంతుని తేజస్సు పొందుతుంది. భక్తుల కోరికలు నెరవేర్చుతుంది. భగవంతుని తేజస్సు మంత్రబలంచేత, యంత్రబలంచేత వృద్ధియవుతుంది. శాస్త్రప్రకారం నిత్యపూజలో చేయు ధూపదీప నైవేద్యాదులు ఆ తేజస్సును సురక్షితంగా కాపాడుతాయి. భక్తుల కోరికలు సిద్ధింపజేయు శక్తి కలిగియుంటాయి. ఇవి మానవులచే ప్రతిష్ఠించబడిన విగ్రహాల విషయం. ఇక స్వయంభూమూర్తులు అనగా దైవికంగా వెలసిన దేవాలయాలకు, విగ్రహాలకు మహత్తరశక్తి యుంటుంది.

దేవుడు కేవలం దేవాలయానికే పరిమితమవుతాడనుకొనుట పొరపాటు. ఎక్కడ దైవశక్తి జాగృతమగునో అక్కడ పవిత్రం, భగవత్సాక్షాత్కారం కలుగుతుంది. భక్తులయొక్క అర్చనల ప్రభావంచే దేవతామూర్తియందు అద్భుత తేజస్సు వృద్ధి చెందుతుంది. ఆ తేజస్సు మనలందరినీ రక్షిస్తుంది. కోరిన కోరికలను సిద్ధింపజేస్తుంది. అదియే దేవాలయమవుతుంది.

ఒకరి తండ్రి యొక్క చిత్రపటం చూపి ఇది ఎవరు? అని అడిగినచో, ఇది కాగితం అని అతడనడు. ఇది 'నా తండ్రి' అని అంటాడు. దానిని మనం నిరాకరించిన యెడల తన తండ్రినే నిరాకరించినటుల భావిస్తాడు. అలాగే కృష్ణలీలల యొక్కచిత్రపటాలు చూసినపుడు అదిగో! చూడు! ఆ కృష్ణుడెలా వెన్న దొంగిలిస్తున్నాడో? అని అనుకుంటాంగాని వేరే భావం రాదు కదా!

భగవద్విగ్రహాలను, దేవప్రతిమలను చూసినపుడు ఆయన శక్తి, తేజం, లీలలు స్మరణకు వస్తాయిగాని, అది రాయియా? లోహమా? కర్రయా? అనే ఆలోచనలెవరికి కలుగుతాయి? దేవతామూర్తులన్నియు భగవద్భావంతో పూజింపబడతాయిగాని, జడవస్తువులగా కాదు. మామూలుగా రాళ్ళనే, కొయ్యలనే

పూజించాలనుకుంటే భూమిపై వేరే ఎన్ని రాళ్లు లేవు? మనం పూజించు పదార్థమందు ఆ దేవదేవుని భావిస్తాం.

దేవతీర్థమందు, మంత్రమందు, ఔషధమందు, ఎవరికి ఎట్టి భావం ఉంటుందో వారికి అట్టి ఫలమే కలుగుతుంది. రాయి, కర్ర అనుకొను వారికి అవియే లభిస్తాయి. దైవభావన చేయువారికి దైవానుగ్రహమే లభిస్తుంది. మహాత్ముల చరిత్రలలో దేవాలయ విగ్రహాలు సజీవాలై కదలినట్లుగా, మాట్లాడినట్లుగా తెలుస్తుంది.

కనులకు కన్పించు విగ్రహాలు, చిత్రపటాలు మొదలైనవి సులభమోక్ష సాధనకు సహాయకారులు. కన్పించే విగ్రహమందు క్షణమైనను మనస్సు నిలపలేనివారు, సంపూర్ణ మానసిక ధ్యానయోగంచేత భగవంతుని పొందుట కష్టసాధ్యం. విగ్రహారాధనలో తమ శక్తి, కార్యసాధనాలోచించియే చేస్తున్నారు. మనకు గల ఏకాదశేయింద్రియాలలోని ఒక మనస్సు చేయు పూజ శ్రేష్ఠమై, మిగతా ఇంద్రియాలైన కనులు, చెవులు, నోరు, చేతులు, కాళ్లతో చేయు సేవ నీచమెట్లగును?

**శ్లో॥ పత్రం పుష్పం ఫలం తోయం యోమే భక్త్యా ప్రయచ్ఛతి ॥**

అను గీతాచార్యులైన శ్రీకృష్ణభగవానుని వాక్యం విగ్రహారాధనకు గాక మరి దేనికి సంబంధించింది? విగ్రహారాధన వ్యర్థమయ్యేనేని శ్రీశంకర, రామానుజ, మధ్వాచార్యులెందుకు దానిని బోధిస్తారు? శ్రీరామకృష్ణ పరమహంస కాళీ విగ్రహాన్ని పూజించియే గదా తరించాడు. శ్రీచైతన్యులవారు నిరంతరం కృష్ణనామస్మరణం, కృష్ణసేవ చేసియే జీవితం ధన్యమొనర్చెను. మహాయోగి భర్తృహరి కూడా చివరి వరకు విగ్రహారాధననే సూచించి, ఆచరించాడు. ఇంతెందుకు? భక్తి మార్గాన్నవలంబించిన వారందరూ విగ్రహారాధనను గావించి ఇష్టసిద్ధిని పొందారు. పరమయోగులైనను విగ్రహారాధనను నిషిద్ధం చేయలేదు. సామాన్యులందరకు బాహ్యపూజ అనగా విగ్రహారాధన అత్యంతావశ్యకం. ప్రతిరోజు దేవతార్చన చేయువారికి కాలక్రమేణా సర్వాంతర్యామి సాక్షాత్కరిస్తాడు.

**దేవపూజా విధానం**

బాహ్యపూజ, మానసికపూజ అని దేవతార్చనం రెండు విధాలు. ఈ రెండు విధాలుగా నిత్యం ఆచరించుట శ్రేష్ఠం. దైవ సాక్షాత్కారమైన పిదప బాహ్యపూజ చేయకున్నను దోషం లేదు. కాని అప్పటివరకు చేయకుండిన ప్రత్యవాయం కలదు.

శ్రీమద్భాగవతంలో ప్రహ్లాదుడంటాడు –

**"ఇందు గల డందు లేదని**
**సందేహము వలదు చక్రి సర్వోపగతుం**
**డెందెందు వెదకి చూచిన**
**నందందే కలడు దానవాగ్రణి! వింటే"**

అనగా భగవంతుడు సర్వాంతర్యామియై అంతటను నిండియున్నాడు. కాని మనం వెదకి చూడాలి. వెదకి చూచినవారికి తప్పక సాకారుడై సాక్షాత్కరిస్తాడు. వెదకుట ప్రారంభించాలంటే ముందుగా విగ్రహాన్నో, చిత్రపటాన్నో ఆశ్రయించాలి. వానికి తగు భక్తిశ్రద్ధలతో శక్తివంచన లేకుండా పూజించాలి. ఆనాడు ప్రహ్లాదునకు స్తంభం నందు నరసింహమూర్తిగా దర్శనమిచ్చినట్లు మనకు భగవంతుడు కాలక్రమేన దర్శనమిస్తాడు.

తత్త్వవాక్యాలను పరిశీలించినా –

**"అణోరణీయాన్, మహతో మహీయాన్"**

**"ఈశావాస్యమిదం జగత్ వాసుదేవ సర్వమితి"** అని చెప్పబడ్డాయి.

ప్రపంచమంతయూ భగవన్మయమే. ఆయన లేని ప్రదేశం లేదు. అణువునుండి బ్రహ్మాండం వరకు ఆయన రూపమే.

మానవులకు వలె భగవంతునకు నిర్ణయాకారం లేదు. ఆయన ఏ ఆకారాన్నయిననూ ధరించవచ్చు. ఒకే సమయాన అనేకచోట్ల, అనేక రూపాలతో నుండగలడు. శ్రీకృష్ణభగవానుడు స్వయంగా గోవులుగా, దూడలుగా, గోపాలుడుగానైనాడు. ఒక్కొక్క గోపికకు ఒక్కొక్క కృష్ణునిగా నుండిన 'రాసలీల'

మనకు ప్రత్యక్ష నిదర్శనం. భగవంతుడు ఆయా కాలానికి తగినట్లుగా దశావతారాలెత్తాడు. దశావతారాలేగాదు, తన అపార కరుణవలన మన రక్షణకొరకు కోట్లకొలది అవతారాలెత్తుతునే యున్నాడు. ఎన్నో రూపాలుగా ఆయన దర్శనమిచ్చాడు. బాలుడుగా, స్త్రీగా, ముదుసలివాడుగా భగవంతుడు భక్తులకు దర్శనమిచ్చాడు.

భక్త రామదాసుకు మహిషంగా కనిపించాడు. కబీర్‌దాస్‌నకు కుక్కగా దర్శనమిచ్చాడు. ఈ కాలంలో కూడా నిజమైన భక్తులకు ఇట్టి దర్శనాలుంటాయి. కనుక ఆ భగవంతుణ్ణి ఏ ఆకారంలోనైనను, ఏ మూర్తిగానైనా పూజించవచ్చు. భగవానునికి కావలసింది భక్తిగాని మరి ఏదీ అవసరంలేదు. భగవంతునిపై అచంచల విశ్వాసం, పరిపూర్ణమైన ప్రేమ కలిగియుంటే చాలు! మనకు ఫలం వెంటనే లభిస్తుంది. మట్టితో ద్రోణాచార్యుని విగ్రహం చేసి కొలిచిన ఏకలవ్యునికి, సాక్షాత్ ద్రోణాచార్యుణ్ణి సేవించిన అర్జునునికంటే ఎక్కువ ధనుర్విద్యా ప్రావీణ్యం కలిగింది. ప్రత్యక్షంగా శ్రీమన్నారాయణుడైన శ్రీకృష్ణునితో మాట్లాడుతూ, చూస్తూ దుర్యోధన దుశ్శాసనాదులు, ఆయనను మానవునిగను, ఇంద్రజాలకునిగ భావించినందునే వారికి అధోగతి కలిగింది. కనుక భావమే ప్రధానం.

**భక్తితత్త్వం**

"భావమే బలమన్నాడు భావానందుడు" శ్రీయతివర భావానందస్వామి వారు శ్రీపాండురంగాశ్రమంలో రుక్మిణీ పాండురంగ స్వామిని సేవించి తరించాడు. అనేకుల తరింపజేసారు. "భావాతీత ధ్యానాన్ని" యావత్ప్రపంచానికి విప్లవంలా ప్రచారం చేసి, అభ్యసింపచేసి తరింపచేసారు మహర్షి మహేష్‌యోగి. ఇలా ఎందరో మహానుభావులున్నారు. భగవంతుడెక్కడ ఉన్నాడను విశ్వాస మెవరికుండునో అక్కడ వారికి ప్రత్యక్షమవుతాడు. ఏ రూపంగా సేవించిన ఆ రూపం పొందుతాడు. మనమెంత పెద్దగా లేదా ఎంత చిన్నగా కావాలంటే అంతగానే ఉంటాడు. అయినను ఆయన సర్వశక్తులు గలవాడుగనే యుంటాడు. మన వీలుకొరకే ఆయన కరుణించి, దర్శనమిస్తాడు. కనుక భగవానుడు భావప్రియుడు.

ఒక ఇనుప వస్తువును నిప్పులో వేసిన అదియు నిప్పై మనలను కాల్చుతుంది. అదేమాదిరిగా ఒక విగ్రహంగాని, చిత్రపటంగాని మనం భక్తిభావంతో 'భగవంతుడు' అనే అగ్నిలో వేయుటవలన, ప్రాణప్రతిష్ఠాది వేదమంత్ర సంస్కారం వలన సాక్షాత్తూ భగవంతుడవుతాడు. మరి ఆ మూర్తి భక్తుల కోరికను తీర్చే శక్తిగలవిగా నుంటాయి. ఇనుప వస్తువు నిప్పైనట్లే, విగ్రహం దేవుడవుతాడు. కాని నిప్పు ఇనుప వస్తువు మాత్రమే కాలేదు. అందుకని భగవంతుడు విగ్రహం మాత్రమే కాలేడు. భగవానుడు సర్వస్వతంత్రుడు.

భగవంతుని సాకార స్వరూపునిగా సేవించుట మన సౌలభ్యం కొరకే. మూర్తి కనుల ముందుంటే మనస్సుకు ఏకాగ్రత కలుగుతుంది. భగవానుడు దగ్గరవుతాడు. భక్తి తీవ్రరూపం దాల్చుతుంది. భగవంతుడు సాకారుడైనను మన శరీరంలాగా ఆయన శరీరం అని తలచరాదు. ఆకలిదప్పుల వంటి ప్రకృతి గుణాలేవీ ఆయనకు లేవు. ఆకారం లేకుండా మన కొరకే ఆకారం ఉండెనో, ఆకలిదప్పులు లేకయు వానిని కలవాడగుచున్నాడు. మనమిచ్చెడు నైవేద్యాదులను స్వీకరిస్తున్నాడు. ఆయనకు కడుపు నిండుట మన భక్తిభావమే గాని పదార్థ పరిమాణం, విలువలు కాదు. హృదయాన్ని చూస్తాడుగాని ఆడంబరాన్ని చూడడు. ద్రౌపది చేతిలోని పాత్రయందలి ఒక్క మెతుకుతో ఆయన కడుపు నిండలేదా? కుచేలుని పిడికెడు అటుకులు తిని అనేక సందలివ్వలేదా! భగవంతునకు మన మెంత పెట్టినను తినగలడు, ఏది పెట్టినను స్వీకరించగలడు. భక్త కన్నప్ప మాంసం నివేదించాడు. పుక్కిటి నీటితో స్నానమాచరించాడు. కనుక ఎవరెవరికెంత శక్తియో, అంత శక్తివంచన లేకుండా ఆ దేవుని అనన్యభక్తిభావంతో సేవించాలి.

**సీ॥ అన్యభావన లేక ఆత్మయందునే నన్ను**
**ఎనలేని భక్తి ధ్యానించునెవడో,**
**సుతుల పేరుననైన సతుల రోషియునైన**
**'శ్రీరామ' యంచు నను జేరునెవడో,**
**పగబూని నాపైన పగలు రాత్రియు**

**తిట్టు లిడియైన నా పేరు లెన్నునెవడో,**

**భయము వేళయునైన పాహిమాం**

**శ్రీరామ యంచు మదిలోన నన్దల్చునెవడో,**

**గీ॥ అట్టి పరమాత్ముడడిగిన అవనినైన**

**తమ్ములునైన నాదు రాజ్యమ్ము!**

**నైన దివ్య భాగ్యములునైన దేహ**

**మైనను ఇత్తునో భాను తనయా ॥**

(ఈ పద్యాన్ని పూజ్యులు మా నాన్న కీ॥శే॥ శ్రీగౌరీభట్ల కృష్ణమూర్తిశర్మగారు ఎల్లప్పుడు దైవసంకీర్తనా కార్యక్రమంలో గద్గదస్వరంతో పఠించి, ఆనందించేవారు.)

ఈ పదంలో ఎంత భావం ఇమిడియుందో కదా! శ్రీరామచంద్రుడు సుగ్రీవునితో చెబుతున్న విషయమిది. శక్తి కలిగియుండియు, ఏదో 'పత్రం, పుష్పం, ఫలం, తోయం' అని సమర్పించిన భగవంతుడు తృప్తి చెందడు సరికదా! ఆగ్రహిస్తాడు. ఆయన సంపదనే ఆయనకిచ్చుటకు మనం సంకోచించుట ఎంత విచిత్రమో! మనమిచ్చు భోజనాదులను ఆయన తప్పక స్వీకరిస్తాడు. త్యాగరాజస్వామి 'పాలారగించవే' అనే కృతిని పాడుచుండ సాక్షాత్తూ శ్రీరామచంద్రమూర్తి స్వీకరించాడు. పండరిపురంలోని విఠోబాదేవుని భక్తుడైన తుకారామస్వామితో తన స్వరూపంగా విచ్చేసి, సహపంక్తి భోజనం చేశాడు. స్వామి భోజనాదులు గ్రహించునపుడు మనం చూడలేకున్నను, భక్తి వృద్ధియైన కొలది, ఆయన అనుగ్రహించిన కొలది నిజంగా ఆ భోజనం అదృశ్యమవుతుంది. ఇట్టి నిదర్శనాలనేకం కలవు.

ఒకరికి పొలం కలదు. అతను దానిని పంట పండింపుమని వేరొకరికి (కౌలుకు) ఇచ్చాడు. తీసుకున్నరైతు సాగుచేసి, పంట పండిన తర్వాత ముందుగా భూ యజమానికి కొంత భాగం సమర్పించి మిగిలింది తాననుభవిస్తాడు. ఇది లోకసహజం. పరమాత్మ దాసులమైన మనం ఆయన సంపదననుభవించునపుడు ముందుగా ఆ స్వామికి భక్తితో సమర్పించి, ఆయన అనుజ్ఞ పొంది, మనం ప్రసాదం స్వీకరించాలి.

**బాహ్యపూజా లాభాలు**

గృహమందుగల విగ్రహంలో, చిత్రపటంలో శ్రీస్వామివారు సర్వంగా వేంచేసియున్నారనుకొని, షోడశోపచారాలతో పూజించాలి. విగ్రహం, పటం అను భావనను రానివ్వకూడదు. అనగా మొదట భావం ప్రధానం. ప్రతిరోజు ఉదయమే లేచి, కాలకృత్య స్నానాదులు ముగించిన పిదప దేవమందిరంలోకి వెళ్లి, శ్రీస్వామివారిని మేల్కొలపాలి. భక్తిశ్రద్ధలతో పూజకు కావలసిన వస్తువులన్నియు సమకూర్చాలి. తోటలోకి వెళ్లి స్వామికొరకు స్వయంగా పూలు, తులసీ, బిల్వం కోయాలి. పూలను శ్రీస్వామివారి కొరకు మాలగా తయారుచేయాలి.

స్వామి పూజకుపక్రమించే ముందు ఇతర విషయాలపై ధ్యాస లేకుండా ప్రశాంతచిత్తుడుగ నుండాలి. పూజ తొందరగా పూర్తి చేయాలని అనుకోరాదు. సాధారణంగా మన పెద్దలందు ఎంత భయభక్తులు ప్రదర్శించెదమో, అంతకంటే కోటిరెట్లధికంగా నుండాలి. త్రిలోక సార్వభౌముడు, జగన్నాథుడు, పరమగురువు, శ్రీపరమాత్ముడైన యెడల మిక్కిలి భక్తివినయాలు, సాత్త్వికశ్రద్ధ చూపించాలి.

విగ్రహరూపంలోనున్న స్వామికి అభిషేకించు సమయాన స్వయంగా ఆ స్వామి స్నానమాచరిస్తున్నాడని అనుకోవాలి. ఇదేవిధంగా మిగతా ఉపచారాలందున కూడా భావించాలి. పూజా సమయాన కేవలం కర్మకాండకే ప్రాధాన్యమివ్వకుండా భావమే ప్రధానం కావాలి. ఉదయం నిద్రలేపుట దగ్గర్నుండి, రాత్రి రుండువరకు సపర్యలు శ్రద్ధగా చేయాలి. వీటన్నింటికీ మంత్రాలు, శ్లోకాలు, స్తోత్రాలు, గేయాలున్నాయి. ఆ స్వామివారి గృహమందే మనమున్నామనే భావం కలగాలి. తీర్థప్రసాదాలను బహుజాగరూకులైగ్రహించాలి. మనం తీసికొను ప్రతి పదార్థాన్నీ, వస్తువును ముందుగా భగవంతునికి సమర్పించి, ఆ తర్వాతనే గ్రహించాలి. గృహంలో మనం స్వయంగా పూజాప్రక్రియలన్నియు చేయవచ్చు. దేవాలయాల్లో ఈ సేవలన్నీ అర్చకులద్వారా జరుగుతాయి.

అర్చకులు భగవంతునికీ, భక్తునికీ అనుసంధానం చేయువారుగా నుంటారు. సంపూర్ణ శరణాగతి భావాన్ని అలవరచుకోవాలి. మున్ముందు పూజాప్రక్రియ విషయాలన్నీ సవివరంగా తెలుసుకోవచ్చు. బాహ్యపూజ బాగుగా అభ్యాసం

అయితే, మానసిక పూజకు అర్హులవుతారు. దైవమందిరాలను పరిశుభ్రం చేయాలి. గర్భాలయానికి ప్రదక్షిణలు చేయాలి. దేవాలయానికి వెళ్లునపుడు ఖాళీ చేతులతో వెళ్లరాదు. వెంట పూలు, పండ్లు, టెంకాయలు యథాశక్తి తీసుకువెళ్లాలి.

స్వామికి జరుగు సేవలను కనులారా తిలకించాలి. తీర్థప్రసాదాలు గైకొనిన తర్వాత, మండపంలో కాసేపు కూర్చొని, స్వామికి జరిగిన సేవలను స్మరించాలి. దేవాలయావరణలో నిరంతరం భగవన్నామస్మరణ చేయాలి. ఎవరైనను ఉదయం కాలకృత్యస్నానాదులు పూర్తయిన పిదప సమీప దేవాలయాన్ని తప్పక దర్శించాలి. తిరిగి సాయంత్రం హారతి వేళల్లో స్వామిని సేవించి, నిద్రించాలి.

ప్రారంభదశలో ప్రతి వ్యక్తికి బాహ్యపూజ మిక్కిలి ఆవశ్యకం. క్రమరకమేణా చిత్తశుద్ధి కలుగుతుంది. మన పూర్వీకులేర్పరచిన ఈ సంస్కారం మనకు అద్భుత వరం. శ్రద్ధాభక్తులే ప్రధానం. ముందుగా ఆలయంలో భగవంతుడున్నాడనే విశ్వాసం దృఢంగా కలిగియుండాలి. తర్వాత అంతటా దైవమున్నాడనే విశ్వాసం దృఢమవుతుంది. విగ్రహరూపంలో నున్న పరమాత్మను సేవించగా, సేవించగా, ప్రతి వ్యక్తిని పరమాత్మ రూపంగా భావిస్తాం. తద్వారా అన్యోన్య అనుబంధం వృద్ధి అవుతుంది. పరస్పరం ద్వేషించుకోం. ప్రేమ, గౌరవభావాలేర్పడుతాయి. ఏకాత్మభావం నుండి సర్వాత్మభావం కలుగుతుంది. విశ్వశాంతికి దోహదమవుతుంది. పరమాత్మ స్వరూపమైన ఈ ప్రపంచం చాలా విచిత్రమైంది. రాగద్వేషాలు, కామక్రోధాది దుర్గుణాలు, స్వార్థచింతన, ధనకాంక్ష మున్నగునవి మనలను పీడిస్తాయి. ఇవన్నియు మనస్సుకు సంబంధించినవి. అందుకే చిత్త శుద్ధి అవసరం. చిత్తశుద్ధికి సులభమార్గం దేవపూజ. దేవపూజ వలన మానవులు సులభంగా, అతి శీఘ్రంగా ముక్తిమార్గం పొందుతారు.

దేవతార్చనా విధానం శాస్త్రంలో సవివరంగా పేర్కొనబడింది. అందరూ సులభంగా ఆచరించుటకు వీలుగా ఈ ప్రక్రియ నేర్పరిచారు. దేవపూజకు ముందుగా చేయవలసిన విషయాలు ప్రతి ఒక్కరూ తెలుసుకొనవలసిందే.

- దేవపూజా స్థలమును కడిగి, ముగ్గులు పెట్టి పరిశుభ్రంగా ఉంచాలి.
- పూజా పాత్రలన్నింటినీ శుభ్రంగా కడిగి, తుడవాలి.

* పూజలకు కావలసిన సామగ్రి నంతటినీ శుభ్రంగా చేసిన పాత్రలందుంచాలి.
* స్నానం చేసి శుచియై మడివస్త్రం ధరించాలి. మడివస్త్రం అనగా శుభ్రంగా ఉతికి ఆరవేసిన గుడ్డ అని అర్థం.
* దూదితో చేసిన వస్త్రాలు ఏ రోజుకారోజు ఉతికి ఆరవేసినవై యుండాలి.
* పట్టు, నార, సిల్కు వస్త్రాలు వాడుకొని, తిరిగి దాచియుంచి వాడవచ్చు.
* కంబళులు (తెల్లగొంగళి), ధావళి, శాలువలు ఎండలో వేసి, గట్టిగా దులిపి ధరించవచ్చును.
* తడి వస్త్రాలతో సంధ్యావందనాది దైవకార్యాలు చేయరాదు.
* తప్పనిసరియైనచో బాగుగా పిండి, నీరు లేకుండా చేసి, గాలిలో ఆరవేసినచో ఫరవాలేదు.
* పూజ చేయునపుడు నేలమీద గాని, కేవలం పీటమీదగాని కూర్చొనరాదు.
* నేలపై గాని, పీటపైగాని దర్భాసనమ, గొంగళియో తెలుపు వస్త్రమైనను వేయాలి.
* సంప్రదాయానుసారంగా ఎవరెవరి అనుకూలత ననుసరించి నుదుట తిలకం, భస్మం, నామం ధరించాలి.
* ఖాళీ నుదుటితో దేవపూజ చేయకూడదు.వసతి లేనపుడు నీటితోనైనను తిలకం దిద్దుకోవాలి.
* సంధ్యావందనం చేసిన తర్వాతే జపాదులు చేయాలి.
* అవసరాన్ననుసరించి దేవపూజ తర్వాత జపాదులు చేయవచ్చును.
* దీపారాధనకు ఆవునెయ్యి శ్రేష్ఠమైంది.
* ఆవునెయ్యి, బర్రె (గేదె) నెయ్యి, నువ్వులనూనె వరుసగా అనుకూలాన్ని అనుసరించి వాడవచ్చు.
* ప్రధాన దీపం వెలిగించునపుడు వేరొక దీపంతో వెలిగించాలి.
* అగ్గిపుల్లతో ప్రధాన దీపం వెలిగించరాదు.
* ఒకే వత్తిగాకుండా, 2 లేదా 3 వత్తులు వేయాలి.

* దేవపూజకు వాసనలేని పూలు, చెడు వాసన గలిగిన నల్లని పూలు, పనికిరాని ప్రదేశాలందు పూసినవి, పురుగులున్నవి, నేలరాలినవి, ఒకరు వాసన చూసినవి, ధరించినవి పనికిరావు.
* తులసీ ఆకులు ఆడవారు తెంపరాదు (కోయరాదు).
* తులసీ దళాలను తెంచుటకు ముందు ప్రార్థన, నమస్కారం చేసి తెంపాలి.
* దేవునికి సమర్పించు గంధాన్ని మడితోనే కలపాలి.
* ఒకసారి దేవునికి సమర్పించిన ధూపదీప నైవేద్యాదులు మరియొకసారి పనికిరావు.
* ఎవరైనను, ఏ జాతివారైనను స్త్రీలు, పురుషులు ముందుగా వారి వారి శక్త్యానుసారం దేవపూజ చేసిన తర్వాతనే భుజించాలి.
* మంత్రాలు చదువుటకు యోగ్యత లేనివారు శ్లోకాలు, స్తోత్రాలు పఠించి పూజించవచ్చు.
* తీర్థం నేలపై పడకుండా జాగ్రత్తగా తీసుకోవాలి.
* ప్రసాదాన్ని నిర్లక్ష్యం చేయరాదు. ప్రసాదం స్వీకరించుటకు అశ్రద్ధ పనికిరాదు.

**షోడశోపచార వివరాలు**

దేవతార్చనలో ప్రధానమైనవి షోడశోపచారాలు. ఇవి మొత్తం పదహారు విధానాలు. అందుకే షోడశోపచారాలన్నారు. ఒక్కొక్క ఉపచారం ఒక్కొక్క విశేషం కలిగియుంది.

**1. పాద్యం :** పద్మం, విష్ణుక్రాంత ఆకులు, గరిక, శ్యామాకం ఈ నాలుగు పాద్యద్రవ్యాలు, వీనిలో ఏవి లభించినను వానిని నీటిలో వేసి పాద్యం సమర్పించాలి.

**2. అర్ఘ్యం :** కుశలు (దర్భ), అక్షతలు, నువ్వులు, వడ్లు, యవలు, మినుములు, తెల్ల ఆవాలు మొదలగువానిలో లభించినవానిని శుద్ధమైన నీటిలో వేసిన అర్ఘ్యమీయాలి. నీరు, ఆవుపాలు, దర్భకొనలు, పెరుగు, నెయ్యి, బియ్యపు గింజలు, యవలు, తెల్ల ఆవాలు ఈ ఎనిమిదింటిని అర్ఘ్యాంగాలంటారు. గంధం, పుష్పం, అక్షతలు, యవలు, దర్భకొనలు, నువ్వులు, ఆవాలు, గరికపోచలు

సమస్త దేవతలకు అర్ఘ్యద్రవ్యాలు. శంఖంలో గంధపుష్పాక్షతలతో కూడిన నీటిని అర్ఘ్యమొసంగుట శ్రేష్ఠం.

**3. మధుపర్కం :** చెరకురసం, తేనె, నెయ్యి, పాలు, పెరుగు కలిపిన పదార్థాన్ని మధుపర్కమంటారు.

**4. ఆచమనీయం :** యాలకులు, లవంగాలు, వట్టివేళ్ళు, చలువ మిరియాలు కలిపిన నీటిని ఆచమనీయంగా సమర్పించాలి.

**5. స్నానద్రవ్యాలు :** ఆవుపాలు, పెరుగు, తేనె, నెయ్యి, పటికబెల్లం కలుపగా పంచామృత స్నానమవుతుంది. పుష్పతైలం, ఫలరసంతోను, యవల, గోధుమల యొక్క పిండితో నలుగుపెట్టి, గోరువెచ్చటి నీటితో అభ్యంగన స్నానం చేయించాలి. తులసీ దళాలతో కలిసిన నీరు జలస్నానమవుతుంది. అక్షత పుష్పాలతో కూడిన నీటిని శంఖంతో స్నానం చేయించిన శ్రేష్ఠం. శంఖంతో గంగోదకంతో స్నానమాచరించిన మహాపుణ్యం.

**6. వస్త్రం :** ఎలుకలు కొట్టింది, కాలింది, చిరిగింది, ఇతరులు ధరించింది, క్రిములచే దూషితమైంది, చిల్లులు పడింది, నాశనం చెందింది, దుష్కర్మ కుపయోగించింది, దేవతలచే ధరించబడింది. కుట్టబడింది. అన్యాయంగా లభించిన వస్త్రాలు దేవతాపూజకు, విగ్రహాలంకరణకు పనికిరావు.

**7. యజ్ఞోపవీతం :** తొమ్మిది పోగులుండి, తెలుపైన లేక పసుపు పచ్చని, పట్టు సూత్రాలతో నిర్మించిన యజ్ఞోపవీతం సమర్పించాలి.

**8. ఆభరణం :** బంగారం, వెండి, ఆభరణాలను ఎంత విశేషంగా అలంకరిస్తే అంతకు రెట్టింపు ద్రవ్యం మనకు లభిస్తుంది.

**9. గంధం :** చందనం, కుంకుమ పూవు, అగరు, కస్తూరి, జాజికాయ, జాపత్రి, తులసీ గంధంతో కూడిన ద్రవ్యాన్ని అష్టగంధం అంటారు. ఇది స్వామివారికి సమర్పించుట విశేషం.

**10. పుష్పం :** తులసీ, తామర, జాజి, కలువ, మొగిలి, ఎర్ర కలువపూలు ముఖ్యమైనవి. ఇందులో మొగలిపూవుపై భిన్నాభిప్రాయాలున్నవి (విశేష వివరాలు

అవకాశాన్ననుసరించి తెలుపబడతాయి).

**11. ధూపం :** జటామాంసి, గుగ్గిలం, దేవదారు, అందుకు చెట్టు జిగురు. (పాలమడ్డి) అగరు, కర్పూరం, జాజికాయ శ్రేష్ఠమైనవి. లభించినవానినే సమర్పించవచ్చు.

**12. దీపం :** ఆవునెయ్యి, నువ్వులనూనె, కర్పూరం మొదలైన వానిని సమర్పించాలి.

**13. నైవేద్యం :** మనం ఏ పదార్థాలను ఉపయోగిస్తామో వానినన్నింటినీ నివేదించాలి. బంగారు, వెండి పాత్రలలో జలంతోపాటు సమర్పించుట ఉత్తమం.

**14. తాంబూలం :** వక్కలు, జాజికాయ, జాపత్రి, లవంగాలు, చలువ మిరియాలు, యాలకులు... లేత తమలపాకుతో కలిపి సమర్పించాలి.

**15. నీరాజనం :** మంగళహారతిలో ఎన్ని ఎక్కువ దీపాలు వెలిగించిన అంత విశేష ఫలం లభిస్తుంది. కర్పూర హారతి వెలిగించవచ్చు.

**16. ప్రదక్షిణ నమస్కారం :** ప్రదక్షిణా విధానం ఆయా దేవతకు నిర్ణయించబడిన సంఖ్యను చేయాలి. మనస్సులో స్వామిని భక్తితో ప్రార్థించి సాష్టాంగ ప్రణామం చేయాలి.

ఎవరు పైన తెలిపిన షోడశోపచారాలను శ్రద్ధగా చేస్తారో చేయిస్తారో, వారికి ఇహపర సౌఖ్యాలు లభిస్తాయి. దేవతార్చన విధానాన్ని శాస్త్రంలో తెలిపిన విధంగా శ్రద్ధాభక్తులతో చేయుట విధియని గుర్తించాలి.



# 13. భక్తుల లక్షణాలు

**నీ పాద కమలసేవయు**
**నీ పాదార్చకుల తోడి నెయ్యము, నితాం**
**తాపార భూతదయయును**
**తాపసమందార నాకు దయసేయగదే!**

ఓ భగవంతుడా! నీ పాదపద్మాల సేవను నీ పాదసేవకులతో స్నేహాన్ని ఎల్లప్పుడూ అంతులేని భూతదయను నాకు ప్రసాదించమని మూడు ముక్కల్లో ప్రార్థించాడు. భాగవతంలో భక్తశిఖామణి పోతన. మరి సిసలైన భక్తునికి ఉండవలసిన అసలైన లక్షణాలింకేమైనా ఉన్నాయా అని తరచిచూస్తే...

సాక్షాత్తూ శ్రీకృష్ణభగవానుడు స్వయంగా ఉపదేశించిందే శ్రీమద్భగవద్గీత. ఇది సకల వేదసారం. ఒక అద్భుత యోగశాస్త్రం. బ్రహ్మవిద్యా రహస్యం. ఉపనిషత్తులన్నింటికీ మకుటాయమానమైంది. ఇందులో పదునెనిమిది అధ్యాయాలున్నా, ఒక్కొక్క అధ్యాయానికి ఒక విశేషం ఉంది. పరమాత్ముడు భక్తియోగంలో భక్తుల లక్షణాలను సంపూర్ణంగా వివరించాడు. ప్రతీ ఒక్కరూ ఈ లక్షణాలను తెలుసుకుని, ఆచరించేందుకు ప్రయత్నించినపుడే నిజమైన భక్తులవుతారు. భక్తుడడనగానే కేవలం దేవాలయానికి వెళ్లి, దేవుడికి నమస్కరించి, యథాశక్తిపూజలు చేసి, తీర్థప్రసాదాలు తీసుకోవడంకాదు. ఇది కేవలం ప్రాథమిక దశ మాత్రమే. ఆంతరంగికంగా గీతలోని ముఖ్యమైన భక్తి లక్షణాలను కలిగి యుండాలన్నదే గీతాచార్యుని ప్రధాన ఉపదేశం.

**శ్లో॥ అద్వేష్టా సర్వభూతానాం, మైత్రః కరుణ ఏవ చ ।**
**నిర్మమో నిరహంకారః, సమదుఃఖసుఖః క్షమీ ॥** (12 అ. 13 శ్లో)

ఏ ప్రాణియందును ద్వేషభావం లేనివాడు, సకలప్రాణులందు అవ్యాజమైన ప్రేమ, దయ కలవాడు, మమత అహంకారాలు లేనివాడు, సుఖం ప్రాప్తించినను, దుఃఖం ప్రాప్తించినను సమభావం కలిగియుండాలని పై శ్లోక తాత్పర్యం.

**1. ఏ ప్రాణియందైనను ద్వేషభావం లేకుండుట :** 'ద్వేషం' అనేది చాలా చెడ్డగుణం. ద్వేషగుణం కలిగివుండడానికి అనేక కారణాలున్నా, అకారణ ద్వేషం కూడా వుండడం విచిత్రం! సహజంగా ద్వేషం ఎప్పుడు కలుగుతుందని విచారిస్తే, శత్రుభావమేర్పడినపుడు అని తెలుస్తుంది. బాహాటంగా పోట్లాడే శక్తిగాని, అవకాశంగాని లేనపుడు ద్వేషభావాన్ని పెంచుకుంటారు. మనకున్న సుఖాలను ఎదుటివారు ఆటంకపరచినపుడు ద్వేషం కలుగుతుంది. మనకు లేని సుఖాలు ఎదుటివారికి ఉన్నపుడు, వానిని వారినుండి పొందుటకు ప్రయత్నించి విఫలమైనపుడు కూడా ద్వేషం కలుగుతుంది.

ఈ ద్వేషగుణం వలన ఎదుటివారికంటే, ఎవరికి ద్వేషం ఉందో వారే నష్టపోతారు. దానివలన ప్రయోజనమేంటి? మన కన్నులో మనమే వేలు పొడుచుకున్నట్లు కదా! అందుకని కారణమున్నా, లేకున్నా ఎవరియందూ, ఏ ప్రాణియందూ ద్వేషభావం లేకుండా ఉండాలి. అనగా ప్రతి ప్రాణినీ మనస్ఫూర్తిగా ప్రేమించినపుడే ఇది సాధ్యమవుతుంది.

**2. సకలప్రాణులందు మైత్రి కలిగివుండుట :** ప్రతి ప్రాణిపై ప్రేమభావమేర్పడినపుడే వారితో స్నేహం చేయగలుగుతాం. మైత్రి అనేది విశాల హృదయం కలవారికే సాధ్యం. విశాల హృదయం కలగాలంటే ఈ ప్రపంచమంతా ఒకే కుటుంబం అన్న భావన ఏర్పడాలి. అందుకే 'వసుధైక కుటుంబం' అన్నారు. ప్రేమ అనేది సంకుచితం కాకూడదు. ఇది అనేక రకాలు. సోదరప్రేమ, మిత్రప్రేమ, పుత్రప్రేమ, మాతృప్రేమ మొదలగువాటిలో ఎవరెవరు వారివారి స్థాయిననుసరించి ఎదుటివారితో ప్రేమను కలిగివుంటారో అప్పుడే మైత్రి సాధ్యమవుతుంది. అపకారం చేసినవారితో కూడా స్నేహభావం కలిగినపుడు మైత్రిగుణం సిద్ధించినట్లు బావించాలి. సకలప్రాణులను ప్రేమించి, మైత్రీభావంతో మెలిగినపుడు ప్రపంచమంతా శాంతిగా ఉంటుంది. ఒక వ్యక్తిలోని మైత్రీగుణం విశ్వశాంతికి దోహదమవుతుంది.

**3. ప్రతిప్రాణియందు దయ కలిగియుండుట :** పైన తెలిపిన ప్రేమ కలిగి ఉండటం వేరు, ఈ దయాగుణం వేరు. ప్రేమ ఉంటేనే దయ గలుగుతుంది. కానీ దయలో ఉపకార బుద్ధి ఉంటుంది. ఎవరి మీద మనకు దయ కలుగుతుందో వారికి ఉపకారం చేస్తాం. ఇది దయాగుణంలోని విశేషం. మనవద్ద ఉంది. మనకున్న సుఖాలు ఎదుటివారికీ ఉండాలనేది లేదుకదా! ఎదుటివారికి లేనిది, మనకున్నదానిలో నుండి వారి కవసరం అనుకున్న స్థితిలో అడగకుండా లభింపజేసే గుణమే దయ అవుతుంది.

దయాగుణం ఉన్నవారు శత్రువులను కూడా రక్షిస్తారు. ద్వేషమెంత దుర్గుణమో దయ అంత మంచిగుణం. ప్రతి ఒక్కరికీ దయా గుణమున్నట్లయితే పరస్పర సహకారం సులభమవుతుంది. దయవల్ల పరోపకార బుద్ధి పెరుగుతుంది. పరమాత్మకు మనపై అమితమైన దయ కలిగి ఉన్నందువల్లనే మనకు గీతోపదేశం లభించింది. అమూల్యమైన దేహాన్నీ, ప్రాణాన్నిచ్చి మనలను పోషిస్తున్నాడు. మనం చేయవలసిందల్లా సృష్టిలోని ప్రతి ప్రాణిపై దయ కలిగి ఉండడమే. దయాగుణం కలవారికి అపకారం జరగదు. అన్యోన్యప్రేమ భావం బలపడుతుంది. పరస్పర గౌరవం కలుగుతుంది.

**4. మమకారం లేకపోవడం :** మనకిష్టమైన వస్తువులపై, వ్యక్తులపై, ప్రాణులపై క్రమేణా మమకారం కలిగి ఉండడం సహజం. ప్రపంచంలో అన్ని ప్రాణులను సమానంగా ప్రేమతో చూచినపుడు అయిష్టమైన ప్రాణిగాని, వ్యక్తిగాని ఉండరుకదా! అయితే ఎవరిమీద మన మమకారం అనేదే ప్రశ్న. దీనికి సమాధానం అందరిమీదా అని చెప్పాలి. మమకారంవల్ల దుఃఖం ఏర్పడుతుంది. దేన్నయితే మనం బాగా కోరుకుంటామో అది పొందినపుడు సుఖం కలుగుతుంది. మననుంచి అది దూరమైనపుడు బాధ కలగడమూ సహజమే. సృష్టిలోని ప్రతి ప్రాణి, ప్రతి వస్తువు ఎప్పుడో ఒకప్పుడు నశించేవే. నశించే వాటిపై మమకారం కలిగి ఉండడంవల్ల ప్రయోజనమేంటి? "ఇది నాది" అనే భావనే మమకారానికి పునాది. దానిపై ఆధిపత్యం పెంచుకుని మమకారాన్ని బలపర్చుకుంటాం. మమకారాన్ని జయించడానికి రెండు మార్గాలు. ఒకటి సృష్టిలోని సకలప్రాణులు నావారే.

సకలవస్తువులూ నావే అనే భావంతో ఉండడం. రెండవది ఇదంతా నశించేదే కదా! పుట్టిన ప్రతిప్రాణి గిట్టక తప్పదు కదా! అని నిశ్చయించుకోవడం. ఈ రెంటిలో దేనినభ్యసించినా మమకారం దూరమవుతుంది. ఈ మమకారాన్ని పరమాత్మపై పెంచుకోవడమే భక్తి అవుతుంది.

**5. అహంకారం లేకపోవడం :** అహంకారానికి పునాది మమకారమనే చెప్పాలి. ఎందుకంటే ఏ ప్రాణిని లేదా ఏ వస్తువును "నాది" అని అనుకుని మమకారం పెంచుకుంటున్నామో వాటిని పొందినపుడు సుఖంతోపాటుగా అహంకారం జనిస్తుంది. నా అంతవాడు లేడు. నేనే గొప్పవాడిని, నేను తలచుకుంటే ఏమైనా చేయగలను. నేను చేస్తేనే ఈ పని పూర్తవుతుంది, కాబట్టి నేనే చేస్తాను. ఇలాగ ప్రతిదానికి నేనున్నాను అని దృఢపరచుకోవడమే అహంకారం.

అహంకారం కలవాడు నశిస్తాడు. ఇందులో ఇంకా దురహంకారం కూడా ఉంటుంది. ఇది మరీ ప్రమాదం. అహంకారం మనల్ని నశింపచేయకుండా ఉండాలంటే అహంకారాన్ని మనం నశింపచేయాలి. ఇందుకు ఒకటే సాధనం. అంతా పరమాత్ముడి అనుగ్రహంతో జరుగుతుంది. నేను కేవలం నిమిత్తమాత్రుణ్ణి అనే భావన కలిగివుండడం.

**6. సుఖదుఃఖాలందు సమభావం కలిగివుండడం :** సుఖదుఃఖాల కలయికే మానవజీవితం. సుఖం అంటే సంతోషం. దుఃఖం అంట బాధ. ఇవి రెండూ ఒకదాని వెంట ఒకటి వెలుగునీడల్లాగా ఉన్నాయి. ప్రతి ప్రాణీ సహజంగా సుఖాన్నే కోరుకుంటుంది. మరీ కోరకుండానే దుఃఖం ఎలా వస్తుందనేదే ప్రశ్న. కోరకుండా దుఃఖం వచ్చినపుడు కేవలం సుఖాన్నే కోరుకోవడంలో అర్థం లేదు కదా! అందుకని దుఃఖం ఎలాగయితే మనం కోరకుండా వస్తుందో సుఖం కూడా అలానే వస్తుంది. కాబట్టి సుఖదుఃఖాలను సమభావంతో చూడాలి. చాలావరకు సుఖం వచ్చినపుడు సంతోషంగా ఉండి, కాలాన్ని మర్చిపోతాం. కానీ దుఃఖం వచ్చినపుడు మాత్రం విపరీతమైన బాధననుభవించి ఆ సమయాన్ని భరించలేం. దుఃఖసమయాల్లో కూడా బాధను మాత్రం అనుభవించక తప్పదు. కానీ సుఖం మీదే కాంక్ష ఉండి, దుఃఖాన్ని భరించడానికి సిద్ధంగా లేకపోవడం

మంచిదికాదు. రెండింటిపైనా సమానమైన దృష్టి కలిగివుండాలనేది కూడా ఈ భక్తుల లక్షణాలలో ఒకటి.

**"పరోపదేశ వేళాయాం - సర్వే వ్యాస పరాశరాః"**

అని ఒక నీతివాక్యం ఉంది. ఇతరులకు బోధ చేసేటపుడు అందరూ వ్యాసులు, పరాశరులే కానీ ఎవరికి వారు స్వయంగా అనుభవించినపుడే అసలు సంగతి అర్థమవుతుంది. ఈ భక్తుల లక్షణాలన్నీ ఏదో సామాన్యమానవుడు చెప్పినవి కాదుగదా! సాక్షాత్తూ శ్రీకృష్ణపరమాత్ముడే మనకోసం ఉపదేశించినవి. అయితే ఆయా లక్షణాలను ఒక్కొక్కటిగా బాగా మననం చేసుకుని ఆచరించడానికి ప్రయత్నించినపుడే మనం నిజమైన మానవులమవుతాం.

కలియుగంలోని ధర్మాచరణలో మొట్టమొదటిది గీతాపాఠం. గీతాపాఠం అనగానే కూర్చుని వరుసగా శ్లోకాలు లేదా తాత్పర్యం పారాయణం చేయడం కాదు. కనీసం రోజుకొక శ్లోకమైనా తాత్పర్యం తెలుసుకుని దానిని మనం ఆచరించడానికి ప్రయత్నించాలి. అప్పుడే గీతా పఠనం సార్థకమవుతుంది. ఎన్ని అధ్యాయాలు పూర్తయింది అన్నదే ప్రధానం కాదు. ఎన్ని శ్లోకాల సారాంశం గ్రహించాం, ఆచరించాం అన్నదే ముఖ్యం.

ఇందులో తెలిపిన భక్తుల లక్షణాలను ప్రతి ఒక్కరూ శ్రద్ధగా ఆచరించడానికి ప్రయత్నించినట్లైతే విశ్వశాంతి ఏర్పడడమే కాక అతివృష్టి, అనావృష్టి బాధలు, కరవుకాటకాలు, హింసావాదం దూరమవుతాయి. సాత్వికభావం పెంపొంది సర్వమానవ సౌభ్రాతృత్వం కలుగుతుంది. విశ్వకల్యాణమూ జరుగుతుంది.

**శ్లో॥ సంతుష్టః సతతం యోగీ, యతాత్మా దృఢ నిశ్చయః ।**
**మయ్యర్పిత మనోబుద్ధిః యోమద్భక్తః సమేప్రియః ॥**

(భ.గీ. భక్తియోగం - 14 శ్లో॥)

ఎల్లప్పుడు సంతుష్టుడై యుండువాడు సమాహితచిత్తుడైన జితేంద్రియుడు, దృఢనిశ్చయం కలవాడు, నాయందు అర్పింపబడిన మనోబుద్ధులు కలవాడు, నేనెట్టివాడైన నా భక్తుడు నాకు ప్రియుడని శ్రీకృష్ణభగవానుడు సెలవిచ్చాడు.

**7. నిత్యం సంతుష్టుడుగా ఉండటం :** ఈ సంసారంలో మనం ప్రవేశించింది మొదలు మనకు ప్రపంచంలో గల పలు పదార్థాలు, వస్తువులు, వ్యక్తులు తప్పనిసరి అవసరమవుతాయి. ఇది జగమెరిగిన సత్యం. స్వానుభవంలో అందరికీ తెలుసు. అయితే మనం కోరుకునేవి లభించినపుడు ఆనందం, కోరుకున్నవి లభించనపుడు దుఃఖం అనుభవించుట సహజం. అంతేగాక కోరినవి కోరినంత లభించకపోవడం వలన కూడా మనం బాధపడుతుంటాం. ఎవరికి కూడా కోరినవి కోరినట్లుగా లభించవు, కోరకున్నను అవసరానికి సరిపడునవి అనుకోకుండా లభిస్తాయి. ఇదే సృష్టి వైచిత్ర్యం. అనగా మనకు ఏది ఎంత లభించునో విధి విలాసం. కావున ఎప్పుడు ఏది ఎంత లభించినను తృప్తిపడాలి.

తృప్తిపడటం నేర్చుకుంటే ఎల్లప్పుడు మనం ఆనందంగా ఉంటాం. ప్రయత్నంతో మనం కోరినవన్ని సాధించవచ్చుననే విశ్వాసం ప్రతి ఒక్కరికీ ఉంటుంది. ఇది తప్పుకాదు. ప్రయత్నం చేయకుండా, కేవలం కోరినంత మాత్రాన ఏది ఎప్పుడూ లభించదు. కాని ప్రయత్నిస్తే ఎప్పుడైనా, ఏదైనా లభిస్తుంది అనుకున్నా కూడా పొరపాటే. కాబట్టి నిత్యం ప్రయత్నిస్తూ ఉండాలి, ప్రయత్నించగా లభించినదాంతో తృప్తిపడాలి. ఇది కొంచెం కఠినమే అయినా, సాధన చేయగా సులభమవుతుంది. "సాధనాత్ సాధ్యతే సర్వం" అన్నారు మహానుభావులు శ్రీశ్రీశ్రీ మదనానందస్వామివారు. "సాధనమున పనులు సమకూరు ధరలోన" అని కూడా మనకు తెలుసు. భక్తులమైన మనం క్రమంగా ఒక్కొక్క లక్షణాన్ని అలవరచుకుని దైవానుగ్రహాన్ని పొందాలని శ్రీకృష్ణభగవానుని అనుగ్రహం.

**8. జితేంద్రియుడు (యోగి) :** మన శరీరం ప్రధానంగా పది ఇంద్రియాలతో కూడి ఉంది. ఇందులో ఐదు జ్ఞానేంద్రియాలు, ఐదు కర్మేంద్రియాలు. ఈ పదింటికి రాజులాంటి సార్వభౌమాధికారంగల ఏకాదశేంద్రియం అనగా పదకొండవది మనస్సు. ఇది అంతరింద్రియం. దీని అదుపాజ్ఞలోనే మిగతా పది ఇంద్రియాలూ పనిచేస్తాయి. ఈ పది ఇంద్రియాలనూ మనం స్వాధీన పరచుకోవాలంటే వీటికి అధిపతి ఐన మనస్సును నియంత్రిస్తే చాలు. అంటే మనస్సును జయిస్తే జితేంద్రియులవుతారు. ఐతే అది అంత సులభమైన పనికాదు

సుమా! దీనికి అనేకమార్గాలున్నాయి. ఒక్కొక్కరు ఒక్కో మార్గాన్ని అవలంబిస్తారు. ఎవరెవరి అభిరుచికి తగిన మార్గాన్ని వారు ఎంచుకోవచ్చు. కానీ అందరి లక్ష్యసాధనా ఒక్కటే. అదే మనోనిగ్రహం. శరీరం పది ఇంద్రియాలపురం ఈనాటిది. కానీ అంతరింద్రియమైన మనస్సు మాత్రం సనాతనమైంది. అందుకే ఈ కసరత్తు అంతా. దేవాలయంలో విగ్రహరూప భగవానుని కనులారా దర్శించిన తరువాత ప్రశాంతంగా కాసేపు కూచోవాలంటారు కదా! ప్రశాంతంగా కూర్చున్న సమయంలో దర్శించిన మూర్తిని మనస్సులో ధ్యానించాలి. అలా నిత్యం ధ్యానిస్తూ ఉంటే మనస్సు నిశ్చల రూపమవుతుంది. అభ్యాస వైరాగ్యాలతో మనసుని స్వాధీనపరచుకోవచ్చని శ్రీకృష్ణభగవానుడే బోధించాడు. క్రమంగా సాధన చేస్తూ ఉంటే తప్పక సాధ్యమవుతుంది. మనస్సు స్వాధీనమైతేనేగానీ జితేంద్రియత్వం ప్రాప్తించదు.

**9. ఆత్మయందు దృఢనిశ్చకం కలిగి ఉండడం :**

**శ్లో॥ సంకల్ప వికల్పాత్మకో మనః నిశ్చయాత్మకో బుద్ధిః ॥**

మనస్సు సంకల్పిస్తుంది. వికల్పిస్తుంది. బుద్ధి మాత్రం నిశ్చయిస్తుంది. బుద్ధి మనసుకు మరో రూపం. నిశ్చయించటమే బుద్ధి. నిశ్చయించడంలో సంశయాలు లేకుండా దృఢనిశ్చయం కలిగి ఉండాలి. మనం అనేక సంకల్పాలు కలిగిఉంటాం. సంకల్పం కార్యరూపం దాల్చాలంటే నిశ్చయం అవసరం. ఈ నిశ్చయం తటస్థం కాకూడదు. తటస్థ నిశ్చయం వలన కార్యనాశం జరుగుతుంది. అందుకే గీతలో 'సంశయాత్మ వినశ్యతి' అన్నారు భగవానుడు. దృఢనిశ్చయం వల్ల కార్యసిద్ధి అవుతుంది. కాబట్టి మనమంతా దృఢనిశ్చయం కలిగి ఉండడానికి ప్రయత్నించాలి. దీనికి ఒకటే మార్గం. సంశయం ఎప్పుడు కలుగుతుంది? ఇదా, అదా అనే ప్రశ్నలుదయించినప్పుడే కదా. ఏది అనేది "బుద్ధిః కర్మానుసారిణి" అని శాస్త్రం చెబుతుంది. మన కర్మలను అనుసరించి మన బుద్ధి నిశ్చయిస్తుంది. నిశ్చయించిన దానినే దృఢం చేయటం అవసరం.

దృఢనిశ్చయం కలవారికి చెడు జరగదు కాబట్టి సంశయం అవసరంలేదు. మనం సంశయంలో ఎందుకు పడతామంటే మన నిశ్చయంవల్ల అంతా మంచే

జరగాలని చెడు ఏ మాత్రం జరగవద్దని కదా. దృఢనిశ్చయం వల్ల చెడు జరగనే జరగదని సాక్షాత్తూ శ్రీకృష్ణపరమాత్మే చెప్పినప్పుడు ఇక మనకు సంశయం ఉండకూడదు.

**10. 'నా' యందు మనోబుద్ధులు అర్పించడం :** నా యందు అనగా శ్రీకృష్ణభగవానుడే చెప్పాడు కాబట్టి ఆయన యందే అని అర్థం. సంకల్పించే మనస్సును, నిశ్చయించే బుద్ధిని రెండింటినీ శ్రీకృష్ణభగవానుడికే అర్పించాలి. మనం నిత్యం ఎన్నో సంకల్పాలు చేస్తూనే ఉంటాం. ఎన్ని సంకల్పాలు చేసినా అందులో నిశ్చయించేవి కొన్ని మాత్రమే. అలా నిశ్చయించిన కొన్నింటిని మాత్రమే కార్యక్షేత్రంలో అమలుపరుస్తాం. కార్యరూపం దాల్చే కొన్నింటి కొరకు అనేక సంకల్పాలను వృథా చేస్తున్నాం. అందుకే సంకల్పాలు వృథాకాకుండా భగవానుడికి సమర్పించమంటున్నాడు శ్రీకృష్ణపరమాత్ముడు. అలాగే నిశ్చయించిన విషయాలు కూడా వృథా కాకుండా ఉండడం కోసం బుద్ధిని కూడా భగవానుడికే సమర్పించాలి. సమర్పించడం అంటే ఇదేదో పత్రమో, పుష్పమో కాదుకదా! మనస్సు... బుద్ధి ఇది ఎలా సమర్పించేది అని కదా అనిపిస్తుంది. ఇక్కడ మనస్సంటే 'సంకల్పం' అని, బుద్ధి అంటే 'నిశ్చయం' అని తెలిసిందికదా! ఇక సమర్పించాల్సిందేమిటి? అంటే మనం సంకల్పించే ప్రతి సంకల్పాన్నీ శ్రీకృష్ణార్పణమస్తు అని నిశ్చయించిన విషయాన్నీ శ్రీకృష్ణార్పణమస్తు అని భావించటమే సమర్పించటం అవుతుంది.

ప్రహ్లాదుడు నవవిధ భక్తి విషయంలో 'ఆత్మ నివేదనం' అన్నాడు. ఈ ఆత్మనివేదన భక్తి అలవరచుకున్న భక్తుడు శ్రీకృష్ణపరమాత్మకు చాలా ఇష్టుడవుతాడు. అందుకే చివరగా 'యోమద్భక్తః సమే ప్రియః' అన్నాడు భగవానుడు. మనోబుద్ధులు పైవిధంగా ఎవరు సమర్పిస్తారో వారు శ్రీకృష్ణుడిలో ఐక్యమవుతారు. శ్రీకృష్ణుడు నేనే ఆ భక్తుడు అంటున్నాడు. ఇంత మంచి లక్షణాన్ని భక్తులందరం అలవరచుకోవాలి.

చెప్పడం చాలా సులువు. కానీ చేయడం చాలా కష్టం. ఈ విషయంలో శ్రీరామకృష్ణపరమహంస చక్కని ఉదాహరణ ఇచ్చారు. మనం ఇళ్లలో వాడే

చీపురుకట్ట ఇల్లంతా శుభ్రం చేస్తుంది. కానీ దానికి ఎంతో మలినం అంటే ఉంటుంది. ఐనా అది శుభ్రం చేస్తూనే ఉంటుంది కదా! అలాగే చెప్పేవారు చేసినా చేయకపోయినా చెప్పిన విషయాలు విని చదివి ఎంతోమంది ఆచరిస్తారని ఆశిద్దాం.

ఏ విషయమైనా తాను ఆచరించిన తరువాతే ఇతరులకు తెలియజేయడమన్నది మహాత్ముల లక్షణం. అలాంటి మహాత్ములలో రామకృష్ణపరమహంస అగ్రగణ్యుడు. అలాగే మనకు ప్రత్యక్షంగా ఆచరించి చూపిన మహాత్ములు శ్రీ అప్పాల విశ్వనాథశర్మ, శ్రీపాండురంగాశ్రమం వారు.

**"యద్యదా చరతి శ్రేష్ఠః తత్తదేవే తరోజనః"**

ఏది పెద్దలు ఆచరిస్తారో దానినే ఇతరులందరూ అనుసరిస్తారని గీతలో శ్రీకృష్ణపరమాత్మ సెలవిచ్చారు.

**శ్లో॥ యస్మాన్నో ద్విజతే లోకో లోకాన్నో ద్విజతే చయః ।**
**హర్షా మర్షభయో ద్వేగైః ముక్తోయః సచమే ప్రియః ॥**

(భ.గీ- భ.యో- శ్లో. 15)

ఎవరి వలన ఏ ప్రాణి ఉద్వేగానికి లోనుకాకుండా ఉంటుందో, స్వయంగా తాను కూడా ఏ ప్రాణివలన ఉద్వేగానికి అంటే సంతాపం మరియు క్షోభ చెందకుండా ఉంటుందో, ఎవరు ఉత్సాహం, సహింపలేకపోవడం భయము, ఉద్వేగం లేకుండా ఉంటారో అట్టివారు తనకు ఇష్టులని శ్రీకృష్ణ భగవానుడు తెలిపాడు.

### 11. ఏ ప్రాణికీ ఉద్వేగం కలగనీయకుండడం :

సృష్టిలో ప్రతి ప్రాణీ పరమాత్మ స్వరూపమే. అంటే అన్ని ప్రాణులూ మనకు సోదర స్వరూపులు. నిత్య జీవితంలో ఒక ప్రాణి మరొక ప్రాణిపై ఆధారపడి ఉండటం సహజం. అన్ని ప్రాణుల్లోకెల్లా మానవుడు ఉత్తముడు. మానవుడు తన అవసరాలకు ఇతర ప్రాణులను ఉపయోగించుకుంటాడు. తన ఆధీనంలో ఉన్న వాటిని సులభంగా లొంగదీసు కుంటాడు. పెద్ద ప్రాణులు చిన్న ప్రాణులను సులభంగా లోబరచుకుంటాయి. మన అవసరానికి ఇతర ప్రాణులను లేదా

మనుషులను ఉపయోగించు కున్నట్లే ఇతర ప్రాణులు లేదా మానవులు మనల్ని ఉపయోగించుకుంటాయి కదా. ఇక్కడ మన అవసరం కన్నా ఇతర ప్రాణుల క్షేమమే ముఖ్యమని భగవానుని ఉపదేశం. ఇతర ప్రాణులను, లేదా తోటి మానవులను మన అవసరాల నిమిత్తం క్షోభకు గురిచేసి సంతాపాన్ని కలిగించకూడదు. మన అవసరాలు మానుకోనవసరం లేకుండా ఇతర ప్రాణులను క్షోభపెట్టకుండా మెలగాలి. ఇతర ప్రాణుల క్షోభ మనకు శాపంగా మారుతుంది. మనకు తెలియకుండానే శిక్షపడుతుంది. దాన్ని విధిగా అనుభవించి తీరాలి. అవసరం కన్నా శిక్ష తప్పనిసరి అవుతుంది. వీలైనంతవరకు ఏ ప్రాణికి లేదా ఇతర మానవులకు క్షోభ కలగనీయకుండా, సంతాపానికి గురి చేయకుండా ఉండడానికి ప్రయత్నించాలి. అప్పుడు ఏ ప్రాణికీ మనవల్ల ఉద్వేగం కలగదు.

**12. ఏ ప్రాణివలన కూడా మనం ఉద్వేగం చెందకూడదు :**

పై లక్షణంలో మనవల్ల ఏ ప్రాణికీ ఉద్వేగం కలగకూడదు అని, ఏ ప్రాణి వల్ల మనం ఉద్వేగం చెందకూడదు అని ఈ లక్షణంలో భగవానుడు తెలిపాడు. ఇతర ప్రాణులు లేదా మానవుల అవసరాలను తీర్చడంలో మనం క్షోభకు లేదా సంతాపానికి ఒక్కోసారి గురికావాల్సి వస్తుంది. ఐనాసరే సంతోషంగా వారివారి అవసరాలను తీర్చవలసిందే. ఇక్కడ ఒక చిన్న చమత్కారం ఉంది. మనమేమో ఇతర ప్రాణులకు ఉద్వేగం కలిగించకూడదు. ఇతర ప్రాణుల వల్ల మనం ఉద్వేగం చెందకూడదు అంటే ఎలా సాధ్యం అనిపిస్తుంది కదూ! మనం ఎప్పుడైతే ఇతర ప్రాణులకు ఉద్వేగం కలిగించకుండా ఉంటామో మనకు ఇతర ప్రాణుల వల్ల ఉద్వేగం ఎట్టి పరిస్థితులలోనూ కలగదు. అంటే ఒక లక్షణంతో మరో లక్షణం ముడిపడి ఉంది. ఈ రెంటిలో ఒకటి సాధ్యమైతే చాలు. రెండవది దానంతట అదే వస్తుంది. చీమకు కూడా హాని తలపెట్టని వానికి శివుడైనా ఏమీ చేయలేడని లోక సామెత ఉంది.

సర్వాంతర్యామియైన పరమాత్మ స్వరూపమే అంతా. కనుక ఇది సాధ్యమవుతుంది. ఇందులో సందేహం లేదు. మన మహాత్ముల జీవితాలను

పరిశీలిస్తే ఇది స్పష్టంగా తెలుస్తుంది. ప్రతి ప్రాణిపై ప్రేమను, ఆప్యాయతను పెంచుకోవడం అవసరం. దీనివల్ల ఏ ప్రాణీ కూడా బాధపెట్టదు. బాధపడదు.

**13. హర్షం (ఉత్సాహం/సంతోషం) లేకుండా ఉండడం :**

మనకిష్టమైన వస్తువు లభించినపుడు మన మనసులో కలిగే ఉత్సాహం శరీరం రోమాంచం, అశ్రుపాతం మొదలైనవి కలుగుతాయి. దీనినే 'హర్షం' అంటారు.

ఇష్టం అనేది వ్యక్తిగతం. అందరికీ అన్ని వస్తువులూ ఇష్టం కావు. కొందరికి కొన్ని వస్తువులు ఇష్టమైతే మరికొందరికి మరిన్ని వస్తువులు ఇష్టమవుతాయి. ఒకరికి ఇష్టమైన వస్తువు మరొకరికి ఇష్టం కాదు. ఇక్కడ వస్తువుయొక్క లోపమేమీ లేదు. అది మనలోని మనోవికారం మాత్రమే. ఒక్క వస్తువులే కాదు, ప్రాణుల, మనుషుల విషయంలో కూడా అంతే. ఇష్టమైన వస్తువు, ప్రాణి లేదా మనిషి లభించినపుడు కలిగే మనో వికారమే ఉత్సాహం, సంతోషం. ఈ మనో వికారాల కారణంగా రోమాంచం, అశ్రుపాతం అనే శారీరక వికారాలు కలుగుతాయి. రెండు రకాల వికారాలు లేకుండా ఉండగలగాలి. ఇష్టమైన వస్తువు, ప్రాణి లేదా మనుషులు అనేవారు ఉండకూడదు. ఇది ఎలా సాధ్యం. సాధ్యం కాదు కాబట్టే అన్ని వస్తువులనూ అన్ని ప్రాణులను అందరినీ ఇష్టపడాలి. ఇక ఇష్టానికి ప్రత్యేక స్థానం ఉండదు. లేదా తటస్థ వైఖరిని నేర్చుకోవాలి. లేదా సృష్టంతా భగవంతుడిదైనపుడు ఇందులోని వస్తువులు, ప్రాణులు, మనుషులందరూ భగవంతునికి చెందినవారే. కాబట్టి ఆయన వస్తువులను, ప్రాణులను ఇష్టపడడానికి మనమెవరం. కేవలం ఆయన సంకల్పమాత్రం చేత జరిగే ఈ ప్రక్రియలకు వికారా లెందుకు పొందాలి. అందుకని అన్ని వస్తువుల యందు, అన్ని ప్రాణుల యందు సమభావం కలిగి ఉండడానికి ప్రయత్నించాలి. అప్పుడే ఈ లక్షణం కలిగి ఉన్నవాళ్లం అవుతాం.

సాధన చేయగా సాధ్యమౌతుంది. వస్తుప్రీతి, ప్రాణిప్రీతి, బంధుప్రీతి పనికిరాదని తాత్పర్యం. క్రమక్రమంగా అభ్యాసం చేస్తూ పోవాలి.

**14. అమర్షం లేకుండా ఉండటం (సహించలేకపోవటం ఉండకూడదు):**

పైన చెప్పుకున్న హర్షమనే లక్షణానికి ఇది వ్యతిరేకమైంది. ఇష్ట వస్తువు, ప్రాణి లభించినపుడు హర్షం ఎలా కలుగుతుందో అనిష్ట వస్తువు అంటే ఇష్టం కాని వస్తువు, ప్రాణి లభించినపుడు సహనం కోల్పోతాం. దీన్నే అమర్షం అంటారు. ఇది కూడా ఉండకూడదంటారు పరమాత్మ.

ప్రపంచంలోని వస్తువులన్నీ, ప్రాణులన్నీ పరమాత్మవే ఐనప్పుడు ఇష్టాయిష్టాలకు అవకాశమేలేదు. ఇక్కడ కూడా పై లక్షణం స్వాధీన మైతే ఈ లక్షణం దానంతట అదే వస్తుంది. అయిష్ట వస్తువును కానీ, ప్రాణిని కానీ పొందినప్పుడు కలిగే అసహనం మంచిది కాదు. దీనివల్ల పరమాత్ముడు దూరమవుతున్నాడు. మనకు తెలియకుండానే పాపం మూటగట్టుకుంటున్నాం. సృష్టిలో ఇష్టాయిష్టాలు రెండూ ఉంటాయి. ఈ రెండింటినీ ప్రక్కనపెట్టి, జీవనం కొనసాగించాలి. ఇదీ భక్తుల లక్షణం.

దైవ నిర్ణయానికే ప్రతీది వదిలివేయడం నేర్చుకోవాలి. ఏది ప్రారబ్దమో దానినే మనమనుభవిస్తాం. ఇష్టాయిష్టాలనేవి కల్పితాలు. మన బుద్ధి ఎలా సంకుచితమైంది. మనకు అయిష్టంగా కనిపించే వస్తువును లేదా ప్రాణిని మనం ద్వేషించినట్లే లేదా దూరం చేసుకు న్నట్లే అవుతుంది. అంతా పరమాత్మ సృష్టి అని మరచిపోకూడదు. జాగ్రత్త, పరిశుభ్రం అనేవి ఆరోగ్య దృష్ట్యా పొరపాటుగాదు. తటస్థంగా ఉన్నప్పుడు ఏ దోషం కలగదు. అసహనాన్ని ప్రదర్శించ కుండా ఉంటే చాలు. ఇంతకుమించి చేయవలసిన సులభమైన ఉపాయం మరొకటి లేదు. ప్రయత్నమనేది అవసరం. ఒకదాని వెంట ఒకటి భక్తుల లక్షణాలన్నీ అలవడతాయి. వీలైనంతవరకు మరచిపోకుండా ఉంటే మంచిది. అందుకే గీతను పారాయణం చేయమన్నారు.

**15. భయ వర్జితం (భయం లేకుండా ఉండటం) :**

ప్రపంచంలో ప్రతీది భయంతో కూడుకున్నదే. భయాలన్నిటిలో కెల్లా 'ప్రాణభయం' పెద్దది. మనం మన శరీరంపై లేదా మనకు ఇష్టమైన వస్తువు, ప్రాణిపై ఉండే మమకారమే (ప్రేమ) భయానికి మూల కారణం. ప్రతి ప్రాణి

తన ప్రాణంపై ఎక్కువ ప్రేమ కలిగి ఉంటుంది. అలాగే ప్రాణికి ఇష్టమయ్యే వస్తువులు లేదా ప్రాణులపై కూడా ప్రేమ ఉంటుంది. ఇందులో మొదటిది తన శరీరం, తర్వాత తాను ప్రేమించే వస్తువు లేదా ప్రాణి. శరీరం శాశ్వతం కాదని అందరికీ తెలుసు. పుట్టిన ప్రతి ప్రాణి గిట్టక మానదు. ఇది మన అనుభవంలో జరుగుతున్నదే. మన శరీరమే శాశ్వతం కానపు డు, మనం ప్రేమించే వస్తువులు లేదా ఇతర ప్రాణులు గూర్చి వేరే చెప్పాలా? అనగా ప్రపంచంలోని ఏ వస్తువుగాని, ఏ ప్రాణిగాని శాశ్వతం కాదు. శాశ్వతం కాని వస్తువులు లేదా ప్రాణులపై మనం ఎక్కు వ ప్రేమ కలిగి ఉన్నా ప్రయోజనం లేదు. మనకు ఎక్కువ ప్రేమ లేని వస్తువులు లేదా ప్రాణులు మన శరీరంపై భయపడనవసరం లేదు.

భయమున్నను, లేకున్నను సృష్టిలో జరిగే ఏ కార్యం ఆగదు. కాకపోతే జాగ్రత్త అనేది అవసరం. నిర్భయంగా ఉంటూనే జాగ్రత్త తీసుకుంటే చాలు. భయపడుతూ జాగ్రత్త తీసుకున్నందువల్ల భయమనే మన మనోవికారం తద్వారా జరిగే శరీర వికారాలుండవు. అందుకే శ్రీ శంకరాచార్యులు "సర్వం వస్తు భయాన్వితం భువి నృణాం వైరాగ్య మేవా భయం" అన్నారు. ప్రపంచంలో అన్ని వస్తు వులు, ప్రాణులు భయాన్ని కలిగించేవే. 'వైరాగ్యం' ఒక్కటే 'అభయం' అని అర్థం. మనం ఏ వస్తువును లేదా ఏ ప్రాణిని చూసినా భయమనేది లేకుండా ఉండగలగాలి. ఇది అంత సులభమైన విషయం ఏంగాదు. కాని సాధన ద్వారా క్రమేణా అలవరచు కోవచ్చు. ప్రపంచమంతా పరమాత్మ స్వరూపమని గతంలో తెలుసు కున్నాం. ఇది ఒక సాధన. అంతా పరమాత్మ స్వరూపమే అయినపుడు భయపడాల్సిన అవసరం లేదు. ఏ వస్తువుతోగాని, ఏ ప్రాణితో గాని, చివరకు మన శరీరంతో గాని మనకు భయం అనవసరం. ప్రేమ లేదని దృఢసంకల్పం అనగా వైరాగ్యభావం కలిగి ఉండడం వలన కూడా భయముండదు. ఇది రెండవ సాధన. ఎవరెవరికి ఏది సాధ్యమో, వారు దానిని అభ్యసించవచ్చు.

**16. ఉద్వేగ రహితం (ఆవేశానికి లోనుకాకుండా ఉండడం) :**

పైన చెప్పిన 11, 12 లక్షణాలలో ఏ ప్రాణి లేదా వస్తువు వలన మనం ఉద్వేగానికి లోనుకాకుండా ఉండడం, మన వలన ఏ ప్రాణి ఉద్వేగపడకుండా

ఉండడం అనే విషయాలు తెలుసుకున్నాం. ఈ లక్షణంలో మనకు మనమే అనవసర లేదా అవసర ఆవేశానికి గురవుతుంటాం. దీనినే 'ఉద్వేగం' అన్నారు. ఇది కూడా పనికిరాదు. అనగా ఉద్వేగం లేకుండా ఉండాలి.

ఆవేశం వలన అనేక అనర్థాలు కలుగుతాయి. చివరకు ఆరోగ్యం కూడా దెబ్బతింటుంది. సహజంగా కోపంతో కూడిన ఆవేశం లేదా సంతోషంతో కూడిన ఆవేశం మనలో ఉంటుంది. ఈ రెండు విధాలైన ఆవేశాలు మంచివి కాదు. ఒకరి ప్రమేయం లేకుండానే మనంతట మనమే ఆవేశానికి గురవుతూ ఉంటాం. ఇందుకు ప్రధానం మన భావమే. మన మనస్సులో ఆవేశానికి సంబంధించిన ఆలోచనలు లేదా ఊహలు కలిగినపుడే ఆవేశం దానంతటదే వస్తుంది. మనలో ఆవేశాన్ని కలిగింపజేసే ఆలోచనలను లేదా ఊహలను రానీయకుండా ఉండడం మొదటి మార్గం. ఒకవేళ పొర పాటున వచ్చినా దానిని మనస్సులోనే అణచివేయటం రెండవ మార్గం. మొగ్గలోనే త్రుంచివేస్తే సమస్య ఉండదు.

ఆవేశం రావడానికి అనేక కారణాలున్నాయి. కోపం, సంతోషాలే గాకుండా, భయం, ఆందోళన, అలసట, తొందరపాటు, కార్యభారం మొదలైనవన్నీ కూడా ఆవేశాన్ని కలిగించేవే. కాని భక్తుడికి ఆవేశం లేకుండా ఉండాలని శ్రీకృష్ణభగవానుడు చెబుతున్నాడు. 'ఉద్వేగరహితం' కావాలి. అపుడే ఆనందమయమైన జీవితం గడుపుతాం. 'భక్తి' కలిగింది సరే, భక్తుడికి ఉండ వలసిన లక్షణాలన్నీ క్రమేణా ఒక్కొక్కటీ సాధించినపుడే నిజమైన భక్తులని పించుకుంటాం. మోక్షానికి భక్తిమార్గమే సులువైంది. మోక్షం తొందరగా సిద్ధించాలంటే భక్తుల లక్షణాలన్నీ పొందవలసిందే. దేవుడికి భక్తి, శ్రద్ధ లతో పూజ చేయడంతో పాటు భక్తుల లక్షణాల సాధన అత్యంతావశ్యకమైంది. ఇందుకు 'సాధన' ఒక్కటే ఉపాయం.

**శ్లో॥ అనపేక్షః శుచిర్దక్ష ఉదాసీనో గతవ్యథః ।**
**సర్వారంభ పరిత్యాగీ యోమద్భక్తః సమేప్రియః ॥**

(శ్రీమద్భగవద్గీత–భ.యో. 16)

ఇతరుల ఆధారం కోరనివాడు, పవిత్రమైనవాడు, కార్య నిర్వహణా సమర్థుడు, ఉదాసీనుడు, భయం లేని మనస్సు కలవాడు, సమస్త కర్మల ఆరంభాన్ని వదిలివేసిన వాడైనట్టి భక్తుడు నాకిష్టమైనవాడని శ్రీకృష్ణ పరమాత్మ సెలవిచ్చాడు.

**17. పరాధీన రహితం (ఇతరులపై ఆధారపడకుండా ఉండటం):**

పుట్టడానికి ముందునుంచే తల్లిపై ఆధారపడవలసి వస్తుంది. పుట్టిన తరువాత తప్పనిసరిగా సమాజంపై ఆధారపడవలసిందే. ఐతే సృష్టిలోని నియమం ప్రకారం జరిగే ప్రక్రియలకు ఆధారపడటం విధి. కానీ ప్రతి చిన్న విషయానికి ఇతరులపై ఆధారపడటం వలన చులకన భావం ఏర్పడటమే కాక సోమరితనం వస్తుంది. ఇంకా ఎన్నో అనర్థాలకు దారితీస్తుంది. ఫలితంగా దుఃఖమే కానీ సుఖముండదు. అందుకే "సర్వం ఆత్మవశం సుఖం" అని చెప్పారు. సాధ్యమైనంతవరకు మనకు సంబంధించిన పనులను మాత్రమే మనమే చేసుకోవడానికి ప్రయత్నించాలి. సమాజంలో ఆయా వృత్తులకు సంబంధించి ప్రత్యేకంగా పనులు చేస్తారు. ఆయా పనులను వారితో చేయించుకున్నప్పటికి మనం స్వతహాగా చేసుకోవలసిన పనులు మాత్రం ఇతరులపై రుద్దకుండా జాగ్రత్తపడాలి. నిత్యకృత్యంలో ఇతరులు చేయవలసిన పనులు వారితోనే చేయించాలి. మనం చేసుకోవలసినవి మనమే చేయాలి. క్రమేణా ఇతరులపై ఆధారపడకుండా జీవించడానికి అలవాటుపడాలి. చాలామంది పెద్దలకు పిల్లలతో పనులు చేయించుకోవడం అలవాటు. ఆ సమయంలో ఆ పని సులభంగా పూర్తయిందనే సంతోషం బాగానే ఉంటుంది. కాని ఇది పరాధీనమైంది. పైగా పిల్లల్లో చులకనభావం ఏర్పడుతుంది. గౌరవం తగ్గుతుంది. ఇలాంటి పొరపాట్లు తెలిసి చేస్తున్నామనే శ్రీకృష్ణ పరమాత్మ భక్తుల లక్షణాలలో దీనిని చేర్చాడు.

**18. పవిత్రంగా ఉండడం:**

శారీరకంగా పరిశుభ్రంగా ఉండడమే కాకుండా, పరిశుద్ధమైన ఆహార పానీయాలు తీసుకున్నప్పుడే మనసు పవిత్రంగా ఉంటుంది. అందుకోసమే మన పెద్దలు ఆచారాలని ఏర్పాటుచేశారు. ఐతే ప్రస్తుతం ఆచారాలను చాదస్తం కింద లెక్కకడుతున్నారు. భక్తునికి పవిత్రత చాలా అవసరం. పవిత్రత ఉ

న్నచోటే పరమాత్మ ప్రత్యక్షమవుతాడు. అందుకే నిత్యకర్మలోని సంధ్యావందనం ఆరంభంలో "అపవిత్రః పవిత్రోవా" అని పఠిస్తాం. భగవన్నామం ద్వారా అపవిత్రునికి పవిత్రత కలుగుతుంది. మనమెంత జాగ్రత్తగా ఉన్నప్పటికి సమాజంలో పవిత్రతను కాపాడలేం. శారీరక ఆహార పరిశుభ్రతకు నీరు తప్పనిసరి. కానీ నీటి కొరత ఉన్నచోట పవిత్రత సాధ్యంకాదు. మనం పవిత్రంగా ఉండడమే కాదు. తీసుకునే ఆహారం కూడా పవిత్రంగా ఉంటాం. ఇది కూడా ప్రస్తుత సమాజంలో చాలా కష్టం. అందుకని మనం ఎల్లప్పుడూ భగవన్నామ స్మరణను అలవరచుకుంటే మనసు ఎప్పుడూ పవిత్రంగా ఉంటుంది. సాధారణంగా పవిత్రత వల్ల ఆరోగ్యంగా ఉంటారు. మనమూ మన పరిసరాలు, గృహం, ఆలయం ఇవన్నీ పవిత్రంగా ఉంచుకోవడానికి ప్రయత్నించాలి. ఆహారం విషయంలో రుచికి ఎంత ప్రాధాన్యమిస్తామో శుచికి కూడా అంతే ప్రాధాన్యమివ్వాలి. ఆహారం, విహారం, వ్యవహారం పవిత్రంగా ఉండాలని శ్రీకృష్ణ పరమాత్మ ఉపదేశించాడు.

**19. దక్షుడు (కార్యనిర్వహణా సమర్థుడు):**

ఎంతటి గొప్ప కార్యాన్నయినా అవలీలగా పూర్తిచేయగలవాణ్ణే దక్షుడు అంటారు. సమగ్రంగా సంపూర్ణంగా నిర్వహించగలిగే యోగ్యత కలిగి ఉండాలి. చిన్న కార్యాలయందు నిర్లక్ష్యం, పెద్ద కార్యాలందు అశక్తత పనికిరాదు. తగిన బుద్ధిబలం, ధైర్యం ఉన్నపుడే ఏ కార్యాన్నయినా సమర్థవంతంగా పూర్తిచేయగలుగుతాం. మానవ జీవితమే ఒక కురుక్షేత్ర సంగ్రామం. ఇది ధర్మాధర్మాలకు సంబంధించిన యుద్ధం.. ధర్మానికే విజయమని అందరికీ తెలుసు. కాని అధర్మాన్ని పోషిస్తూ, దానియందే రమించడం జరుగుతుంది. అధర్మాన్ని ఓడించి దక్షుడుగా మారాలి. ఒక కార్యక్రమం పూర్తిచేయడానికి ధైర్యసాహసాలతో పాటు యుక్తి, చాతుర్యాలు కూడా అవసరం. ఇవన్నీ దైవానుగ్రహం వల్ల మనకు సమకూరతాయనడంలో సందేహం లేదు.

కురుక్షేత్ర సంగ్రామంలో శ్రీకృష్ణపరమాత్మ అనుగ్రహం వల్లనే పాండవులు అధర్మంపై విజయం సాధించారు. దైవం కూడా ధర్మం వైపే ఉంటుంది. మనం

ధర్మాన్ని సక్రమంగా ఆచరిస్తే దైవానుగ్రహం లభిస్తుంది. దీనికి ఎంతో సాధన అవసరం. భక్తులలోని ప్రతి లక్షణం అమూల్యమైంది. వీటన్నిటినీ పొందడానికి ప్రయత్నించినపుడే పరిపూర్ణ భక్తి సిద్ధిస్తుంది.

**20. ఉదాసీనుడు (దేనియందూ ఆసక్తిలేనివాడు):**

ఉదాసీనత అన్నిటికంటే అత్యుత్తమమైంది. ఇది చాలా కష్టమైన లక్షణం. దీన్ని అలవరచుకున్నవారు ప్రపంచాన్ని జయించినట్లే. మనకు కనిపించే ప్రతి వస్తువు, పని, దానివల్ల కలిగే ఫలితంపై ఉదాసీనతను కలిగి ఉండాలి. ఉదాసీనం వేరు, వైరాగ్యం వేరు. విధిగా చేయవలసినవి చేస్తూ, లాభం వచ్చినా, నష్టం వచ్చినా బాధను, సంతోషాన్ని వ్యక్తపరచకపోవడం ఉదాసీనమవుతుంది. మన పనిని మనం చేస్తూ పోవడం తప్ప దానివల్ల కలిగే సుఖదుఃఖాలపై మౌనం వహించడం ఇందులోని రహస్యం. రాగద్వేషాలు లేకుండా ఉండగలిగినప్పుడే ఇది సాధ్యమౌతుంది. అంతా దైవంపై భారం వేయాలి. విధి నిర్వహణకు ఆటంకం కారాదు. మన కర్తవ్యాన్ని మనం మర్చిపోకుండా ఎల్లప్పుడూ దైవ చింతనలో కాలం గడపడానికి మంచి అవకాశం ఏర్పడుతుంది. అందుకే ఉదాసీనులం కావాలి.

ప్రపంచం యొక్క నిజస్వరూపం తెలియాలి. మానవ జీవిత పరమార్థమేంటో తెలుసుకోవాలి. అప్పుడే ఉదాసీనత అలవడుతుంది. ప్రతి దాన్నీ ఆనందంగా స్వీకరించగలగాలి. ఆందోళన పనికిరాదు. ప్రయత్నం మానరాదు. ఫలితాన్ని వదిలి వేయాలి. ఒక లక్షణం మరొక లక్షణంపై ఆధారపడి ఉంటుంది. కాని ధర్మాన్ని ఆచరించే విషయంలో మాత్రం ఉదాసీనత పనికిరాదు. శ్రీకృష్ణుడు ధర్మాచరణం కొరకు అవతారాన్ని ధరించాడు. ఏ విషయంపైనా ఆసక్తి కనబరచకుండా ఉంటే ఉదాసీనత సాధింపబడుతుంది.

**21. నిర్భయుడు (గత వ్యథః) (మనస్సులో భయంలేనివాడు):**

మనోవ్యాకులత మంచిదికాదు. మనసులో ఏమాత్రం భయమున్నా అది ఆందోళన కలిగిస్తుంది. ఆందోళన వల్ల మనసు బలహీనమవడం, బలహీనమైన మనసు కలవాడు ఏ కార్యాన్నీ సమర్థంగా పూర్తి చేయలేడు. భయానికి కారణాలు

అనేకం ఉంటాయి. ఏ కారణంగానైనా భయాన్ని మనస్సులోకి రానీయకుండా జాగ్రత్తపడాలి. దీనికి ఒక్కటే మార్గం. భగవంతుణ్ణి మనసారా శరణువేడటమే. ఎక్కడైతే భగవచ్ఛరణాగతి ఉంటుందో అక్కడ భయం అనేది ఉండదు. నిరంతరం భగవన్నామం జపించేవారికి భయం కలిగే అవకాశముండదు. భయాలన్నింటి లోకెల్లా ప్రాణభయం గొప్పది. మనకున్న ప్రాణాన్ని రక్షించుకోవడమే మన కర్తవ్యం. కానీ ప్రాణాన్ని నియంత్రించలేం. జనన మరణాలు దైవాధీనాలే. ఇది జగమెరిగిన సత్యం.

మనం నియంత్రించలేని ప్రాణంపై భయమెందుకు? ప్రాణం పోసినవాడే రక్షకుడు. ఉన్నంతవరకు కాపాడుకోవడమే మన పని. భయ పడుతూ కాలం గడిపే దానికంటే నిర్భయులమై దైవాన్ని ప్రార్థించడం ఉత్తమం. ప్రాణభీతి లేనివారికి మోక్షం కరతలామలకమౌతుంది. సంకోచం లేకుండా భయం ఉండదు. భయానికి మూలకారణమైన సంకోచాన్ని వదిలివేయాలి. యథార్థం తెలిసినప్పుడు సంకోచం ఉండదు. ముందుగా యథార్థ జ్ఞానం పొందడానికి ప్రయత్నించాలి. సద్గురువును ఆశ్రయించినట్లయితే యథార్థ జ్ఞానం కలుగుతుంది.

**22. సర్వారంభ పరిత్యాగి (అన్ని పనుల ఆరంభాన్ని వదిలి వేయడం):**

ప్రపంచంలో ఏ ప్రాణీ పనిచేయకుండా ఉండలేదు. కాని జీవించడానికి సంబంధించిన పనులు తప్ప ఇతరములైన పనులను ఆరంభించకూడదని పరమాత్మ ఉద్దేశ్యం. ముఖ్యంగా అనవసరమైన పనుల జోలికి వెళ్లకూడదు. సమయం, శక్తి ఉందికదా అని కొన్ని పనులను మనం కావాలని నెత్తిన వేసుకుంటాం. ఇది పనికిరాదంటాడు పరమాత్మ. ఏ పని అయినా చేయగలిగిన శక్తి ఉన్నట్లే, ఏ పనీ చేయకుండా ఉండడం కూడా గొప్ప విషయమే. దీనికి కూడా సాధన అవసరం. ఏ పనీ చేయకుండా ఉండడం అంటే అసమర్థత కాదు. సాధకుడు మాత్రమే ఏ పనీ చేయకుండా ఉండగలడు. సోమరితనం వల్ల ఏ పనీ చేయకుండా ఉండడం వేరు. భక్తుడు నిరంతరం దైవచింతనలోనే కాలం గడుపుతూ ప్రాపంచిక పనులేవీ చేయకుండా ఉండడం వేరు. ఈ రెంటికీ చాలా వ్యత్యాసం ఉంది. భగవంతుడు ఉపదేశించింది సోమరిగా ఉండమని కాదుకదా!

నిరంతరం దైవచింతనలో ఉండడం కోసం ఏ పనీ చేయవద్దన్నాడు. అనేక పనులు చేయడానికి కూడా మనసు, శరీరం సహకరించదు. ఫలితాలన్నింటినీ పొందలేం. మన కర్తవ్యమేదో తెలుసుకుని దానికై నిరంతరం ప్రయత్నిస్తూ, ఇతర పనుల జోలికి వెళ్లకుండా ఉండడం బుద్ధిమంతుల లక్షణం. భక్తులైనవారు నిజంగా చేయవలసింది ఇదేనని తెలుసుకోవాలి. అలాంటి భక్తులే తనకిష్టమని అంటాడు పరమాత్మ.

**శ్లో॥ యో న హృష్యతి న ద్వేష్టి న శోచతి న కాంక్షతి ।**
**శుభాశుభ పరిత్యాగీ భక్తిమాన్ యః సమేప్రియః ॥**

(భగవద్గీత భ.యో-12-17)

తా॥ ఏ భక్తుడు కోరినవి లభించగా సంతోషింపడో, కోరకుండా లభించిన వానిని ద్వేషించడో, ఇష్టమైనవి నష్టమైనపుడు దుఃఖింపడో, సాధ్యంకాని వానిని కోరడో, ఎవడు పుణ్యపాపాలకు సంబంధించిన శుభాశుభ కర్మలను వదిలివేయునో అతడు నాకు ఇష్టుడు.

## 23. కోరినవి లభించిన సంతోషింపకూడదు

మనం సహజంగా కోరినవి లభించినపుడు సంతోషిస్తాం. సంతోషం కలిగించే వాటినే కోరుకుంటాం. సృష్టిలోని అన్నీ మనకు సంతోషాన్ని కలిగించవు. అలాగని అందరికీ అన్నీ కూడా సంతోషాన్నివ్వవు. ఇది సృష్టి వైచిత్ర్యం. అనగా వారి వారి సంతోషాన్ని బట్టి వారి కోరకలుంటాయి. ఉదాహరణకు రాజుకు యుద్ధమంటే సంతోషం. సామాన్య ప్రజలకు యుద్ధమంటే దుఃఖం. ఇక్కడ ఇరువురి కోరికలు భిన్నంగా ఉన్నాయి. సృష్టిలోని అన్నీ సంతోషాన్నిచ్చేవే అందామా అంటే కాదు. మరి అన్నీ కూడా దుఃఖాన్నే ఇస్తున్నాయా అంటే కూడా కాదు. ప్రతి విషయం సంతోషాన్ని, దుఃఖాన్నీ కూడా ఇస్తుంది. మనమంతా కూడా సృష్టిలోని వారమే కదా!

కేవలం మనకు సంతోషాన్నిచ్చే వాటినే కోరుకోవడం, కోరినవి లభించగానే సంతోషించడం ఎంతవరకు సమంజసం? అందుకే మనం కోరినా, కోరకున్నా లభించేవి లభిస్తూనే ఉంటాయి. అలాగే సంతోషాన్ని కూడా కోరినా, కోరకపోయినా

పొందవచ్చు అని తాత్పర్యం. లౌకిక విషయాలను కోరి, దానివలన కలిగే క్షణికమైన సంతోషాన్ని పొందనవసరం లేదంటాడు భగవంతుడు. మనమొక్కరమే సంతోషాన్ని పొందే కోరిక కోరకూడదు. మన కోరికవలన విశ్వమంతా సంతోషాన్ని పొందాలి. అలాంటి కోరికలనే కోరాలి అని శ్రీకృష్ణ భగవానుని ఉపదేశం, ఆదేశం.

## 24. కోరకుండా లభించిన దానిని ద్వేషించకూడదు :

సృష్టిలో మనం కోరకుండానే మనకు కొన్ని లభిస్తాయి. వాటిని ద్వేషించవద్దు. ఉదాహరణకు అనారోగ్యాన్ని మనమెవరం కోరుకోం. ఐనా మనల్ని పీడిస్తూనే ఉంటుంది. దానిపై ద్వేషం పనికిరాదు. సహజంగా ఇష్టమైన వానిపై రాగం అనగా ప్రేమ, అయిష్టమైన వానిపై ద్వేషం అనగా పగ (కోపం) వస్తాయి. ఇవి రెండూ మన మనస్సుకు సంబంధించిన గుణాలు. రాగద్వేషాలు రెండూ భయంకరమైనవి. ఈ రెండింటినీ ఎవరు వదిలివేస్తారో వారే నిజమైన భక్తులు. ఎవరికైనా సంతోషాన్ని కలిగించేవైనా, దుఃఖాన్ని కలిగించేవైనా మన ప్రారబ్ధాన్ని బట్టే వస్తాయి. మనం కోరుకునే కోరికలు పూర్వజన్మ వాసనను అనుసరించి ఉంటాయి. అందుకే అందరికీ ఇవి ఒకేలా ఉండవు.

పూర్వజన్మ కర్మానుసారం ఈ జన్మ లభిస్తుంది. జన్మించిన కుటుంబం, కుటుంబంలోని వారి మనస్తత్వాలు, స్థితిగతులు, పరిసర వాతావరణం, సహవాసం, వ్యక్తిగత అభిరుచులు మొదలగువాటిని బట్టే మన కోరికలు ఉంటాయి. అలాగే కోరకుండా వచ్చేవి కూడా పై వాని మూలంగానే వస్తాయి. కోరగా వచ్చిన ఫలితాన్ని అనుభవించినపుడు కలిగే సంతోషాన్ని, కోరకుండా వచ్చిన బాధను అనుభవించినపుడు కలిగే దుఃఖరూపమైన ద్వేషాన్ని పూర్తిగా వదిలివేయాలి. అనగా తటస్థ వైఖరిని అవలంబించాలి. ఉదాసీనతను అభ్యసించాలి. కొందరికి కోరకుండా సంతోషం, కోరినా దుఃఖం కూడా కలిగే అవకాశాలుంటాయి. అయినా కోరినా, కోరకున్నా లభించిన రాగద్వేషాలు లేకుండా చేసుకున్నపుడే భక్తుడు అవుతాడు.

మనకు కష్టాలు కలిగినపుడే భగవంతున్ని ప్రార్థించి, పూజలు, హోమాలు చేయడం భక్తి అనబడదు. ఆ చేసేవి భక్తితో చేయాలి.

## 25. ఇష్టమైనవి నష్టమైనపుడు దుఃఖించవద్దు :

ముందుగా ఇష్టమైన వానిని కోరతాం. కోరినవి లభించిన వెంటనే సంతోషం కలుగుతుంది. ఆ లభించినవి శాశ్వతంగా ఉండడానికి ప్రయత్నిస్తాం. అవి మధ్యలో అనగా పూర్తికాలం ఉండక నష్టమైనపుడు దుఃఖం (బాధ) కలుగుతుంది. ఈ దుఃఖాన్ని కూడా పొందకూడదంటాడు పరమాత్మ. ఇష్టమైన వస్తువు కాని, వ్యక్తిగాని, మరేదైనాగాని వదిలివేయడమంటే సాధ్యం కాదుగదా! అలాగని సృష్టిలో ప్రతి వస్తువు లేదా వ్యక్తి శాశ్వతంగా ఉంటుందా? అంటే ఉండదుకదా! ఇది సృష్టి నియమం. పుట్టింది ప్రతీదీ గిట్టేదే. పైగా పుట్టిన దగ్గర్నుండి ప్రతీది క్రమేణ మార్పు చెందుతూ ఉంటుంది.

మనం సర్వస్వతంత్రులం కాదు. సర్వశక్తిమంతులం అంతకంటే గాదు. సృష్టిని నియంత్రించే శక్తి ఏ ఒక్క మానవ మాత్రునికీ లేదు. ఐనపుడు నష్టపోవడాన్ని ఆపలేం కదా! అందుకు దుఃఖించడం దేనికి? అంటాడు భగవంతుడు. చెప్పడానికి ఇది చాలా తేలికగా ఉంది. కానీ అనుభవించడం సాధ్యమా? అందుకే భగవద్గీతను బోధించాడు. తెలివి కలిగిన ప్రతివాడు తెలుసుకోవలసిన సత్యాలివి. భక్తుడు అనగానే కేవలం దేవాలయం వెళ్లి, ప్రదక్షిణ నమస్కారాలు, పూజలు చేస్తే సరిపోదు. ఈ భక్తుల లక్షణాలన్నీ ఖచ్చితంగా అలవరచుకున్నపుడే నిజమైన భక్తుడవుతాడు. భగవంతునికి ఇష్టుడవుతాడు.

## 26. సాధ్యం కాని వాటిని కోరకూడదు :

కోరడం మానవ సహజం. ఎలాగూ కోరుతున్నాం గదా అని గొంతెమ్మ కోరికలు పనికిరావు. మన స్థాయిననుసరించి, శక్తిననుసరించి, అనుభవించే స్థోమతను బట్టి కోరికలుండాలి. పురాణాల్లో రాక్షసులు లేనిపోని కోరికలు కోరి వారి నెత్తిమీదకు తెచ్చుకున్నారు. మనకు కావలసింది ఎలాగూ లభిస్తుంది. కానీ లభించేవరకు మనకు ఓపిక ఉండదు గనుక కోరుకోవడం తప్పనిసరి. ఆ కోరికలు మన జీవన విధానం సులభంగా సాగిపోయే విధంగా ఉంటే బాధలేదు. మనకు సాధ్యం కాని కోరికలు కోరుకొని అవి కాలేదే అని బాధపడడం దేనికి? అందుకే పరమాత్మ అన్నాడు. నాయనా! నీకు సాధ్యం కాని కోరికలు

ఏవి కోరకు! అని బుజ్జగించి చెబుతున్నాడు. ఈ మధ్యకాలంలో ఎక్కువగా కేవలం కోరికలు నేరవేరుట కొరకే భగవంతుణ్ణి ప్రార్థిస్తున్నారు, పూజిస్తున్నారు, నమస్కరిస్తున్నారు, ప్రదక్షిణలు చేస్తున్నారు. ఎక్కడ కోరికలు తొందరగా నెరవేరుతాయో తెలుసుకుని, ఆ దేవాలయాలకు, ఆయా స్థలాలకు, ఆయా వ్యక్తుల వద్దకు వెడుతున్నారు. ఎక్కడికి వెళ్లినా, వారి వారి ప్రారబ్ధ కర్మానుసారమే కోరికలు నెరవేరే సమయానికి నెరవేరతాయి. ప్రస్తుతం అందరికీ, అన్నిచోట్లా, అన్ని కోరికలు ఎట్టి పరిస్థితిల్లో నెరవేరవని శాస్త్రం చెప్పింది. మనం చేయవలసిందల్లా మన శక్తికి మించిన కోరికలు కోరకుండా ఉంటే చాలు. మనం కోరిన కోరికలు నెరవేరుట కొరకే పుణ్యకర్మలు చేయడానికి ప్రయత్నిస్తున్నాం. సరే! ఈ విధంగానైనా భగవంతుని సేవచేసి నిజమైన భక్తులవుతారని ఆశిద్దాం.

## 27. శుభాశుభ కర్మలను వదిలివేయాలి

మనం ఎప్పుడూ ఏదో ఒక పని చేస్తూనే ఉంటాం. మనం చేసే పనులు రెండు రకాలు. ఒకటి మంచి పని, రెండోది చెడ్డపని. మంచి పని చేస్తే మంచి జరుగుతుందని తెలుసు. చెడు పని అని తెలిసి కూడా మనకు మంచి ఫలితం రావాలనే దురాశతో చెడు పనులు చేస్తుంటాం. మంచి పని వలన మంచి కలిగినట్లే, చెడు పని వలన చెడు జరుగుతుంది కదా! అయినా మనం చెడు పని చేయడానికి వెనుకాడం. మంచి పని వల్ల పుణ్యం లభిస్తుంది. చెడు పని వల్ల పాపం వస్తుంది.

**శ్లో॥ పుణ్యస్య ఫల మిచ్ఛంతి, పుణ్యం నేచ్ఛంతి మానవాః ।**
**న పాప ఫలమిచ్ఛంతి, పాపం కుర్వంతి యత్నతః ॥**

అనగా పుణ్యం వల్ల కలిగే ఫలితం. మంచి జరగాలి. కాని మంచి పనులు చేయవద్దు. చెడు పని వల్ల కలిగే పాపం వద్దు కానీ చెడు పనులు చేయడానికే ప్రయత్నిస్తారు.

మంచి పనులైనా, చెడు పనులైనా చేయకుండా ఉండాలంటాడు భగవంతుడు. అనగా ఏ పనీ చేయకుండా సోమరిగా ఉండమని కాదు. ఆ

పనుల వల్ల వచ్చే ఫలితంపై దృష్టి లేకుండా ఉండాలని ఒక అర్థమైతే, ప్రత్యేకంగా పనిగట్టుకుని పుణ్యం రావాలని మంచి పనులు చేయడం, పాపం వచ్చినాసరే అని చెడు పనులు చేయడం కూడదని పరమాత్మ యొక్క పరమార్థం. నీవు ధర్మానుసారం నీ శక్త్యానుసారం చేయవలసిన పనిని శ్రద్ధగా చేయి. ఇంతకీ మానవులు చేయవలసిన పని ఏమిటి? సంసారాన్ని పోషించడం, పిల్లలను కనడం, డబ్బు సంపాదించడం, పేరు ప్రతిష్ఠలు పొందడం కావుగదా! మరేం చేయాలి? మానవ జీవిత లక్ష్యమైన, జన్మసార్థకమయ్యే మోక్ష సామ్రాజ్యాన్ని పొందడానికి ప్రయత్నించాలి. మోక్ష సాధనకు సంబంధించిన పనులు తప్ప ఇతరములైన పుణ్యపాపాలిచ్చు పనులను చేయకూడదు. ఇదే నిజమైన భక్తుల లక్షణం.

భక్తుడు భక్తుడుగా కాకుండా సాధకుడుగా మారాలి. సాధకుడు తన లక్ష్యసాధనకై సిద్ధిని పొందాలి. అప్పుడే జన్మ సార్థకమవుతుంది. మోక్షం కరతలామలకమవుతుంది. అందుకే ప్రత్యేకించి శ్రీకృష్ణ భగవానుడు శ్రీమద్భగవద్గీతలోని భక్తియోగంలో భక్తుల లక్షణాలను క్రమంగా వివరించాడు. ఈ లక్షణాలను తూ.చ. తప్పకుండా ఎవరు ఆచరిస్తారో వారికి మోక్షం తప్పక సిద్ధిస్తుంది.

**శ్లో॥ సమః శత్రౌ చ మిత్రేచ తథా మానావమానయోః ।**
**శీతోష్ణ సుఖ దుఃఖేషు సమః సంగ వివర్జితః ॥**

(శ్రీమద్భగవద్గీత భ.యో. (12) శ్లో. 18)

శత్రు, మిత్రలను సమానంగా చూచువాడు, సన్మాన, అవమానములందు ఒకే రీతిగా ఉండువాడు, శీతోష్ణములు, సుఖదుఃఖములందు సమభావం కలిగి ఉండేవాడు, ఆసక్తి రహితుడైన భక్తుడు నాకు ప్రియుడని శ్రీకృష్ణ భగవానుడు సెలవిచ్చాడు.

### 28. శత్రు, మిత్రులందు సమభావం కలిగియుండుట:

మనకు ఎవరు శత్రువు? ఎవరు మిత్రుడు? అని ప్రశ్నించుకోగా, అపకారం చేసినవాడు శత్రువవుతున్నాడు. ఉపకారం చేసేవాడు లేదా మేలు కోరేవాడు

మిత్రుడవుతున్నాడు. వీరిరువుర్నీ సమానంగా చూడమంటాడు భగవానుడు. సహజంగా మిత్రుని యందు ప్రేమ, శత్రువు యందు కోపం కలిగి ఉంటాం. ఇది మానవులలోగా జంతు, పశుపక్ష్యా దులలో, క్రిమికీటకాదులలోనూ ఉంది. దైవ సృష్టిలో శతృభావం కూడా ఒకటి. దీనిద్వారానే ధర్మ సంరక్షణార్థమై అవతారాలెత్తి దుష్ట సంహారం చేశాడు పరమాత్మ. చివరకు ఆ శతృవులను కూడా తరింపజేశాడు. జగన్నాటకంలో ఇవన్నీ పాత్రధారులు మాత్రమే. నిజంగా ఎవరికి ఎవరు శతృవులు కారు, మిత్రులు కారు. అంతా దైవస్వరూపమే అయినపుడు ఎవరికి ఎవరు శత్రువు? ఎవరికి ఎవరు మిత్రులు? అంతా సమానమే. ఇదంతా తాత్కాలికం. ఈ నిజాన్ని గ్రహించినవారు అందరిపై సమ భావమే కలిగి ఉంటారు.

ఉపకారికి ఉపకారం చేయడంలో విశేషం ఏమీలేదు. అపకారికి కూడా ఉపకారం చేసేవాడే గొప్పవాడని సుమతీ శతకంలో చక్కగా చెప్పాడు. ఐతే అపకారి యందు వైరభావం లేనపుడే ఇది సాధ్యమవుతుంది. కొన్ని సందర్భాలలో, కొన్ని ప్రదేశాలలో వైర జంతువులు కూడా సంఘీభావంతో ఉన్న సన్నివేశాలు మనకు కన్పిస్తాయి. అనగా స్థలప్రభావం, సమయ ప్రభావం సాధనాబలం చేత ఇది సాధ్యమవుతుంది. ధర్మరాజు అజాతశత్రువనిపించుకున్నాడు. తన సోదరులతో కలిసి కౌరవులపై యుద్ధం చేసి కూడా శతృవులను జయించాడు. శతృభావాన్ని జయించాడు. సాధ్యమైనంత వరకు మన నిత్యకృత్యాలలో శతృభావాన్ని పెంచుకోకుండా జాగ్రత్తపడితే "విశ్వశాంతి" ఏర్పడుతుందనడంలో సందేహమెంతమాత్రం లేదు. ప్రతి వ్యక్తి, ప్రతి భక్తుడు ఈ ఉత్తమ గుణాన్ని అలవరచుకోవడానికి ప్రయత్నించాలి. మరణానంతరం ఈ దేహాలన్నీ భస్మీభూతమవుతాయి. అందుకే మరణం వరకే శత్రువన్నారు. కాబట్టి జీవితాన్ని కేవలం మరణం కొరకే కాకుండా జీవించి ఉన్నప్పుడే శతృభావాన్ని లేకుండా చేసుకుంటే భక్తులవుతారు.

**29. గౌరవ అవమానాలందు సమభావం కలిగి ఉండాలి :**

ప్రతి వ్యక్తికి గౌరవం పొందాలనే కాంక్ష సహజంగా ఉంటుంది. నలుగురిలో

మంచిపేరు సంపాదించాలని, పదిమంది మెచ్చు కోవాలని తహతహపడు తుంటారు. అవమానాన్ని భరించలేరు. కొన్ని సందర్భాల్లో అవమానం కంటే ప్రాణత్యాగమే మేలనుకుంటారు. ఇది ఎంతవరకు సమంజసం? ప్రాణం కంటే అవమానం గొప్పదా? అవమానమనేది కేవలం క్షణికమైంది, తుచ్ఛమైంది. అలాగే గౌరవ సన్మానాలు కూడా. లోకం చాలా విచిత్రమైంది. ఎవరు, ఎప్పుడు, ఎవర్ని గౌరవిస్తారో, వారే ఎప్పుడు, ఎవర్ని అవమానిస్తారో తెలియదు. గౌరవించినవారే అవమానించడానికి వెనుకాడరు. ఒకప్పుడు అవమానించిన వారే మరొకప్పుడు గౌరవిస్తారు. లోకం కొరకు వారిచ్చే గౌరవ, అవమానాల కొరకు మన అమూల్య జీవితాన్ని త్యాగం చేయడం బుద్ధిమంతుల లక్షణం కాదు. జీవితంలో మానావమానాలు రెంటినీ భరించడానికి సిద్ధంగా ఉండాలి. మన లక్ష్యసాధన సరియైనదైనప్పుడు ఎవరు గౌరవిస్తేనేమి? ఎవరు అవమానిస్తే నేమి? భక్తుడైనవాడు దేనిని కోరరాదు. దైవికంగా లభించినపుడు రెంటిని స్వీకరించాలి. అలాగే భక్తులు కూడా అందరిని గౌరవించాలి తప్ప, ఎవరిని అవమానించడానికి ప్రయత్నించకూడదు. గౌరవం లభించినపుడు పొంగిపోకుండా, అవమానం కలిగినప్పుడు క్రుంగిపోకుండా ఉండమనే భగవానుని ఉపదేశం. అటువంటివారే భక్తులని, వారే తనకు ఇష్టులని అన్నాడు.

### 30. శీతోష్ణములందు సమభావం కలిగియుండాలి:

పంచభూతాత్మకమైన ఈ శరీరం నశిస్తుంది. పంచ జ్ఞానేంద్రియాలలోని చర్మమే స్పర్శజ్ఞానం కలిగి ఉంటుంది. దీనివల్ల ఇది చలి, ఇది వేడి, అని గుర్తించగలుగుతున్నాం. చలి అధికంగా ఉన్నపుడు వేడిని కోరుకుంటాం. వేడి అధికంగా ఉన్నప్పుడు చల్లదనాన్ని కోరుకుంటూ కాలం గడుపుతున్నాం. అనగా ఎక్కువ చలిని తట్టుకోలేం, ఎక్కువ వేడినీ తట్టుకోలేం. ఇది మానవ సహజం. ప్రకృతిలో రెండూ మనకు సమానంగా లభిస్తున్నాయి. అయితే దేనికీ మనం పూర్తిగా అలవాటు పడకుండా రెండింటినీ భరించగలగాలి. మానసికంగా ఈ భావం స్థిరపడితే ఏదీ మనల్ని బాధించదు. చలిని గాని, వేడిని గాని అనుభవిస్తున్నపుడు పదే పదే ఆ బాధను గుర్తుకు తెచ్చుకోవడం గాని, అనడం గాని చేయకుండా ఉండడడం మొదటి పని.

ఇక రెండవది.. శరీరాన్ని చలిని, వేడిని తట్టుకోవడానికి సిద్ధపరచాలి. సున్నితంగా తయారుచేయకూడదు. ప్రకృతికి అనుగుణంగా చలికాలంలో వేడిని సహాయంగా తీసుకుని చలిని జయించాలి. ఎండాకాలంలో చల్లదనాన్ని తగినంత తీసుకుని వేడిని అధిగమించాలి. అనగా రెండింటియందు సమభావాన్ని కలిగి ఉండాలి. ఊరికే మాటల వరకే, వ్యాసాల వరకే, ఉపన్యాసాల వరకే కాకుండా ఆచరణలో ఉండడానికి ప్రయత్నించినప్పుడే భక్తులవుతారు. ప్రతిరోజూ చన్నీటి స్నానం చేసిన వారికి శీతోష్ణ బాధలుండవు. శరీరాన్ని ఏవిధంగా అలవాటు చేస్తే, ఆ విధంగానే తయారవుతుంది. అందుకే భక్తులైనవారు ఆయా ప్రాంతాన్ననుసరించి, వాతావరణాన్ననుసరించి విధి విధానాలను, ఆచార సంప్రదాయాలను పాటిస్తే సులభంగా శీతోష్ణాలను జయించవచ్చు.

**31. సుఖ దుఃఖాలందు సమభావం కలిగి ఉండాలి:**

సుఖ దుఃఖ సమ్మేళనమే జీవితం. ఇంతకుముందు తెలిపిన లక్షణాలలో కూడా సుఖ దుఃఖ విషయం గూర్చి బాగుగా విశదీకరించబడింది. కాని ఇక్కడ సుఖం, దుఃఖం రెండింటి యందు సమభావం కలిగి ఉండాలన్నాడు భగవంతుడు. తాత్కాలిక సుఖాల వెంట దుఃఖం ఉండనే ఉంది. ఏ సుఖమైతే దుఃఖాన్ని కలిగించదో అది శాశ్వత సుఖం. అదే మోక్షం. మన ప్రయత్నించాల్సింది శాశ్వత సుఖసాధన. భక్తులెప్పుడూ మోక్ష సాధనకై ప్రయత్నించాలి. కనుక ప్రాపంచిక సుఖదుఃఖాలందు ఉదాసీన భావం కలిగి ఉండాలి. సుఖం కలిగిన వెంటనే సంతోషంగా ఉండడం, దుఃఖం కలిగిన వెంటనే బాధపడడం కూడదు. రెంటినీ అనుభవించక తప్పదు. కాబట్టి రెండింటియందు సమదృష్టినే కలిగి ఉండాలి. ఈ సుఖదుఃఖాలు లోకంలో అన్ని ప్రాణులకు సమంగానే ఉన్నాయి. మిగతా ప్రాణులు శాశ్వత సుఖమైన మోక్షాన్ని గూర్చి ప్రయత్నించవు. మనం విధిగా సాధన ద్వారా మోక్షాన్ని పొందాలి. సాధనలన్నింటిలో భక్తిని మించింది లేదు. అందుకే కృష్ణభగవానుడు భక్తి యోగంలో భక్తులకుండాల్సిన లక్షణాలను ప్రత్యేకంగా వివరించాడు. ఈ లక్షణాలను ఎవరైతే శ్రద్ధగా కలిగి ఉండడానికి ప్రయత్నిస్తారో వారికి మోక్షం కరతలామలకమవుతుంది. క్షణికమైన సుఖదుఃఖాలనే లక్ష్యంగా కలిగి ఉండకూడదు. శీతోష్ణములు ఎలాగో సుఖదుఃఖాలు కూడా అలాంటివే. ఇవి ఎప్పుడూ మారుతుంటాయి.

## 32. సంగవర్జితుడు అనగా ఆసక్తిరహితుడై ఉండాలి:

ప్రపంచమంతా ఆసక్తిమయమైంది. ఆకర్షణతో కూడింది. ప్రకృతి రమణీయాన్ని, అందులో గల వస్తువులు, వ్యక్తులు మొదలైన వానిపై ఉండే వ్యామోహాన్ని లేకుండా చేసుకోవాలి. ఇది కావాలి. ఇదైతే బాగుంటుంది అనే ఆలోచనలు భక్తులకు ఉండకూడదు. ప్రతీదీ భగవంతునిదే, భగవానునికి సమర్పించ కుండా ఏదీ మనం స్వీకరించడానికి అర్హత, హక్కు లేదు. ఇంద్రియాలు కాంక్షించే వానిపై ఆసక్తి ఉండకూడదు. కేవలం మోక్షాసక్తి తప్ప ఇతరాల్ని కోరరాదు. దీనికి ఒక్కటే మార్గం. సృష్టిని సృజించింది పరమాత్మకదా! ఆయన అనుమతి లేకుండా మనమేదీ పొందరాదు. అందుకే మనమేది తీసుకున్నా ముందుగా భగవానునికి సమర్పించి తీసుకుంటే క్రమేణ ఆసక్తి తగ్గుతుంది.

పరిమితికి మించిన వానిని కోరకుండా, తప్పనిసరిగా అవసరమైన వానిని శక్తివంచన లేకుండా తీసుకుంటూ, వానిని కూడా పరమాత్మకు సమర్పించడం అభ్యసించాలి. అంతా క్షణికమైందే అనే భావన బలంగా ఉన్నట్లయితే కూడా క్రమేణ ఆసక్తిని తొలగించుకోవచ్చు. వీలైనంతవరకు అవసరాలను తగ్గించుకోవాలి. ఆడంబరాలకు తావీయకూడదు. ఆధునిక ఆకర్షణను కలిగించే వస్తువులకు అవకాశమీయరాదు. ప్రతిదీ ఆసక్తిని కలిగించేవే. కనుక ఒక్కసారి దేనిపై ఆసక్తి కలుగుతుందో దాని గూర్చి విచారించి, దైవస్మరణ చేసినట్లయితే ఆసక్తిని జయించవచ్చు. ఎన్ని వస్తువులను పొందినా, ఇంకా అనేకం మనల్ని ఆకర్షిస్తూనే ఉంటాయి. జీవితమంతా సేకరించినా ద్రవ్యం సరిపోదు, స్థలం సరిపోదు. అందుకే భక్తుడైన వాడు సంగవర్జితుడు కావాలి. ఏకాంతవాసానికి అలవాటు పడాలి. దైవ సాన్నిధ్యాన్ని తప్ప ఇతర ప్రదేశాలకు వెళ్లరాదు. ఇతర ప్రసంగాలు చేయరాదు. ఇతర వ్యక్తుల సహవాసం కోరరాదు. ఇలా క్రమేణా సాధన చేస్తూ పోతే ఆసక్తి తగ్గుతుంది.

**శ్లో॥ తుల్య నిందా స్తుతిర్మౌనీ సంతుష్టో యేన కేన చిత్।**
**అనికేతః స్థిరమతిః భక్తిమాన్మే ప్రియో నరః ॥**

(శ్రీమద్భగవద్గీత–భక్తియోగం–19వ శ్లోకం)

ప్రశంసను, నిందను సమంగా గ్రహించేవాడు, మౌనం అనగా వాక్సంయమం కలవాడు, ఏది లభించినా తృప్తినందేవాడు, నిర్దిష్టమగు నివాసస్థానం లేనివాడు, నిశ్చలచిత్తుడు, భక్తి యుక్తుడు అగు మానవుడు నాకు ఇష్టుడని తాత్పర్యం.

**33. నిందను, ప్రశంసను సమంగా గ్రహించుట:**

మనమంతా ప్రశంసలనే కోరుకుంటాం. నిందను భరించలేం. పొగడ్తల కోసం ఎన్నో పనులు చేస్తాం. చేసిన ప్రతి పనిని నలుగురు మెచ్చుకోవాలని చూస్తాం. మంచి పనులైతే అందరూ హర్షిస్తారు, మెచ్చుకుంటారు. కాని చెడుపనులు చేసి, అందరూ మెచ్చుకోవాలనుకోవడం పొరపాటు. చెడు చేసిన వారిని సమాజమెప్పుడూ నిందిస్తుంది. కాని కొన్ని సార్లు కొందరికి చెడు చేయకున్నా కూడా నిందలు భరించాల్సి వస్తుంది. అలాగే ప్రశంసలు కూడా కోరకుండానే లభిస్తాయి. అయితే ఇవి తాత్కాలికాలు. ఎవరు ఎవర్ని నిందించినా, స్తుతించినా వాటిని పట్టించుకోకుండా ఉండాలంటాడు భగవానుడు.

ఒకప్పుడు మెచ్చుకున్నవారే మరొకప్పుడు నిందించడానికి వెనుకాడరు. ఒకప్పుడు నిందించినవారే మరొకప్పుడు మెచ్చు కుంటారు. ఇది లోకసహజం. కొందరు పొగడ్తలకు పొంగిపోయి, నిందలకు క్రుంగిపోతారు. ఇవి రెండూ విరుద్ధ లక్షణాలు. దేనికీ కూడా చలించక మనం మన కర్తవ్యాన్ని చక్కగా నిర్వర్తిస్తున్నప్పుడు ఏది జరిగినా భరించాలి. అందుకు సిద్ధంగా ఉండాలి. భక్తులు ఈ రెంటినీ సమంగానే చూడాలి.

**34. మౌనం (వాక్ సంయమం) కలిగియుండడం:**

మౌనం అంటే మాట్లాడకుండా ఉండడం అని అర్థం. అలాగని మొత్తంగా ఎవరితోనూ, ఎల్లప్పుడూ మాట్లాడకుండా ఉండడం కాదు. మితంగా మాట్లాడాలి. చాలామందికి అవసరమైనదాని కన్నా ఎక్కువ మాట్లాడే అలవాటు ఉంటుంది. ఇది పనికిరాదు. ఎవరితో, ఎప్పుడు, ఎంతవరకవసరమో అంతే మాట్లాడాలి. ఎప్పుడూ అవసరం లేకున్నా కూడా ఇతరులను నిందించడమో, పొగడడమో చేస్తే మౌనం సిద్ధించదు. కాలక్షేపం కోసం కొందరు అదేపనిగా మాట్లాడుతూనే

ఉంటారు. దానివలన మన శక్తి అంతా వృథా అవడమే కాక భక్తికి ఆటంకం కలుగుతుంది. అందుకే మౌనంగా ఉండమన్నాడు పరమాత్మ. ఇందుకు సాధారణంగా చెబుతుంటారు. రెండు చెవులున్నాయి. ఒకే నోరుంది కదా! అందుకని ఎక్కువ వినాలి, తక్కువ మాట్లాడాలి అని.

ఎక్కువ వినడం వల్ల కూడా మౌనం సిద్ధించదు. కాబట్టి మాట్లాడడం ఎలా మితం చేస్తామో అలాగే మితంగానే వినాలి. ముఖ్యంగా భక్తులకు చాలా ఉపయోగం ఉంది. భక్తులకే కాదు అందరికీ మౌనం అవసరం. "మౌనేన కలహం నాస్తి" అనే సూక్తి కూడా అందరికీ తెలుసు. మౌనం గొప్పతనం ఆచరణలోనే తెలుస్తుంది. సాక్షాత్తూ పరమాత్మ భక్తుల లక్షణాలలో మౌనాన్ని చేర్చాడు. ముఖ్యంగా దేవాలయాల్లో, ధార్మిక కార్యక్రమాలు జరిగే స్థలాల్లో ఖచ్చితంగా మౌనాన్ని పాటించవలసిందే.

### 35. ఏది లభించినా తృప్తి పొందడం:

ఎన్నో కావాలని కోరుకుంటాం. ఎన్ని లభించినా తృప్తి చెందక అహర్నిశలూ ఇంకా ప్రయత్నిస్తూ ఉంటాం. మనకు ఆశ అవసరమే కానీ, అత్యాశ పనికిరాదు. ఆశ వల్ల ఏదో ఒక పని ప్రారంభిస్తాం. ఆ పని వల్ల ఏదో కొంత లభిస్తుంది. దాంతో తృప్తి చెందడం అవసరం. అలా కాకుండా ఇంకా కావాలని అత్యాశతో ఉరుకులూ పరుగులూ తీయడం వల్ల ఉపయోగం ఉండకపోగా సమయం, శక్తి, వృథా అవుతాయి. భక్తులైనవారు లభించిన దానితో తృప్తి పడడం నేర్చుకోవాలి. మరో ముఖ్య విషయం ఏమిటంటే మనకు ప్రాప్తం ఉన్నంతవరకే లభిస్తుంది. దానికి మించి ఎంత ప్రయత్నించినా ఫలితం ఉండదు. అందరూ ఏమనుకుంటారంటే మనకు ప్రాప్తమున్న సంగతి ముందుగా తెలియదుకదా! అందుకే తీవ్ర ప్రయత్నం చేస్తున్నామంటారు. నీ శక్తి మేరకు నీవు ప్రయత్నిస్తే ఏది లభి స్తుందో అదే ప్రాప్తమని తెలుసుకోవాలి. దాంతో నీవు తృప్తిపడలేదంటే అది నీ ఖర్మ. తృప్తి అనేది ఉంటే ప్రాప్తం అదే తెలుస్తుంది. ఏది లభించినా తృప్తిపడడం ఒక విషయమైతే, లభించిం దాంతో తృప్తిపడడం మరో విషయం. ఈ రెండూ చాలా దగ్గరవి, అనుభవంలో మాత్రమే తెలుస్తాయి. తృప్తిని మించిన

స్వర్గం లేదు. ఆశను మించిన నరకం లేదు. అందుకే ప్రతి ఒక్కరూ తృప్తిపడడానికి ప్రయత్నించాలని భగవానుని ఉపదేశం.

### 36. నిర్దిష్టమైన నివాసస్థానం లేకపోవడం:

ఒకేచోట కదలకుండా ఉండాలని అందరూ కోరుకుంటారు. ఇది సహజం. కానీ ప్రకృతి అంటేనే మార్పు జరిగేదీ అని అర్థం. ఏదీ శాశ్వతమైంది కాదుకదా! మనం ఒకేచోట ఎప్పుడూ నివసించాలని కోరుకోవడం కూడా తగదు. ప్రకృతికి అనుగుణంగా మనమూ ఉండాలి. ఒకేచోట ఉండడం వల్ల ఆ స్థలంపై మమకారం పెరుగుతుంది. చివరకు దాన్ని వదలడం సాధ్యం కాదు. అందుకని నివాసమార్పులకి సిద్ధంగా ఉండాలంటాడు భగవంతుడు. సూక్తుల్లో "ఏకావాసం పత్తనం వా వనం వా" అని ఉంది. ఇది కేవలం సామాన్యుల కొరకు చెప్పబడిందే కాని భక్తుల కొరకు కాదు. పదే పదే నివాసం మారడం వల్ల లోకంలో పలుకుబడి దెబ్బతింటుందని, వ్యాపారం సాగదని అనుకుంటారు. ఇది వ్యవహారం. భక్తుడు చేసేది వ్యవహారం కాదు, కాకూడదు. అందుకే మనం ఏ స్థలంలోనైనా ఉండగలగాలి. ఎన్ని స్థలాలనైనా మారగలగాలి. అంతా దైవేచ్ఛగా భావించాలి. అప్పుడు మనకి ఏవిధమైన ఆయాసం ఉండదు. స్థలం మారి నంత మాత్రాన మనకు నష్టం ఏదీ ఉండదు. పైగా భక్తుల కుండవలసిన లక్షణం కూడా సిద్ధిస్తుంది. సన్యాసులకు ఒక్క క్షణం కూడా ఒకచోట ఉండకూడదనే నియమం ఉంది. ఎప్పుడూ పర్యటిస్తూనే ఉండాలని చెప్పారు. అలాగే భక్తులకు కూడా ఒకేచోట ఎల్లప్పుడూ నివసించకూడదనే లక్షణం గీతలో చెప్పబడింది. చాలామంది భక్తిమార్గం చాలా సులభం అనుకుంటారు. ఇందులో తెలిపిన లక్షణాలన్నీ సాధించినప్పుడు కదా! భక్తులయ్యేది. కేవలం పైపైగా తమ కోర్కెలు నెరవేర్చుకోవడా నికి గుడికి అలా వెళ్ళి, నమస్కరించి తీర్థప్రసాదాలు తీసుకుంటే సరిపోదని గుర్తించాలి. ప్రాథమిక దశలో ఇవి అవసరమే కానీ, అదే నిజమైన భక్తికాదు. అలాచేసేవారు నిజమైన భక్తులూ కారు.

### 37. నిశ్చలచిత్తం కలిగి ఉండడం:

చిత్తానికి రెండు విపరీతమైన లక్షణాలున్నాయి. ఒకటి చంచలమైతే రెండవది నిశ్చలం. ఇది ఎలా సాధ్యమనిపిస్తుంది. దీనికీ ఒక చక్కని ఉదాహరణ ఉంది.

నీరు ఎల్లప్పుడూ ప్రవహించేదే కదా... అంటే చంచలం. అదే నీటికి గడ్డకట్టే తత్వం కూడా ఉంది. ఇది మన స్వానుభవంలో అందరికీ తెలుసు. ప్రవహించే నీటికి ఎక్కువ శీతలాన్ని కలిగిస్తే అది గడ్డకడుతుంది. అంటే నిశ్చలమవుతుంది. అలాగే చిత్తం.. అంటే మనసు కూడా చంచలమే. కానీ దానిని సాధన ద్వారా నిశ్చలం చేయొచ్చు. నిశ్చలమైన చిత్తమే భక్తుల లక్షణంగా భగవానుడు పేర్కొన్నాడు. ఇదెలా సాధ్యం? సాధన ఏమిటి? అనే ప్రశ్నలు గీతలోనే అర్జునుడు శ్రీకృష్ణ పరమాత్మనడిగాడు. అభ్యాసం, వైరాగ్యం అనే సాధనల ద్వారా నెమ్మదిగా చిత్తం నిశ్చలమవుతుందని స్పష్టంగా చెప్పాడు. ఏ సాధనకైనా మొట్టమొదటిది అభ్యాసమే. అభ్యాసం లేకుండా ఏ సాధన సిద్ధించదు. చిత్తం నిశ్చలమవడానికి అభ్యాసమే ముఖ్యమైన సాధన అని తెలుసు కోవాలి, అభ్యసించాలి. సహజంగా ప్రతి ఒక్కరూ మనసు (చిత్తం) చలిస్తుంది ఎలాగ? అని వదిలివేస్తారు. అభ్యసించమని ఎందరు చెప్పినా ప్రారంభంలో ఆసక్తి చూపిస్తారు తప్ప చివరి వరకు అభ్యసించరు. అభ్యాసలోపం వల్ల నిశ్చలమయ్యే అవకాశం లేదు. కానీ చిత్తం నిశ్చలమవడం దాని సహజగుణం. ఇందులో ఎలాంటి సందేహానికి తావులేదు.

**38. భక్తియుక్తుడవడం:**

భక్తి అంటే 'భగవంతునిపై ప్రేమ' అని చెబుతారు. భగవంతునిపై ప్రేమ ఎలాగ? అనే సందేహం వస్తుంది. భగవంతుడిపై ప్రేమ అనవచ్చు. లేదా నిష్కల్మషమైన, నిరాడం బరమైన, సాత్వికమైన, సహజమైన ఆదరాభిమానాలను తన తోటి ప్రాణులపై, సమాజంపై కలిగి ఉండడం భక్తి అనొచ్చు. భగవంతుడు అనగానే కేవలం దేవాలయాల్లోని విగ్రహాలు అనే భావన మనలో ఉంటుంది. కాని సృష్టి అంతా భగవంతుడే అనే విషయం తెలుసుకోవాలి. ఇది తెలుసుకోవడం కొరకే దేవాలయాలు. ఇక ప్రేమ అనే పదం యువతీ యువకులకే వాడడం అలవాటుగా మారింది. మాతృప్రేమ, పితృప్రేమ, పుత్రప్రేమ, మిత్రప్రేమ, లోకప్రేమ... ఇలా ప్రేమ ఎన్నో రకాలుగా ఉంటుంది. సర్వం ప్రేమమయంగా మారినపుడే 'భక్తి' అవుతుంది. అలాంటి భక్తిని కలిగి ఉండాలని శ్రీకృష్ణ

పరమాత్ముడు బోధించాడు. భక్తిని కలిగి ఉండడానికి కూడా సాధన అవసరం. ఈ సాధనలో భాగమే.. పూజలు, పునస్కారాలు. కానీ కేవలం పూజలకే పరిమితం కాకూడదు. సర్వాంతర్యామి అయిన పరమాత్మ స్వరూపమైన ప్రాణకోటిని ప్రేమించగలిగినప్పుడే మనం భక్తిని కలిగియున్నట్లుగా భావించాలి. కుటుంబంలోని వారిని ప్రేమించి, సమాజంలో వారిని ద్వేషించద్దు. అలాగే సమాజంలో వారిని ప్రేమించి, కుటుంబంలో వారిని ద్వేషించ కూడదు. ఇదంతా ఒకటే కుటుంబం. 'వసుధైక కుటుంబమ్' అన్నారు. ప్రేమించడం, ప్రేమించబడటం అనేవి ఒకదానికొకటి ముడిపడి ఉన్నాయి. నీవు అందర్నీ ప్రేమగా చూసినట్లయితే, నీవు కూడా అందరిచే ప్రేమించబడతావు. ఈవిధంగా భగవంతుడు స్వయంగా తెలిపిన భక్తుల లక్షణాలను మనం శ్రద్ధగా అభ్యసించాలి.

**శ్లో॥ యే తు ధర్మామృత మిదం యథోక్తం పర్యుపాసతే ।**
**శ్రద్ధా ధానా మత్పరమా భక్తాస్తేఽతీవమే ప్రియాః ॥**

(శ్రీమద్భగ్గీత-భక్తియోగం-20వ శ్లోకం)

ఎవరు శ్రద్ధావంతులు, మత్పరాయణలు అవుతూ ఈ అమృతతుల్యమైన ధర్మాన్ని చెప్పినట్లుగా ఆచరిస్తారో అలాంటి భక్తులు నాకు మిక్కిలి ప్రియమైనవారు.

శ్రీమద్భగవద్గీతలోని భక్తియోగంలో పదమూడవ శ్లోకం "అద్వేష్టా సర్వభూతానాం... సమదుఃఖ సుఖక్షమీ" నుండి పై శ్లోకం వరకు శ్రీకృష్ణ భగవానుడు భక్తుల లక్షణాలను వరుసగా వివరించాడు. ఆ వరుసలో చివరి శ్లోకం ఇది. చివరగా శ్రద్ధాసక్తులే ప్రధానంగా భక్తులకుండాలని భగవంతుడు సెలవిచ్చాడు.

### శ్రద్ధావంతులు

శ్రద్ధకు విశ్వాసమే పునాది. ముందు విశ్వాసం కలిగితే కానీ తరువాత శ్రద్ధ కలగదు. విశ్వాసం కలగడానికి అనేక కారణాలు తోడ్పడతాయి. విశ్వాసాలు కూడా అనేక రకాలు. అందులో మొట్టమొదటిది దైవ విశ్వాసం. రెండవది గురు విశ్వాసం. మూడవది శాస్త్ర విశ్వాసం. నాల్గవది మార్గ విశ్వాసం. ఇలా విశ్వాసాలు నాలుగు రకాలు. ఎవరికైనా సరే మొదటిదైన దైవ విశ్వాసం తప్పక ఉండితీరాలి.

దీనిమీదనే మిగతా విశ్వాసాలు ఆధారపడి ఉన్నాయి. దైవ విశ్వాసం కలగడానికి పూర్వజన్మ సుకృతం, ప్రస్తుత కుటుంబ సాంప్రదాయం, సాత్విక సద్గుణ సంపత్తి, మిక్కిలి దుఃఖ జీవనం, సత్‌సహవాసం మొదలైన అంశాలు దోహదమవుతాయి. కొందరికి సహజంగానే దైవ విశ్వాసం ఏర్పడుతుంది. ఇది వారి వారి పూర్వజన్మ సుకృతంతో లభిస్తుంది. మరికొందరికి వారి కుటుంబ సాంప్రదాయాల కారణంగా కలుగుతుంది. కుటుంబంలో ఆధ్యాత్మిక, దైవిక కార్యక్రమాలు తరచూ జరగడం వల్ల దైవ విశ్వాసం వైపు ప్రేరణ కలిగిస్తాయి.

ఇంకొందరిలో సాత్విక సద్గుణాలు అధికంగా ఉండడం వల్ల తానే స్వయంగా దైవ విశ్వాసాన్ని కలిగించుకుంటాడు. సంసారంలో ఎక్కువ దుఃఖాలననుభవిస్తూ దిక్కుతోచక దైవాన్ని ఆశ్రయిస్తారు మరికొందరు. వారికి దుఃఖ నివారణయై సుఖం కలగడంతో దైవ విశ్వాసం ఏర్పడుతుంది. మిత్రుల, ఆప్తుల సహవాసం వలన వారి ప్రేరణతో దైవంపై విశ్వాసాన్ని పెంచు కుంటారు కొందరు. ఇలా ఎందరో అనేక విధాలుగా దైవ విశ్వాసాన్ని పొందుతారు.

విశ్వాసం కలగడం ఒక అంశమైతే శ్రద్ధగా దైవభక్తిని పెంపొందింప జేసుకోవడం మరొక ముఖ్యాంశం. విశ్వాసం కలిగినవారు తప్పకుండా శ్రద్ధ వహిస్తారు. ఈ శ్రద్ధలో కూడా తమకు అవసరమైనప్పుడు ఒకరకంగా, అవసరం లేనప్పుడు మరొక విధంగా ఉండే ప్రమాదం ఉంది. శ్రద్ధ వెంబడే అశ్రద్ధ కూడా ఉంటుంది. అశ్రద్ధకు అసలు తావీయకుండా, ఎప్పుడూ ఒకే విధమైన శ్రద్ధను కలిగి ఉండాలంటాడు శ్రీకృష్ణ పరమాత్మ. శ్రద్ధాలోపం వల్లనే భక్తి సన్నగిల్లుతుంది. భక్తిలేనిచోట భగవంతుడుండడు. భగవంతుడికి కావలసింది భక్తి. భక్తి శ్రద్ధ వల్లనే కలుగుతుంది. శ్రద్ధ విశ్వాసం ద్వారా వస్తుంది. ఇలా ఒకదానితో మరొకదానికి సంబంధం ఉంది. భక్తుడు తప్పనిసరిగా శ్రద్ధావంతుడు కావాలి. శ్రద్ధావంతులకే భక్తి కలుగుతుంది. అలాంటివారే భగవంతుడికి మిక్కిలి ప్రీతిపాత్రులు.

## మత్పరాయణులు

మత్ అంటే నాయొక్క అని అర్థం. శ్రీకృష్ణ భగవానుడు స్వయంగా చెబుతున్న విషయం కాబట్టి నాయందు (నాయొక్క) అనగా భగవానుని యందు ఆసక్తులై ఉండాలి. శ్రద్ధ కలవారికే ఆసక్తి కలుగుతుంది. భగవంతుడు తప్ప వేరే విషయం జోలికి వెళ్లనివారు ఆసక్తులైనట్లుగా భావించాలి. దీనినే 'అనన్యభక్తి' అంటారు. భార్యాపిల్లలపై యజమానికి, భర్త, కుటుంబంపై భార్యకు ఏవిధంగా ఆసక్తి ఉంటుందో అంతకంటే ఎక్కువగా భగవానుడి యందు ఆసక్తి ఉన్నప్పుడే భక్తి నిజమౌతుంది. మనం కన్న పిల్లలపై మనకు మమకారం ఉం డడం సహజం. వారిపై ఎలాగూ ఆసక్తి ఉంటుంది. ఉండాలి కూడా. కానీ మనల్ని, మన పిల్లల్ని ఇంకా మనవాళ్లందరినే కాక ఈ సృష్టినే సృష్టించిన ఆ భగవంతుడిపై మనకు ఎంత ఆసక్తి ఉండాలి? ఈ విషయాన్ని మనం మన సంసార గందరగోళంలో పడి మాటిమాటికీ మర్చిపోతూ ఉంటాం. అందుకే ఈ బోధ అంతా. గీతలో అంతా ఇదే విషయాన్ని బోధించాడు.

నీవు నీ సంసారంలో ఉండు. నీ పిల్లాపాపలను కాపాడుకో. కానీ నన్ను మాత్రం మరువకు. నాపైన ఆసక్తి మాత్రం కలిగి ఉండమని భగవానుడు బుజ్జగించి మరీ చెప్పాడు. భగవంతుడిపై ఆసక్తి పెంచుకోవడానికి సన్యాసం తీసుకోనక్కరలేదు. సంసారాన్ని వదిలిపెట్టమనీ అనలేదు. నీ పని నువ్వు చేసుకుం టూనే నన్ను మాత్రం మరువకుండా ఉండు నాయనా! తల్లీ!! అన్నాడు పరమాత్మ. భక్తి పెరిగిన కొద్దీ ఆసక్తి కలుగుతుంది. ఆసక్తి కలిగిన కొద్దీ భక్తి పెరుగుతుంది. నాపైన ఆసక్తిని పెంచుకుంటే చాలు నీవు భక్తుడవైపోతావు. నీవు భక్తుడవైతేనే నాకు చాలా ఇష్టమైనవాడివవుతావని భగవంతుడు ఈ చివరి శ్లోకం ద్వారా భక్తుల లక్షణాలను ముగించాడు.

ఇందులో చెప్పిన భక్తుల లక్షణాలన్నీ కూడా అమృతంతో సమానమైన ధర్మాలని కృష్ణభగవానుడే స్వయంగా తెలియ జేస్తున్నాడు. ఇంకా సందేహం ఎందుకు? కాబట్టి ప్రతి ఒక్కరూ మొదటినుండి చివరి వరకూ గల భక్తుల లక్షణాలను క్రమక్రమంగా పట్టుదలతో సాధించినట్లయితే నిజమైన భక్తులవు

తారు. మనలో భక్తులంటే కేవలం దేవాలయాలకు వెళ్లి, నుదుట తిలకం పెట్టుకుని తీర్థప్రసాదాలు తీసుకునేవారే అని చాలామంది అనుకుంటారు. వీరనుకున్నట్లుగా అలాంటి వారందరూ భక్తులన్నమాట నిజమే కానీ భక్తుల లక్షణాలు లేకుండా కేవలం పై చిహ్నాలు కలిగి ఉంటే వారు నిజమైన భక్తులు కారని శ్రీకృష్ణుని యొక్క అభిప్రాయం. భగవానుని ఆదేశాన్ని మనం అంతా ఖచ్చితంగా అమలు చేయవలసిందే. ఇందులో తరతమ భేదం లేదు. పెద్ద చిన్నా అందరూ సమానమే. భగవానుడి తరువాతే అందరూ. భగవానుడు ఏది చెబితే అది చేయవలసిందే. సంశయం ఏమాత్రం పనికిరాదు. "సంశయాత్మ వినశ్యతి" అని భగవానుడే తెలిపాడు. సందేహం కలవారు నశిస్తారు. కాబట్టి సందే హం లేకుండా క్రమంగా 'భక్తుల లక్షణాలు' అనే ధర్మా మృతాన్ని అందరం గ్రోలుదాం... అంటే ఆచరించుదాం. ఎవరికి వారికి తెలుస్తుంది ఇప్పటివరకు మనలో ఎన్ని లక్షణాలున్నాయి? ఇంకా ఎన్ని లక్షణాలు ఉండాలి? అని. ప్రతిరోజూ కాదు ప్రతిక్షణం చింతించుకుని ఈ క్షణం నుంచే ఒక్కొక్క లక్షణాన్నీ ఆచరించడానికి, అమలుపరచడానికి సిద్ధంగా ఉండాలి.

ఆగమశాస్త్రం ప్రకారం ఆలయాలు ఉన్నాయి. గీతాశాస్త్రం ప్రకారం భక్తులుండాలి. అప్పుడే ఆ ఆలయాలకు నిజమైన కళ వస్తుంది? ఆ ప్రతిష్ఠామూర్తులు ఆనందంతో ఆశీర్వదిస్తారు. లోకకల్యాణం జరుగుతుంది. సస్యశ్యామలం ఏర్పడుతుంది. మన జన్మలు ధన్యమవుతాయి.



# 14. వివాహ వ్యవస్థలో రాశికూటాలు

హైందవ సాంప్రదాయం ప్రకారం 'వివాహం' అనేది ఒక విశిష్ట సంస్కారం. వివాహమే మిగతా సంస్కారాలన్నింటికి మూలం. శాస్త్రంలో అష్టవిధ వివాహాల గురించి తెలుపబడింది. వివాహ విధానాలు మొత్తం ఎనిమిది రకాలుగా ఉన్నాయి. అవి 1) బ్రాహ్మం 2) దైవం 3) ఆర్షం 4) ప్రజాపత్యం 5) ఆసురం 6) గాంధర్వం 7) రాక్షసం 8) పైశాచికం.

- ✶ యోగ్యుడైన వరుణ్ణి మర్యాదపూర్వకంగా రప్పించి, శుభముహూర్తాన చక్కగా అలంకరించిన కన్యను బంధువుల సమక్షంలో ఇవ్వడం బ్రాహ్మ వివాహమన బడుతుంది.
- ✶ గొప్ప యజ్ఞయాగాదులు చేయు ఋత్విజునకు సాలంకృతంగా కన్యను అప్పగించడం దైవ వివాహమంటారు.
- ✶ యాగాది సిద్ధి కొరకు కొద్దికాలం వరునివద్ద నుండి, వారిని తీసుకుని, వారికి శాస్త్రప్రకారం కన్యనొసగటాన్ని ఆర్ష వివాహ మంటారు.
- ✶ మీరు ఇరువురూ కలిసి ధర్మమాచరించండని చెప్పి తల్లిదండ్రులు వరుని పూజించి, కన్యను ఇవ్వడం ప్రాజాపత్య వివాహమంటారు.
- ✶ అమ్మాయికి, అమ్మాయి బంధువులకు డబ్బులిచ్చి, తమ ఇష్టమున పెండ్లి చేసుకొనుట ఆసుర వివాహమంటారు.
- ✶ వధూవరులిద్దరు ఒకరినొకరు ఇష్టపడి కలవడాన్ని గాంధర్వ వివాహమంటారు.
- ✶ అమ్మాయి బంధువులు, తల్లిదండ్రులు ఒప్పుకోనప్పుడు వారిని హింసించి, కన్యను బలవంతంగా తీసుకెళ్లడం రాక్షస వివాహమంటారు.

* నిద్రించే వారిని, మత్తులో ఉన్న అమ్మాయిని తెలియకుండా బలవంతంగా ఎత్తుకుని వెళ్లడం పైశాచిక వివాహమంటారు.

ప్రస్తుతం పై ఎనిమిది విధాలైన వివాహాలలో నాల్గవదైన ప్రాజాపత్య వివాహం, ఆరవదైన గాంధర్వ వివాహాలు ఎక్కువగా జరుగుతున్నాయి. ఇందులో తెలియజేసిన ఏ వివాహానికైనా యోగ్యుడైన వరుడు లేదా యోగ్యురాలైన వధువును ఎంపిక చేయుటకే ప్రాధ్యాన్యమిచ్చారు. ఇంకా వధూవరుల ఇష్టానికి కూడా అవకాశం ఉంది. కాని జ్యోతిశ్శాస్త్ర ప్రకారం నక్షత్ర, రాశి, గ్రహ, మైత్రి విషయాలకు తగిన ప్రాధాన్యతనివ్వలేదు. కాని భవిష్యత్తు శుభాశుభ ఫల సూచనకు మాత్రమే రాశికూట ఫలవిచారాన్ని మన పూర్వీకులేర్పరచారు.

కొంతకాలం క్రితం మన పెద్దలే నిర్ణయాలు తీసుకుని, రాశికూట విచారాలు చేయకుండానే, వధూవరుల ఇష్టాయిష్టాలతో ప్రమేయం లేకుండానే వారి పిల్లలకు వివాహాలు జరిపించారు. అట్టి వారి కుటుంబాలు అన్యోన్యంగా ఉంటూనే, వారి పిల్లల వివాహ విషయాలకొచ్చేసరికి విపరీతమైన ధోరణిని అవలంబించడం విడ్డూరంగా ఉంది. ప్రస్తుతం విజ్ఞానం పెరిగింది. సంతోషం. పెరిగిన విజ్ఞానంతో విపరీతంగా ప్రవర్తిస్తున్నారు. ఇక పిల్లల విషయానికొస్తే దైవాన్ని కూడా సరిగా విశ్వసించనివారు వివాహ విషయంలో ఇంటర్నెట్‌లో ఆస్ట్రాలజీ విభాగాలను తెరచి, ఇష్టానుసారంగా గుణాలు చూసి స్వంత నిర్ణయాలు తీసుకుంటున్నారు. పూర్తిగా తెలిసిన వారికి చెప్పనవసరం లేదు. కాని తెలిసీ తెలియని వారికి తెలియజేయడం ఆ బ్రహ్మదేవుడికి కూడా సాధ్యంకాదు.

ముందు పెద్దవాళ్ల విషయం తీసుకుందాం! ఎదిగిన అబ్బాయి కొరకు అమ్మాయిని, అమ్మాయి కోసం అబ్బాయిని వెదకుట సహజం. ఈ మధ్య ముందేవి చూడకుండానే జాతకాలు బాగుంటే చాలు! ఇంకేం అవసరం లేదని, వారి నక్షత్రం, జాతక వివరాలు తీసుకుని పౌరోహితుల, జ్యోతిష్యుల వద్దకు పరుగులు తీస్తున్నారు. వారు బాగున్నవని చెప్పిన వారికి పెళ్లిచూపులు ఏర్పాటుచేసి, ఒకటి, రెండు, మూడు వరుసగా చూసి తిరిగి నిశ్చయానికి పౌరోహితులను సంప్రదిస్తున్నారు. చూసిన మూడింటిలో మీరేది బాగుందంటే వారినే చేసుకుం

టామంటున్నారు. అయితే జ్యోతిష్యానికి పూర్తి ప్రాధాన్యత నిస్తూనే అమ్మాయి అందంగా ఉండాలి,కట్నం దండిగా ఇవ్వాలి, చదువు సరిపోయేట్టు ఉండాలి, పెండ్లి ఘనంగా జరపాలి, విదేశాలకు వెళ్లడానికి సిద్ధంగా ఉండాలి, మంచి హెూదా, సంస్కారవంతులై ఉండాలని కోరికలు కలిగి ఉంటున్నారు.

ఇవన్నీ ఉండాలనే వారికి, జాతకాలు కలవాలనుకోవడం ఎంతవరకు సరిపోతుంది. ఒకవేళ జాతకాలు బాగుండి, పై వాటిలో ఏదిలేకున్నా పెండ్లికి ఒప్పుకోవాలి కదా! అలా చేయడం లేదు. మరో సంబంధానికి ప్రయత్నిస్తున్నారు. అనగా దీన్నిబట్టి వారు జాతకాలకు ఎంతవరకు ప్రాధాన్యతనిస్తున్నారో అర్థ మవుతుంది. వారి ఉద్దేశ్యమేమిటంటే వారనుకున్నట్లు మిగతా విషయాలన్నింటితో పాటు జాతకాలు కూడా బాగుండాలన్నది ప్రధానాంశం.

ఇక అమ్మాయి, అబ్బాయి ఒకరినొకరు ఇష్టపడ్డారని తెలిసినా, జాతకాలు సరిపోలేదని వ్యతిరేకిస్తున్నారు కొందరు పెద్దలు. ఇది ఎంతవరకు సమంజసం? అందుకే పెండ్లికి జాతకాల యొక్క రాశికూటాల సంపూర్ణ వివరాలు అందరికి తెలియాలి. రాశికూటాలు చూసే పౌరోహితులు గానీ, జ్యోతిష్యులు గాని, అబ్బాయివైపు వారు బాగుందంటే, అమ్మాయి తాలూకు వారు బాగోలేదంటున్నారు. దీనితో వారు అయోమయంలో పడి మూడో వ్యక్తిని సంప్రదిస్తున్నారు. జాతకాలు గాని, రాశికూటాలు గాని ఎవరు చూసినా, ఎంత మంది చూసినా మారవు! ఒకరు ఒక రకంగా, మరొకరు మరో రకంగా ఎందుకు చెబుతున్నారు? ఈ విషయాలన్నీ కూలం కషంగా చర్చించాలి. శాస్త్రం ఏం చెప్పిందో తెలుసుకోవాల్సిన అవసరం అందరికీ ఉంది. ఇది చాలా సున్నితమైన విషయం. జీవితాలతో చెలగాటమాడడం మంచిదికాదు. ఈ విషయాన్ని తల్లిదండ్రులు, వధూవరులు, పౌరోహితులు, జ్యోతిష్కులు అందరూ తప్పనిసరిగా గమనించాలి.

ఇక అమ్మాయిలు, అబ్బాయిల విషయానికి వస్తే ఈ రోజుల్లో యుక్తవయస్సులో ఉన్నవారు కూడా విచిత్రంగా ప్రవర్తిస్తున్నారు. ప్రేమ వ్యవహారాల్లో పడి, తల్లిదండ్రులను ఒప్పించి చేసుకునే వారు కొందరైతే ఎదిరించి, పారిపోయి పెళ్లి చేసుకునేవారు మరికొందరు. ఇవి రెండూ కాక, ఇంటర్నెట్

సౌకర్యంతో ఆస్ట్రాలజీ ఛానెల్ల ద్వారా జాతకాలు బాగాలేవని ప్రేమను దూరం చేసుకునేవారు ఇంకొందరు. నేటి సమాజంలోని యువతీ యువకులు కూడా జ్యోతిష్యానికి ప్రాధాన్యమివ్వడం హర్షించదగిన అంశం. కాని గుడ్డిగా ఏదో కంప్యూటర్ చూసి నిర్ణయాలు తీసుకోవడం మంచిదికాదు. కాబట్టి జ్యోతిష శాస్త్రాల్లోని వాస్తవ విషయాలను, నేటి సమాజంలో యువతీ యువకులందరూ కూడా శ్రద్ధగా తెలుసుకోవాలి.

విజ్ఞానం పెరిగిన ఈ సమాజంలో ఆధునిక శాస్త్రాలతో పాటు, సనాతన శాస్త్ర విషయాలు సమన్వయం చేసుకుని, అవగాహన చేసుకుంటే మరీమంచిది. ఒకవైపు నాస్తిక, హేతువాదం మూఢనమ్మకాలంటున్నా, మరోవైపు ఆ శాస్త్రాలన్నింటినీ గౌరవించి, ఆచరించేవారు రోజురోజుకీ విపరీతంగా పెరిగి పోతున్నారు. మన శ్రేయస్సుకోరి, సమాజాభివృద్ధికే శాస్త్రాలు రూపొందించబడ్డాయి. ఏ శాస్త్రాన్నయినా కాలానుగుణంగా, దేశ, ప్రాంతాచారాలను దృష్టిలో పెట్టుకుని సమన్వయం చేసుకోవడం ఉత్తమం, అవసరం, అనుకూలం కూడా. కానీ దీనిని లెక్క చేయక కేవలం చాదస్తంగా వాదించడం, తెలుపడం సమంజసం కాదు. శాస్త్ర విషయాలు తెలుసుకునే ముందు సంపూర్ణ శ్రద్ధా విశ్వాసాలు గలవారికే ప్రాధాన్యం ఉంటుంది.

శాస్త్రాలు అనేకమంది ఋషులు, పెద్దలు అనేక విధాలుగా రూపొందించారు. వాటిలో ఏది సరియైందో నిర్ణయించడం మనకు సాధ్యం కాని పని. మనం చేయవలసిందల్లా ప్రస్తుతం మన పెద్దవాళ్లు ఆచరిస్తున్న విధానాన్నే అనుసరించిడం ప్రధాన కర్తవ్యం. ధర్మశాస్త్ర గ్రంథాలన్నింటిలోకెల్లా 'ధర్మసింధువు' పరమ ప్రామాణిక గ్రంథం. దీన్ననుసరించి మనం శాస్త్ర విషయాలను తెలుసుకుందాం.

మన పెద్దలు వివాహ విషయంలో ప్రధానంగా ప్రారబ్దానికే మొదటి ప్రాధాన్యతనిచ్చారు. **"ఋణానుబంధ రూపేణా పశుపత్నీ సుతాలయ"** అని, "ప్రారబ్దం అనుభోక్తవ్యం కృతం కర్మ శుభాశుభం" అను వాక్యాలు ఈ విషయాన్ని దృఢపరుస్తున్నాయి. ఎవరి ప్రారబ్దం ఎలా ఉందో, ఎవరికీ తెలియదు, కనుక

ప్రారబ్ధాన్ని సూచించుటకే జ్యోతిశ్శాస్త్రం ఉంది. ఇందులో కూడా ప్రారబ్ధ ఫలసూచనలకన్నా, శుభముహూర్త నిర్ణయానికే ప్రాధాన్యం ఉంది. దీన్నిబట్టి ప్రారబ్ధ సూచనలో భాగంగానే వధూవరులకు రాశికూట వివరాల వ్యవస్థను ఏర్పరచారు. కాబట్టి ముందుగా మనం చేయవలసిందేమిటంటే, మంచి శు భముహూర్తంలో అమ్మాయిని, అబ్బాయిని ఒకరినొకరు చూసుకునే అవకాశం కల్పించాలి. దీనికంటే ముందే అబ్బాయి, అమ్మాయి యోగ్యతలు, అందం, ఐశ్వర్యం, సాంప్రదాయం మొదలైన అన్ని విషయాలు క్షుణ్ణంగా తెలుసుకుని, నిశ్చయించుకున్న తర్వాతనే చూపుల ఏర్పాట్లు అవసరం. వారిద్దరూ పరస్పరం ఒకరి నొకరు ఇష్టపడ్డారంటే ప్రారబ్ధ సూచనగా భావించి వివాహం చేయాలి.

పూర్వం చిన్నవయసులో వివాహాలు జరిగేవి కనుక పెద్దల నిర్ణయమే ఆమోదమయ్యేది. నేడు యుక్తవయస్సులో వివాహాలు జరపడం సాంప్రదాయమైంది. కాబట్టి పెళ్లిచూపుల అవసరమేర్పడింది. దీని తర్వాతనే పౌరోహితులు గాని, దృఢవిశ్వాసంగల జ్యోతిష్యులను సంప్రదించడం ఉచితంగా ఉంటుంది.

వివాహ విషయంలో శాస్త్రం అనేక విషయాలను తెలుపుతూ ఎన్నో అవకాశాలను ఇచ్చింది. ఉదాహరణకు–

**శ్లో॥ జన్మనా జన్మ కుర్వీత, నామ్నా నామైవ కారయేత్ ।**
**ఉభయం బలహీనం చేత్, పుంజన్మ స్త్రీషు నామతః ॥**

అనగా వధూవరులిద్దరి జన్మనక్షత్రాల ఆధారంగా చూడడం మొదటిది. లేదా ఇరువురి పేర్లను అనుసరించి నిర్ణయించడం రెండవది. ఈ రెండు విధాల కూడని పరిస్థితిలో వరుని జన్మ నక్షత్రంతో, వధువు నామనక్షత్రం పేరుతో మేళనం చూడవచ్చని సారాంశం.

దీనినిబట్టి మనకు అర్థమయయ్యేదేమిటంటే ఒకరినొకరు ఇష్టపడిన వధూవరులను ఏవిధంగానైనా మేళనం చేసి, దేనిప్రకారం మేళనం సరిపోయిందో, వానినాధారంగా చేసుకుని వివాహాది శుభముహూర్తాలు నిర్ణయించాలన్నది ప్రధానోద్దేశం.

పై మూడు విధాలు కాకుండా, ఈ సందర్భాల్లో అమ్మాయి పేరును మార్చడం కూడా శాస్త్ర సమ్మతమే.

రాశికూటాలన్నింటిలో గ్రహమైత్రి ప్రధానమైంది. వధూవర జన్మ లేదా నామ నక్షత్ర రాశికి అధిపతులైన గ్రహాలు శత్రువులు కాకుండా మిత్రులై ఉండాలన్నది ఈ గ్రహమైత్రి విశేషం.

**1. గ్రహమైత్రి:**

మేషాది ద్వాదశ రాశులకు వరుసగా కుజ, శుక్ర, బుధ, చంద్ర, రవి, బుధ, శుక్ర, కుజ, గురు, శని, గురు గ్రహాలు అధిపతులు. వీరిలో ఎవరికి ఎవరు శత్రువులు, ఎవరికి ఎవరు మిత్రులనేది తెలుసుకోవాలి.

| గ్రహం | శత్రువులు | మిత్రులు | సములు |
|---|---|---|---|
| 1. రవి | శని, శుక్ర | గురు, కుజ, చంద్ర | బుధ |
| 2. చంద్రుడు | లేరు | రవి, బుధ | కుజ, గురు, శుక్ర, శనులు |
| 3. కుజుడు | బుధ | రవి, గురు, చంద్ర | శని, శుక్రులు |
| 4. బుధుడు | చంద్ర | రవి, శుక్ర | శని, కుజ, గురులు |
| 5. గురుడు | శుక్ర, బుధ | రవి, కుజ, చంద్ర | శని |
| 6. శుక్రుడు | రవి, చంద్ర | శని, బుధ | కుజ, గురు |
| 7. శని | కుజ, రవి, చంద్ర | శుక్ర, బుధ | గురు |

ఈ రాశ్యాధిపతి మైత్రి సరిపోనిచో అంశాధిపతి మైత్రి చూడవచ్చు. రాశికూటాల ఆధారంగా చేసుకుని గుణాలను ఏర్పరిచారు. కాని మన పంచాంగంలో చూపబడిన గుణమేళన పట్టిక కేవలం స్థూలంగా మాత్రమే తెలుపుతుంది. సూక్ష్మ పరిహార విషయాలకు కావలసిన గుణాలు అందులో కలపబడవు. కనుక పంచాంగాల్లో గుణాలను చూసి, 18కి తక్కువగా ఉన్నచో పనికి రాదనుటకు వీల్లేదు. ఉదాహరణకు గ్రహమైత్రి గుణవిచారం చూసిన తెలుస్తుంది.

1. వధూవరుల రాశులకు ఒకేగ్రహం అధిపతి అయితే = 5 గుణాలు.

2. వధూవరుల రాశుల అధిపతులు మిత్రులు అయితే = 5 గుణాలు.

3. ఒకరి గ్రహం సముడు, ఒకరి గ్రహం శత్రువు అయితే = 2 1/2 గుణాలు.

4. ఒకరి గ్రహం సముడు, ఒకరి గ్రహం మిత్రుడు అయితే = 4 గుణాలు

5. ఒకరి గ్రహం మిత్రుడు, ఒకరి గ్రహం శత్రువు అయితే = 1 గుణం

6. ఇరువురి గ్రహాలు ఒకరికొకరు శత్రువులయితే = 0

7. ఇరువురి గ్రహాలు ఒకరికొకరు సములే అయితే = 3 గుణాలు.

**2. గణమైత్రి:**

మొత్తం మూడు గణాలు. అవి దేవగణం, మనుష్యగణం, రాక్షసగణం. ఒక్కొక్క నక్షత్రం ఒక్కొక్క గణానికి సంబంధించి ఉంటుంది. అనగా ఒక గణానికి కొన్ని నక్షత్రాలగును. అవి 1. దేవగణ నక్షత్రాలు: అశ్వని, మృగశిర, పునర్వసు, పుష్యమి, హస్త, స్వాతి, అనూరాధ, శ్రవణం, రేవతి; 2. మనుష్యగణ నక్షత్రాలు: భరణి, రోహిణి, ఆర్ద్ర, పుబ్బ, ఉత్తర, పూర్వాషాఢ, ఉత్తరాషాఢ, పూర్వాభాద్ర, ఉత్తరాభాద్ర; 3. రాక్షస గణ నక్షత్రాలు: కృత్తిక, ఆశ్లేష, మఖ, చిత్త, విశాఖ, జ్యేష్ఠ, మూల, ధనిష్ఠ, శతభిషం.

1. వధూవరుల ఇరువురి గణాలు ఒకటైతే = 6 గుణాలు

2. వరునిది దేవగణం, వధువుది మనుష్య గణమైతే = 6 గుణాలు.

3. వరునిది మనుష్యగణమై వధువుది దేవగణమైతే = 5 గుణాలు.

4. వరుడు రాక్షసగణమై వధువుది దేవగణమైతే = 1 గుణం

5. వరుడు దేవగణమై వధువుది రాక్షసగణమైతే = 0 గుణాలు

6. వరుడు మనుష్యగణమై వధువుది రాక్షస గణమైతే = 0 గుణాలు

పై రాక్షస గణ నక్షత్రాలలో పనికివచ్చే రాక్షసగణ నక్షత్రాలున్నాయి. ఇది కూడా శాస్త్రంలోనే తెలుపబడింది.

ఆశ్రేష, చిత్త, విశాఖ, జ్యేష్ఠ, మూల, శతభిష నక్షత్రాలకు రాక్షసగణ దోషం లేదు. కాని వీనికి సంబంధించిన గుణాలు మేళన పట్టికలో కలవడం లేదు.

**3. రాశి మైత్రి (రాశి కూటం):**

వధువు రాశి నుండి వరుని రాశి వరకు, తిరిగి వరుని రాశి నుండి వధువు రాశి వరకు లెక్కించగా – 2–12= దరిద్రం; 9–5= సంతానం; 6–8= కలహాలు; 7–7 = శుభం; 3–11= లాభం; 4–10= సుఖం.

వధూవరులిద్దరిదీ ఒకే నక్షత్రమై పాదభేదముంటే శుభం. రాశి ఒకటైతే మిక్కిలి శుభం. నక్షత్రం ఒకటై రాశి వేరుగా ఉన్నా శుభమే. ఇందులో నాడీగణాది దోషాలుండవు. పైవిధంగా దోషాలులేని రాశికూటం ఉంటే = 7 గుణాలు. చెడుకూటం అయినా గ్రహమైత్రి ఉంటే = 4 గుణాలు. చెడుకూటం అయినా గ్రహమైత్రి లేకుంటే = 1 గుణం. ఒకే పాదం కలిగిన రాశికూటమైతే = 0 గుణాలు.

రాశికూటం కంటే గ్రహమైత్రికే ఎక్కువ ప్రాధాన్యమిచ్చారని తెలుస్తుంది.

రాశికూటంలో కూడా పనికివచ్చే చెడు కూటాలను కూడా శాస్త్రంలో తెలియజేశారు. కానీ వీటి గుణాలు మేళన పట్టికలో కలబడకపోవడం వల్ల ఇబ్బంది కలుగుతుంది.

**2–12లో శుభమైనవి:** మీన–మేష; వృష–మిథు; కట–సింహ; కన్య–తుల; వృశ్చిక–ధను; మక–కుంభం.

**11–3లో శుభమైనవి:** కట–వృష, కుంభ–ధను; మీన–మకరం.

**10–4లో శుభమైనవి:** కట–మేష; వృష–కుంభ; కన్యా–మిథు; వృశ్చిక – సింహ; మఖ–తుల; మీన–ధనుస్సు.

**9–5లో శుభమైనవి:** కన్యా–వృష; కుంభ–తుల; వృశ్చి–కటకం; సింహ–మేష; కటక–మీనం.

**6–8లో శుభమైనవి:** వృష–తుల; వృశ్చి–మేష; కటక–ధను; కన్యా–కుంభ; మక–మిథు; మీన–సింహం.

## 4. నాడీమైత్రి

మూడు విధాలైన నాడులున్నాయి. అవి ఆదినాడి, మధ్యనాడి, అంత్యనాడి. ఒక్కొక్క నాడికి కొన్ని నక్షత్రాలేర్పడ్డాయి.

**ఆదినాడి నక్షత్రాలు:** అశ్విని, ఆర్ద్ర, పునర్వసు, ఉత్తర, హస్త, జ్యేష్ఠ, మూల, శతభిషం, పూర్వాభాద్ర.

**మధ్యనాడి నక్షత్రాలు:** భరణి, మృగశిర, పుష్యమి, పుబ్బ, చిత్త, అనూరాధ, పూర్వాషాఢ, ధనిష్ఠ, ఉత్తరాభాద్ర.

**అంత్యనాడి నక్షత్రాలు:** కృత్తిక, రోహిణి, ఆశ్రేష, మఘ, స్వాతి, విశాఖ, ఉత్తరాషాఢ, శ్రవణం, రేవతి.

వధూవరులిద్దరిది ఒకేనాడి కాకూడదు. నాడీభేదముండాలి. నాడీ భేదమున్నచో = 8 గుణాలు, నాడి ఏకమైనచో = 0 గుణాలు. శాస్త్రంలోనే నాడీ దోషంలేని నక్షత్రాలు, ఒక్కొక్క నాడిలో పరిహార నక్షత్రాలు (అనగా కొన్ని నక్షత్రాలకు మినహాయింపును ఇచ్చారు) కూడా తెలిపారు. కాని వీని గుణాలు కూడా మేళన పట్టికలో కలియుట లేదు.

1) ఆదినాడీ ఏకనాడి అయినా దోషం లేని నక్షత్రాలు: ఉత్తర, శతభిషం, పూర్వాభాద్ర, పునర్వసు, ఆర్ద్ర, మూల, అశ్విని.

ఈ నక్షత్రాలకు ఏకనాడి అయినా దోషం ఉండదు.

2) మధ్యనాడి ఏకనాడి అయినా దోషంలేని నక్షత్రాలు: పూర్వాషాఢ, అనూరాధ, ధనిష్ట, పుష్యమి, చిత్త, పుబ్బ, మృగశిర.

3) అంత్యనాడి ఏకనాడి అయిననూ దోషాలు నక్షత్రాలు: కృత్తిక, విశాఖ, ఆశ్రేష, శ్రవణం, మఘ, రోహిణి.

ఏకనాడి అయిననూ దోషంలేని నక్షత్రాలు: ఉత్తరాభాద్ర, రేవతి, రోహిణి, మృగశిర, ఆర్ద్ర, శ్రవణం, పుష్యమి, విశాఖ. పంచాంగకర్తలందరు పరిహార గుణాలను కూడా కలిపి – మేళన పట్టిక ప్రత్యేకంగా మా దివ్యజ్ఞాన పంచాంగంలో రూపొందించబడింది.

**5. యోని (కూటమి) మైత్రి**

ఒక్కొక్క నక్షత్రానికి ఒక జంతువుగా గుర్తించారు. ఆయా జంతువులకు వైరం లేకుండా ఉంటే, యోని మైత్రి ఉన్నదని తెలుస్తుంది. 1. గుర్రం నక్షత్రాలు: అశ్విని, శతభిషం; 2. ఏనుగు నక్షత్రాలు: భరణి, రేవతి; 3. మేక నక్షత్రాలు: కృత్తిక, పుష్యమి; 4. పాము నక్షత్రాలు: రోహిణి, మృగశిర; 5. కుక్క నక్షత్రాలు: ఆర్ద్ర, మూల; 6. పిల్లి నక్షత్రాలు: పునర్వసు, ఆశ్రేష; 7. ఎలుక నక్షత్రాలు: మఖ, పుబ్బ; 8 ఆవు నక్షత్రాలు: ఉత్తర, ఉత్తరాభాద్ర; 9. దున్న నక్షత్రాలు: హస్త, స్వాతి; 10. పులి నక్షత్రాలు: చిత్త, విశాఖ; 11. జింక నక్షత్రాలు: అనూరాధ, జ్యేష్ఠ; 12. కోతి నక్షత్రాలు: పూర్వాషాఢ, శ్రవణం; 13 ముంగిస నక్షత్రాలు: ఉత్తరాషాఢ, అభిజిత్; 14. సింహం నక్షత్రాలు: ధనిష్ఠ, పూర్వాభాద్ర.

శాస్త్రంలో వైరం జంతువులకు ప్రత్యేకంగా సూచించారు. 1. కుక్క × జింక, 2. పాము × ముంగిస, 3. సింహం × ఏనుగు, 4. కోతి × మేక, 5. గుర్రం × దున్న, 6. ఆవు × పులి, 7. పిల్లి × ఎలుక.

ఈవిధమైన వైరం పనికిరాదు. మొత్తం 20 కూటాలున్నప్పటికీ, అందులో ఈ ఐదు కూటాలే ప్రధానమైనవి. వీటిలో కూడా ఏ కూటమి కలవకున్నను, మిగతా కూటాలు బాగున్నచో వివాహం చేయవచ్చును. శాస్త్రంలో తెలిపిన ఎనిమిది కూటాల ఆధారంగా పంచాంగాలలో గుణగణనం చేశారు.

మూల, ఆశ్రేష, విశాఖ, జ్యేష్ఠ నక్షత్రాలు మంచివి కావని లోకంలో వాడుక ఉంది. అయితే ఈ నక్షత్రాల వారిని వివాహం చేసుకోవద్దని, చేసుకుంటే గండాలని, వీరికి దోషం, వారికి దోషమని ఉంది. ప్రమాదవశాత్తూ జరిగే విషయాలను భయంకరంగా చిత్రీకరించి ప్రజలను ఆందోళన పెట్టడం శాస్త్ర సమ్మతం కాదు. కానీ ఈ నక్షత్రాల వారితో కొద్దిగా జాగ్రత్తగా ఉండడం మంచిదని, లేదా ఏదైనా శాస్త్రోక్త శాంతి పరిహారాలు, దైవసేవ జరిపించినచో దోషం ఉండదనేది మాత్రం అంగీకరించక తప్పదు.

రాశి కూటాలలో పైన తెలిపిన ఐదు కూటాలతో పాటు, ఒకవేళ జాతకం అందుబాటులో ఉంటే కుజదోష విచారణ కూడా చేయాలి.

### 6. కుజదోష విచారణ

జాతకంలో జన్మలగ్నం నుండిగాని, చంద్రరాశి నుండి గాని శుక్రుడున్న రాశి నుండి గాని 2,4,7,8,12 స్థానాల్లో కుజుడుంటే 'కుజదోషం' అంటారు. లగ్నంలో కుజుడున్నా కూడా దోషం అవుతుంది. వధూవరులిద్దరి జాతకాలలో కుజదోషం ఉన్నట్లయితే 'దోష' ప్రభావం ఉండదు.

వధూవరుల మేళన నిమిత్తం కుజదోష ప్రభావం లేకుండా చూడడానికి వీలుగా కొన్ని సూచనలు:

1. కుజుడు జాతకంలో తన స్వక్షేత్ర, ఉచ్ఛ, మిత్ర క్షేత్రాల్లో ఉంటే కుజదోషం లేదు.
2. కుజ–చంద్ర, కుజ–గురు, కుజ–బుధ యోగమున్నను దోషం లేదు.
3. కర్కాటక, సింహలగ్నాల వారికి కుజదోషం లేదు.
4. మిథున, కన్యారాశుల వారికి 2వ స్థానంలో కుజుడుంటే దోషం లేదు.
5. తులా, వృషభ రాశుల వారికి 12వ స్థానంలో కుజుడుంటే దోషం లేదు.
6. మేష, వృశ్చిక రాశుల వారికి 4వ స్థానంలో కుజుడుంటే దోషం లేదు.
7. మకర, కర్కాటక రాశుల వారికి 7వ స్థానంలో కుజుడుంటే దోషం లేదు.
8. ధనస్సు, మీన రాశులవారికి 8వ స్థానంలో కుజుడుంటే దోషం లేదు.
9. కుంభ, సింహ రాశుల వారికి కుజదోషం ఏ స్థానంలో ఉన్నా దోషం లేదు.
10. జాతకం శని బలవంతుడుగా ఉన్నా కుజదోషం ఉండదు.
11. ఇరువురి నక్షత్రాలననుసరించి గుణాలు ఎక్కువగా వచ్చినను కుజదోషం ఉండదు.

**కుజదోషం లేని నక్షత్రాలు:** అశ్విని, మృగశిర, పునర్వసు, పుష్యమి, ఆశ్రేష, ఉత్తర, స్వాతి, అనురాధ, పూర్వాషాఢ, ఉత్తరాషాఢ, శ్రవణం, ఉత్తరాభాద్ర, రేవతి.

పై విధానమంతా బాగా పరిశీలిస్తే శాస్త్రం మనకు ఎక్కువ అవకాశాలను కల్పించింది. అంటే వీలైనంతవరకు బాగా నచ్చిన వారినే వివాహమాడడాన్ని ప్రోత్సహిస్తుందని రుజువైంది.

దీని తర్వాత వివాహం ఎప్పుడు చేయడం అనేది కూడా ప్రధానాంశం. శుభముహూర్త నిర్ణయాలు, పంచాంగాల ననుసరించి పౌరోహితులు చేసినప్పటికీ వధూవరులకు 'బలం' ఎప్పుడుందని చెప్పడంలో ఇబ్బందులెదురవుతున్నాయి.

శాస్త్రంలో తెలిపిన ప్రకారం అమ్మాయికి గురుడు గోచార రీత్యా మంచి స్థానాల్లో ఉండాలి. అబ్బాయికి రవి లేదా శుక్రుడు మంచి స్థానాల్లో ఉండాలి. గురుని యొక్క శుభస్థానాలు 2, 5, 7, 9, 11. రవికి 3, 6, 10, 11 శుభ స్థానాలు. ఒకవేళ మిగతా స్థానాల్లో ఉన్నప్పుడు వివాహం చేయవలసి వచ్చినపుడు ఆయా గ్రహాలకు శాంతి జరిపి చేయమన్నారు.

అంటే తప్పక గ్రహబలం ఉండాలని శాస్త్రం చెప్పలేదు. ఉంటే మంచిదని అభిప్రాయం. శుభముహూర్తం ఎలాగో శుభగ్రహ బలం కూడా అలాగేనని అందరూ గుర్తించాలి. సాధ్యమైనంత వరకు సందేహాలు లేకుండా అబ్బాయి, అమ్మాయిలకు వివాహాలు చేసి సుఖశాంతులతో కలకాలం వర్ధిల్లాలని అందరం ఆశీర్వదించాలి.



# 15. గృహస్థాశ్రమముత్తమం

మన జీవన విధానంలో కొన్ని ప్రధాన మైన మార్పులు సహజంగా జరుగుతాయి. ఇవి నాలుగు విధాలు. ఈ నాల్గింటినే పెద్దలు ఆశ్రమాలుగా పేర్కొన్నారు. జననం మొదలు వివాహం అయ్యేవరకు బ్రహ్మచర్యాశ్రమం అని, వివాహం మొదలు సంసార బాధ్యతలు పూర్తయ్యే వరకు అంటే పుత్రుడిపై భారం వేసే సమయం వరకు గృహస్థాశ్రమమని, సంసార బాధ్యతలు పూర్తి చేసుకుని సన్యాసం తీసుకునేవరకు వానప్రస్థాశ్రమమని, సన్యాసం తీసుకోవడం సన్యాసాశ్రమమని అంటారు. జీవిత లక్ష్యమైన మోక్షాన్ని సాధించడానికి ఇది సహజ సోపాన మార్గం. పై నాలుగు ఆశ్రమాలలోకెల్లా గృహస్థాశ్రమమే ఉత్తమమైందని శాస్త్రం చెబుతోంది.

**శ్లో॥ యథా మాతర మాశ్రిత్య, సర్వే జీవంతి జంతవః ।**
**ఏవం గార్హస్థ్య మాశ్రిత్య, వర్తంత ఇతరాశ్రమాః ॥**

తల్లిని ఆధారంగా చేసుకుని సకల జీవులూ బ్రతుకుతున్నట్లు గానే గృహస్థాశ్రమాన్ని ఆధారంగా చేసుకుని ఇతర ఆశ్రమాల వారంతా జీవిస్తున్నారు.

సర్వజీవులూ వాయువును ఆశ్రయించి ప్రాణాలతో ఎలా ఉంటున్నాయో ఆ విధంగానే అన్ని ఆశ్రమాలవారు గృహస్థాశ్రమాన్ని ఆశ్రయిస్తున్నారు. నదులన్నీ సముద్రంలో కలిసినట్లుగానే మిగతా మూడు ఆశ్రమాలవారూ అంటే... బ్రహ్మచర్య, వానప్రస్థ, సన్యాస ఆశ్రమాలవారందరూ గృహస్థాశ్రమంలోని వారితో కలిసి ఉంటున్నారు. ఇలాంటి ఉత్తమమైన గృహస్థాశ్ర మంలోని వారంతా ధర్మబద్ధమైన జీవనం గడపాలి.

### గృహస్థాశ్రమ ధర్మాలు

గృహస్థుడైన యజమాని తన భార్యను సురక్షితంగా ఉంచాలి. పిల్లలకు చక్కని విద్యను అభ్యసింపజేయాలి. ఇతర కుటుంబ సభ్యులను బంధువులను

పోషించాలి. గృహస్థుకు భార్యే ప్రధానం. సకల ధర్మకర్మలకు భార్య సహధర్మచారిణిగా ఉంటుంది. కాబట్టి ఆమెకు అయిష్టమైన వాటిని ఏమీచేయ కూడదు. ధన, వస్త్రాభరణాదులిచ్చి సంతోషపెట్టాలి. శ్రద్ధతోనూ మంచి మాటల తోనూ సంతృప్తి పరచాలి. భార్యను ఒంటరిగా ఉత్సవాలకు, యాత్రలకు, సభలకు పంపకూడదు. ఆమెకు తోడుగా కుమారున్నో, బంధువునో, సేవకున్నో ఇచ్చి మరీ పంపాలి.

తల్లిదండ్రులు, భార్యాపిల్లలు, సోదరులు అతిథులను వదిలి ఏ పరిస్థితుల్లోనూ గృహస్థు భుజించకూడదు. పెద్దలను, బంధువులను వంచించి తన పొట్టనే నింపుకునే తుచ్ఛుడు లోకంలో నిందింపబడడమే కాక నరకబాధల్ని అనుభవిస్తాడు. గ్రామంలోని స్వధర్మపరులైన వారిని, శ్రోత్రియులైన బ్రాహ్మణులను, అభ్యాగతులను, సన్యాసులను సాదరంగా ఆహ్వానించి యథాశక్తి ఆతిథ్యమియ్యాలి.

ఐదేళ్లు వచ్చేవరకు పిల్లల్ని ప్రేమగా, రాజభోగాలతో పెంచాలి. తరువాత పదహారేళ్లు వచ్చేసరికి దాసుడివలె పనిపాటలు నేర్పించాలి. అవసరమైతే శిక్షించి అయినా విద్యాభ్యాసం చేయించాలి. పదహారేళ్లు దాటిన పుత్రుల్ని గాని, పుత్రికల్ని గానీ స్నేహితులుగానే భావించి ఏమాత్రం శిక్షించకూడదు. పరుష వాక్యాలతో బాధించకూడదు. కోడలు మొదలైనవారిని పీడించకూడదు. యోగ్యులైన పుత్రులను ఇంటి పనులలో ఉపయోగించి క్రమంగా తనతో సమానులుగా తయారుచేసి వారికి పూర్తి బాధ్యతలను అప్పగించడానికి ప్రయత్నించాలి. యుక్తవయసు వచ్చిన పుత్రికలను యోగ్యుడైన వరుడికిచ్చి వివాహం జరిపించాలి.

మేనల్లుళ్లు, తమ్ముళ్లు, మనుమలు, మనవరాళ్లు, తమ్ముళ్ల భార్యలను, కోడళ్లను, చెల్లెళ్లను పుత్రాధికప్రేమతో చూడాలి. గృహస్థుడు తన కుటుంబ సభ్యులనేకాక జ్ఞాతులను, బంధు మిత్రులను సేవకులను యథాశక్తి పోషిస్తూ సంతోషపెట్టాలి. చెడు ప్రవర్తన గల భార్యాపిల్లల వల్ల గృహస్థుకు సమాజంలో అపకీర్తి రావడమే కాకుండా పరలోకంలో ఉత్తమ గతులు కూడా ఉండవు. అందుకే నిత్య జాగురూకులై భార్యాపిల్లలను మంచి మాటల చేత క్రమశిక్షణతో సన్మార్గవర్తనులుగా చేయాలి. దీనివల్ల కీర్తి, ఐశ్వర్యాలు కలుగుతాయి. భార్యాపిల్లల చెడు నడవడి వల్ల గృహస్థు జ్ఞానం, కర్మ కూడా నశించి వంశానికంతటికీ అపకీర్తి కలుగుతుంది.

గృహస్తు తన ఇంటికి వచ్చినవారు ఎలాంటివారైనా తగిన విధంగా వారిని ఆదరించాలి. కుశల ప్రశ్నలతో పలకరిస్తూ మంచినీరు ఇవ్వాలి. ఆ తరువాత శక్త్యానుసారం భోజనం పెట్టి మర్యాదగా సాగనంపాలి. అభ్యాగతుడైన బాలుడుగానీ, వృద్ధుడుగానీ పూజనీయులవుతారు. వారు గురువుల్లాగే అందరికీ ఆదరణీయులు. రోగ పీడితుడికి పడకను, అలసట చెంది వచ్చిన వారికి ఆసనాన్ని, దప్పికగొన్నవారికి మంచినీటిని, ఆకలిగా ఉన్నవారికి అన్నాన్ని ఇవ్వాలి.

కరువు కాలంలో అన్నం పెట్టినవారు, మంచిరోజుల్లో డబ్బులిచ్చినవారు, యుద్ధసమయంలో ధైర్యవంతులు, అప్పులకు దూరంగా ఉన్నవారు అభినందనీయులు. భయపడే వారికి ధైర్యమిచ్చి, రోగులకు ఔషధాలిచ్చి, విద్యార్థులకు చదువు చెప్పి, ఆకలిగా ఉన్నవారికి అన్నమివ్వడం మిక్కిలి ఉత్తమం. ముసలి వారైన తల్లిదండ్రులు, సాధ్వియైన భార్య, పసివారైన పిల్లలను ఎంత కష్టమైన పనులైనా చేసి గృహస్థు పోషించి తీరాలి.

**"మాతరం పితరం చైవ సాక్షాత్ ప్రత్యక్ష దేవతాం"**

తల్లిదండ్రులను ప్రత్యక్ష దైవాలుగా భావించి అన్నివిధాలా సేవించాలి. మంచి కుమారుడే కులాన్నంతటికీ పవిత్రత చేకూరుస్తాడు. పుత్రుడెపుడూ తల్లిదండ్రులను తీయని, చల్లని మాటలతోనే పలకరించాలి. వారికిష్టమైన వాటిని సమకూరుస్తూ, వారి ఆజ్ఞలను తప్పక పాటించాలి. తన మంచిపనులతో తల్లి దండ్రులకు సంతోషాన్ని కలిగించేవాడే పుత్ర శబ్దానికి అర్హుడు.

భర్తకు హితం చేకూర్చునదే భార్య అవుతుంది. అలాగే భార్యకు హితం చేకూర్చువారే భర్త అవుతాడు. కష్టసుఖాల్లో ఒకేవిధంగా సహకరించేవారే మిత్రులు. వీరంతా పూర్వపుణ్య విశేషం చేతనే లభిస్తారు.

విద్యాధనంతో, అధికారమదంతో కీర్తిప్రతిష్ఠలు కలిగి కళ్లుకానక, పొగరుబోతుతనంతో తల్లిదండ్రులను ఎవరు చులకన చేస్తారో వారు ధర్మచ్యుతులై నరకాన్ని పొందుతారు. పితృభక్తి కలవాడే కుమారుడు, పెంచి పోషించేవాడే తండ్రి, విశ్వాస పాత్రుడే మిత్రుడు, సుఖపెట్టునదే భార్య లేదా భర్త అవుతారు. తన మేలు కోరేవాడు ఎప్పుడైనా తండ్రి ఎదుట పొగరుబోతు మాటలాడకూడదు. వేళాకోళాలు, బెదిరింపులు, చాడీలు చెప్పడం మొదలైనవి చేయకూడదు.

ఏ ప్రాంతంలో, ఏ గ్రామంలో తగిన సన్మానం, ప్రియాచరణం, బంధువర్గం, చదువుసంధ్యలు, సంపన్నులు లేరో ఆ ప్రాం తంలో ఒక్కరోజైనా నివసించకూడదు. లోకంలో మనకు ఏది ఇష్టమో, వేటిని మన ఇంట్లో ఇష్టంగా ఉంచుకుంటామో, ఏయే వస్తువులు ఎక్కువగా ఉండాలని కోరుకుంటామో వాటిని యోగ్యులైనవారికి ఇస్తూ ఉండాలి. "దానమేవ కలౌ యుగే" అని శాస్త్రవాక్యం. ఎవరు సర్వహింసల నుండి దూరంగా ఉంటారో, క్షమాశీలురో సమస్త ప్రాణులకు ఆశ్రయభూతులో వారు మాత్రమే స్వర్గానికి వెళతారు.

సంసారమనే విషవృక్షంలో రెండే రెండు అమృతఫలాలున్నాయి. ఒకటి కావ్యామృత రసాస్వాదనం, రెండు సత్పురుష సహవాసం. ఏ పని సాధించాలన్నా విజయం పొందాలన్నా ప్రమాదాల్ని ఎదుర్కోక తప్పదు. ధైర్యసాహసాలతో ప్రమాదాల్ని ఎదుర్కొని విజయాన్ని పొందినట్లయితే శుభాలు తప్పక కలుగుతాయి. అప్పులు చేసిన తండ్రి, వ్యభిచారిణి అయిన తల్లి, రూపవతి అయిన భార్య, చదువురాని కొడుకు శత్రువులవుతారు. అంటే వీరివల్ల దుఃఖం తప్ప సుఖం లభించదు. ఎవరికి తల్లి, ఇల్లు ఉండవో, ఎవరి భార్య గయ్యాళో వారు సంసారం వదిలి అడవులకు పోవడం మేలు.

ధర్మార్థకామమోక్షాలనే నాలుగు పురుషార్థాలలో ఎవరికి కనీసం ఒకదానిలోనైనా శ్రద్ధా ఆసక్తి లేదో వారు వ్యర్థులు.

అతిథి, పిల్లలు, భార్య, తల్లి, తండ్రి ఈ ఐదుగురినీ గృహస్థు తప్పక పోషించాలి. మిగతావారిని తన శక్త్యానుసారం పోషించవచ్చు. సువాసినులైన ఇంటి ఆడపడుచులు, కన్యలు, రోగులు, గర్భిణులకు అతిథుల కంటే ముందుగా భోజనం పెట్టవచ్చు. ఇందులో ఏమాత్రం సందేహం లేదు. దుష్టురాలైన భార్య, మోసకారియైన మిత్రుడు, అహంకారి యైన సేవకుడు, పాము తిరిగే ఇల్లు వల్ల ప్రాణానికే ముప్పు రావచ్చు.

ప్రేమించడం, ద్వేషించడం, గౌరవించడం, పాపకర్మ చేయడం, అప్రియం గావించడంలో ఆలస్యం చేయడం మంచిది. అనగా బాగా ఆలోచించి చేయవల సినవని గ్రహించాలి.

"దానేన భోగీ భవతి, మేధావీ వృద్ధసేవయా"

దానం వలన భోగి అవుతారు. వృద్ధుల సేవ వల్ల జ్ఞాని అవుతారు, అహింస వల్ల చిరంజీవి అవుతారు.

"శిశువు జన్మించినప్పుడు తల్లిదండ్రులు పడిన శ్రమకు ప్రతి ఫలం ఏమి ఇచ్చినా తీరదు. నూరేండ్లు తల్లిదండ్రులకు సేవ గావించినా ఆ ఋణాన్ని తీర్చుకోలేం"

కుమార్తెను మంచి కులంలోకి ఇవ్వాలి. కుమారునికి మంచి విద్యలు నేర్పించాలి. శతృవులను వ్యసనమందు, మిత్రులను ధర్మమందు ప్రవర్తింపజేయాలి. పేదవారికి డబ్బు దానం చేయడం, పాడుబడిన గుడిలోని దేవుణ్ణి పూజించడం, దిక్కు లేని శవాన్ని దహనం చేయడం అనే ఈ మూడు పనులూ అశ్వమేధ యాగ ఫలంతో సమానమైన ఫలాన్నిస్తాయి.

దట్టమైన అడవిలో ముక్కుమూసుకుని కూర్చున్నా, ఎవరి జోలికీ వెళ్లకుండా తన పనిలో తాను నిమగ్నమై ఉన్నా కూడా మిత్రులు, శతృవులు, ఉదాసీనులు తటస్థపడుతూనే ఉంటారు.

అతిథి వాకిట్లో ఉండగా, వారిని విడిచి తాను భుజించడం మహాదోషం. ఆ సమయంలో త్రాగునీరు సురాపానంతో, తిన్న అన్నం గోమాంసంతో సమానం. యజ్ఞానికి, స్వంత ఇంటికి, దైవక్షేత్రానికి, గర్భిణీ స్త్రీ వద్దకు, ముదుసలివారి వద్దకు, బాలురు, రాజు, గురువు వద్దకు వెళ్లేటప్పుడు వట్టి చేతులతో వెళ్లకుండా, ఏదో పండు లేదా పూలను తీసుకుని వెళ్లాలి.

తల్లిలేని శిశువు బ్రతుకు, భార్యలేని యవ్వనం, శాంతం లేని ఋషి యొక్క తపస్సు చారులేని భోజనం వలె నిష్ప్రయోజనమైనవి. గుణహీనులైన నూరుగురు పుత్రుల కంటె గుణవంతు డైన ఒక పుత్రుడు మేలు. నక్షత్రాలెన్ని ఉన్నా చంద్రుని ప్రకాశమే గొప్పది. చెట్టు తొర్రలో పుట్టిన నిప్పు చెట్టునంతటినీ కాల్చినట్లు, దుష్టపుత్రుని వల్ల తండ్రికేగాక వంశం మొత్తానికి కీడు కలుగుతుంది.

వ్యవసాయాన్ని ఎలాగ రోజూ చూసుకోవాల్సి వస్తుందో, అలాగే కుటుంబాన్ని కూడా ప్రతినిత్యం శ్రద్ధగా చూసుకుంటూ ఉండాలి. కుటుంబాన్ని విడిచి ఇతర

కార్యకలాపాల్లో మునిగిన వారికి తాను చేస్తున్న కార్యఫలం లభించకపోగా, అనేక ఈతి బాధలకు గురికాక తప్పదు.

అతిథికి వడ్డించకుండా ఏ పదార్థం మనం భుజించరాదు. అతిథి పూజ చేసేవారికి ధన్యత, కీర్తి, ఆయుష్షు, స్వర్గం లభిస్తాయి. ఏ గృహస్థు తన కొరకే వంట చేయించుకుంటాడో, అతడు పాపాన్నే భుజిస్తాడు. బుద్ధిమంతులైన వారు దేవత, అతిథి పూజలు చేసి, మిగిలిన అన్నాన్ని భుజిస్తే.. యజ్ఞశేషం భుజించిన సత్ఫలం కలుగుతుంది. ఆచారం, ధర్మం, నడవడికల విషయంలో మన తండ్రి, తాత, ముత్తాతలు ఏ మార్గాన్ని అనుసరించారో, అదే మార్గంలో వెళ్లాలి. సత్పురుషులు నడచిన దారిలో వెళితే కీడు కలగదు.

**"సర్వం పరవశం దుఃఖం, సర్వమాత్మవశం సుఖం"**

ఇతరులపై ఆధారపడి ఉండడమే దుఃఖదాయకం, స్వశక్తి మీద ఆధారపడి పనులు చేసుకొనుటచే సుఖం లభిస్తుంది. సుఖ దుఃఖ స్వరూప సారాంశమే ఇది. మన స్వంత ఆలోచన వల్ల సుఖం కలుగుతుంది. పెద్దల ఆలోచనలను ఆచరణలోకి తీసుకోవడం మరింత క్షేమకరం. ఇతరుల ఆలోచనలను అను సరిస్తే నష్టమే చేకూరుతుంది.

"సత్యవ్రతం" అనగా సాధ్యమైనంత వరకు నిజమే చెప్పడం, ఆడిన మాట తప్పకుండా ఉండడం వల్ల సంపదలు కలుగుతాయి. మనకున్న దానిలో త్యాగం చేస్తే కీర్తి లభిస్తుంది. అభ్యాసం చేయడం వల్లే విద్య లభిస్తుంది.

మనం చేసే పనుల ననుసరించి బుద్ధి ప్రవర్తిస్తుంది. కర్మను అనుసరించే బుద్ధి కలిగినా, బుద్ధిమంతులైనవారు మాత్రం బాగా ఆలోచించే పనులు చేస్తూ ఉండాలి. చెడుబుద్ధి కలవారిని మట్టికుండవలె సులభంగా ఖండించవచ్చు గాని తిరిగి అతికించడం అసాధ్యం. మంచిబుద్ధి గలవారిని బంగారుకుండవలె భేదించుట కష్టం కాని తిరిగి అతికించడం సులభం

**"ఋణానుబంధ రూపేణ, పశుపత్నీ సుతాలయా"**

ఋణానుబంధ రూపంగానే పశువులు (వాహనాలు, వస్తువులు), భార్యాపిల్లలు, ఇళ్లు లభిస్తాయి. ఋణం తీరిపోగానే మళ్లీ మనల్ని వదిలివేస్తాయి.

బుద్ధిమంతులు వీటిని గూర్చి విచారించరు. మన ఆయుష్షు దినదినం తరిగిపోతూనే ఉంది. అయినా మనవాళ్లు కలిసినప్పుడు క్షేమమా? కుశలమా? అని ప్రశ్నిస్తారు. వారికి మనం కుశలంగా ఉన్నామని ఎలా చెప్పగలం? బాగా జీర్ణమైన ఆహారం, వివేకి అయిన కుమారుడు, మంచి శిక్షణగల స్త్రీ, బాగా సేవించబడిన రాజు, ఆలోచించి చెప్పిన మాట, బాగా విచారించి చేసిన పని ఎంతకాలం గడిచినా చెడు ఫలితాలనీయవు.

మనవారియందు ప్రేమ, సేవకులయందు దయ, చెడువారి వద్ద కఠినం, సాధుపురుషులందు ప్రీతి, పాలకుల పట్ల నీతి, పండితుల యెడ సత్ప్రవర్తన, శతృవులందు పరాక్రమం, గురువులందు సహనం, స్త్రీలపట్ల నిగ్రహం కలిగిన వారివల్లనే లోకంలో మంచితనం ఏర్పడుతుంది. ఇట్టివారే జీవితంలో కుశలురుగా గుర్తింపబడతారు.

మంచి వారితో స్నేహం చేయడం వల్ల అనేక మంచి ఫలితాలు కలుగుతాయి. బుద్ధి జాడ్యం అనగా సోమరితనం పోతుంది. సత్యవ్రతులౌతారు, ఆత్మగౌరవం పెరుగుతుంది. చెడు ఆలోచనలు రావు, మనస్సు నిర్మలమవుతుంది. కీర్తిప్రతిష్ఠలు లభిస్తాయి. మంచివారి స్నేహంవల్ల కలగని మంచిలేనేలేదు.

మంచివారిలోని మంచితనాన్ని దుర్మార్గులు చెడుగానే భావిస్తారు. పైగా అసమర్థుడనుకుంటారు. బిడియపడే వారిని సోమరియని, సదాచారవ్రతుడిని దంభాచారపరుడని, శుచిశుభ్రంగా నున్న వారిని కపటియని, పరాక్రమవంతుడిని దయాహీనుడని, మౌనిని పిచ్చివాడని, తేజోవంతుడిని అహంకారియని, చక్కగా మాట్లాడేవారిని వాచాలుడని, స్థైర్యం కలవారిని అశక్తుడని ఇలా ప్రతివారి యందు దోషం వెదకుటనే లోకంలో చెడువారి పని.

శతృవైనవారు మన ఇంటికి వచ్చినపుడు మర్యాదపూర్వకంగా ఆతిథ్యమీయవలసిందే. తనను నరకడానికి వచ్చిన వారికి కూడా చెట్టు నీడనే ఇస్తుంది కానీ ఊరుకోదు గదా! లోభాన్ని మించిన చెడు గుణం లేదు. చాడీలు చెప్పడం కంటె పాపం లేదు. సత్య వ్రతం కంటె మించిన తీర్థరాజం లేదు. సౌజన్యాన్ని మించిన బలం లేదు. కీర్తిని మించిన అలంకారం లేదు. విద్యకంటె మించిన ధనం లేదు. అపకీర్తిని మించిన చావులేదు.

**అపూజ్యా యత్ర పూజ్యంతే, పూజ్యానాం చ వ్యతిక్రమః**

ఎక్కడ పూజ్యులు అవమానింపబడి, అయోగ్యులు పూజింప బడతారో అక్కడ కరువు, భయం, మరణాలు, ప్రమాదాలు సంభవిస్తాయి. ధనికులు, వేదవేత్తలైన బ్రాహ్మణులు, రాజు, నది, వైద్యులు ఉన్న చోటనే నివసించాలి. తప్పులు జరుగుతాయేమోనని ఏ పనీ అసలే ఆరంభించకుండా ఉండడం కంటే, జరిగిన తప్పులను సరిదిద్దుకుంటూ ఏదో ఒక పనిని ప్రారంభించడం పురుష లక్షణం. అజీర్ణమవుతుందని భోజనం చేయకుండా ఊరుకోం కదా! బంతిని నేలమీద పడవేసినా, తిరిగి పైకి ఎగురుతుంది. అదేవిధంగా ధీరులైనవారు ఓటమి చెందినా, మరల కార్యసాధనకు పూనుకుని సాధిస్తారు. మట్టిముద్దవలె క్రిందబడి భూమికే అంటిపెట్టుకున్నట్టుగా ఉన్నవారు ఒకసారి జరిగిన ఓటమికే కార్యాన్ని మానుకొనే పిరికివారు, అధైర్య హీనులు. ఆపదలు కలిగినపుడు ధైర్యాన్ని, సంపదలున్నపుడు ఓరిమిని, సభల్లో వాక్చాతుర్యాన్ని, యుద్ధంలో పరాక్రమాన్నీ, కీర్తినీ సంపాదించడంలో ఆసక్తిని, విద్యాభ్యాసంలో వ్యసనాన్ని కలిగియున్నవారే మహాత్ములౌతారు. మహాత్ముల మనస్సు కలిమియందు పుష్పకోమలంగాను, ఆపదలందు పెద్ద శిలాపర్వతం యొక్క ఉపరితలంవలె నిశ్చలంగా ఉంటుంది. పండ్లు పుష్కలంగా ఉన్న చెట్లు క్రిందకు వంగి ఉంటాయి. అలాగే సంపదలందు సత్పురుషులు వినమ్రులై ఉంటారు. ఇతరుల కొరకు జీవించే వారికి నమ్రతయే ప్రధాన స్వభావమై ఉంటుంది.

పౌరుషవంతులైన వారికి పుష్పగుచ్ఛం వలె అందరి తలలపై ఉండడమో, అడవిలో నేలరాలి నశించడమో జరుగుతుంది. మనోవాక్కాయములతో పుణ్యకర్మలు చేస్తూ, అమృత హృదయులై, నిరంతరం లోకోపకారులై, ఇతరులకు ఏ రవ్వంత సుగుణమున్ననూ దాన్ని కొండంతలు చేసి లోకాన్ని ఆనందంలో ఓలలాడించే మహానుభావులు కొందరే ఉంటారు గదా!



# 16. సనాతన ధర్మ సా(గ)రం

మానవులకు చతుర్విధ పురుషార్థాలైన ధర్మార్థకామమోక్షాలే ఇహ,పర సాధనలు. ఈ చతుర్విధ పురుషార్థాలను సులభంగా లభింపజేయుటే ఆగమశాస్త్రము యొక్క ప్రధాన లక్ష్యం.

**'ఆగచ్ఛంతి, బుద్ధిమారోహంతి, యస్మాత్ అభ్యుదయనిశ్రేయ సోపాయాః స ఆగమః'** దేనినుండి క్షేమం, మోక్షపాయాలు లభించుచున్నవో, తెలియుచున్నవో అది 'ఆగమమ'ని అర్థం. మానవుడు నిరంతరం సుఖాన్వేషి, ప్రతి విషయంలో తన క్షేమాన్నే కోరుకుంటాడు. సుఖాన్వేషణలో ఎన్ని దుఃఖాలను అనుభవించుటకైనా సిద్ధపడతాడు. కాని ధర్మంతో కూడిన అర్థ,కామాలను పొందినపుడు మానవుడు సుఖంగా నుండగలడు. దుఃఖాలు వాటంతట అవే దూరమవుతాయి. అందుకే చతుర్విధపురుషార్థాలలో 'ధర్మం' మొదటి స్థానం ఆక్రమించింది. సుఖాన్వేషియైన మానవునికి శాశ్వతసుఖమే మోక్షం. మానవజీవిత పరమ, చరమ లక్ష్యం కూడా మోక్షమే. మోక్షసాధనకు ధర్మమే ఆధారం. అర్థకామాలను త్యజించినవారికే మోక్షం సిద్ధిస్తుంది. అనగా ఇహలోక సుఖానుభవాలను పొందుటకు అర్థకామాలు ఎంత అవసరమో, పరలోక సుఖమైన మోక్షాన్ని సాధించుటకు అర్థకామాలు అంతే అవసరమని సారాంశం. రెంటిలో కూడా ధర్మంయొక్క పాత్ర అత్యంతావశ్యకమైంది. మరియు విశిష్ఠమైంది. మన సనాతన ఋషులు ధర్మాన్ని మిక్కిలి ప్రాధాన్యతనిచ్చిరి. అట్టి సనాతన ధర్మస్వరూపాన్ని సమగ్రంగా తెలియజేయుటకే ఈ ప్రయత్నం.

సనాతన ధర్మానికి వేదాలే ప్రమాణాలు. వేదం అనగా...

**'విదంత్యనేన ధర్మాధర్మానితి వేదః'** దేనిచేత ధర్మాధర్మాలను తెలిసికొందుమో అది 'వేదం' అనబడును.

వేదానికే 'శృతి' అని, 'ఆమ్నాయమ'ని పేర్లు కలవు. శృతి అనగా... **'శ్రూయతే ధర్మాధర్మాదిక మనయేతి శృతిః'** దేనిచేత ధర్మాధర్మాలు వినబడునో అది శృతి అనబడును. ఆమ్నాయమనగా... **'ఆమ్నాయతే పారంపర్యేణేత్యా మ్నాయః'** ఏది పారంపర్యంచేత అభ్యసించబడుచున్నదో అది ఆమ్నాయం.

పారంపర్యంచేత అభ్యసించబడి, ధర్మాధ్మాలను విని, తెలుసుకొనుచున్నామో అది వేదమని తాత్పర్యం. వేదం అనగా ధర్మాధర్మాలను సంపూర్ణంగా బోధించునది అని స్పష్టంగా తెలుస్తుంది.

ధర్మం అనగా **ధరతి లోకానితి ధర్మః** లోకాలను ధరించునది 'ధర్మం' అని అర్థం. మరియు **'ధ్రియతే వా జనైరితి ధర్మః'** ప్రజలచేత ఆచరించబడునది ధర్మం. అనగా వేద విహితమైన కర్మనే ధర్మమై ఉంది. వేదం అపౌరుషేయం మరియు సనాతనమైంది. అనగా ధర్మం కూడా సనాతనమైందని సారాంశం. సనాతన ధర్మాన్ని క్షుణ్ణంగా తెలుసుకొని, యథాశక్తి దేశకాల పరిస్థితులననుసరించి ఆచరించుటకు ప్రయత్నించాలి. గీతలో కూడా శ్రీకృష్ణభగవానుడు...

**శ్లో॥ యదాయదాహి ధర్మస్య గ్లానిర్భవతి భారత ।**
**అభ్యుత్థాన మధర్మస్య తదాత్మానం సృజామ్యహమ్ ॥**

ఓ అర్జునా! ఎప్పుడు ధర్మానికి హాని, అధర్మానికి వృద్ధి యగునో అప్పటికప్పుడు నేను నా రూపాన్ని ప్రకటిస్తుంటారు. అనగా భగవానుడు ధర్మరక్షణార్థమై అవతరిస్తానని ఖచ్చితంగా చెప్పాడు.

**'ధర్మ సంస్థాపనార్థాయ సంభవామి యుగేయుగే'** ధర్మం సుస్థిరమొనర్చుటకు నేను ప్రతి యుగంనందు అవతరిస్తానని స్పష్టంగా తెలియజేసాడు. సృష్టిలో ధర్మపరిరక్షణ ఎంత ముఖ్యమో తెలుస్తుంది.

**యుగధర్మం**

కృతయుగాన ధర్మం పూర్ణమై నాలుగు పాదాలు కలిగియుండె. కేవలం సత్యమే కృతయుగాన పరివ్యాప్తమై ఉండె. అందుకే దీనికి సత్యయుగమని పేరు. అధర్మానికి ఏమాత్రం అవకాశంలేదు. తక్కిన మూడు యుగాలలో అధర్మంచే ధన, విద్యాదిసంపాదనం వలన ధర్మం పాదపాదాన తగ్గుచూ వచ్చింది. ధనవిద్యలచే

ఆర్జితమైన ధర్మం కూడా దొంగతనం, అసత్యం, మోసాలవలన తగ్గిపోతూవుంది.

ధర్మయుగమైన కృతయుగంలో మానవులు రోగాలు లేనివారై, సకలవిధాలైన కోరికలు పూర్తి చేసుకొనిన వారై, నాలుగు వందల సంవత్సరాల ఆయుష్షు కలిగియుండిరి. మిగిలిన యుగాలందు ఆయువుగూడా పాదపాదాన అల్పమైంది. అనగా కలియుగమందు మానవుని ఆయుష్షు కేవలం వందసంవత్సరాలే.

కృతయుగాన ధర్మాలు వేరు. త్రేతాయుగాన ధర్మాలు వీనికంటే భిన్నాలు. వానికంటే వేరైనవి ద్వాపరయుగ ధర్మాలు. కలియుగధర్మాలు ద్వాపరయుగంకంటే వేరైనవి. యుగాల క్షీణదశను అనుసరించి ప్రతియుగాన ధర్మాలు వేర్వేరుగా వున్నాయి.

**శ్లో॥ తపః పరం కృతయుగే, త్రేతాయాం జ్ఞానముచ్యతే ।**
**ద్వాపరే యజ్ఞమే వాహుః దానమేకం కలౌయుగే ॥**

సకల ధర్మాలన్నియు అన్నియుగాలందును ఉండవలసినవి ఉన్నను, కృతయుగాన తపస్సు మేలై ఉండెను. త్రేతాయుగాన తపస్సు కంటే జ్ఞానం శ్రేష్ఠమై ఉంది. ద్వాపరయుగాన యజ్ఞం విశేషమైయుంది. నేటి కలియుగాన 'దానమొక్కటే' మిక్కిలి శ్రేష్ఠమైంది.

**సత్పురుషుల ధర్మాలు**

ఎవరైనను వారివారి యోగ్యతననుసరించి, ఉత్తమధర్మాలు ఆచరించుటకు గాను 'సత్పురుషుల ధర్మాలు' తెలియాలి. బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్రులనెడి నాలుగు వర్ణాలను వారివారి గుణ, కర్మలననుసరించి విభాగం చేయబడినవే కాని ఆయా కులాన జన్మించుటవల్ల కాదు. అనగా కులం ప్రధానం కాదు గుణమే ప్రధానమని తాత్పర్యం.

**శ్లో॥ అధ్యయనం చాధ్యయనం యజనం యాజనం తథా ।**
**దానం ప్రతిగ్రహం చైవ బ్రాహ్మణానామకల్పయత్ ॥**

వేదశాస్త్రాలు, చదువుట, ఇతరులకు చెప్పుట, యజ్ఞాలు చేయుట, ఇతరులచే చేయించుట, దానం చేయుట, ఇతరులిచ్చిన దానాలు స్వీకరించుట, అను ఈ ఆరు ఉత్తమకర్మలు బ్రాహ్మణులు ఆచరించవలసినవి.

ఎవరు ఆరు ఉత్తమ కర్మలను నిత్యం ఆచరిస్తారో వారే బ్రాహ్మణులని తెలియాలి. వేద, శాస్త్రార్థములను వివరించుట సృష్టి విశేషమేగానీ, తప్పనిసరికాదు. అయినను ఈ ఆరు కర్మలను ఆచరించిన బ్రాహ్మణులే శ్రేష్ఠులు.

**శ్లో॥ భూతానాం ప్రాణినః శ్రేష్ఠాః, ప్రాణినాం బుద్ధి జీవినః ।**
**బుద్ధిమత్సు నరాః శ్రేష్ఠాః నరేషు బ్రాహ్మణాః స్మృతాః ॥**

సృష్టిలోని సకలభూతములైన స్థావర, జంగమ రాశులలో ప్రాణులు శ్రేష్ఠులు. ప్రాణులన్నింటిలో బుద్ధిచే జీవనం చేయునవి, యోగ్యమైనవి. బుద్ధిమంతులైన వారిలో మానవులు శ్రేష్ఠులు. మానవులలో బ్రాహ్మణులు శ్రేష్ఠులు.

**శ్లో॥ ఉత్పత్తిరేవ విప్రస్య మూర్తిర్ధర్మస్య శాశ్వతీ ।**
**సహి ధర్మార్థముత్పన్నో బ్రహ్మ భూయాయ కల్పతే ॥**

బ్రాహ్మణుని పుట్టుకయే ధర్మానికి నిత్యమైన శరీరం. ధర్మాచరణ నిమిత్తమే జన్మించారు. ధర్మాచరణం వల్లనే బ్రాహ్మణుడు బ్రహ్మత్వాన్ని పొందగలరు. ధర్మసమూహ రక్షణ బాధ్యత బ్రాహ్మణునిదే అయివుంది. ధర్మప్రభువులు అయిన బ్రాహ్మణులకు ఉంవలసిన లక్షణాలు గీతలో కూడా చెప్పబడినాయి.

**శ్లో॥ శమోదమస్తపః శౌచం క్షాంతిరార్జవ మేవ చ ।**
**జ్ఞానం విజ్ఞాన మాస్తిక్యం బ్రహ్మకర్మ స్వభావజమ్ ॥**

మనోనిగ్రహం, ఇంద్రియనిగ్రహం, ధర్మాన్ని ఆచరించుటలో కలుగు కష్టాల సహనం, బాహ్యాభ్యంతర శుచిత్వం, ఇతరుల అపరాధాలను క్షమించుట, రుజుమార్గ జీవనం, వేదశాస్త్రాలందు, ఈశ్వరునియందు, పరలోకాదులందు విశ్వాసం కలిగి ఉండుట, వేదశాస్త్రాలను చదువుట, ఇతరులకు చెప్పుట, పరతత్వానుభవం అన్నియూ బ్రాహ్మణులయొక్క స్వాభావిక కర్మలై ఉన్నవి.

**ధర్మలక్షణం**

శ్లో॥ వేదః స్మృతిః సదాచారః స్వస్య చ ప్రియమాత్మనః ।
**ఏతచ్చతుర్విధం ప్రాహుః సాక్షాద్ధర్మస్య లక్షణమ్ ॥**

వేద ప్రమాణితం, స్మతి బోధితం, సత్పురుషుల నడవడికి అనుగుణమైనవి. తన ఆత్మకు నిశ్చయమైంది ఈ నాలుగును ధర్మంయొక్క ప్రధాన లక్షణాలు.

శ్లో॥ అహింసా సత్యమస్తేయం శౌచమింద్రియ నిగ్రహః ।
ఏతం సామాసికం ధర్మం చతుర్వర్ణేஉబ్రవీన్మనుః ॥

అహింస, సత్యము, పరులసొత్తు తీసుకొనుట (దొంగతనం), పరిశుభ్రత, ఇంద్రియ నిగ్రహం ఇవి నాలుగు వర్ణాలవారికి అనగా అందరికీ పరమధర్మాలు. ఇంకను ధైర్యం, ఓర్పు, మనోనిగ్రహం, తనదికాని వస్తువుపై ఆశ లేకుండుట, శుచిత్వం, బుద్ధి, విద్య, సత్యం, కోపం లేకుండుట అనునవి 10 ధర్మలక్షణాలు.

సత్పురుషులైనవారు ఏవిధంగా నడచుకుందురో ఇతరులందరూ వారినే అనుసరిస్తారు. కనుక ముందుగా ఉత్తములందరూ ఖచ్చితంగా పై ధర్మ లక్షణాలను కలిగి యుండాలి.

అదీగాక పై ధర్మలక్షణాలను ఎవరైతే కలిగివుంటారో వారే ఉత్తములు. ఉత్తములు ఏది ప్రమాణంగా స్వీకరిస్తారో, మిగతా వారందరూ దానిని ప్రమాణంగా గ్రహిస్తారు.

వ్యాసమహర్షి మహాభారతంలో **'నేను చేతులెత్తి ఆక్రోశిస్తున్నాను దయచేసి వినండి.. ధర్మంవలనే అర్థ, కామాలు కలుగుతున్నాయి. కావున అట్టి ధర్మాన్ని మీరందరూ ఆచరించండయ్యా...'** ధర్మంయొక్క విశిష్టత చాలా గొప్పది. అయితే ఇది తర్కమువలన తెలుసుకోవలసిందికాదు. శృతులు భిన్నంగా ఉన్నవి. ధర్మం యొక్క యథార్థతత్వం తెలుసుకొనుట చాలా కష్టం. కావున మహాత్ములైన మన పూర్వీకులు ఏ మార్గాలను అనుసరించారో దానినే మనం అనుసరించుట సరియైన మార్గమని శాస్త్రం తెలుపుతుంది.

శ్లో॥ ధర్మార్థ కామమోక్షాణాం ప్రాణాస్సంస్థితి హేతవః ।
తాన్నిఘ్నతా కింనహతం రక్షతా కిం న రక్షతమ్ ॥

ధర్మార్థకామ మోక్షాలనే నాలుగు పురుషార్థాల నిలకడకు ప్రాణాలే హేతువులై వున్నవి. అట్టి ప్రాణాలను పోగొట్టుకొనినవాడు సర్వాన్ని పోగొట్టుకున్నవాడే అవుతారు. వాటిని రక్షించుకొన్నచో సర్వం రక్షించుకున్నవాడవుతాడు.

పరులకు హితమైన ధర్మాన్ని అడగకుండా చెప్పినవాడే సత్పురుషుడు. 'ధర్మోరక్షతి రక్షితః' ధర్మాన్ని మనం కాపాడినచో అది మనలను రక్షిస్తుంది.

భారతీయ సంస్కృతి సనాతన ధర్మంపైనే ఆధారపడివుంది. ధర్మం ఇతరులకు బోధించుటకు సులభంగానే ఉంటుంది. ఆచరించుటయే కష్టసాధ్యం. కనుక ఇతరులకు చెప్పబోయే ముందు మనం ఎంతవరకు ఆచరిస్తున్నామనేదే ముఖ్యం.

సనాతన ధర్మరక్షణ వలన ప్రపంచంలో అతివృష్టి, అనావృష్టులు, కరవుకాటకాలు, రోగ, చోర, అగ్ని, భూకంప, తుఫాను భయాలుండవు. పాడిపంటలు సమృద్ధిగా ఉంటాయి. ప్రజలు ఆయురారోగ్యైశ్వర్యమలతో సుఖంగా ఉంటారు.

**శ్లో॥ అష్టాదశ పురాణానాం, సారం సారం సమృద్ధృతం ।**
**పరోపకార పుణ్యాయ, పాపాయ పరపీడనమ్ ॥**

18 పురాణాల సారం పిండగా పిండగా చివరికి తెలిసిందేమిటంటే ఇతరులకు సహాయం చేయుట పుణ్యం అనియూ, ఇతరులను బాధించుట పాపం అనియూ. ఈ రెండు వాక్యాలను నిరంతరం గుర్తుంచుకొని ఆచరించుటకు ప్రయత్నించాలి. మానవులు పాపపుణ్యాలను, వాటి ఫలాన్ని కూడా తెలిసియూ, నిరంతరం పాపకర్మలు చేయుటకే ప్రయత్నిస్తుంటారు.

పుణ్యఫలం కోరు మానవులు పుణ్యకర్మలు చేయుటకు ఇష్టపడరు, పాపఫలం అవసరంలేదు. కానీ ప్రయత్నపూర్వకంగా పాపకర్మలు చేస్తుంటారు. ఇది మానవసహజమై యుంది. బుద్ధిమంతులైన మానవులు దీనిని అతిక్రమించి, యథార్థాలను గ్రహించి మెలగాలి. మానవజీవితమే సుఖదుఃఖ మిశ్రితం. మనమెల్లప్పుడూ సుఖాన్ని కోరుకుంటూనే దుఃఖాన్ని అనుభవిస్తాం. కేవలం పుణ్యం చేయుటవల్లనే సుఖం లభిస్తుంది. కాని పుణ్యసంపాదన చాలా కష్టం. సనాతన ధర్మాచరణం వల్లనే పుణ్యం లభించును.

పాపకర్మాచరణకు ప్రయత్నమే అవసరంలేదు. మనకు తెలియకుండానే అది కలుగుతుంది. దాని ఫలం మాత్రం దుఃఖరూపంలో అనుభవించక తప్పదు. తెలిసి చేసినను, తెలియక చేసినను పాపఫలం వస్తుంది.

**శ్లో॥ కేచిదజ్ఞానతో నష్టాః కేచిన్నష్టాః ప్రమాదతః ।**
**కేచిత్ జ్ఞానావలేశేన కేచిన్ నష్టైః ర్వినాశితః ॥**

తెలియక నష్టపోయేవారు కొందరు, తెలిసి ప్రమాదంతో నష్టపోయేవారు మరికొందరు, తెలియకనే తెలిసితిమని గర్వించి నష్టపోయేవారు ఇంకొందరు. ఇలా నష్టపోయేవారు నాలుగు విధాలని శాస్త్రంలో పేర్కొనబడింది.

ప్రస్తుత కలికాలంలో బహుజాగరూకులై, మనకు వీలైనంతలో కాలపరిస్థితులననుసరించి సనాతన ధర్మాన్ని ఆచరించుటకు ప్రయత్నించాలి. సనాతన ధర్మాచరణవల్ల సమాజంలో మార్పు సంభవిస్తుంది. నేడు జరుగుతున్న విపరీత పరిస్థితులకు కారణం సనాతన ధర్మాచరణలోపమే. మనతోటి మానవులేకాదు సకల ప్రాణులన్నియూ సుఖిస్తాయి. ప్రతి ఒక్కరూ సనాతన ధర్మాన్ని ఆచరించుటకు సంకల్పించి యథాశక్తి ప్రయత్నించాలి.

యుగధర్మాలు, దేశ, కాల, వాతావరణ పరిస్థితులననుసరించి ధర్మాలు కూడా మారినవి. మారే ధర్మాలను కూడా ఆచరించడానికి ప్రయత్నించకపోతే మానవజన్మ వ్యర్థం. దేశకాల పరిస్థితుల ననుసరించి ధర్మాన్ని మార్పు చేసుకొనుటకుగాను, శాస్త్రంలో వెసులుబాటు ఉండనే ఉంది. దానికై చింతించవలసిన అవసరం లేదు. సనాతన ధర్మపరిరక్షణమే ఆగమశాస్త్ర ధ్యేయమైనపుడు, ఈ రెండునూ ఒకటేనని వేరే చెప్పనక్కరలేదుకదా! ముందు ధర్మరక్షణం, తర్వాత శాస్త్రఅవగాహన అవసరం.



# 17. ధర్మేణ లభతే సర్వం

శ్లో॥ ధర్మాదర్థః ప్రభవతే, ధర్మాత్ప్రభవతే సుఖం ।
ధర్మేణ లభతే సర్వం ధర్మసార మిదం జగత్ ॥

(రామా. అరణ్య. 8-30)

ధర్మంవల్ల ధనం, సుఖంతోపాటు సర్వం లోకంలో సంభవిస్తాయి. ఈ ప్రపంచంలో ధర్మమే సారభూతమైంది.

ప్రస్తుత కలికాలంలో ధర్మం ఒక పాదంమీద మాత్రమే ఉంది. అది కూడా నశింపజేయకుండా కాపాడుకునే బాధ్యత మనందరిపై ఉందని గుర్తుంచుకుందాం.

మనందరి సుఖం కొరకే ధర్మం ఏర్పడింది. కాకపోతే కాలానుగుణంగా ధర్మాన్ని ఆచరించడం ప్రస్తుత కర్తవ్యం. ధర్మార్థ కామమోక్షాలనే నాలుగువిధాలైన పురుషార్థాలను సాధించడం కోసమే మనకు జన్మ లభించింది. ఇవి సాధించడానికి శరీరమే ముఖ్యం. ఎంత ప్రయత్నం చేసైనా శరీరాన్ని చక్కగా కాపాడుకోవాలి. 'శరీర మాద్యం ఖలు ధర్మసాధనమ్' అన్నారు. శరీరం ద్వారానే ధర్మసాధన చేయగలం.

శరీరాన్ని కాపాడుకోవడానికి ఆరోగ్యం అవసరం. సంపూర్ణ ఆరోగ్యవంతులే అన్ని కార్యాలూ సులభంగా చేయగలరు. ఆరోగ్యంగా ఉండాలంటే ఆహారం బాగుండాలి. మనం తీసుకునే ఆహారంపై ఆరోగ్యం ఆధారపడివుంది. కలుషితం లేని, సాత్విక మితాహారం తీసుకున్నవారికే సంపూర్ణ ఆరోగ్యం ఉంటుంది.

అందుకే 'ఆరోగ్యమే మహాభాగ్యం' అన్నారు.

ఎంత సంపద ఉన్నా, ఆరోగ్యం సరిగా లేకపోతే ఏం లాభం? ఆరోగ్యాన్ని కాపాడుకోవడానికి ముందు మనం శ్రద్ధ తీసుకోవాలి.

ధర్మసాధనకు ఆరోగ్యం మొదటిదైతే, విద్య రెండవది. విద్య అనగా జ్ఞానం, ఆరోగ్యవంతులమైన మనకు జ్ఞానం లేకపోతే ప్రయోజనముండదు.

**'జ్ఞానేన హీనాః పశుభిస్సమానాః'** జ్ఞానం లేని మానవులు పశువులతో సమానులు. సరియైన విద్యనే అభ్యసించాలి. విద్యలన్నీ జ్ఞానాన్ని కలిగించేవే అయినా బ్రహ్మవిద్యకు సంబంధించిన విద్యను 'విద్య' అంటారు.

'అధ్యాత్మ విద్యా విద్యానామ్' అని గీతాచార్యుడు తెలిపాడు. మోక్షసాధనకు బ్రహ్మవిద్య ఒక్కటే శరణ్యం. ఎంతటివారికైనా బ్రహ్మవిద్య లేకపోతే మోక్షం రాదు. విద్యను అభ్యసించినవారే వినయంగా నుండగలరు. సద్గురువును ఆశ్రయించినవారికి చక్కని విద్య లభిస్తుంది. ప్రస్తుత కాలంలో మోక్షసాధనకే కాకుండా విద్యవల్ల జీవనం కూడా గడుస్తుంది. జీవనోపాధి కొరకే విద్యను అభ్యసించేవారు కోకొల్లలు. ఇది అధ్యాత్మ విద్యగాదు. దీన్ని లౌకికవిద్య అంటారు. విద్యాభ్యాసం పూర్తియైన తరువాత గృహస్థాశ్రమంలో ప్రవేశిస్తాం.

**శ్లో॥ యథా వాయు సమాశ్రిత్య, సర్వే జీవంతి జంతవః ।**
**తథా గృహస్థ మాశ్రిత్య, వర్తంత ఇతరాశ్రమాః ॥**

ఏవిధంగా సకలజీవులు గాలిని ఆశ్రయించి ప్రాణాలతో ఉంటున్నవో, అదేవిధంగా మిగతా ఆశ్రమాల వారంతా గృహస్థునిపై ఆధారపడియున్నారు.

ఒక కుటుంబీకునిపై పిల్లలు, వృద్ధులు, సన్న్యాసులు ఆధారపడి జీవిస్తారు. అందుకే కుటుంబాన్ని పోషించేవారు ఇది తప్పక దృష్టియందుంచుకోవాల్సిన అవసరం ఉంది. అంతేగాదు పితృదేవతలు కూడా గృహస్థునే ఆశ్రయిస్తారు. అతిథి, అభ్యాగతులను సాక్షాత్తూ భగవత్స్వరూపులుగా భావించి వారికి యథాశక్తి సేవించాలి. తల్లిదండ్రులు ప్రత్యక్ష దేవతలుగా భావించి సేవించాలి. పిల్లలను చక్కగా పోషించి, విద్యాబుద్ధులు నేర్పించి, యుక్తవయస్సు రాగానే వివాహం చేయాలి. వృద్ధులైన వారిని శ్రద్ధగా సేవించాలి. బంధువులను మిత్రులను ప్రేమ, ఆప్యాయతతో చూడాలి. అనగా గృహస్థునికి ఎక్కువ బాధ్యతలున్నాయన్న సంగతి చెప్పకనే తెలుస్తుంది. అందరూ అనుభవిస్తున్నదే. ధర్మసంపాదన చేయాలి. సంపాదించిన దానిలో కొంత దానధర్మాలకు కూడా వినియోగించాలి.

సత్ప్రవర్తనను కలిగియుండాలి. సదాచారవంతులు కావాలి. ఈవిధంగా గృహస్థ బాధ్యతలు పూర్తి చేసినట్లయితేనే మోక్షసాధనకు సులభమార్గం లభిస్తుంది.

ముఖ్యంగా గృహస్థుకు అన్నివిధాలా తోడునీడగా ఉండేది గృహిణి. భార్య అనుకూలంగా లేకపోతే గృహం ఒక నరకంగా మారుతుందనడంలో సందేహం లేదు. భార్యాభర్తలు కుటుంబం అనే రథానికి రెండు చక్రాల వంటివారు. ఒకరినొకరు అన్యోన్యంగా ఉండి కుటుంబ బాధ్యతలను నెరవేర్చుకోవాలి. ఒకరు గొప్ప, ఒకరు తక్కువ అనే భావన లేకుండా ఇరువురూ కలసిమెలసి ఉన్నట్లయితే సంసారం చక్కగా సాగుతుంది.

**శ్లో॥ అంతఃకరణ తత్త్వస్య, దంపత్యోః స్నేహసంశ్రయాత్ ।**
**ఆనంద గ్రంథి రేకో య, మపత్యమితి కథ్యతే ॥**

(ఉత్తర రామాయణం)

భార్యాభర్తల యొక్క అంతఃకరణ తత్త్వంయొక్క స్నేహసంసర్గంవల్ల కలిగే ఆనందబంధమే 'సంతానం' అని చెప్పబడుతుంది. నేటి కాలంలో కుటుంబాన్ని పోషించాలంటే ధనం ప్రధానమైంది.

**'ధనమూలం ఇదం జగత్'** ప్రతి చిన్న పనికి కూడా డబ్బే అవసరం. డబ్బు లేకుండా ఒక్క పని జరగదు. న్యాయంగా సంపాదించిన డబ్బు అయితేనే అది మనవద్ద ఉంటుంది. లేకపోతే తత్కాల సుఖం లభించినా చివరికి అన్నివిధాలా నష్టపోవడమే గాక భ్రష్టులవుతారు. కాకపోతే న్యాయంగా సంపాదించేవారికి అభివృద్ధి ఆలస్యంగా ఉంటుందనేది వాస్తవమే అయినా ఇది శాశ్వతమైంది. ఉత్తమమైంది.

'దానమేవ కలౌయుగే' అని ఉన్నందున దానంవల్లనే ధనం వృద్ధి అవుతుంది. వేరే మార్గమే లేదు. ధనం అనేది అదృష్టంమీదనే ఆధారపడి ఉంది. పూర్వజన్మ సుకృతాన్ననుసరించి సిరిసంపదలు కలుగుతాయి. కాని సంపాదించినవారు తప్పకుండా కొంత పొదుపుచేసి రక్షించుకోవాల్సిన అవసరం ఉంది. సంపదలుండి దానం చేయనివాడు వ్యర్థుడు. లోభగుణాన్ని మించిన పిశాచి లేదు. శక్తివంచన లేకుండా తనకున్నదానిలో ఇతరులకు అనగా లేనివారికి, పేదలకు దానం చేయుట అలవరచుకున్నవారే మోక్షానికి అర్హులవుతారు.

ఇతరులకు ఎవరు ఇబ్బంది కలిగించకుండా ఉంటారో వారికి అన్నివిధాలా మేలే జరరుగుతుంది. ఏ ఇబ్బందులూ లేకుండా సంతోషంగా ఉంటారు.

మన పెద్దలు ఆశ్రయించిన మార్గాలనే మనం ఆశ్రయిస్తే, ఏ ఇబ్బందీ ఉండదు. ముందు మన ప్రాంతం, తర్వాత మన కుటుంబంలోని పెద్దలు ఏ ఆచారాలను పాటించారో తెలుసుకుని మనం ఆవిధంగానే ఆచరించాలి తప్ప విరుద్ధంగా వెళ్లకూడదని శాస్త్రం చెప్పింది.

**శ్లో॥ యస్మిన్దేశే పురే గ్రామే, త్రైవిద్యే నగరేపివా ।**
**యో యత్ర విహితో ధర్మః తం ధర్మం న విచాలయేత్ ॥**

– పరాశర స్మృతి

ఏ దేశంలో, పట్టణంలో, గ్రామంలో ఏది విహితమై ఉంటున్న ధర్మమో, ఆ ధర్మాన్ని అతిక్రమించి ఎవ్వరూ నడువరాదు. అనగా అందరూ దానినే అనుసరించాలని తాత్పర్యం.

'పరోపకారాయ పుణ్యాయ పాపాయ పరపీడనమ్' ఇతరులకు ఉపకారం చేయడాన్నే పుణ్యం అని, ఇతరుల్ని బాధించడాన్ని పాపమని తెలుసుకుంటే, ప్రపంచమంతా ఒకే కుటుంబంగా సుఖశాంతులతో ఉంటుంది.

ఎంతటి గొప్పవారైనా దైవ సంకల్పానికి అందరూ బద్ధులై ఉండవలసిందే. ఎందుకంటే ప్రాణం మన చేతిలో లేదు. ఎవరు ఎంతకాలం జీవిస్తారో, మనకు మనల్ని కన్నవాళ్లకు కూడా తెలియదు. ఎందరో మహానుభావులు అందరూ ఊర్ధ్వలోకాలకు వెళ్ళిపోయారు.

మనం పుట్టకముందు ఎవరికి పుడతామో తెలియదు. కన్నవారికి ఎవరు పుడతారో తెలియదు. పుట్టిన తర్వాత వీడు నా కొడుకని కన్నవారు, నా కన్న తల్లిదండ్రులు వీరని పుట్టినవారు గుర్తిస్తారు. ఇది ఎంత విచిత్రంగా ఉంది. ఎవరూ కూడా ఈ రహస్యాన్ని తెలుసుకోలేకపోయారు. ప్రాణం పోవడం కూడా అంతే కదా! ఇక ఏమైనా ఈ మధ్యకాలంలో జీవించి ఉన్నంతవరకే చేసే కార్యకలాపాలు మాత్రమే నావి, నీవి అని పోట్లాడుకుంటున్నాం. ఇది వైరాగ్యం కాదు. ఖచ్చితమైన నిజం! ఎవరికి వారు ఒక్కసారి ఆలోచించండి! మరి ఏమిటి

ఇదంతా అని ఆలోచిస్తే మనకు ఆధ్యాత్మిక తత్త్వ విషయాలే సరియైన సమాధానం చెబుతాయి.

**"ఏకః పరాత్మా బహుదేహవర్తీ"** అనగా ఒకే పరమాత్మ అనేక జీవుల దేహాల్లో ఉన్నాడు. ఇది అసలైన ఆధ్యాత్మిక వేదాంత రహస్యం. దీనిపైననే మిగతా విషయాలన్నీ ఆధారపడి ఉన్నాయి. అందువల్ల ఆధ్యాత్మిక జ్ఞానాన్ని అందరూ తెలుసుకోవాలి. కర్మ-భక్తి- జ్ఞాన మార్గాలు ఇందులో ప్రధానమైనవి. ఎవరెవరి స్థాయి ననుసరించి, వారు ఆయా మార్గాన్ని అనుసరించి మోక్షాన్ని పొందాలి.

**శ్లో॥ సకామా సగుణో పాస్తిః నృణాం భోగాయ కల్ప్యతే ।**
**నిష్కామా చిత్తశుద్ధ్యర్థే ఇతి శాస్త్రస్య నిశ్చయః ॥**

మనమందరం కోరికలు గలవారమే. మన సుఖం కొరకే సగుణోపాసనం రూపొందించబడింది. నిష్కామకర్మ చేసేవారికి అనగా కోరికలు లేకుండా ఉపాసించేవారికి కూడా ఈ సగుణోపాసన వల్ల చిత్తశుద్ధి కలుగుతుందని శాస్త్రం చెప్పింది. సగుణోపాసనలో భక్తియే ప్రధానమైంది. కోరికలు నెరవేర్చుటకుగాను చేసే పూజలు, జపాలు భక్తి అనబడదు. కేవలం మనం ఉపాసించే దైవంపై ప్రేమతో జరిపే సేవలే భక్తి అవుతుంది.

శ్రీఆదిశంకరులు - వివేక చూడామణిలో - 'స్వస్వరూపానుసంధానం భక్తిరిత్యభిధీయతే' అని అన్నారు. 'నేను' నిరంతర విచారాన్నే 'భక్తి' అని అంటారు. ఈ భక్తి తొమ్మిది విధాలుగా ఉందని ప్రహ్లాదుడు చెప్పాడు. ఏ భావంతో ఉన్నా మన జీవితలక్ష్యమైన మోక్షసాధనను మరువకుండా ఉండడం అవసరం. ఏ మతంవారైనా ఏ సంప్రదాయం వారైనా చివరికి తెలుసుకోవాల్సింది ఒక్కటే!

**'సర్వం బ్రహ్మమిదం జగత్'** (మహాభారతం - శాంతిపర్వం)

ఈ జగత్తు అంతా బ్రహ్మస్వరూపమే అని గ్రహిస్తే మోక్షం చాలా సులభమవుతుంది.



# 18. “శరీర మాద్యం ఖలు ధర్మ సాధనం”

శ్లో॥ ధర్మే చార్థేచ కామే చ, మోక్షేచ భరతర్షభ ।
యదిహాస్తి తదన్యత్ర, యన్నేహాస్తి న తత్ క్వచిత్ ॥

(మహాభారతం)

తా॥ భరతశ్రేష్ఠుడా! ధర్మ, అర్థ, కామ, మోక్షాలనే చతుర్విధ పురుషార్థాలను బోధించే ఇందులోని వచనాలే సమస్త ఇతర గ్రంథాల్లోనూ ఉన్నవి. దీనిలో లేనివి మరి ఎక్కడా లేవు.

శరీరమే ధర్మసాధనకు ప్రధానమైంది. శరీరం రోగబాధలతో ఉన్నట్లయితే మనం ఏమీ చేయలేం. ఆరోగ్యంగా ఉండడానికి మంచి ఔషధాలను స్వీకరించడంతో పాటూ అనుభవజ్ఞులు తెలిపిన ఉచిత సలహాలను ఆచరించాలి. ప్రస్తుత కాలంలో చిత్రవిచిత్రమైన వ్యాధులు బాధిస్తున్నాయి. రోగాల పేర్లు తెలియడం లేదు సరికదా, వాటిని నివారించే ఔషధాలే లేకుండా పోయాయి. ఒకవేళ ఔషధాలు వాడినా వాటివల్ల ఇతర బాధలు ఎక్కువవుతున్నాయి. కాబట్టి మన పూర్వీకులు మనకందించిన ఆరోగ్య సూత్రాలను అనుసరించి సంపూర్ణ ఆరోగ్యవంతులవడానికి ప్రయత్నించాలి.

మన శరీరం ఒక పెద్ద మర యంత్రం. ఇది నిర్విరామంగా పని చేస్తూనే ఉంది. ఆహారమే దానికి ప్రధాన ఇంధనం. సరైన ఆహారాన్ని సక్రమంగా అందించడంతో పాటు ఎప్పటికప్పుడు శుద్ధి చేయడం కూడా తప్పనిసరి అవసరం. మనకు ఆహారం తీసుకోవడంలో గల శ్రద్ధ శుద్ధి చేయడంలో ఉండదు. ప్రస్తుతం ఆహారంలో కూడా అనేక లోపా లున్నాయి. అవే అనారోగ్యానికి మూల కారణాలు.

ప్రతిరోజూ ఉదయమే లేచి కాల కృత్యాలు తీర్చుకున్న తరువాత టీ, కాఫీలు త్రాగకుండా, పూర్తిగా మానివేయక పోయినా అవి తీసుకునే ముందు ఒక లీటరు మంచినీరు త్రాగాలి. ఇది ఏ వయసు వారైనా చేయచ్చు. దీనివల్ల వాత, పిత్త, శ్లేష్మ దోషాలు తొలగి సంపూర్ణ ఆరోగ్యవంతులవుతారు.

సూర్యోదయానికి కనీసం ఒక గంటముందు నిద్రలేవాలి. లేవగానే పై కార్యక్రమం ముగించుకుని ఆ రోజు చేయవలసిన ధర్మార్థ మార్గాలను, తగిన శ్రమను నిశ్చయించుకోవాలి. ప్రశాంతంగా కూర్చుని వీలైనంత సమయం దైవధ్యానం తప్పకుండా చేయాలి.

రోజూ స్నానం చేయడం వల్ల అవయవాలన్నీ పరిశుభ్రమై, మలినాలన్నీ తొలగిపోతాయి. శరీరానికి కాంతి కలుగుతుంది. దురద, చెమట పోయి శ్రమ, అలసట ఉండదు. పైత్యం, దాహం తగ్గి అగ్నిదీప్తి, ధాతు వృద్ధి కలుగుతుంది. సుఖంగా ఉంటుంది. శరీరం దృఢమై పవిత్రంగా ఉండి రోగనిరోధక శక్తి పెరుగుతుంది. స్నానంతో మనస్సుకు హితం చేకూరి చిత్తశుద్ధి ఏర్పడుతుంది.

భోజనం చేసిన తరువాత, జ్వరంతో బాధపడుతున్నప్పుడు, అర్ధరాత్రి సమయంలో, కట్టుబట్టలతోనూ, పూర్తి దిగంబరంగాను, తెలియని జలాశయాలలోనూ స్నానం చేయరాదు.

అవకాశమున్నవారు తలంటుస్నానం రోజూ చేయవచ్చు. లేదా వారానికి ఒక సారి మాత్రం తప్పనిసరిగా చేయాలి. ఇది సర్వాంగాలకూ పుష్టినిస్తుంది. తల, చెవులు, పాదాలయందు తైలాన్ని ఉపయోగించాలి.

భోజనం కంటే ముందు అల్లం, సైంధవ లవణం కలిపి నమిలి తిన్నట్లయితే జీర్ణశక్తి వృద్ధి అవుతుంది. గొంతు, నాలుక పరిశుద్ధమై రుచి కలుగుతుంది. పరగడుపున పెద్ద ఉసిరిక, భోజనం తరువాత రేగి పండు, ఎప్పుడూ వెలగపండు తినకూడదు. అరటిపండు ఎప్పుడైనా తినొచ్చు.

సూర్యోదయం నుండి మూడు గంటల లోపు భుజించకూడదు. మూడు గంటల తరువాత.. ఆరుగంటల లోపు భుజించాలి. ఆరు గంటల తరువాత భుజించినట్లయితే బలం నశిస్తుంది. భోజనానికి ముందు కాళ్లు చేతులు బాగా కడుక్కుని ఆచమనం చేసి (ఆచమనం వల్ల గొంతు తడుస్తుంది.) ఆవరణగల పరిశుభ్రమైన స్థలంలో కూర్చుని ప్రశాంత చిత్తంతో భుజించాలి. అన్నాన్ని బాగా కలపాలి. చప్పుడు కాకుండా భుజించాలి.

ఎత్తైన పీటమీద సమదేహుడై సుఖంగా కూర్చుని సరైన సమయానికి ఆకలిననుసరించి తేలికైన, వేడిగా ఉన్న ఆహారాన్నే తినాలి. మజ్జిగ, చారు మొదలైన ద్రవపదార్థాలతో చివరన భుజించాలి.

ఆకలి అయినపుడే తినాలి. మితంగా తినాలి. రుచిగా ఉన్నాయని ఎక్కువగా తినడం మంచిది కాదు. పదార్థాలను తగిన మోతాదులో తిన్నట్లయితే వ్యాధులు రావు. చమురుతో కూడిన వేడి అన్నం వల్ల జఠర దీప్తి కలుగుతుంది. తొంద రగా కాకుండా అతి నెమ్మదిగా కాకుండా బాగా నమిలిన తరువాతే మింగాలి.

భోజనం చేసేటప్పుడు నీరు ఎక్కువగా తాగకూడదు. భోజనం పూర్తయిన తరువాత కూడా కొంచెం నీరు మాత్రమే తాగాలి. భోజనం పూర్తయిన గంట తరువాత మాత్రమే కావలసినంత నీరు త్రాగడం మంచిది. భోజనానికి ముందు కూడా నీరు తాగరాదు. ఒక గంట ముందుగా తాగితే ఆరోగ్యమే.

భోజనం చేసిన తరువాత నూరు అడుగులైనా నడవాలి. తినగానే కదల కుండా కూర్చున్నట్లయితే పొట్ట పెరుగు తుంది. తినగానే వెంటనే పడుకున్నట్ల యితే కొవ్వు పెరుగుతుంది. మెల్లగా అటూ ఇటూ తిరిగినట్లయితే ఆయుర్వృద్ధి కలుగుతుంది. భోజనం చేసిన వెంటనే పరిగెత్తడం పనికిరాదు. అది ఆయుక్షీణం కూడా.

భోజన సమయంలో ప్రశాంత చిత్తం అవసరం. టీవీలు, సినిమాలు చూస్తూ భోంచేయకూడదు. వీలైతే భగవన్నామస్మరణ చేసుకోవచ్చు. లేదా మౌనంగా భుజించడం మంచిది.

మితమనేది లేకుండా ఎప్పుడూ ఏదో ఒక పదార్థం తినేవారికి అజీర్ణ వ్యాధి బాధిస్తుంది. దీనివల్ల మలబద్ధకం ఏర్పడుతుంది. అసలు సకల రోగాలకూ అజీర్ణమే మూలకారణం.

ఆరోగ్యానికి ఆహారమే చాలా ముఖ్యం. ఆహారం తీసుకునే విధానం ఇంకా ముఖ్యం. తిన్నది జీర్ణమైన తరువాతనే మళ్లీ ఏమైనా తినాలి. నవ్వుతూ తుళ్లుతూ అతిగా మాట్లాడుతూ పరధ్యానంలో ఉంటూ భుజించకూడదు. దీనివల్ల తిన్నది సరిగా జీర్ణం కాదు.

నెయ్యి బుద్ధిని వృద్ధి చేస్తుంది. పాలు బలం. ఆయుష్షును వృద్ధి చేస్తుంది. భోజనం చేసేటపుడు పరనిందా ప్రసంగాలు, అసహ్య కథా విషయాల చర్చ చేయరాదు. ఒక్కరే కాకుండా ఇద్దరు, ముగ్గురితో కలిసి భోజనం చేస్తే మం చిది. గృహస్థు తప్పకుండా పగలు, రాత్రి పంక్తి భోజనమే చేయాలి.

భోజనం అయిన తరువాత చన్నీటితో పలుమార్లు పుక్కిలించాలి. తద్వారా కఫం, దప్పిక, దుర్వాసన ఉండవు. నోరు శుభ్రంగా ఉంటుంది. తేజస్కాముడైన పురుషుడు భార్యతో కలిసి భుజించ కూడదు.

పుష్టికరమైన గోధుమలు, పప్పుదినుసులు, సైంధవ లవణం, పెద్ద ఉసిరక పళ్లు, పాలు, నెయ్యి, తేనె ప్రతిరోజూ వాడాలి. ఇవి ధాతువుల్ని వృద్ధి చేస్తాయి. పానీయాలలో పాలు అతి శ్రేష్ఠమైనవి. ముసలితనం రాకుండా రోగ నిరోధక శక్తిని పెంచుతాయి. లవణాలు లేకుండా మిగిలిన ఐదు రసాలు కలిగిన ఉత్తమ వస్తువు పెద్ద ఉసిరక పళ్లు.

సమయం కాకుండానే భోజనం చేసే వారికి శరీరం బరువు పెరిగి వ్యాధులు వచ్చే అవకాశం ఉంది. కాలాన్ని అతిక్రమించి తినేవారికి జఠరాగ్ని ప్రాణవాయువుతో ప్రజ్వలితమై, తిన్నది సరిగా జీర్ణం కాదు. తిరిగి ఆకలి కూడా కాదు. దీనివల్ల కూడా వ్యాధులు ప్రబలుతాయి. భోజనం ఎల్లప్పుడూ పాలతోనే ముగించాలి. పెరుగుతో ఎప్పుడూ ముగించరాదు. గృహస్థు కనీసం పగలు మజ్జిగతోనూ రాత్రి పాలతోనూ ముగించవచ్చు. ఉప్పు, పులుపు, వగరు, కారం మొదలైనవి విదాహకాలైన పదార్థాలు. వీటి దోషం హరించడానికి తీపి పదార్థం చివరన భుజించాలి. భోజనం తరువాత అటూ ఇటూ పచార్లు చేసి తాంబూలం వేసుకుని ఎడమవైపు తిరిగి పడుకుంటే ఏ ఔషధంతోనూ పనిలేదు.

శరీరంపై వస్త్రం లేకుండా అంటే ఏక వస్త్రుడై భుజించ కూడదు. ఏది ఆరోగ్యాన్నిస్తుందో అది మంచి మందు. రోగాల నుండీ కాపాడే వారే వైద్యశ్రేష్ఠులు. కేవలం ఒక శాస్త్రమే చదివినవారు కాకుండా అనేక శాస్త్రాలు చదివి స్వానుభవాన్ని గడించినవారే ఉత్తములు. ఔషధసేవతో పాటు పథ్యమైన ఆహార నియమాలు అవసరం. ఎప్పుడూ ఆహార నియమాలు పాటించేవారికి మందులతో పని ఉండదు. పథ్యం చేయనివారికి ఔషధం వ్యర్థం. ఈ లోకంలో భోజనం చేయడం, స్త్రీలతో కలవడం అనేవి మానవ సహజాలు. వీటిని చేయమని ఎవరినీ ప్రోత్సహించవలసిన అవసరం లేదు. కానీ వీటిని క్రమబద్ధం చేసి నియమాలు ఏర్పరచడమే ముఖ్య ఉద్దేశం.

వివాహం ద్వారా స్త్రీ సాంగత్యం, యజ్ఞం ద్వారా భోజన నియమం శాస్త్రకారులు ఏర్పరిచారు. గోరువెచ్చటి నీటి స్నానం, కొంచెం వేడిగా ఉన్న భోజనం,

పాలు త్రాగడం, భార్యతో కలవడం అనే నాలుగు మానవులకు పథ్యములు. ఎక్కువగా నీరు త్రాగడం, అతి సంగమం, పగటి నిద్ర, రాత్రులు మేలుకుని ఉండడం, మలమూత్రాల్ని ఆపుకోవడం వంటి వాటివల్ల రోగాలు పెరుగుతాయి.

మన కోసం వేచి ఉన్న వందపనులను విడిచిపెట్టయినా సమయమైతే లేదా ఆకలైతే భోజనం చేయాలి. అదేవిధంగా వేయిపనులు విడిచైనా స్నానం చేయా లి. ఏదైనా తింటూ నడవరాదు. మనో వాక్కాయాలచే అన్నీ అవస్థల్లోనూ ఎల్లవేళలా ఎవ్వరి యందు కామం లేకపోవడమే బ్రహ్మచర్యం. వ్యాయామం వల్ల శరీర లాఘవం, పనుల్లో సామర్థ్యం, ఆత్మస్థైర్యం, కష్టాలను సహించే శక్తి, శారీరక రోగ దోష వినాశనం అగ్నిదీప్తి మొదలైనవన్నీ కలుగుతాయి.

మనశ్శాంతి, శరీరకాంతి, జ్ఞాపకశక్తి, జ్ఞానం ఇవన్నీ ఒక్క బ్రహ్మచర్యం వల్ల లభిస్తాయి. ఇది గొప్ప ధర్మాచరణం. వ్యాయామం, హాస్య సంభాషణం, సం భోగం, రాత్రుళ్లు మేలుకుని ఉండడం అనేవి అనుచితాలే అయినప్పటికీ మితంగా సేవించడం బుద్ధిమంతుల లక్షణం.

శాస్త్రాలన్నిటికంటే ఆచారం శ్రేష్ఠం. ఆచారం నుండే ధర్మం ప్రభవించింది. ధర్మం వల్ల ఆయుష్షు వృద్ధి చెందుతుంది. ఆచారమే ధర్మానికి మూల లక్షణం. సత్పురుషులకు కూడా ఆచారమే ప్రధాన లక్షణం. సాధు పురుషుల ప్రవర్తన ఆచారానికి మూలం. ప్రజల కోరికలు ఆచారం వల్లనే సిద్ధిస్తాయి, కోరిన సంపదలు కలుగుతాయి. ఆచారాన్ని పాటించకపోతే ప్రమాదమే కలుగుతుంది. దురాచారుడైన పురుషుడు లోకనిందను పొందడమే గాక రోగపీడితుడై అల్పా యుష్కుడై దుఃఖజీవి అవుతున్నాడు.

వ్యాధి యొక్క స్వభావాన్ని తెలుసుకుని రోగి బాధలను నిగ్రహింపజేయడమే వైద్యుడి కర్తవ్యం. కానీ ఆయుర్దాయం అతని చేతిలో ఉండదు. అందు చేత మిగిలిన వాటినన్నింటినీ విడిచి పెట్టయినా మనం మన శరీరాన్ని బాగా కాపాడుకోవాలి. దేహధారులకు శరీరం ఆపదలో ఉన్నప్పుడు మిగిలినవి ఎన్ని ఉన్నా అవి లేనట్లే.

శూన్య గృహంలో ఒంటరిగా నిద్రించ రాదు. గాఢనిద్రలో ఉన్నవారిని లేప రాదు. ఉదయాస్తమయాలందు, నీళ్లలో ప్రతిబింబించిన సూర్యుని, నట్టనడిమి

నెత్తిమీదున్న సూర్యుణ్ణి తేరిపార చూడరాదు. చిన్న గుంటలోని నీరు త్రాగ రాదు. వర్షంలో పరిగెత్తరాదు. నీటిలో మన ప్రతిబింబాన్ని చూడరాదు. పగలు, ఉదయ, సాయంసంధ్యలయందు ఉత్తర దిశకు తిరిగి మలమూత్ర విసర్జన చేయాలి. రాత్రులందు ఈ నియమం అవసరం లేదు. ఉదయపు ఎండలో నిలబడరాదు. గోళ్లు, వెంట్రుకలు తుంచరాదు. పండ్లచే గోళ్లు కొరకరాదు. శ్మశాన పొగ మంచిదికాదు. సాయంకాలం ఎండ ఆరోగ్యానికి మంచిది. విభూతిచే శరీరం శుద్ధి అవుతుంది. చిరిగిన దుస్తులు ధరించరాదు. సంధ్యాకాలాల్లో నిద్రించరాదు. ఆరోగ్యం విషయంలో అశ్రద్ధ పనికిరాదు. అనారోగ్యం వచ్చాక ఔషధాలు సేవించడం కంటే అనారోగ్యం కలగకుండా జాగ్రత్త వహించాలి. యజ్ఞ యాగాదుల్లో వచ్చే హోమం పొగ ఆరోగ్యానికి మంచిది.

'ఆరోగ్యం భాస్కరాదిచ్ఛేత్'– మనకు మంచి ఆరోగ్యాన్ని సూర్యభగవానుడే అందిస్తాడు. అందుకే ప్రతినిత్యం ఆయనను భక్తిశ్రద్ధలతో ఉపాసించాలి. సంధ్యావందనం యొక్క ప్రధానోద్దేశ్యం కూడా ఆరోగ్యం కొరకే. సూర్యుని వల్ల మిగతా గ్రహాలన్నీ ప్రకాశిస్తున్నాయి. రాత్రింబవళ్లు, ఋతువులు, అయనాలు, సంవత్సరాలు ఏర్పడుతూ కాలచక్రం భ్రమిస్తుంది. మనకు ప్రధానమైన ఆహారం లభించడానికి సూర్యుడే ఆధారం. సూర్యుని వల్ల ఎండలు, వర్షాలు వస్తున్నాయి. వర్షం వల్లనే మనకు జీవనాధారమైన నీరు లభిస్తుంది. ఆ నీటితోనే సూర్యభగవానునికి కృతజ్ఞతగా త్రిసంధ్యలందు మూడుమార్లు అర్ఘ్య ప్రదానం చేయాలి.

ధర్మశాస్త్రాలన్నీ మన సౌఖ్యం కొరకు ఏర్పరచినవే. శాస్త్రమా? కాదా అనే చర్చ మనకనవసరం. అది మనకు ఎంత వరకు ఉపయోగపడుతుంది. సమాజానికి శాస్త్రాల వల్ల మేలు జరుగుతున్నదా? లేదా అనేది అవసరం. మన పూర్వీకులైన ఋషులు మనకంటే గొప్పవారు. వారు ఎన్నో విషయాలను అనుభవించి వాటి సారాన్ని మనకు అందించారు. ఈ విషయాలను మనం అవగాహన చేసుకుని ఆచరించడమే మన కర్తవ్యం.



# 19. పరోపకారార్థమిదం శరీరం

శ్లో॥ పరోపకారాయ ఫలంతి వృక్షాః, పరోపకారాయ వహంతి నద్యః ।
పరోపకారాయ చరంతి గావః పరోపకారార్థమిదం శరీరమ్ ॥

– భర్తృ. నీతిశతకం

పరుల కొరకే చెట్లు పండ్లనిస్తున్నాయి. పండ్లనే గాక నీడనిస్తున్నాయి, కలపనిస్తున్నాయి. పరుల కొరకే నదులు ప్రవహిస్తున్నాయి. మనకు నీటిని, ఆహారాన్ని అందిస్తున్నాయి. పరుల కొరకే ఆవులు పాలనిస్తున్నాయి. ఇవి కూడా పాలనేగాక ఎరువును, ఔషధాలను చివరకు తన అవయవాలన్నింటినీ ఇస్తున్నాయి. అదేవిధంగా (మన) ఈ శరీరాలు కూడా పరుల కొరకేనని నీతిశాస్త్రంలో చక్కగా తెలుపబడింది.

ఇతరుల కొరకు కొందరు కొన్ని కార్యాలను విఘ్నభయంతో అనగా ఆటంకాలు వస్తాయేమోనని ఆరంభించరు, అటువంటివారు అధములు. మరి కొందరు ఆరంభించి, మధ్యలో ఆటంకాలు వస్తే ఆపివేసేవారు మధ్యములు. ఇంకొందరు ఆరంభించిన కార్యాలను ఎన్ని ఆటంకాలు వచ్చినా వదిలిపెట్టక పూర్తి చేయిస్తారు. వీరే ఉత్తములనబడతారు.

ఇతరులకు ఆదర్శంగా ఉండడానికి మనం న్యాయమార్గాన్నాశ్రయించాలి. ఈ విషయంలో నీతి నిపుణులైనవారు నిందించనీ, పొగడనీ; సంపదలు రానీ, పోనీ; మరణమే రానీ, ఏమైనా కానీ, ధీరులైన సత్పురుషులు న్యాయమార్గం నుండి వైదొలగరు.

బుద్ధిమంతులైనవారు ఏ పనిని చేయవలసి వచ్చినా, దానివల్ల ఎట్టి ఫలితాలు కలుగుతాయోనని, బాగుగా విచారించి మరీ చేస్తారు. అలా కాకుండా అనాలోచితంగా తొందరపడి ఏ పనైనా చేస్తే అది మరణ పర్యంతం బాధించి మనశ్శల్యంగా పరిణమిస్తుంది.

మన స్వభావానికి, సంప్రదాయానికి తగిన పనిలో కొన్ని లొసుగులున్నప్పటికీ ఆ పనినే చేస్తూండాలి. వేరొకరికి ఉచిత మైన పనిలో కొన్ని మెరుగులే ఉండనీ, దాన్ని మనం చక్కగా నెరవేర్చగలిగే అవకాశమున్నా ఆ పనిని చేయడం కంటే, మన ధర్మాన్నే ఆచరించాలి. స్వభావ జనితంగా చేసే కర్మలకు పాపం అంటదు. మన స్వభావసిద్ధమైన పనిలో కొన్ని దోషాలున్నా దాన్ని విడవద్దు. ఎందుకనగా సకల కర్మల్లోనూ ఎంచితే దోషాలుంటాయి. నిప్పున్నచోట పొగ ఉన్నట్లే కర్మ అంటేనే దోషం ఏదో ఒకటి ఉండి తీరుతుంది. కాబట్టి అవన్నింటినీ గూర్చి ఆలోచించి సమయం పాడుచేయక మన ధర్మాన్ని మనం సక్రమంగా నిర్వర్తించాలి. పరుల కొరకు మన శరీరం ఉపయోగ పడాలంటే, ముందుగా మన ధర్మాన్ని మనం చక్కగా పాటించాలి. ప్రస్తుత కాలంలో మన ధర్మాన్ని మనం సక్రమంగా నిర్వర్తిస్తే, పరోపకారంతో సమానం. దైవం ప్రతికూలంగా ఉన్నప్పుడు సమస్త ప్రయత్నాలు, పురుషకారం వ్యర్థమై, అభిమానవంతుడైన పేదవానికి అరణ్యవాసమందే సుఖంగాని, మరొకచోట ఉండదు.

అబద్ధాలు చెప్పడం కంటే మౌనవ్రతమవలంబించడం మంచిది. పరస్త్రీ గమనాసక్తుడవడం కంటే నపుంసకుడై ఉండటమే మేలు. చాడీలు చెప్పడంలో ఇష్టం కలిగి ఉండడం కంటే మరణమే మేలు. పరధనం తిని బ్రతకడం కంటే బిచ్చమెత్తి జీవించడం మంచిది. పశుశాలలో గొడ్డు పశుఉండడం కంటే శూన్యంగా ఉండడమే మేలు. అవివేకియైన రాజు పాలించే ప్రదేశంలో ఉండడం కంటే అరణ్యవాసమే మేలు. అధములను సేవించడం కంటే చావే నయం.

ఆకలిబాధ చాలా తీవ్రమైంది. కాబట్టి బుద్ధిమంతులు ఇతరుల ఆకలిని గుర్తించాలి. ఆకలైన తల్లి కూడా బిడ్డను వదిలేస్తుంది. ఆకలిగొన్న ఆడపాము తన గ్రుడ్లనే మ్రింగేస్తుంది. అలాగే ఆకలిగొన్నవారు ఏ పాపాన్నయినా చేస్తారు. శుష్కించిన మనుష్యుల్లో కరుణ కూడా ఇంకిపోతుంది.

శరీరానికి అపాయం ఎప్పుడో ఒకప్పుడెలాగ తప్పదు. సంపదలూ ఏదో విధంగా నశించేవే. సంయోగాలు, వియోగాలు మార్పు చెందేవే. పుట్టింది ప్రతిదీ గిట్టునదే. యౌవనం, రూపం, జీవితం, సంపద, ఐశ్వర్యం అన్నీ

అశాశ్వతాలే. కాబట్టి తెలిసినవారు వీటి కొరకు వ్యామోహం చెందరు. సంయోగమే వియోగం యొక్క బాధను సూచిస్తుంది. జన్మమే అనతిక్రమమైన మరణాన్ని సూచిస్తుంది. మహాసముద్రాన ఒక కర్ర మరొక కర్రతో తారసిల్లుతూ, విడిపోతున్నట్లే ఈ లోకాన ప్రాణులకు సంయోగ వియోగాలు కలుగుతుంటాయి.

ఎన్ని ప్రయత్నాలు చేసైనా విద్య, ధనం, కీర్తి, ధర్మం అను నాల్గింటిని ఆర్జించాలి. ప్రయత్న పూర్వకంగా వ్యసనాలను, దుష్టులతో స్నేహాన్ని, తగవులను, ద్రోహకృత్యాలను వదలాలి. తెలివిగలవారు లోకాన శుభాల్నే పొందుతారు. పథ్యాహారం తీసుకునేవారు రోగం లేకుండా సుఖంగా ఉంటారు. యత్న శీలురు విద్యను సాధిస్తారు. వినయశీలురు ధర్మార్థాలతో పాటు కీర్తిని పొందుతారు. సహనం వల్ల లోకమంతా వశమవుతుంది. దీనివల్ల సాధ్యం కానిది లోకంలో ఏదీ లేదు. ఎవరి చేతిలో శాంతి అనే ఆయుధం ఉంటుందో, వారిని ఎంతటి దుర్జనుడైనా ఏమీ చేయలేడు.

బుద్ధిమంతులు కావ్యశాస్త్ర వినోదాలతో కాలం గడుపుతారు. మూర్ఖులు వ్యసనాలతో, కలహాలతో లేదా నిద్రతోనే కాలం వృథా చేస్తారు. అడగనిదే ఎవరికీ చెప్పరాదు. అన్యాయంగా ప్రశ్నించినా జవాబు చెప్పకూడదు. అన్ని తెలిసినా తెలియనివాని వలెనే లోకంలో ప్రవర్తించాలి. రోగాలతో బాధపడేవారు, చాలా కాలం ఇతర దేశాలలో నివసించేవారు, పరుల భోజనాన్ని కోరే వారు, పరుల ఇంట నివసించేవారి బ్రతుకే మరణంతో సమానం. వీరికి మరణమే విశ్రాంతినిస్తుంది.

పరోపకారం చేయాలంటే లోభమనే దుర్గుణముండకూడదు. లోభం వల్ల మనస్సు చంచలమవుతుంది. ఆశలు పెరుగుతాయి. ఆశల వల్ల ఇహపరాలు రెండింటిలో మనం దుఃఖాన్నే అనుభవిస్తాం. ధర్మాన్ని తెలుసుకొనడానికి కూడా తగిన యోగ్యత అవసరం. మత్తులు, ప్రమత్తులు, ఉన్మత్తులు, అలసినవారు కోపగ్రస్థులు, ఆకలితోనున్నవారు, లోభులు, పిరికి వారు తొందరలో ఉన్నవారు, కాముకులు ధర్మాన్ని తెలుసుకోలేరు.

మనం చేసే ఏ పని కూడా ఇతరులకు ఉపయోగపడదో, చేసినందుకు మనమెల్లప్పుడు సిగ్గుపడాల్సి వస్తుందో అట్టి పనులను ఎప్పుడూ చేయరాదు.

పాలకులను, దేశాన్ని, కులాన్ని, బంధువులను, ధర్మాన్ని ఎన్నడూ దూషించరాదు. సాధారణ ధర్మమేమనగా! మనకు శక్తి ఉన్నప్పటికీ, మన సంఘంలోని ఆచార వ్యవహారాది మర్యాదలను మనసా కూడా ఉల్లంఘించవద్దు.

గృహస్థులైనవారు ఎప్పుడూ అబద్ధాలాడరాదు. కపటంగా ఉండకూడదు. దేవపూజ, అతిథిసేవ చేస్తూనే ఉండాలి. బంధు మిత్ర, స్వజన విరోధం పనికిరాదు. బలవంతులతో ద్వేషం పెట్టుకోకూడదు. స్త్రీలు, పిల్లలు, ముదుసలివారు, మూర్ఖులతో తగవులాడవద్దు. భార్యాభర్తలకు, తల్లిదండ్రులకు, అన్నదమ్ము లకు, యజమాని సేవకులకు, అక్కచెల్లెండ్రకు, మిత్రులకు, గురుశిష్యులకు మధ్య విభేదాలను, పోట్లాటలను ఏమాత్రం ప్రేరేపించకూడదు. దీనులను, గ్రుడ్డివారిని, కుంటివారిని, చెవిటివారిని ఎప్పుడూ వేళాకోళం చేయరాదు. చేయకూడని పనులలో బుద్ధిని ప్రవేశించనీయవద్దు. మంచి పనులు వెంటనే చేయడానికి ప్రయత్నించాలి. చెడ్డవారితో స్నేహం కోరుకోవద్దు.

సుఖాన్ని కోరేవారు సంతోషాన్ని పొందుతూ కూడా కోరికలను పరిమితిలో ఉంచుకోవాలి. సంతృప్తే సుఖానికి మూలం, అసంతృప్తే దుఃఖ హేతువనేది పరమ సత్యం. లభించని వాటికై విచారించక, లభించిన వాటిని చూసుకుని పొంగిపోక, లాభలాభాలను, సుఖదుఃఖాలను కూడా సాక్షిమాత్రులుగా ఉండి అనుభవిస్తూ, సాంసారిక విషయాల్లో తగుల్కొనకుండా జీవించడం నేర్చుకోవాలి. మహానుభావులు లభించని వాటిని కోరరు. నష్టాల్లో దుఃఖించరు. ఆపదలు వచ్చినపుడు కలతచెందకుండా ఉంటారు. సుఖదుఃఖాలను సాక్షిమాత్రుడుగా అనుభవించడమే కర్తవ్యం. సుఖం తర్వాత దుఃఖం, దుఃఖం తర్వాత సుఖం చక్రం లాగా తిరుగుతూనే ఉంటాయి. కాబట్టి సుఖదుఃఖాల రెండిటిలోను మనం తటస్థులుగానే ఉండాలి.

పరస్త్రీలను తల్లులవలె, పరధనాన్ని మట్టిపెళ్లల వలె, సర్వ ప్రాణులను తనవలె చూసేవారే పండితులు. సత్యం, ధర్మం, పరాక్రమం, దయ, ప్రియవాక్కులు, దేవతా తిథి బ్రాహ్మణ పూజలు స్వర్గానికి చక్కని సోపానాలు. మీదపడనంతవరకే ఆపదలంటే భయపడాలి. కానీ ఒక్కసారి అవి మీదపడితే భయం లేకుండా,

తగిన జాగ్రత్తపడడం, వాటి నివారణకై ప్రయత్నించాలి. కాలం ఎలాగోలా గడిచిపోతుందిలే అని సంతృప్తి చెందేవారికి ఎప్పుడూ దుఃఖం కలగదు.

**గృహస్థాశ్రమంలోనే మోక్షం లభించే ఉపాయం**

**"ధర్మమార్గాన జీవయాత్ర సాగిస్తూ, జ్ఞానం గురించి నిరంతర కృషి చేస్తూ, జితేంద్రియుడై, అతిథి సేవా తత్పరులైన ఉత్తమ పురుషులకు గృహస్థాశ్రమంలోనే తప్పక మోక్షం లభిస్తుంది."**

బ్రహ్మజ్ఞాన పరాయణులమై, బ్రహ్మనిష్ఠతో, ఈశ్వరార్పణ బుద్ధితో సకల కర్మలు చేస్తూ ఉండాలి. ఎవరి యందు తల్లి దండ్రులు సంతృప్తి చెందుతారో, మిత్రులు అనురాగంతో ఉంటారో, కీర్తిని లోకులు గుర్తిస్తారో అట్టివారే మూడు లోకాలు జయిస్తారు. మంచి కులం వారితో వివాహాది సంబంధాలు కలిగి యుండి, పండితులతో సహవాసం చేస్తూ, జ్ఞాతులతో ఐక మత్యంగా ఉండేవారికి ఎన్నడూ ఆపదలు కలగవు.

మధుర పదార్థాలు మనమొక్కరమే తినరాదు. ముఖ్యవిషయాలు ఒక్కరమే నిశ్చయించరాదు. తోడు లేకుండా ఒంటరిగా వెళ్లరాదు. అందరూ నిద్రిస్తుండగా మనమొక్కరమే మేల్కొనరాదు. యే పనినైనా ఆరంభించకుండడం మొదటి బుద్ధి లక్షణం. ఆరంభించాక ఆ పని పూర్తయ్యేవరకు చేయడం రెండో బుద్ధి లక్షణం.

మహాత్ములు, గురువులు, దేవతాత్ములకు దుఃఖం కలిగి కన్నీరు గనుక భూమిపై పడితే ఆ దేశం మహా దుఃఖం, కరువు, సామూహిక మరణాలతో నాశనమవుతుంది.

సారం లేని ఈ సంసారంలో సారభూతమైనవి కాశీ నివాసం, సత్పురుషుల సహవాసం, గంగా స్నానం, దైవసేవ అనే నాలుగు మాత్రమే ఉన్నాయి. ఎల్లప్పుడూ జ్ఞానవృద్ధులగు వారికి నమస్కరిస్తూ, వారికి తగు సేవ చేసేవారికి ఆయుష్షు, విద్య, కీర్తి, బలం అనే నాలుగు ఫలితాలు కలుగుతాయి.

అప్పు ఇచ్చేవారు, వైద్యులు, వేదవేత్తయైన బ్రాహ్మణులు, ఎల్లప్పుడూ ప్రవహించే నది ఉన్నచోటనే నివసించాలి. బాల్యంలో విద్యనభ్యసించాలి.

యవ్వనంలో వివాహం చేసుకుని, ధనమార్జించి కుటుంబాన్ని పోషించాలి. పండితుడై ప్రౌఢ వయస్సులో ధర్మకర్మలనాచరించాలి. వార్ధక్యంలో జ్ఞానాన్ని పొంది, మోక్షప్రాప్తికై సన్యసించాలనేది సనాతన ధర్మం.

ప్రియమైన మాటలతో చేసే దానం, గర్వం ఏ మాత్రం లేని విద్య, క్షమ కలిగిన శౌర్యపరాక్రమాలు, త్యాగంతో కూడిన ధన సంపాదన అనే నాలుగు విషయాలు కలిగినవారు చాలా అరుదుగా లభిస్తారు. అతిథికి అన్నమిచ్చే శక్తి లేకపోతే, ధార్మికులైనవారు అతిథికి విశ్రమించే స్థలం కాని, పడకగాని, మంచినీరు గాని, చివరకు మంచి మాటలతోనైనా పలకరించాలి. దాన గుణం, మంచిగా మాట్లాడే స్వభావం, ధీరత్వం, ఉచితానుచిత జ్ఞానం అనే నాలుగు విషయాలు పుట్టుకతో వచ్చేవే కానీ నేర్చుకుంటే రావు.

లోకజ్ఞానం, పాపభీతి, లజ్జ, దాక్షిణ్యం, ధర్మశీలత లేనివారితో స్నేహం చేయకూడదు. భాధ కలిగించని పరిహాసంలో, స్త్రీల సందర్భాన, వివాహ విషయంలో, ప్రాణాపాయ సమయంలో, సర్వస్వం కోల్పోయేటప్పుడు అబద్ధాలాడినచో దోషం కలుగదు. సత్యం, దానం, అనాలస్యం, అనసూయ, క్షమ, ధైర్యం అనే మంచి గుణాలను ఎప్పుడూ విడవవద్దు. షడ్గుణాలైన కామ, క్రోధ, లోభ, మోహ, మద, మాత్సర్యాలను శత్రువులను దూరంగా ఉంచితేనే మనకు సుఖం లభిస్తుంది.

**ఈ జీవలోకంలో మిక్కిలి సుఖాన్నిచ్చేవి**

మంచి సంపాదన, పరిపూర్ణ ఆరోగ్యం, ఇష్టమైన భార్య, భార్య మంచిని గూర్చి మాట్లాడే స్వభావం, మన ఆజ్ఞను పాలించే కొడుకు, ధనాన్నిచ్చే విద్య అనే విషయాలతో మనకు సంపూర్ణ సౌఖ్యం లభిస్తుంది.

**మనల్ని గొప్పవాళ్లను కానీయని అంశాలు**

ఆలస్యం, స్త్రీలోలత, అనారోగ్యం, పుట్టినచోటును వదలని మమకారం, పిరికితనం, ఏడుపుగొట్టుతనం ఈ లక్షణాలు గల వారు గొప్పవారు కారు.

**ఎంతటివారైనా లోకంలో చులకనయ్యే అంశాలు**

చిన్న పిల్లలతో స్నేహం, కారణం లేకుండా నవ్వడం, స్త్రీలతో వివాదం, దుర్మార్గుల సేవ, సంస్కారం లేని మాటలు ఇవి కలవారెంతవారైనా లోకం దృష్టిలో చలకన చేయబడతారు.

**సప్త సంతానాలు**

బావి లేదా బోరింగ్ వేయించడం, చెరువు లేదా కొలను త్రవ్వించడం, మండపం లేదా దేవాలయం నిర్మించడం, చలివెందుల అనగా మంచినీరు, అన్నం ఇచ్చే కేంద్రాలు స్థాపించడం, రావిచెట్లను నాటడం, పుత్రుడు కలగడం ఈ ఏడింటినీ సప్త సంతానాలని స్కాంద పురాణంలో చెప్పారు.

**అష్ట భోగాలు**

సకల పరిచర్యలు చేయడానికి దాసీజనం, సేవలందిం చడంలో సేవకులు, అజ్ఞలు పాలించడంలో కొడుకులు, ఆపద సంపదలలో ఆదుకునే బంధువులు, ఇష్టమైన వస్తువులు, ప్రయాణాలు చేయటకు వాహనాలు, కావలసినంత డబ్బు, తరిగిపోనంత ధాన్యం సమృద్ధిగా ఉంటే అష్టభోగాలని అర్థం.

**సప్త బాధకాలు**

ఈగలు, భూతం, వేశ్య, బిచ్చగాడు,ఎలుక, గ్రామాధికారి, కరణం– ఈ ఏడుగురు ఎప్పుడూ ఇతరులను బాధించేవారవుతారు.

**అష్టకష్టాలు**

అప్పుల పాలవడం, ఇతరులను యాచించడం, ముసలితనం, వ్యభిచార లక్షణం, దొంగబుద్ధి, దరిద్రబాధలు, అనారోగ్యం, ఎంగిలి తిని బ్రతకడం అనే ఎనిమిది విషయాలను అష్టకష్టాలంటారు.

**నవ రహస్యాలు**

ఆయువు, సంపద, గృహ విషయాలు, మంత్రం, ఔషధం, సంగమం, దానం, మానం, అవమానాలనే తొమ్మిది విషయాలను రహస్యంగా ఉంచాలి. అశాశ్వతమైన మలమూత్రాలతో నిండివున్న ఈ శరీరం చేత శాశ్వతమైన, నిర్మలమైన కీర్తి కాయాన్ని సంపాదించడానికి యత్నించాలి.

**సత్పురుషుల నిత్యకృత్యాలు :**

సత్యమైన మాట, అందరియందు దయ, దానగుణం, దీనజన సంరక్షణ, సత్సాంగత్యం అనేవి సత్పురుషుల నిత్య కృత్యాలు.

దరిద్రులకు దానం, సమర్థులకు శాంతి, యువకులకు తపస్సు, జ్ఞానులకు మితభాషిత్వం, సమస్త భోగాలున్న వారికి కోరికల నియమం, సర్వప్రాణులందు దయ ఉన్నట్లయితే మనం స్వర్గగాములు కావడం జరుగుతుంది. మనం చేసే పుణ్య పాపాలకు సంబంధించిన పనులను బట్టే ఫలితాలు కూడా విధి నిర్దేశంగా అనుభవిస్తాం.

కులాన్ని రక్షించడానికి వ్యక్తిని, గ్రామం కొరకు కులాన్ని, దేశం కోసం గ్రామాన్ని, ఆత్మ కోసం లోకాన్నే విడిచిపెట్టాలి. బ్రాహ్మణుల్లో జ్ఞానం వల్ల పెద్దవారనబడతారు. క్షత్రియుల్లో శౌర్యపరాక్రమాలున్నవారు, వైశ్యుల్లో శ్రీమంతులు, శూద్రుల్లో కేవలం వయస్సును బట్టి పెద్దరికం నిర్ణయిస్తారు.

మనం నిలచిఉన్నా, నడిచినా, క్షణక్షణం ఆయుష్షు తరిగి పోతూనే ఉంది. కాబట్టి ఆలస్యం చేయకుండా మన కర్తవ్యాన్ని మనం చేసుకోవాలి. ఎవరికి తగినట్లు వారికి వారి వారి యోగ్యత ననుసరించి యథాశక్తిగా సత్కరించి, విధివిహితంగా పూజించి అన్నం పెట్టాలేగానీ, ఏదోలే అని నిర్లక్ష్యభావంతో దానమివ్వడం లేదా అన్నం పెట్టడం చేయకూడదు.

రాగద్వేషాలున్నవారు అడవులకు వెళ్లినా దోషాలు వెంబడిస్తూనే ఉంటాయి. ఇంద్రియ నిగ్రహం గలవారు గృహమందున్నా తపస్సు చేసుకోవచ్చు. రాగద్వేషాలే ప్రధానం గనుక, వాటిని విడిచిపెట్టి, పుణ్యకర్మలు చేసే మహాత్ములకు ఇల్లే తపోవనం అవుతుంది. అందరం సాత్విక స్వభావులైన మహాత్ము లనే సేవించాలి. శుద్ధ సత్వం వల్లనే ధర్మబుద్ధి కలుగుతుంది. ధర్మబుద్ధి వల్లనే దైవభక్తి కలుగుతుంది. 'లేదు' అని చెప్పడం ఎంత కష్టమో, 'ఇమ్ము' అని అడగడం కూడా అంతే కష్టం. ఐతే మనం ఎవరినైనా ఇవ్వమని అడగవలసిరాకుండా, ఎవరికైనా 'లేదు' అని చెప్పవలసి రాకుండా ఉండడానికి గాను దైవాన్ని ప్రార్థించాలి. పరోపకరణమే నిరంతరం జాగృతమయ్యే పుణ్యపురుషులకు ఆపదలన్నీ తొలగి సంపదలే

కలుగుతాయి. ఎల్లప్పుడూ ప్రియమైన మాటలు మాట్లాడుతూ, అర్హులైన వారికి సముచిత మర్యాదలు చేస్తూ, సంపదలు కలిగి, నిందలు లేనివారు నరరూపంలో ఉన్న దేవతలవుతారు.

"ఈలోకంలో జీవితం అశాశ్వతమే గాక, ధనం, యవ్వనం, భార్యాపిల్లలందరూ అస్థిరాలే. స్థిరమైనవి, శాశ్వతమైనవి ధర్మం, కీర్తి రెండే రెండని బాగా గుర్తుంచుకోవాలి."

ఏ ప్రాణికీ అపకారం జరగకుండా బ్రాహ్మణులు జీవించాలి. అది సాధ్యం కాకపోతే అత్యల్ప బాధను కలిగించే సాత్విక వృత్తిని చేపట్టి జీవయాత్రను సాగించాలి. బ్రాహ్మణులు అయాచితంగా లభించిన దాని తోనే జీవించాలి. అది సాధ్యం కాకపోతే యాచించి జీవించవచ్చు. అదీ సాధ్యం కాకపోతే వర్తక, వాణిజ్యాలతో గడప వచ్చు. అంతేకాని సేవకా వృత్తితో ఎన్నడూ జీవించరాదు. అంటే ఉద్యోగాలు చేసి జీవించడం పనికిరాదు.

మన ముఖం ముడతలు పడి, తల నెరసి రాలిపోయి, సంతానానికి సంతానం కలుగుతుందో అపుడే గృహస్థాశ్రమం నుండి వానప్రస్థాశ్రమంలోకి ప్రవేశించాలి. చెడుస్నేహాలు చేయక, మంచివారితో మైత్రిని పెంచుకుని, పుణ్యకార్యాలు చేస్తూ, ఎల్లప్పుడూ శరీరం అశాశ్వతమైందని గుర్తుంచుకుని మసలాలి.

శ్రోత్రీయుడై సదనుష్ఠానం కలిగి, ఆశలన్నింటినీ వెనుకకు నెట్టినవారే నిజమైన పండితులు. సంతోషం అనే అమృతపానంతో తృప్తి చెందు శాంత మనస్సుగల వారికి కలిగే పరమ సుఖం, ధనలోభంతో ఎల్లప్పుడూ ఇటూ అటూ పరుగులెత్తే వారికి ఎలా కలుగుతుంది? నిత్య శౌచవిధులనాచరిస్తూ, పితృతర్పణాలు చేస్తూ కూడా ఎవరు ఈ సంసారంవల్ల విరక్తి చెందడం లేదో, వారికి శాస్త్రం ఏమి బోధించగలదు? అనగా ఎంత చెప్పినా నిష్ప్రయోజనమని సారాంశం. స్వంత వర్ణాశ్రమ ధర్మాలు మీర కుండా జీవయాత్ర నడుపుతూ, తపస్సు చేస్తూ, దైవభక్తితో సేవలు చేసే వారికి జ్ఞానోదయం కలిగి వైరాగ్యాది సాధన చతుష్టయం సిద్ధిస్తుంది. భోజనం శరీరాన్ని రక్షించడానికే స్వీకరించాలి. మిథునకర్మ సంతానాన్ని పొందడానికి మాత్రమే ఉండాలి. మాటలు సత్యాన్ని

పలకడానికే ఉపయోగించాలి. అప్పుడు ఈ దుర్గమమైన సంసారాన్ని అవలీలగా దాటి సత్పురుషులౌతారు. మన దేహమందే అమృతం, మృత్యువూ రెండూ ఉన్నాయి. కోరికల వల్ల మృత్యువు లభిస్తుంది. జ్ఞానంవల్ల అమృతం లభిస్తుంది. విజ్ఞులు బాగా విచారించి, యోగ్యమైన దానినే స్వీకరించాలి.

పరలోక సుఖం లభించాలంటే భక్తులను, అనురక్తులను, ఆశ్రితులను రక్షించాలి. సర్వప్రాణులయందు దయగలిగి ఉండాలి. మంచివారు ఏడడుగులు కలిసి వేసినంతలోనే స్నేహితులౌతారు. మరీ మంచివారికి మూడు అడుగులతోనే మైత్రి కలుగుతుంది. ఉత్తమోత్తములకు అడుగడుగునా మిత్రులు లభిస్తూనే ఉంటారు.

**శ్లో॥ సర్వ స్తరతు దుర్గాణి, సర్వో భద్రాణి పశ్యతు ।**
**సర్వః సద్బుద్ధి మాప్నోతు, సర్వః సర్వత్ర నందతు ॥**

అందరూ కష్టాల నుండి కడతేరుదురుగాక! అందరూ శుభాలనే పొందుదురుగాక! అందరకూ మంచిబుద్ధులు కలుగుగాక! అందరూ ఎల్లప్పుడూ ఆనందంగా ఉందురుగాక!



# ౨౦. ఏకాదశీ వ్రత మహాత్మ్యం

శ్లో॥ యదిచ్ఛే ద్విష్ణు సాయుజ్యం శ్రియం సంతతి మాత్మనః ।
ఏకాదశ్యాం నభుంజీత పక్షయోరుభయోరపి ॥ (నారదః)

ఏకాదశి అనగానే మనకందరకు ఉపవాసం అని తెలుసు. ఏకాదశి వ్రతం గూర్చిన విశేషాలు చాలా ఉన్నాయి. పరమపవిత్రమైన ఏకాదశి వ్రతాన్ని ఆచరించినందువల్ల ఇహమందు సంపద, సంతతి రెండూ లభిస్తాయి. పరమందు విష్ణు సాయుజ్యం లభిస్తుంది. అందుకే మనమందరం తప్పక ఏకాదశీ వ్రతాన్ని ఆచరించవలసిందే!

ముందుగా మనమాచరించే కర్మల గూర్చి తెలుసుకుందాం!

కర్మ విశేషాలు రెండు విధాలు. 1. దైవం, 2. పిత్ర్యం. ఇందులో దైవకర్మలు ఆరు విధాలుగా ఉన్నాయి. 1. ఏక(భ)భుక్తం 2. నక్తం 3. అయాచితం 4. ఉపవాసం 5. వ్రతం 6. దానం.

1. మధ్యాహ్నం నందు ఒకేసారి ఏక జాతీయమైన అన్నాన్ని భుజించడాన్ని 'ఏక(భ)భుక్తం' అంటారు. 2. రాత్రియందే ప్రదోషకాలంలో భుజించడాన్ని 'నక్తం' అంటారు. 3. యాచన చేయకుండా ఆ రోజు ఏది దైవికంగా లభిస్తే దాన్ని మాత్రమే స్వీకరించడాన్ని అయాచితం అవుతుంది. 4. అహెూరాత్రం లందు అనగా రోజంతా కూడా భుజించకుండా ఉండడాన్ని ఉపవాసం అంటారు. 5. ఏదైనా ప్రత్యేక పూజా మొదలైన కార్యక్రమాలను 'వ్రతం' అంటారు. 6. మనకు ఉపయోగపడు ద్రవ్యాన్ని లేదా వస్తువులను ఇతరుల ఉపయోగార్థమై ఇచ్చుట 'దానం' అవుతుంది.

ఈ ఆరింటిలో ఏకభుక్త, నక్తాదులు కొన్ని వ్రతాలకు అంగాలుగా ఉన్నాయి. కొన్ని ఏకాదశి ఉపవాస విషయంలో ప్రతినిధిగా విధింపబడినాయి.

మరికొన్ని స్వతంత్రాలుగానే ఉన్నాయి. ప్రస్తుత ఏకాదశి విషయంలో రెండు అంశాలు ప్రధానంగా ఉన్నాయి. ఒకటి ఉపవాసం, రెండవది వ్రతం. సంతానం లేనివారు ఈ రెండింటిని రెండు పక్షాలందు ఆచరించాలి.

సంతానమున్నవారు వ్రతమాచరించకుండా, కేవలం యథాశక్తి నియమాలతో భోజనాన్ని వదిలివేయాలి.

మరో ముఖ్య విషయమేమిటంటే– ఆషాఢ శుద్ధ ఏకాదశి నుండి కార్తీక శు. ఏకాదశి వరకు గల అన్ని ఏకాదశులందు అందరూ ఉపవాస, వ్రతాలను ఆచరించవచ్చు.

వ్రతాలు రెండు విధాలు. 1. నిత్యం 2. కామ్యం.

అందరం శాస్త్ర ప్రకారం తప్పక ఆచరించుట నిత్యం అని, ఏదైనా ప్రత్యేక కోరికతో చేసేది కామ్యం అవుతుంది. ఏకాదశి వ్రతంలో రెండూ ఉన్నాయి. కామ్య వ్రతాన్ని ఆచరించేవారు రెండు పక్షాలందు ఏకాదశిని శాస్త్రోక్త విధానంగా ఆచరించాలి. దీనికి నిషేధం లేదు.

వంశపరంపరగా ఉన్న పాంచరాత్ర సంస్కారం గల వైష్ణవులు రెండు ఏకాదశుల్లో ఉపవాసం తప్పనిసరిగా ఆచరించవలసిందే.

ఏకాదశి వ్రతంలో శైవ, వైష్ణవ, సౌర మత భేదం లేదు, అందరికీ ఇది నిత్య వ్రతమై ఉంది. ఒకవేళ చేయకపోతే దీనికి పరిహారం వేరే లేదు. ఎనిమిది సంవత్సరాల వయస్సు మొదలుకుని 80 సంవత్సరాల వయస్సు వరకు కూడా ఏకాదశి వ్రతాన్ని ఆచరించే అధికారం ఉంటుంది. శక్తిగలవారు ఆ తర్వాత కూడా చేయవచ్చు. గృహిణులు ప్రత్యేకంగా తమ భర్త నుండి లేదా తల్లిదండ్రుల నుండి అనుమతి పొంది మాత్రమే ఉపవాసాది వ్రతాలను ఆచరించాలి. లేనిచో నిష్ఫలమవుతుంది. అంతేగాక పెద్దల ఆయుష్షు క్షీణిస్తుంది. నరక ప్రాప్తి తప్పదు. ఈ వ్రతంలో అశక్తులకు ప్రత్యేక మినహాయింపు శాస్త్రంలో ఇచ్చారు.

**శ్లో॥ నక్తం హవిష్యాన్న మనోదనం వా, ఫలం తిలాః క్షీర మథాంబుచాజ్యం ।**
**యత్పంచగవ్యం యదివాపి వాయుః ప్రశస్తమత్రోత్తర ముత్తరంచ ॥**

పగటి పూట గాకుండా, రాత్రికి భుజించడం, పగలైనా కూడా హవిష్యాన్నం స్వీకరించడం ఇక్కడ హవిష్యం అంటే యజ్ఞంలో వేయడానికి తయారుచేసే పదార్థం, బియ్యం పప్పు కలిపి ఉడికించి దానిపై నేయి వేస్తారు. అన్నం విడిచి, అటుకులు మొదలైనవి తినడం లేక పండ్లు, తిలలు అనగా నువ్వులు తినుట, పాలు త్రాగుట, నీరు త్రాగుట, నేయి త్రాగుట, పంచగవ్యాన్ని (ఆవు పాలు, పెరుగు, నెయ్యి, మూత్రం, పేడ కలిపితే పంచగవ్యం అంటారు.) స్వీకరించుట, చివరగా వాయుభక్షణం. వీటన్నింటిలో ఒకదానికంటే ఒకటి ఉత్తమమని చెప్పబడింది.

ప్రమాదవశాత్తూ ఏకాదశి ఉపవాసం చేయకున్నచో, ద్వాదశి రోజునైనా ఉపవాసం చేయాలి. ద్వాదశి రోజున కూడా చేయని పక్షంలో యవమధ్య చాంద్రాయణ వ్రతాన్ని ప్రాయశ్చిత్తంగా చేసుకోవాలి. నాస్తిక మతం చేత చేయనివారు పిపీలికాది మధ్య చాంద్రాయణ వ్రతం ప్రాయశ్చిత్తంగా చెప్పారు. అశక్తులైనవారి కొరకై భర్త, కుమారులు, కుమార్తెలు, భార్య, సోదర సోదరీ మొదలైన వారి గూర్చి ఏకాదశి ఉపవాసం చేస్తే నూరు యజ్ఞాలు చేసిన పుణ్యఫలితం వస్తుంది. వైష్ణవులు, స్మార్తులు అని రెండు రకాలుగా ఉన్నాం. వైష్ణవ దీక్ష తీసుకున్న వారిని వైష్ణవులు అని, మిగతా వారందరినీ స్మార్తులు అని మహానిబంధాలందు చెప్పబడింది. అంతేగాక వంశపారంపర్యంగా వచ్చినదే వైష్ణవత్వం, స్మార్తం అని నిర్ణయ సింధువులో చెప్పింది. అన్ని దేశాల్లోని వారికి, అందరికీ సమ్మతమై ఉంది.

**శ్లో॥ ఆదిత్యోదయ వేధస్తు, స్మార్తానాం కథితో బుధైః ।**
**అరుణోదయ వేధస్తు, వైష్ణవానాం స్మృతః పరైః ॥**

అని అగ్నిపురాణంలో చెప్పబడింది. ఈ విషయంలో దైవజ్ఞులకే సందేహమేర్పడినపుడు ఏకాదశిని విడిచిపెట్టి ద్వాదశి యందు ఉపవాసం చేయమని శాస్త్ర ప్రమాణం ఉంది.

**శ్లో॥ బహువాక్య విరోధేతు బ్రాహ్మణేషు వివాదిషు ।**
**ఏకాదశీం పరిత్యజ్య ద్వాదశీం సముపోషయేత్ ॥**

ఇదిగాక ఏకాదశి విశేషాలు అనేకం ఉన్నాయి.

ఏకాదశి శుద్ధ, విద్ధ అని రెండు విధాలు. అరుణోదయ వేధగలది విద్ధ అంటారు. దీన్ని వదిలిన, వైష్ణవులు ద్వాదశి యందుపవసిస్తారు. అరుణోదయ వేధ లేనిది 'శుద్ధ' అవుతుంది.

**శ్లో॥ గృహస్థో, బ్రహ్మచారీచ, అహితాగ్ని స్తథైవచ ।**
**ఏకాదశ్యాం నభుంజీత పక్షయోరుభయోరపి ॥**

గృహస్థులు, బ్రహ్మచారులు, అగ్ని హెూత్రులు– రెండు పక్షాలందు వచ్చు ఏకాదశి రోజుల్లో భోజనం చేయ రాదని తాత్పర్యం.

ఈ ఏకాదశీ వ్రత విధానం తెలుసుకునే ముందు ఏకాదశి అంటే ఏమిటో తెలుసుకుందాం!

ప్రతి మాసంలో రెండు పక్షాలుంటాయి. ఒకటి శుక్లపక్షం. మరొకటి కృష్ణపక్షం. పదిహేను తిథులతో కూడినది పక్షం అనబడుతుంది. అమావాస్య తెల్లవారి వచ్చే పాడ్యమి నుండి పౌర్ణమి వరకు శుక్ల (శుద్ధ) పక్షం అని, పౌర్ణమి తెల్లవారి పాడ్యమి నుండి అమావాస్య వరకు కృష్ణ (బహుళ) పక్షం అంటారు.

ఈ రెండు పక్షాలలోని తిథులలో 11వ తిథిని 'ఏకాదశి' అంటారు. ఈ ఏకాదశి తిథికి చాలా విశిష్టత ఉంది.

శాస్త్రప్రకారం ఏకాదశి తిథికి అధిపతి యముడు– రుద్రుడు– విశ్వదేవతలు అగుచున్నారు. అంతేగాక మన శరీరంలోని ఏకా దశేంద్రియమైన 'మనస్సు'కు ఈ ఏకాదశికి సంబంధం ఉంది.

ఐదు జ్ఞానేంద్రియాలకు, ఐదు కర్మేంద్రియాలకు అధిపతి యైన మనస్సు ప్రధానమైంది. **'ఇంద్రియాణి పర్యాణ్యాహుః ఇంద్రియేభ్యః పరం మనః'** ఇంద్రియాలు గొప్పవే కాని ఈ ఇంద్రియాల కంటే మనస్సు చాలా గొప్పదని గీతలో శ్రీకృష్ణ భగవానుడు బోధించాడు.

మనస్సు ఏవిధంగా చెబితే ఇంద్రియాలు అనగా మనం ఆవిధంగా చేస్తాం.

**'మన ఏవ మనుష్యాణాం– కారణం బంధమోక్షయోః'**

ఒక్క మాటలో చెప్పాలంటే- బంధానికి, మోక్షానికి కారణం 'మనస్సే' అవుతుంది.

సుఖాలకు, దుఃఖాలకు కూడా కారణం మనస్సే గదా! అందుకే మనస్సును అదుపులో పెట్టుకుంటే శరీరం అదుపులో ఉంటుంది.

మనస్సును మంచి మార్గంలో పెడితే అది మనలను మంచి మార్గంలో నడిపిస్తుంది. అందుకే ఏకాదశి ఉపవాసాలు, దైవకార్యాలు తప్పనిసరిగా ఆచరించాలి.

ఉపవాసం అంటే- **ఉప- సమీపేయో వాసః 'ఉపవాసః'**

ఇతరమైన ఆలోచనలు లేకుండా, కేవలం ఆ దైవసన్నిధి లోనే రోజంతా గడపడమే 'ఉపవాసం'. నిరంతరం దైవకార్యాల్లో నిమగ్నం కావాలంటే మనం నిత్యం చేసే ఆహార విహారాలను వదిలివేస్తేనే సాధ్యమవుతుంది.

ఆహారం తీసుకోకుండా ఉండడం వల్ల కుటుంబం అంతా దేవుని పూజా కార్యక్రమాల్లో పాల్గొనవచ్చు. అంతేగాకుండా ఆహారం లేనపుడు నిద్రబాధ కూడా ఉండదు. అందుకే జాగరణం చేయడానికి అవకాశమేర్పడుతుంది.

ప్రతి 15 రోజులకు ఒకసారైనా నిద్రాహారాలు మానివేసి దేవుని సన్నిధిలో గడపడం వల్ల సంపూర్ణ ఆరోగ్యం కూడా లభిస్తుంది.

ఈ ఏకాదశి తిథి శ్రీ మహావిష్ణువుకు మరియు శ్రీ సదాశివు నకు ఇరువురకు మహాప్రీతికరమైంది. పరమ పవిత్రమైన ఏకాదశి పర్వదినాన శ్రీ విష్ణుసహస్ర నామాలతో తులసీదళాలతో శ్రీ లక్ష్మీనారాయణుని పూజించవచ్చు. అదేవిధంగా మహన్యాస పూర్వక ఏకాదశ రుద్రాభిషేకంతో బిల్వదళాలతో ఏకాదశ రుద్రుని సేవించవచ్చు.

అమ్మవారికి కూడా ఈ ఏకాదశి రోజున అష్టోత్తర, శత, సహస్ర నామాలతో అర్చన చేసిన అభీష్ట సిద్ధిని కలుగజేస్తుంది. ఇట్టి మహాపుణ్యప్రదమైన ఏకాదశు లు సంవత్సరంలో నెలకు రెండు చొప్పున 12 నెలలకు 24 వస్తాయి. ఒకవేళ అధికమాసం వచ్చి నపుడు రెండు ఎక్కువై మొత్తం 26 ఏకాదశులు అవుతాయి.

**వ్రతవిధానం :**

ఏకాదశికి ముందురోజున అనగా దశమి రోజున బ్రాహ్మీ ముహూర్తమందు మేల్కొని కాలకృత్యాలు తీర్చుకుని, నిత్యకర్మలాచరించిన తర్వాత– సంకల్పం చేయాలి.

**శ్లో॥ దశమీదినమారభ్య, కరిష్యేహం వ్రతం తవ ।**
**త్రిదినం దేవదేవేశ, నిర్విఘ్నం కురు కేశవ ॥**

అని ఆ దేవదేవుని మనస్ఫూర్తిగా ప్రార్థించాలి. నిత్యపూజ పూర్తి చేసుకుని, స్వామికి మహానివేదన చేయాలి. స్వామికి సమర్పించిన ఆహారాన్ని ప్రసాదంగా మధ్యాహ్నం ఏకభుక్తం చేయాలి.

కాంస్యపాత్రం, పెసరపప్పు, పగటినిద్ర, అతిభోజనం, అతి జలపానం, తిరిగి భోజనం, మైథునం, క్షౌరం, అబద్ధాలాడడం, శెనగలు, కోద్రవశాకం, పరాన్నం, ద్యూతం, తైలం, తెలకపిండి, తాంబూలం మొదలగు వానిని విసర్జించాలి. రాత్రి భూశయనం చేసి, తెల్లవారి అనగా– ఏకాదశి రోజున ప్రాతః కాలముననే లేవాలి. స్నానాది నిత్యకర్మలు ముగిసిన తర్వాత– తామ్ర పాత్రతో జలాన్ని స్వీకరించి ఉత్తరాభిముఖులై ఆచమనం చేసి సంకల్పించాలి.

**శ్లో॥ ఏకదశ్యాం నిరాహారో భూత్వాహమపరేహని ।**
**భోక్ష్యామి పుండరీకాక్ష, శరణం మే భవాచ్యుత ॥**

అని స్వామికి పుష్పాంజలిని సమర్పించాలి.

ఓ స్వామీ! ఏకాదశి యందు (ఈ రోజున) నిరాహారుడనై రేపు అనగా ద్వాదశి రోజున పారణ చేసెదను కనుక నిర్విఘ్నంగా పూర్తియగునట్లు నన్ను రక్షింపుము అని ప్రార్థించాలి.

నిరాహారమునకు అశక్తులైనవారు అనగా– రోగపీడితులు, 8 సంవత్సరాలలోపు బాలలు, గర్భిణులు, 80 సంవత్సరాలు దాటిన వృద్ధులు నక్తం గాని, ఫలహారాదులు గాని స్వీకరించెదమని సంకల్పించవచ్చును.

గృహంలో నిత్యపూజ గావించుకుని, సమీపంలోని ఆలయానికి వెళ్ళి, స్వామిని దర్శించి, సేవించాలి. వైష్ణవులు అష్టాక్షరీ మంత్రంతో, శైవులు రుద్ర

గాయత్రితో, సౌరులు నిత్యగాయత్రితో సంకల్పించాలి. వీనితో అభిమంత్రించిన జలాన్నే స్వీకరించాలి. తర్వాత నిత్యపూజ భక్తిశ్రద్ధలతో స్వామికి షోడశోపచార పూజ పూర్తిచేయాలి. ఇందులో పురుషసూక్త, శ్రీసూక్త విధానంతో సుగంధ పుష్పాక్షతలతో గీతవాద్యములతో దివ్య నైవేద్యములతో నానావిధ స్తోత్రాలతో సేవించాలి, అర్చించాలి, భజించాలి.

రోజంతా భగవన్నామ స్మరణతోనే కాలం గడపాలి.

ఈ ఏకాదశి రోజున– పాషండులు– అనగా వేదాన్ని అనుసరించని (వదిలియున్న) వారితో సంభాషణం, దర్శనం, స్పర్శనం చేయకూడదు. బ్రహ్మచర్యం, సత్యభాషణం, పగటి నిద్రలేకుండడం మొదలైనవి ఆచరించాలి.

సూతక, రజస్వలాదుల యొక్క సంభాషణ, శ్రవణ దర్శన స్పర్శనాదులు పనికిరావు. పొరపాటున ఇటువంటివి జరిగినపుడు ప్రాయశ్చిత్తం కూడా శాస్త్రంలో చెప్పారు.

**శ్లో॥ పాషండి దర్శనాదౌతు సూర్యం పశ్చేతత్త శ్శుచిః ।**
**సంస్పర్శేతు బుధస్స్నాయా చ్ఛుచిరాదిత్య దర్శనాత్ ।**
**సంభాష్యతానే శుచిదం, చింతయేదచ్యుతం బుధః ॥**

అను ప్రమాణములననుసరించి–

పాషండులను చూసినందున, త్రాకినందున స్నానం చేసి సూర్యదర్శనం చేయాలి, మాట్లాడినచో భగవన్నామ స్మరణతో ప్రాయశ్చిత్తం చేసుకోవాలి. ఉపవాసం రోజున పితృకర్మయైన శ్రాద్ధం వస్తే, శ్రాద్ధశేషమైన అన్నాదులను ఒక పాత్రలో వడ్డించి, ఆఘ్రాణించి ఆవునకు పెట్టాలి.

ఫలహారం చేయదలిస్తే అట్టి పదార్థం పితృపాత్రలో వడ్డించి, మిగిలింది స్వీకరించాలి.

**శ్లో ॥ ఏకదశ్యాం యదాభూప మృతాహస్స్యాత్కదాచన ।**
**తద్దినంతు పరిత్యజ్య, ద్వాదశ్యామేవ కారయేత్ ॥**

ఏకాదశి రోజుననే మృత తిథి అనగా తద్దినం వచ్చినపుడు ఏకాదశిని వదిలి, ద్వాదశి రోజున చేయాలనే విషయం కేవలం వైష్ణవులకు సంబంధించింది.

వైష్ణవులు 16 మహాలయాలు చేయునపుడు ఏకాదశి, ద్వాదశి మహాలయాలు రెండు "తంత్రేణ కరిష్యే"యని సంకల్పించి, ద్వాదశియందే చేస్తారు.

ఉపవాసవ్రతాన్ని ఆచరించేవారికి సూతకం వచ్చినచో శరీర నియమాలను స్వయంగా చేసి, సూతకం పోయిన తర్వాత పూజాదానాదులు చేయాలి. నిత్యోపవాసమందు సూతకం వచ్చిన శరీర నియమాలాచరిస్తూ, స్నానం చేసి హరికి నమస్కరించి, పూజాదికం బ్రాహ్మణునిచే చేయించాలి.

**వ్రత ఫలం**

**శ్లో॥ యదిచ్ఛేద్విష్ణు సాయుజ్యం శ్రియం సంతతి మాత్మనః ।**
**ఏకాదశ్యాం నభుంజీత పక్షయోరుభయోరపి ॥**

రెండు పక్షములందు వచ్చు ఏకాదశీ పవిత్ర దినాలలో ఏకాదశీ వ్రతాన్ని ఆచరించువారికి విష్ణు సాయుజ్యంతో పాటు సంపద, సంతతి రెండూ లభిస్తాయి. మన జీవన విధానంలో మనకు తప్పనిసరి గావలసినవి రెండే రెండు. మన ప్రయత్నంతో నెరవేర్చుకోలేనివి కూడా ఈ రెండే. అవి 1) సంపద, రెండవది సంతానం. ఈ రెండూ కూడా మన ప్రయత్నంతో పాటు దైవానుగ్రహం ఉంటేనే లభిస్తాయి. అందుకే ఈ నోములు, వ్రతాలు.

ప్రతి సంవత్సరంలో వచ్చే ఏకాదశుల ప్రత్యేక ఫలితాలు, ఏకాదశుల పేర్లు శాస్త్రాలలో తెలుపబడ్డాయి.

ముందుగా–

**చైత్రమాసం** – శుక్ల – కామద – కోరికలు సిద్ధిస్తాయి.
కృష్ణ – వరూధిని – సహస్ర గోదాన ఫలం,
పాపమోచన, పాప విముక్తి

**వైశాఖమాసం** – శుక్ల – మోహిని – ధనప్రాప్తి.
కృష్ణ – అపర – రాజ్యప్రాప్తి.

**జ్యేష్ఠమాసం** – శుక్ల – నిర్జల – అన్నోదక సమృద్ధి.
కృష్ణ – యోగిని – పాప పరిహారం.

| | | | |
|---|---|---|---|
| **ఆషాఢమాసం** – | శుక్ల – | శయన – | సంపదలు |
| | కృష్ణ – | కామిక – | కోరిక సిద్ధి. |
| **శ్రావణమాసం** – | శుక్ల – | పుత్రద – | సంతానప్రాప్తి. |
| | కృష్ణ – | అజ – | అపద రక్షణం. |
| **భాద్రపదమాసం** – | శుక్ల – | పరివర్తన (వామన) – | భూలాభం. |
| | కృష్ణ – | ఇందిర – | ఐశ్వర్య ప్రాప్తి. |
| **ఆశ్వయుజమాసం** – | శుక్ల – | పాపాంకుశ – | పాప విముక్తి |
| | కృష్ణ – | రమ – | లక్ష్మీప్రాప్తి. |
| **కార్తీకమాసం** – | శుక్ల – | ప్రబోధిని – | జ్ఞాన ప్రాప్తి |
| | కృష్ణ – | ఉత్పత్తి – | వస్తుప్రాప్తి |
| **మార్గశిరమాసం** – | శుక్ల – | మోక్షద – | మోక్షసిద్ధి |
| | కృష్ణ – | విమల – | దైవదర్శనం |
| **పుష్యమాసం** – | శుక్ల – | సఫల – | సంతాన ప్రాప్తి |
| | కృష్ణ – | షట్తిల – | ఈతిబాధా నివృత్తి |
| **మాఘమాసం** – | శుక్ల – | జయ – | విజయప్రాప్తి |
| | కృష్ణ – | విజయ – | సంతోష ప్రాప్తి |
| **ఫాల్గుణమాసం** – | శుక్ల – | ఆమలకి – | ఆరోగ్య ప్రాప్తి. |
| | కృష్ణ – | సౌమ్య – | సద్గుణ ప్రాప్తి. |
| **అధికమాసం** – | శుక్ల – | పద్మిని – | విద్యాప్రాప్తి |
| | కృష్ణ – | పరమ – | దైవానుగ్రహం |

పై ఏకాదశుల పేర్ల విషయంలో భిన్న మతాలున్నాయి. అయినా వాటి ఫలితాలలో మాత్రం తేడా లేదు. ఒక్కొక్క పక్షంలోని ఏకాదశికి ఒక్కొక్క కథ ద్వారా ఆ ఏకాదశీ మహాత్మ్యం మనకు తెలుస్తుంది.

ప్రధానంగా ఏకాదశీ వ్రతాచరణ చేసిన భక్తాగ్రేసరుడైన అంబ రీషుని కథను ఈ సందర్భంగా మనం తప్పక స్మరించుకోవాలి.



# 21. అధ్యాత్మవిద్యా విద్యానాం

శ్రీమద్భగవద్గీతలో శ్రీకృష్ణ భగవానుడు విద్యలన్నింటినలో ఆత్మవిద్యను 'నేను' అని విభూతి యోగంలో తెలియజేశాడు. అనగా ముందు అన్ని విద్యలు మనకు తెలిస్తేనే అందులో 'ఆత్మవిద్య' ఏదో తెలుస్తుంది. ఆత్మవిద్య తెలియడానికైనా మనకు విద్య అవసరం. కేవలం "కోటి విద్యలు కూటి కొరకే" అనే సామెత ఇక్కడ వర్తించదు. సకల విద్యలు పరమాత్మ స్వరూపమే అయినా, మనకు మోక్షమార్గాన్నందించేది ఆత్మవిద్య అని సారాంశం.

మానవులకు విద్యయే సౌందర్యం. అదియే గుప్తధనం, విద్యవల్ల కీర్తి, సుఖం, భోగాలు లభిస్తాయి. విద్యయే గురువులకు గురువు. విదేశాలు వెళ్లినపుడు విద్యే మనకు బంధువు. విద్య కన్ను వంటిది. సభలలో పూజార్హత విద్యకే గాని, ధనానికి కాదు. ఇంతటి గొప్పదైన 'విద్యలేని వాడు వింత పశువని' భర్తృహరి నీతిశాస్త్రంలో చెప్పాడు. సకల ప్రాణులకు ఆహార, నిద్రా, భయ, మైథునాలు నాలుగు ప్రధాన ధర్మాలున్నాయి. ఇవి మనకు కూడా మిగతా ప్రాణులతో సమానమే. ఇక విశేషమేమంటే మనకు జ్ఞానమొక్కటే ఎక్కువ. జ్ఞానం లేని మనం పశువుతో సమానమే కాని వేరు కాదు. "జ్ఞానేన హీనః పశుభిస్సమానాః" అని ఉత్తర గీత చెబుతుంది.

విద్యతో సమానమైన బంధువుగాని, అనారోగ్యం వంటి శత్రువుగాని, సంతానంతో సమానమైన స్నేహితులుగాని, దైవాన్ని మించిన బలంగాని లేవు. పాండిత్యానికి రాజరికాన్ని పోల్చుటకు ఏమాత్రం వీల్లేదు. రాజు కేవలం స్వదేశమందే పూజనీయుడు. కానీ, **విద్వాన్ సర్వత్ర పూజ్యతే ।** పండితుడు మాత్రం లోకంలో ఎక్కడికి వెళ్లినా పూజనీయుడవుతాడు. క్షణక్షణం వృథా చేయక విద్యను అభ్యసించాలి. శిక్షించడం వల్ల అనేక సుగుణాలు కలుగుతాయి. కుమారుని, శిష్యుని శిక్షించాలే గాని గారాబం చేయరాదు. అభ్యాసం వల్ల విద్య

లభిస్తుంది. విద్యలో అభివృద్ధి చెందనివారు నిష్ప్రయోజకులు. విద్య నేర్పినవారు కన్నతండ్రితో సమానులు. మొదటి గురువు తల్లి. పండితులకు విద్యే యౌవనశోభ కలిగిస్తుంది.

విద్య వలన జ్ఞానం లభిస్తుంది. జ్ఞానం మనకు పెన్నిధి. దీన్ని జ్ఞాతులు వంచించి తీసుకోలేరు, దొంగలు అపహరించజాలరు. ఎంత దానం చేసినా తరగదు. జ్ఞానం ఒక అనర్ఘరత్నం. సరియైన గురువు వద్ద సేవలు చేసి విద్యను పొందాలి. రూప, యౌవనమున్నా, ఉత్తమ కులంలో పుట్టినా, విద్యలేని వారు శోభించరు. పిల్లలను చదివించని తల్లిదండ్రులు వారికి శత్రువులవుతారు. కని, పెంచినంత మాత్రాన ఎవరూ పండితులు కాలేరు. చదువుకున్న వారితో సహవాసం, సంభాషణం, స్నేహం చేసేవారు ఎన్నటికీ చెడిపోరు. విషయం చెబితే పక్షులు, జంతువులు కూడా తెలుసుకుంటాయి. గుర్రాలు, ఏనుగులు, గాడిదలు హెచ్చరించగానే బరువులు మోస్తాయి. కాని చెప్పని దానిని ఊహించ గలవారే పండితులు. ఇతరుల అభిప్రాయాలను, మనస్సులోని విషయాలను తెలుసుకోవడమే బుద్ధి యొక్క లక్షణం.

బ్రాహ్మణ కులంలో జన్మించిన వారికి విద్య చాలా ముఖ్యం. సూక్ష్మ తెలివిగలవారే అనేక శాస్త్రాలను చదివి సులభంగా అవగాహన చేసుకోగలరు. ప్రతీ విషయంలో గుణదోషాలను పరీక్షించి, స్వీకరించేవారే పండితులు. మంచి చెడ్డలాలోచించక ఒకరు చెప్పిన దానినే విశ్వసించడం మూర్ఖత్వం. పాత విషయాలన్నీ మంచివిగావని, కొత్త విషయాలలో దోషాలుండనవసరం లేదు. చెవులకు శాస్త్ర చర్చలే మంచి ఆభరణాలు. మిగతానగలన్నీ వ్యర్థమే. శాస్త్రాలన్నీ అనంతాలు. తెలుసుకోవలసింది మహాసముద్రమంత చాలా ఉంది. జీవితకాలం చాలా స్వల్పం. ఇందులో విఘ్నాలు అనేకం. కాబట్టి కావలసినంత వరకు సారభూతమైన విషయాలను మనం తెలుసుకోవడానికి ప్రయత్నించాలి. హంస ఏవిధంగా పాలను స్వీకరించి, నీటిని వదిలివేసినట్లుగా మనం కూడా మంచిని గ్రహించి, చెడును వదిలివేయాలి.

పండితుల సహవాసం వల్లనే విద్య వస్తుంది. విద్య వల్ల వినయం కలుగుతుంది. వినయం కలవారినే లోకులు గౌరవిస్తారు. ప్రజా గౌరవాన్ని

పొందువారికి లోటు ఏముంటుంది? విద్యయందు అభిరుచి గలవారికి నిద్ర, సుఖం ఉండదు. దానాలన్నింటిలోకెల్లా విద్యాదానం మరి గొప్పది. అన్నదానం గొప్పదేగాని, దానివల్ల ఆకలి తొలగి క్షణిక సుఖమే లభిస్తుంది. కాని విద్యాదానం వల్ల అజ్ఞానం అనే చీకటి తొలగి జీవితమంతా సుఖశాంతులు లభిస్తాయి. జ్ఞానం చేత బుద్ధి పరిశుద్ధమవుతుంది. విద్య చేత ఆత్మ శుద్ధమవుతుంది.

కొద్ది మాటలతో మనోహరంగా ఎవరూ విషయాలను ఇతరులకు అర్థమయ్యేట్టు చెబుతారో వారే మేధావులు. గురువుల సేవ చేసినా , కావలసినన్ని డబ్బులిచ్చి లేదా ఒక విద్య తెలిపి మరో విద్యను పొందవచ్చు. ఈ మూడు పద్ధతులు గాక వేరే మార్గం లేదు. ప్రజ్ఞావంతులకు శాస్త్రం తమంత తామే విస్తారమవుతుంది. అహంభావం లేనివారికే పండితపదం సార్థకమవుతుంది. పండితులందర్ని ఆనందింపజేసి, నమస్కారాలందించు ఉత్తమ విద్య ఒక్కటి మాత్రం ఉంటే చాలు! విద్య అనేది ఒక కల్పవృక్షం. ఏ కోరిక కోరితే అది ఇస్తుంది. తల్లి వలె రక్షిస్తుంది. తండ్రివలే హితం బోధిస్తుంది. భార్యవలె దుఃఖాన్ని పోగొట్టి ఆనందింపజేస్తుంది. నలుదిశలకు కీర్తిని వ్యాపింపజేస్తుంది. ఐశ్వర్యాన్ని కలిగిస్తుంది. ఒక్కమాటలో చెప్పాలంటే విద్య వల్ల సాధించంది ఏదీ లేదు. కాని వినయశీలుడైన పండితుడు లభించడం చాలా దుర్లభం.

ముసలితనంలో కూడా జ్ఞాన సంపాదన చేయడమే ముఖ్య కర్తవ్యం. ధనమెంత సంపాదించినా, జ్ఞానం వల్ల పొందే ఆనందాన్ని పొందలేరు. చదువుకున్నవారి శ్రమ చదువుకునే వారికే తెలుస్తుంది. పుస్తకంలో ఉండే జ్ఞానం సమయానికి ఉపయోగ పడదు. ధనాలన్నింటిలోకెల్లా విద్యాధనమే గొప్పది. పండితుల మెప్పు లభించినపుడే విద్య ఫలించినట్లవుతుంది. ఆత్మవిశ్వాసం కలుగుతుంది. విద్యలేనివారు గొప్ప కులంలో జన్మించినా ప్రయోజనం లేదు. చదివినవారు నీచకులంలో ఉన్నా దేవతలకు కూడా పూజనీయులవుతారు. అభ్యసించని వారికి శాస్త్రం విషమౌతుంది. కురూపులకు విద్యయే మంచి రూపాన్నిస్తుంది. వేదాధ్యయనం చేయని బ్రాహ్మణుడు సభలలో శోభించడు. పండితులు లేనిచోట ఏ కొద్దిగా చదువుకున్నవారికైనా గౌరవం లభిస్తుంది.

చదువుకున్నవారు లేని వంశం వ్యర్థం. కొద్దిగా తెలుసుకుని, అంతా తెలుసనుకునేవారిని బ్రహ్మదేవుడు కూడా మెప్పించలేడు. ఏమీ తెలియనివారిని బాగా తెలిసినవారిని సులభంగా మెప్పించవచ్చు. పండితులు అంతటా పూజింపబడతారు.

చదువు వంటి కన్ను మనకు లోకంలో వేరే లేనే లేదు. అను వంశికంగా వస్తున్న కుల విద్యవల్ల జీవించడమే ఉత్తమం. కనీసం నూరు శ్లోకాలు వచ్చినవారిని పండితులన్నారు. ఏమీ రాని అజ్ఞానులకంటే పుస్తకాలు చదివేవారు గొప్పవారు. కేవలం పుస్తకాలు చదివేవారి కంటే చదివిన దానిని జ్ఞాపకం ఉంచుకునే వారే శ్రేష్ఠమైనవారు. జ్ఞాపకముంచుకునే వారికంటే అర్థం తెలిసినవారు ఇంకా గొప్పవారు. అట్టి అర్థం తెలిసిన జ్ఞానుల కంటే తెలిసిన వానిని ఆచరించేవారే మిక్కిలి శ్రేష్ఠులైనవారు.

చదవడం, వ్రాయడం, చూడడం, ప్రశ్నలు వేయడం, తెలిసినవారిని ఆశ్రయించడం మొదలైనవి ఎవరు చేస్తారో వారి బుద్ధి వికాసం చెందుతుంది. సద్గుణాలు, పరాక్రమం, చురుకుదనం, పాండిత్యం, స్నేహశీలత అనే ఐదు అంశాలు దొంగలు దోచుకోని అక్షయ నిధులు. యోగ్యమైన విద్య సాధారణమైన వారి నుండియైనా శ్రద్ధతో నేర్చుకోవాలి. ఉత్కృష్ట ధర్మాన్ని ఛండాలుని నుండి కూడా గ్రహించవచ్చు. మంత్ర బీజం కానట్టి అక్షరం లేదు. ఉపయుక్తుడు గాని మనిషి లోకంలో లేడు, వీటిని సంయోజన చేయగల బుద్ధిమంతులు మాత్రం లభించడం కష్టం. శాస్త్రాలన్నీ మన సౌఖ్యం కొరకే ఏర్పడ్డాయి. విధులను శాసించి, విషయాలను తెలియజేసేవే శాస్త్రాలు. అనేక శాస్త్రాలు చదివి, వాటి అర్థ విశేషాలను తెలియనివారు, మంచిగంధపు చెక్కల బరువుని మోస్తున్న వాని పరిమళం తెలియని పశువుతో సమానం.

ప్రత్యక్షం వల్లగాని, అనుమానం వల్ల గాని, ఆత్మ సాక్షాత్కారానికి సంబంధించిన ఏ ఉపాయం తెలుసుకోవడం సాధ్యం కాదో, అట్టి ఉపాయాలను తెలుపేదానిని 'వేదం' అంటారు. శ్రుతి వాక్యాలను విని, ఉపనిషత్తులను బుద్ధితో గ్రహించి, వాటిని ఎల్లప్పుడూ ధ్యానిస్తూ ఉంటే, ఆత్మ సాక్షాత్కారం కలుగుతుంది.

తక్కువ అక్షరాలు కలిగి, అసందిగ్ధ అర్థంతో సారవంతమై, విశాలమైన విషయాన్ని తెలియజేసే సత్యమైన, దోషరహితమైన వాక్యాన్ని 'సూత్రం' అంటారు.

లోకంలోని సర్వద్రవ్యాల్లోని ఉత్తమోత్తమమైంది విద్య ఒక్కటే. శస్త్ర విద్య, శాస్త్ర విద్య రెండూ విద్యలే అయినా, రెంటిలో ఎల్లప్పుడూ ఆదర్శపాత్రమయ్యేది శాస్త్ర విద్య మాత్రమే. ప్రస్తుత కాలంలో ఎంతటి పండితులైనా మౌనవ్రతం అవలంబించక తప్పని పరిస్థితులేర్పడుతున్నాయి. ఈ మధ్యకాలంలో ఇహలోక సుఖసాధకమైన విద్యలను అభ్యసిస్తున్నారు. ఇది మంచిపనే కాని, శరీరంలో శక్తి ఉన్నంతలోనే పరలోక సుఖానుభూతిని కలిగించే బ్రహ్మవిద్యను తప్పక అభ్యసించాలి. ఏ చదువులోనైనా అమంగళకరం, అశుభమైన వాక్యాలను చదవరాదు. మంచి విద్యవల్ల లోకకళ్యాణం జరుగుతుంది.

**విద్యార్థుల లక్షణాలు**

సద్బుద్ధి కలిగి ఉండేవారు, పెద్దవాళ్లను సేవించేవారు, మంచి ప్రవర్తన కలిగియుండేవారు, జ్ఞానాభిలాషి, చెప్పింది వినడంలో కోరికగలవారు, దురభిమానం లేనివారు, పెద్దలపై గౌరవభావం కలిగి నమస్కరించేవారు, తెలియని విషయాలు అడిగి తెలుసు కొనుటకు తగిన సమయం కొరకు వేచియుండువారు, శాంతంగా ఉండేవారు, నిగ్రహం గలవారు, అసూయలేనివారు, శాస్త్ర విశ్వాసం గలవారు, గురువులను ఆశ్రయించేవారు, చదివిన దానిని గ్రహించేవారు. గ్రహించిన దానిని జ్ఞప్తియందుంచుకునేవారు నిజమైన విద్యార్థులుగా గుర్తింపబడతారు.

**గురువు లక్షణాలు**

సమయోచితమైన మాట, స్వభావోచితమైన పని, తన శక్తికి తగిన కోపం గలవారు, వినయవంతులు, ఆదర్శవంతులు, స్వార్థరహితులు, మోసం, కపటబుద్ధిలేనివారు, సమబుద్ధి గలవారు. ఆత్మనిష్ఠ గలవారు గురువులుగా పూజింపబడతారు.

లోకంలో మానవులంతా ఉత్తములైన మహానుభావుల వద్దకు వెళ్లి, వారి వారి ప్రవర్తనలో మార్పులు చేసుకోవాలి. వినయంలేని విద్య ఎంత గొప్పదైనా

వ్యర్థమే. విద్యగలవారు దుష్టులకు దూరంగా ఉండాలి. విద్యనభ్యసించేవారు సుఖాలను కోరుకోరాదు. ధర్మార్థాలు లేనిచోట, శ్రద్ధావంతులు లేనిచోట విద్య చెప్పరాదు. విద్య వల్ల సకల సంపదలు సాధించవచ్చు. విద్య లేని జీవితం శూన్యం. శిష్యుల డబ్బును భక్షించే గురువులు చాలామంది ఉంటారు. కాని శిష్యుల సందేహాలను తీర్చగల ఉత్తమ గురువులు లభించడం కష్టం. సంశయాలన్నీ తొలగించి, చూడని విషయాలను ఎన్నింటినో స్పష్టంగా తెలుపుతూ, లోకానికంతటికీ కన్ను వంటిదైన శాస్త్రజ్ఞానం ఎవరికి ఉండదో వారు నిజంగా గుడ్డివారే. విదేశంలో ఉండాలనుకునే వారికి విద్య మిక్కిలి తోడుగా ఉంటుంది. అందుకే 'విద్వాన్ సర్వత్ర పూజ్యతే' అన్నారు.

విద్య వల్ల వినయం వస్తుంది. వినయం వల్ల యోగ్యత పెరుగుతుంది. యోగ్యులకు డబ్బు లభిస్తుంది. డబ్బు వల్ల సుఖాలు పొందగలుగుతారు. ఈ లోకంలో మానవజన్మ దుర్లభమైంది. విద్యాభ్యాసం మరింత దుర్లభం, అన్ని విద్యలలో ఆత్మవిద్య మిక్కిలి దుర్లభం, వేయిమంది మూర్ఖుల కంటే, యోగ్యగుణాలు గల ఒక పండితుడు గొప్పవాడు. పండితుల యొక్క ప్రవృత్తుల వల్లనే శిష్యులు వృద్ధిలోకి వస్తారు. శరీరబలం కంటే బుద్ధిబలం చాలాగొప్పది. జ్ఞానం ప్రధానమే కానీ, కర్మ హీనమైన జ్ఞానం నిరుపయోగం. కర్మ ప్రధానమే కాని, జ్ఞానం లేని కర్మకూడా నిష్ప్రయోజనం. జ్ఞాన కర్మలు రెండింటి సముచ్చయం వల్లనే మానవుడు తరిస్తున్నాడు. పక్షికి రెక్కలులాగా మనిషికి జ్ఞాన, కర్మలు అవసరం.

విద్యావిధానంలోని సూక్తులు అంతరంగాన ప్రవేశించి, ఆలోచించిన కొలదీ ఆనందతరంగాలను కలిగిస్తూ అమృతాలవుతాయి. స్వయంగా ప్రజ్ఞలేనివారికి శాస్త్రం వల్ల ప్రయోజనమేమీ ఉండదు. ఆచరణ కలవాడే విద్వాంసుడు గానీ, శాస్త్రం చదివినంత మాత్రాన పండితుడుకాదు. అల్పులతో స్నేహం చేస్తే అల్పబుద్ధి ఉంటుంది. సమగుణ శీలం కలిగి, విద్యగల వారితో స్నేహం చేస్తే, సమబుద్ధి కలుగుతుంది. విశిష్టమైన ఉత్తమ వ్యక్తుల సహవాసం వల్ల బుద్ధి ఉన్నత స్థాయిని చేరుతుంది. సోమరితనం కలవారికి విద్యరాదు. సంశయం కలవారికి కూడా జ్ఞానం, శ్రద్ధ ఉండక నశిస్తారు. అట్టివారికి ఈ లోకముండదు. పరలోకం లేదు. అసలు సుఖమే ఉండదు. ఏ మహాత్ముని కర్మలన్నీ కోరికలు కలిగించనివిగా

ఉంటాయో, వారినే పండితులంటారు. వీరికి కర్మలన్నీ జ్ఞానాగ్నిచే దగ్ధమైపోయి, ఫలరహితాలై ఉండడంతో కర్తను బాధించవు.

**ఆత్మవిద్యా రహస్యం**

ఆత్మవిద్యను సాధించడానికి తత్త్వదర్శులైన మహాత్ముల వద్ద సాష్టాంగ ప్రణామం చేసి, విశేష జిజ్ఞాసతో ప్రశ్నించి, అనేక శుశ్రూషలు చేసి తెలుసుకోవాలి. మన అర్హతననుసరించి పై విధంగా చేస్తేనే జ్ఞానులు ఉపదేశిస్తారు. కాని వేరే మార్గం లేదు.

విచిత్రమైన మాటలు గంగా ప్రవాహంలా మాట్లాడుతూ నేర్పుతో శాస్త్ర చర్చలు చేస్తూ, పాండిత్యమున్నట్లు ప్రదర్శించు విద్వాంసులు కేవలం భుక్తి కొరకు గడుపుతారు కాని, ముక్తి మాత్రం పొందరు. మనం కర్మ, జ్ఞానాలు రెంటినీ క్రమంగా సంపాదించాలి. కర్మల వల్ల చిత్తశుద్ధి కలిగి, జ్ఞానసాధన సుగమమవుతుంది. దీనిద్వారా మనకు అమృతమయమైన ఆత్మానందం కలుగుతుంది. పరతత్వం తెలియనంతవరకు శాస్త్రాధ్యాయనం నిష్ఫలం. పరతత్త్వం తెలిసినవారికి సకల శాస్త్రాలు కరతలామలకం కాని నిరుపయోగం. విద్య అంటే ఆత్మజ్ఞానం. అవిద్య అంటే లోకంలోని ఇతర విజ్ఞానం. మనల్ని తరింపజేసేది ఆత్మజ్ఞానం, మేధావియైనవారు ఆత్మజ్ఞానం కొరకు ఆయా గ్రంథాల విషయాలను తెలుసుకుని, గ్రంథాలను వదిలివేస్తారు. వేదాంత వాక్య శ్రవణం కంటే మననం వంద రెట్లు గుణవత్తరమైంది. దానికంటే నిధిధ్యాసం లక్షరెట్లు మేలైంది. దీనికంటే నిర్వికల్పం అనంతగుణాలు కలది. మనకు, ఏ స్థాయి అయినా ఈశ్వరానుగ్రహం చేతనే లభిస్తుంది. ఆత్మదర్శనం కలిగిన యోగులు ధన్యులు. వారిని దర్శించుకున్నంత మాత్రాన మనం ధన్యులమవుతాం.



# ౨౨. "మన"లోనే దేవతలు, రాక్షసులు

మన హిందూ మత ప్రధాన గ్రంథరాజమైన శ్రీమద్భగవద్గీతలో శ్రీకృష్ణభగవానుడు అర్జునుణ్ణి నెపంగా చేసి, అనేక ఆధ్యాత్మిక రహస్యాలను మనకు ఉపదేశించాడు. అందులోని వాస్తవ విషయాలను వెలికితీసి, ప్రస్తుత కాలానికి సమన్వయపరచి, అందరికీ సులభంగా తెలియజేయుటే మన ప్రధాన కర్తవ్యం. తెలుసుకున్న విషయాలను ఎవరు ఎంత వరకు ఆచరిస్తారన్నది వారి వారి విజ్ఞతకే వదిలేద్దాం.

శ్రీమద్భగవద్గీతలోని పదునెనిమిది అధ్యాయాలలో పదహారవ అధ్యాయం "దైవాసుర సంపద్విభాగయోగం". దేవతలు, రాక్షసులను రెండు విభాగాలు చేసి వారి వారి గుణాలను భగవానుడు విపులంగా వివరించాడు. మనలో ఈ రెండు విధాలైన గుణాలను కలిగియున్నాం. ఏ గుణాలు అధికంగా ఉంటే వారు ఆ జాతికి చెందినవారని వేరే చెప్ప నవసరం లేదు. ఎవరికి వారికే చక్కగా తెలుస్తుంది. తెలుసుకుని ఏం ప్రయోజనం? విశ్వశాంతిని కోరే మనకు దైవీ గుణాలే అవసరం కదా! రాక్షస గుణాలను తగ్గించుకుని దైవీ గుణాలను పెంపొం దించే ప్రయత్నం చేస్తే మనం బాగుపడతాం. ప్రపంచమూ బాగుపడుతుంది.

మనలో చాలా మంది ప్రశ్నిస్తుంటారు? దేవతలెవరు? ఎక్క డుంటారు? అని. ఎక్కడో కాదు, దేవతలెవరో కాదు, 'మన' లోనే ఉన్నారని చెప్పడానికే దైవాసుర సంపద్విభాగ యోగాన్ని ప్రత్యేకంగా ఉపదేశించాడు భగవానుడు.

**'ద్వౌ భూత సర్గౌ లోకేస్మిన్ దైవ ఆసుర ఏవ చ'** ఈ లోకమున రెండు విధాలైన ప్రాణ సమూహం సృష్టించబడింది. అందులో ఒకటి దైవగణం, రెండవది రాక్షసగణం. ముందుగా దైవగణం యొక్క గుణగణాలను క్షుణ్ణంగా తెలుసుకుందాం.

## దైవీ సంపద

**1. భయం లేకుండా ఉండడం:** మనలో ఎన్నో భయాలు ఆవహించి ఉన్నాయి. ప్రాణభయం అన్నింటికన్నా గొప్పది. రోగ భయం ప్రస్తుత కాలంలో చెప్పనవసరం లేదు. చోర భయం అనగా దొంగల వలన భయం,అగ్ని భయం, భూకంప భయం, వరద భయం మొదలగు భయాలన్నీ మనల్ని పీడిస్తున్నాయి. ఈ భయాలన్నీ లేకుండా నిర్భయులమై ఉండాలి.

2. మన శరీర రథానికి మనస్సు సారథి. మనస్సు ఆనందంగా ఉంటేనే శరీరం బాగుంటుంది. మనస్సు బాగుండడాన్నే చిత్తశుద్ధి అంటారు. చిత్తశుద్ధి తప్పనిసరి అవసరం. చిత్తశుద్ధి సాధనకు అనేక మార్గాలున్నాయి.

3. యోగం అనగా కలయిక అని అర్థం. సద్గురువు లేదా వేద శాస్త్రాలను బోధించిన విషయాలను సాధనతో మనస్సులో అనుభవించుట యోగం అవుతుంది. యోగం అనగానే హఠం మొదలగు కఠినాలు గాక పరమాత్మను ఆత్మ యందు లీనం చేయడమే యోగం.

4. తెలియని విషయాలను తెలుసుకోవడానికి ప్రయత్నించడంతో సరిపోదు. తెలిసిన విషయాలందు సుస్థిరతను సాధించాలి. దీనినే జ్ఞానములందు సుస్థిరత అంటారు. ఇది అనుభవం ద్వారా నెమ్మదిగా సాధించుకోవాలి. సందేహాలు లేకుండా ఉన్నప్పుడే సుస్థిరంగా ఉంటాం. దీనికి సద్గురువును ఆశ్రయించడమే ఉత్తమం. సాధనకు ముందు జ్ఞానం, తర్వాత యోగం ఒకదాని వెంట ఒకటి ఉంటాయి.

5. 'దాన మేవ కలౌయుగే' కలియుగంలో దానమే సర్వశ్రేష్ఠమైంది. దాన గుణం దైవీ సంపదలో ప్రధానం. దానం చేయడానికి ద్రవ్యం కన్నా, దానం చేయాలనే సంకల్పమే మిన్న. ఉన్న వారందరూ దానం చేయలేరు. దాన గుణాన్ని లేనివారు అలవరచుకోవాలి.

6. ఇంద్రియ నిగ్రహం అనగా. దశేంద్రియాల సమూహమైన శరీరాన్ని అదుపులో ఉంచుకోవడానికి ఈ పది ఇంద్రియాలకు అధిష్ఠానమైన మనస్సు అదుపులో ఉంటేనే, శరీరం నిగ్రహించుటకు అవకాశం ఉంది. అందుకే మొదట చిత్తశుద్ధి చెప్పారు.

7. పూర్వం యజ్ఞయాగాదులు చేయడం కఠినంగా ఉండేది. ఈ రోజుల్లో యజ్ఞాలు సులభంగా చేయడానికి వీలుంది. కాని కోరికలతో కాకుండా లోకకళ్యాణార్థం చేయు యజ్ఞం శ్రేష్ఠమైంది. యజ్ఞం చేయించే వారికన్నా చేసేవారే ముఖ్యం.

8. విజ్ఞానం పెరిగింది కాని, శాస్త్ర పఠనం కన్నా, శాస్త్ర విమర్శ కూడా పెరిగింది. శాస్త్ర విమర్శ కొరకు సంపాదించిన విజ్ఞానం వ్యర్థం. శాస్త్ర పఠనం చాలా అవసరం. సంపూర్ణ అవగాహన లేకుండా శాస్త్రాలపై విమర్శ చేసి, అవిశ్వాసాన్ని పెంపొందించుట సమంజసం కాదు.

9. ఏ విషయాన్నైనా, ఏ పనినైనా ఏకాగ్రతతో చేయడం లేదా గ్రహించడం తపస్సు అనబడుతుంది. ప్రతి పనినీ బాధ్యతాయుతంగా, కర్తవ్య నిష్ఠతో చేసిన సంపూర్ణ విజయం కలుగుతుంది. నిర్లక్ష్యానికి ఏమాత్రం తావీయరాదు.

10. మన మాటలోను, ప్రవర్తనలోను సరళత్వం అవసరం. ఎదుటివారికి ఏమాత్రం ఇబ్బంది కలగకుండా, మన పనులు మనం చేసుకుంటూ వెళ్లడం తప్పనిసరిగా అలవరచుకోవాలి. సరళత్వం వల్ల కఠినత్వం పోతుంది. అందరి యందు ప్రేమ భావం కలుగుతుంది.

11. మనోవాక్కాయాలచేత ఎదుటివారిని బాధపెట్టకుండా ఉండడం అహింస. హింసా మార్గానికి పూర్తి వ్యతిరేకం దైవీ సంపద. సద్గుణాలన్నింటిలో శ్రేష్ఠమైంది అహింస. అహింస కలవారికి ప్రాణులన్నీ వశమౌతాయి. శత్రువులు మిత్రులవుతారు. ఇక పోట్లాటలు, యుద్ధాలు అవసరముండవు.

12. ఆడినమాట తప్పకపోవడంతో పాటు అబద్ధమాడకపోతే 'సత్యం' అవుతుంది. ఇతరులకు హాని తలపెట్టని అబద్ధమైనా, ఆడినమాట తప్పినా, ఈ కాలంలో కొంత వరకు సత్యపాలనే అవుతుంది. 'సత్యంవద' అనేది వేదంలో మొదటి వాక్యం. దీనికి అంత ప్రాధాన్యం ఇచ్చారు.

13. కోపం లేకుండా ఉండాలి. సకల అనర్థాలకు కోపమే మూల కారణం. అందుకే కోపాన్ని దరికి రానీయరాదు. కోపంపై కోపం వస్తే మంచిదే కాని, ఇతరులపై కోపం రాకుండా జాగ్రత్తపడాలి. కోప రాహిత్యం అనేది దైవీగుణం.

14. మనకు ఉన్నది లేదా మనకు నచ్చింది వదలడానికి సిద్ధంగా ఉండాలి. అది త్యాగం అవుతుంది. త్యాగం ఉంటేనే దానం చేయగలం. ముందుగానే దానం చెప్పబడింది. త్యాగం సహజంగానే ఉండాలి.

15. 'శాంతి' అనేది కేవలం చెప్పడానికే కాకుండా ఆచరిస్తే విశ్వశాంతి సులభం. శాంతి అనే ఒకే సద్గుణంలో మిగిలిన అన్ని గుణాలు ఇమిడి ఉన్నాయి. ప్రతి ఒక్కరూ శాంతికి ప్రయత్నిస్తే ప్రపంచ శాంతి కలుగుతుంది. ఇది వ్యక్తిగతం కాదు. సామూహికమైంది.

16. మనకందరకు ఇతరుల దోషాలను సులభంగా గమనించడం అలవాటుగా మారింది. దోషాలను ఇతరులలో కాకుండా, మనలోనూ గమనించి వాటి నిర్మూలనకు ప్రయత్నిస్తే, ఇతరుల దోషాలనెన్నడం అనే దుర్గుణం పోతుంది.

17. మన తోటి ప్రాణులందు దయ కలిగి ఉండడాన్నే 'భూత దయ'. మన శరీరంపై ఉండే ప్రేమను ఇతరులు లేదా ఇతర ప్రాణులపై కలిగి ఉంటే భూతదయ సులభమవుతుంది. మన కేది అవసరమో, ఇతరులకు కూడా అది అవసరమని గుర్తించగలగాలి.

18. ఆశ ప్రతి ప్రాణికీ ఉంటుంది. అది దురాశగా మారకూడదు. మన ఆశకై ఇతరులకు నష్టం కలిగించేది దురాశ అవుతుంది. దురాశ ఉండడం వల్లే ప్రాణహాని వరకు దారి తీస్తుంది. దురాశ అనే దుర్గుణాన్ని దరికి రానీయకుండా ఉండడం దైవీ సంపదలో ముఖ్యమైన అంశం.

19. మన మంచి నడవడి వల్ల ఇతరులకు ఏ మాత్రం హాని జరగరాదు. మంచి నడవడినే మృదు ప్రవర్తన అంటారు. సకల సద్గుణ సంపద కలిగినవారికి మృదుప్రవర్తన అనుకోకుండానే ఉంటుంది. అయినా మంచి నడవడి ఉండడానికి ప్రయత్నించాలి.

20. వినమ్రతతో సర్వ కార్యాలను సాధించవచ్చు. అందుకే విద్యతో పాటు వినయం లేనివారు రాణించడంటారు. వినయంగా ఉండే వారిని అందరూ గౌరవిస్తారు. వినమ్రత కలవారినే దైవం రక్షిస్తుంది. ఇది సద్గుణాలన్నింటిని కలిగియున్నవారిగా తెలియజేస్తుంది.

21. చపలత్వం మానవ సహజం. స్థిరత్వం దైవీ సంపద. మనం క్రమేణా చపలత్వం నుండి స్థిరత్వానికి రావాలి. దేశ, కాల, వాతావరణ పరిస్థితులకనుకూలంగా స్థిరబుద్ధి ఉంటే సరిపోతుంది. స్థలం, వృత్తి, వేషం, భాష ముఖ్యం కాదు. మానసిక స్థితి స్థిరంగా ఉండడం దైవీగుణాల్లో ప్రధానం.

22. భయం లేకుండా ఉండడం వేరు, ధైర్యంగా ఉండడం వేరు. శక్తికి మించిన ధైర్యం కాకుండా, అవసరానికి తగిన ధైర్యం తప్పనిసరిగా ఉండాలి. ధైర్యం వల్ల కొన్ని కార్యాలు సులభంగా నెరవేరతాయి. మానసిక బలహీనత ధైర్యం వల్లనే పోతుంది. ధైర్యం గలవారు కొన్ని విజయాలు సాధిస్తారు.

23. సహనానికి మించి సద్గుణం లేదు. ధైర్యంతో పాటు సహనం కూడా అత్యవసరం. ఇది మనకు మనకే పరీక్షలాంటిది. తొందరపాటును దూరం చేసేది సహనమవుతుంది. సహనంవల్ల ప్రాపంచిక కార్యాలేగాక, శాశ్వతానందమైన మోక్షం కూడా లభిస్తుంది. ఇది మనకు రక్ష.

24. చిత్తశుద్ధి వేరు. చిత్త స్థైర్యం వేరు. సహనం కలవారికి చిత్త స్థైర్యం సులభమవుతుంది. చిత్తస్థైర్యంతో ఎంతటి ఘన కార్యాన్నయినా సాధించడమే కాక, ఎంతటి విపత్కర పరిస్థితినైనా తట్టుకోగల సామర్థ్యం కలుగుతుంది. దైవీ సంపదలో చిత్తస్థైర్యానికి కూడా ప్రధానపాత్ర ఉంది.

25. శుచి రెండువిధాలు. బాహ్యేంద్రియ శుచి, అంతరింద్రియ శుచి. స్నానం మొదలగు ప్రక్రియ వల్ల బాహ్య శుచి సాధ్యమవుతుంది. అంతరింద్రియమైన మనస్సు యొక్క శుచికే చిత్తశుద్ధి అని పేరు. చిత్తశుద్ధి గురించి ముందు చెప్ప బడింది. బాహ్యశుచి వల్ల ఆరోగ్యం బాగుంటుంది. సోమరితనం ఉండదు.

26. ఇతరులపై ద్రోహచింత ఏమాత్రం లేకుండా ఉండగలగాలి. ఇది చాలా ప్రమాదకరం. ద్రోహచింత కలవారు వెంటనే శిక్ష అనుభవించాల్సి వస్తుంది. దీన్నే నరకం అన్నారు. అన్ని దుర్గుణాల్లోకెల్లా ద్రోహచింత మొదటిది. ఇది లేకుండా ఉండడం దైవీగుణాల్లో అతి ముఖ్యం.

27. ఎన్ని సద్గుణాలున్నా గర్వం అనే ఒక దుర్గుణం కలిగిందంటే వ్యర్థమే. గర్వాన్ని దగ్గరకు రానీయకుండా ఉంటే మిగతా సద్గుణాలు రక్షింపబడతాయి. గర్వం వల్ల ఎవరికి వారు నష్టపోవడమే గాక, వారి కార్యాలన్నీ నష్టం అవుతాయి. గర్వం రాకుండా జాగ్రత్తపడాలి.

ఈ ఇరవై ఏడు దైవీగుణాలు కలవారే దేవతలుగా పిలవబడతారు. ఈ గుణాల వల్ల మన జీవిత లక్ష్యమైన శాశ్వతానందమనే ముక్తి లభిస్తుంది. ఎవరైనా దైవీ సంపదలోని గుణాలను అలవరచుకోవడానికి ప్రయత్నించడం అవసరం. ఇక రాక్షస గుణ, లక్షణాలను విచారిద్దాం.

**రాక్షస గుణసంపద**

ముఖ్యంగా హింసాప్రవృత్తి, కపటం, గర్వం, అహంకారం, కోపం, గరుకుదనం, అజ్ఞానం అసురసంపదలో ప్రధానమైన లక్షణాలు. ఇవి ప్రధానంగా ఏ వ్యక్తిలో తాండవిస్తుంటాయో వారే రాక్షసులు.

రాక్షస ప్రవృత్తి కలవారికి జన్మసాఫల్యసిద్ధికై ఏది చేయాలో, ఏది చేయకూడదో తెలియదు. శుచిత్వం ఉండదు. సత్ప్రవర్తనకు దూరంగా ఉంటారు. వారియందు సత్యం లేశమాత్రమైనా కనిపించదు. ఈ ప్రపంచం అంతా అసత్యం అంటారు. దేవుడు లేడంటారు. నేనే దేవుణ్ణి అంటారు. నైతిక విషయాలను

కొట్టిపారేస్తుంటారు. వితండవాదం చేస్తారు. కామం వల్ల స్త్రీ పురుషులు కలిస్తే ఈ ప్రపంచం ఏర్పడిందంటారు. ఇతర కారణాలను ఒప్పుకోరు.

దుష్టబుద్ధితో నష్టాలను కలిగిస్తూ ఉగ్రమైన కార్యాలను చేస్తూ ప్రపంచానికి శత్రువులై సర్వనాశనాన్ని కోరుకుంటారు. తీరని కోరికలు కలిగి, కపటభావంతో, అహంకారమదంతో, శరీరం నిండా గర్వం నింపుకుని విర్రవీగుతూ తెలియని బుద్ధి చేత చెడు స్వభావంతో అశ్రద్ధ కలవారిగా తయారవుతారు.

మరణమాసన్నమైనప్పటికీ, ఇతరులు మరణిస్తున్నప్పటికీ వారి కోరికలు నెరవేర్చుకోడానికే ఇష్టపడతారు. కామోపభోగమే వారి పరమార్థం. అది తప్ప వేరే ఏమీ లేదని నిశ్చయించుకుని విచ్చలవిడిగా తిరుగుతూ ఉంటారు. వేలాది కోర్కెలతో దురాశ అనే పాశంతో బంధింపబడి ఉంటారు. కామం, క్రోధం నాట్యం చేస్తూ ఉంటాయి. అన్యాయ మార్గంలో కామాన్ని తీర్చుకుం టూ, డబ్బు సంపాదిస్తూ, ఆనందాన్ని అనుభవిస్తూ ఉంటారు.

ఇతరులను హింసించి తాత్కాలికంగా సంతోషపడడం వారికి వెన్నతో పెట్టిన విద్య. ఇది నాది, ఈ రోజు నాకిది లభించింది, నా కోరిక తీర్చుకుంటాను, ఈ డబ్బంతా నాదే అవుతుందని తృప్తి పడతారు. ఈ శత్రువును నాశనం చేశానని, ఇతర శత్రువులను కూడా సంహరిస్తానని, నేనే సర్వం అని, నా అంతవాడు ఈ ప్రపంచంలో లేనేలేడని, అంతా నేనొక్కణ్ణే అనుభవిస్తానని విర్రవీగుతూ ఉంటారు. తాను మహాబలవంతుడని, సుఖాలన్నీ తనకే కావాలని, తనవల్ల అన్ని పనులూ పూర్తవుతాయని చెప్పుకుంటారు.

నేను శ్రీమంతుణ్ని, నాది మంచి వంశం, నాతో సమానమైన వారు ఈ ప్రపంచంలో ఎవరూ లేరు, నేను యజ్ఞం చేస్తాను, నేను దానం చేస్తాను, నాకే ఆనందం కావాలి అని అజ్ఞానంతో అనేక కోరికలతో చిత్తం చలించగా మూఢుఢనే వలలో చిక్కుకుని కామ భోగాలందు తీవ్రమైన ఆసక్తి కలిగి నరక ద్వారంలో ప్రవేశిస్తారు.

ఆత్మస్తుతి తప్ప వేరే తెలియనివారు, వినయం ఏమాత్రం లేకుండా విద్యుక్త ధర్మాన్ని విస్మరించి ఉంటారు. కపట నాటకంతో దైవకార్యాలాచరిస్తూ పేరు ప్రతిష్ఠలకై ప్రాకులాడతారు. అహంకార, బల, గర్వ, కామ, క్రోధాది దుర్గుణాలతో కూడినవారై ఉండి, ఇతరుల దేహమందు, చివరకు వారి దేహంలో ఉన్న ఆత్మస్వరూపుడైన భగవంతుణ్ణి ద్వేషిస్తారు.

విద్వేషులు, క్రూరులు అశుభమార్గాన్ని అనుసరించేవారైన ఈ నరాధములు రాక్షసరూపులుగానే జన్మిస్తారు. అనేక జన్మలెత్తి నరకబాధలనుభవిస్తూ ఉంటారు. ప్రతి జన్మలో ఇంకా మూఢులై పరమాత్ముణ్ణి చేరక అధోగతి పాలవుతూ ఉంటారు.

ఆత్మవినాశకారకాలైన నరక ద్వారాలు మూడు విధాలు. కామం, కోపం, లోభం. ఈ మూడిటినీ కలిగినవారే రాక్షసులు. పైన తెలిపిన రాక్షస ప్రవృత్తి గలవారు ఈ ప్రపంచంలో ప్రాణులను బాధిస్తూ వారు ఆనందిస్తారు. ఇలాంటి రాక్షస ప్రవృత్తి గల మానవులు ఆయా గుణాలను వదిలివేసి దైవీ గుణాలను పెంపొందించుకుని జీవన్ముక్తులు కావాలని శ్రీకృష్ణ భగవానుడు చెప్పాడు. నరక ద్వారాలైన కామ, క్రోధ, లోభాలను వదిలివేసినవారు శాశ్వతానందాన్నిచ్చే మోక్షాన్ని పొందుతారు. శాస్త్ర విధులను వ్యతిరేకించి ఇష్టానుసారంగా ప్రవర్తించేవారు. ఆనందం పొందరు. వారికి సుఖం కానీ, మోక్షం కానీ లభించదు. కాబట్టి కర్తవ్యాకర్తవ్య నిర్ణయంలో శాస్త్రాలే మనకు ప్రమాణం. శాస్త్రోక్త విధి నిషేధాలను తెలుసుకుని మనం ఈ లోకంలో కర్మలను ఆచరించాలి. దీనివల్ల అందరూ సుఖంగా ఉంటారు.



# 23. నా(లో) ఆత్మ ఎక్కడుంది?

సృష్టిలోని ప్రాణికోటిలో మనం ఒకటి. అన్ని ప్రాణుల్లో సామాన్య సహజ జ్ఞానం ఉంది. కాని విశేష జ్ఞానం మనకుంది. దీన్నే 'విజ్ఞానం' అంటాం. పశు పక్ష్యాదు లన్నీ వాటంతటఅవే ఆహారాన్ని తీసు కుంటాయి. నిద్రిస్తాయి. ప్రేమ, భయాదులను కలిగి ఉంటాయి. సంభోగంతో పిల్లల్ని కంటాయి. మనకు, వాటికి గల తేడా ఒక్కటే. తమకున్న ఇంద్రియాలతో సృష్టిలో లభించే విషయాలను అనుభవిస్తూ ఆనందిస్తాయి. కాని విషయానుభవంతో పాటు విశ్లేషించే పరిజ్ఞానం వాటికి లేదు.

మనం విశ్లేషించి, విశేషంగా తెలుసుకోవలసిన జ్ఞానం కలిగి ఉన్నాం. దీన్ని 'ఆత్మజ్ఞానం' అంటాం. ముందుగా ఆత్మ అంటే ఏమిటో తెలిస్తే, అది ఎక్కడుంటుందో సులభంగా తెలుస్తుంది.

'అత్తి స్వకర్మ ఫలమితివా ఆత్మా' అని ఆత్మ అనే దానికి అర్థం. అనగా– తాను చేయు పనుల యొక్క ఫలితాన్ని అనుభవించునది ఆత్మ. అయితే సృష్టిలోని ప్రాణులన్నీ కూడా చేస్తున్న పని ఇదియే కదా! ప్రతి ప్రాణి ఏదో ఒక పని చేస్తూనే ఉంటుంది. పని చేసినపుడు ఫలితం కలుగుతూనే ఉంటుంది. ఆ ఫలితాన్ని తాను అనుభవిస్తూనే ఉంది. అనగా ప్రతి ప్రాణిలోను 'ఆత్మ' ఉన్నదని నిర్ధారణ అయింది.

ఆత్మ శరీరం లేకుండా ఉండలేదు. ప్రాణం లేకుండా శరీరం ఉండదు. ప్రాణమున్న ప్రతి శరీరంలో ఆత్మ ఖచ్చితంగా ఉంది. నాలో ఆత్మ ఉందా? లేదా? అనే ప్రశ్నకు అవకాశమే లేదు. కాని నాలో ఆత్మ ఎక్కడుంది? అనే ప్రశ్న ప్రతి ఒక్కరినీ వేధిస్తుంది. ఆత్మ అనేది ఒక పదార్థం కాదు. ఆత్మ శుద్ధమైన చైతన్య స్వరూపం.

మన శరీరం అంతా పరిశీలిస్తే– జ్ఞానేంద్రియాలు, కర్మేంద్రియాలు, రక్తం, మాంసం, ఎముకలు, నరాలు, కండరాలు మొదలైనవెన్నో శరీరం లోపలి భాగాలతో నిండిఉంది. ఆత్మ అనేది ఈ భాగాలలో ఉండడానికి అవకాశం లేదు. ఇంత పెద్ద మన శరీరం పని చేయడానికి మనస్సు అనేది అవసరముంది. మనస్సు అనగా ఆలోచించునది. ఆలోచిస్తేనే పని జరుగుతుంది. ఆలోచనలు ఎక్కడ నుండి వస్తున్నాయి? అనే ప్రశ్న వేసుకుంటే శరీరం లోపల నుండే అంటాం. మెదడు అనే భాగం నుండి ఆలోచనలు వస్తాయి. ఈ ఆలోచనలు కనిపించవు. కాని వచ్చేది మాత్రం అందరికీ సహజమే, నిజమే. ఇందులో సందేహం ఏమాత్రం లేదు.

ఆలోచనలనే మనస్సుతో శరీరం పనిచేస్తున్నప్పుడు ఫలితం అనుభవించేది ఎవరు? ఇది చాలా ముఖ్యమైన ప్రశ్న. ఆలోచన లకు అనుభవించే అవసరం లేదు. శరీరానికి ఫలితంతో పని లేదు. గతంలో మనం ఫలితం అనుభవించేది 'ఆత్మ' అని తెలుసుకున్నాం. మనస్సు ఎప్పుడూ అనగా అలసిపోయేంత వరకూ ఆలోచిస్తూనే ఉంటుంది. అలాగే శరీరం కూడా అలసిపో యేంత వరకు పనిచేస్తూనే ఉంటుంది. మరి పనియొక్క ఫలితాన్ని అనుభవించేది 'ఆత్మ' తప్ప వేరుగాదని సారాంశం.

ఈ 'ఆత్మ' శరీరంలో ఎక్కడుంది? అనేది చిక్కు ప్రశ్న. ఎందుకంటే ఆలోచించే మనస్సు మెదడులో ఉందనుకుంటున్నాం. ప్రాణం హృదయంలో ఉంది అంటారు. మరి ఆత్మ ఉండే స్థానం గుర్తించడం చాలా కష్టం. ఆత్మకు శరీరంతో సంబంధం ఉంది కాని, శరీరం ఆత్మ కాదు. మనస్సుకు శరీరానికి సంబంధం ఉంది కాని మనస్సు ఆత్మ కాదు. ప్రాణం ఉన్నంత వరకే శరీరం పనిచేస్తుంది కాని ప్రాణం ఆత్మ కాదు. అంటే శరీరం, మనస్సు, ప్రాణం ఈ మూడింటి కంటే వేరైనది 'ఆత్మ' అని అర్థం.

ఆత్మ లేకుండా శరీరం లేదని ముందే తెలిసింది. శరీరం లోపల మనస్సుకు దగ్గర ప్రాణంతో సంబంధం లేకుండా ఆత్మ ఉందని తెలుస్తుంది. ఆలోచించే మనస్సుకు కూడా రూపం లేదు. ఇది పదార్థం కాదు కాబట్టి ఆత్మకు మనస్సుకు

దగ్గరి పోలికలున్నాయి. "ఆత్మనే మనస్సై ఆలోచిస్తుంది. బుద్ధిగా మారి నిశ్చయిస్తుంది. చిత్తంగా మారి ఏకాగ్రతతో ఉంటుంది. అహంకారం రూపంలో శరీరంతో పనులు చేయిస్తుంది."

ఆలోచించినపుడు మాత్రమే ఆత్మ మనస్సుగా ఉంటుంది. ఆలోచనలు లేకుండా, శరీరం పనులు చేయకుండా ఉన్న స్థితిలో 'ఆత్మ' కర్మసాక్షిగా దర్శనమిస్తుంది.

నా(లో) ఆత్మ ఎక్కడుంది? అనే ప్రశ్నకు సమాధానం లభించింది. మనమంతా రోజూ ఒకసారి ఈ ప్రశ్నను వేసుకుంటే మనకే సమాధానం లభిస్తుంది.

ప్రతి ప్రాణిలో ఉన్న ఆత్మ యొక్క పరమాత్మ యొక్క అంశ. ఆత్మ అనేది శరీరంలో ఉంటుంది. పరమాత్మ అనునది సర్వాంతర్యామిగా అంతటా ఉంది. ఆత్మ శరీరాన్ని ఏవిధంగా ఆశ్రయించి ఉందో, అదేవిధంగా పరమాత్మ సృష్టిని ఆశ్రయించి ఉంది. శరీరంలో ఉన్న ఆత్మ, సృష్టి లోని పరమాత్మ వేరుగాదు. ఒక్కటే!

ఆత్మనే పరమాత్మ, పరమాత్మనే ఆత్మ. ఆత్మ యొక్క ఉనికి శరీరాన్ని ధరించినపుడే తెలుస్తుంది. సృష్టి ఉంటేనే పరమాత్మ యొక్క ఉనికి తెలుస్తుంది. శరీరానికి పరిమితమైన వయస్సు ఉంది. అనగా ఇది కొంత కాలమే ఉ ంటుంది. కాని ఆత్మ ఎల్లప్పుడూ ఉంటుంది. ఇక్కడ ఒక సందేహం? మన శరీరంలోని ఆత్మ ఎల్లప్పుడూ ఉంటే, ఇప్పుడున్న శరీరం పోయిన తర్వాత ఎక్కడుంటుంది? వేరే ఏ శరీరం ధరిస్తుంది? అనే ప్రశ్నలు రాక మానవు.

ఇటువంటి ప్రశ్నలన్నింటికీ సమాధానాలు మనకు శ్రీకృష్ణ భగవానుడు బోధించిన శ్రీమద్భగవద్గీతలో లభిస్తాయి. వాస్తవానికి మనం చేయవలసిన పని ఇదే. ఆత్మజ్ఞాన సాధనమే నిజమైన విజ్ఞానం. దీనికి వయస్సుతో నిమిత్తం లేదు. స్త్రీ పురుషులెవరైనా ఆత్మ ఒక్కటే. ఆత్మకు లింగభేదం లేదు.

ఎవరికి విశ్వాసం, శ్రద్ధాసక్తులుంటాయో వారికి దీనియందు అభిరుచి కలుగుతుంది. మన పెద్దల ఆశీస్సులతో, దైవానుగ్రహంతో సాధ్యమైనంత మేరకు విజ్ఞానాన్ని పెంచుకోవడానికి ప్రయత్నించాలి. మనకు మనమే ప్రశ్నలు

వేసుకోవాలి? సమాధానాలు వెతకాలి! అప్పుడే జ్ఞానోదయం అవుతుంది. మనల్ని మనమే ఉద్ధరించుకోవాలి. మిగతావారు శ్రేయోభిలాషులు, మిత్రులు, గురువులు సహకరిస్తారే తప్ప, జ్ఞానానందాన్ని, మోక్షాన్ని కలిగించలేరు. ఆత్మ ద్వారా ఆత్మలోనే ఆనందాన్ని అనుభవించడమే మోక్షం. మన జన్మ లక్ష్యం మోక్షమే. ప్రపంచంలో అన్నింటి కంటే గొప్ప సుఖం ఏది లేదు.

ఏ సుఖమైనా ఎల్లప్పుడూ ఉండదు. మనకు ఎల్లప్పుడూ సుఖాన్నిచ్చేది ఒక్క మోక్షం తప్ప వేరే లేదు. ఇది ఎవరికి వారికే తెలుస్తుంది. వేరే ఎవరూ దీన్ని చూపలేరు. గాఢనిద్ర మనకు సుఖాన్నిస్తుంది. దీన్ని ఒకరు మరొకరికి ఎలా చూపలేరో అదేవిధంగా మోక్ష సుఖాన్ని కూడా ఇవ్వలేరు.

జ్ఞానం ద్వారానే మోక్షాన్ని పొందగలం. జ్ఞాన సాధన చాలా సులభం. అందరిలో జ్ఞానం ఉండనే ఉంది. దాన్ని కేవలం నిత్యానుభవంలో ఉపయోగించడమే మనం చేయవలసిన పని. ఇందుకు వేదాంతం నేర్చుకోవలసిన పనిలేదు. బ్రహ్మవిద్య అని భయపడవద్దు. చెప్పే వారిని అనుసరించి చేసేవారుంటారు.



# 24. ఆత్మోపదేశం

**'ఆత్మోపదేశం' సర్వ దుఃఖ నివారణం**

**మనస్సు:** ఓ ఆత్మదేవా! ప్రస్తుత కలికాలంలో నా ముందున్న సమస్యలన్నింటివల్ల నాకు విపరీతమైన భయం కలుగుతుంది. ఏ పనిచేయలేకున్నాను. ఏమీ తోచడం లేదు. అనవసరమైన భ్రమకు లోనైనాను. నేను ఇక్కడ ఒక్క క్షణం కూడా ఉండలేను. నిత్యం ఏదో ఒక కొత్త సమస్యతో సతమతమవుతున్నాను.

మహాప్రభో! ఎటుచూసినా అధర్మమే. ఈ సమస్యలను కష్టపడి సాధించినా మేలు కలుగుననిపించుట లేదు. నాకు ఏ సుఖమూ అక్కర్లేదు. ఈ సంసారంలో ప్రయోజనం శూన్యమే. నేను ఎవరు సుఖపడాలని కోరుకున్నానో, వారు ఈ లోకంలో ఉండడం లేదు. పెద్దలంతా స్వర్గస్తులయ్యారు. ఉన్నవారు ఎప్పటివరకుంటారో తెలియదు. అందరూ పోయిన తర్వాత సుఖపడేది ఎవరు? ఎవరి కొరకు నేను కష్టపడి ఈ సమస్యలను సాధించాలి? మీరే చెప్పండి.

అయ్యా! భయంకరమైన వర్ణసంకరంతో రోజురోజుకీ కులక్షయం పెరిగిపోతుంది. కులనాశనం వల్ల కలిగే కష్టాలు అపారం. మనం ఈ పాపానికి దూరంగా ఉంటేనే మంచిదనిపిస్తుంది. సనాతన కులధర్మాలన్నీ నాశనమవుతున్నాయి. ధర్మం లేని కులంలో ఉండి ఏం ప్రయోజనం? పాపాలు తప్ప మిగిలేవి ఏమీ లేవు. కుల స్త్రీలు నిందలపాలవుతున్నారు. రోజురోజుకీ పాపాలు దావానలంలా పెరిగిపోతున్నాయి. ఎక్కడ చూసినా అన్యాయం, అక్రమం, అవినీతి తాండవిస్తున్నాయి. హత్యలు, అత్యాచారాలు పెరిగిపోతున్నాయి. పాపాలన్నింటిలో వర్ణసంకరానికి మించిన పాపం లేదు కదా!

కులమంతా నరకానికి వెళ్లవలసిందేనా! శ్రాద్ధకర్మలు సక్రమంగా జరగకపోతే పితృదేవతలు అధోగతి పాలవుతారేమో! వర్ణ సంకరానికి మూలమైన ఈ దోషం

వల్ల కులధర్మాలు, జాతిధర్మాలు నశిస్తాయి కదా! కుల ధర్మం పాటించని వారికి ఎట్టి పరిస్థితిలో నరకం మాత్రం తప్పదు. అయ్యో! ఈ పాపకృత్యాలు నేను చేయలేను. చూడలేను. ఇది అంతా దారుణంగా ఉంది. ఈ సంసార జీవనం నా వల్ల కాదు. నన్ను వదిలి పెట్టండి మహాప్రభో!

**ఆత్మ :** మనసా! తగని సమయంలో నీకు ఈ మోహం ఎలా దాపురించింది? ఇది మంచి పద్ధతి కాదు. దీనివల్ల నీకు అటు స్వర్గసుఖం రాదు. ఇటు కీర్తిప్రతిష్ఠలు రావు. పిరికితనం వదిలిపెట్టు. ధైర్యంగా ఉండు. నీ వెనుక నేనున్నాను. తుచ్ఛమైన దుర్బలాన్ని విడిచిపెట్టి, సమస్యలను పరిష్కరించే మార్గం ఆలోచించు. సమస్యలకు భయపడి బంగారు భవిష్యత్తును నాశనం చేసుకుంటావా? జీవితం అమూల్యమైంది. దీన్ని నీవు సద్వినియోగం చేసుకోవాలి.

**మనస్సు:** ఓ ఆత్మగురూ! మా పూజ్యులైన పెద్దలంతా వెళ్ళిపోయారు. నేను ఉండి ఏం సాధించాలి? అధర్మంతో కూడిన ఈ సమస్యలతో పోరాడడం కంటే, బిచ్చమెత్తుకుని జీవించడం నయమనిపిస్తుంది. ఎందరినో మోసం చేసి, ఎవరితోనో మోసగింపబడి జీవితం గడపడం వల్ల ఏం లాభం? ఈ పోరాటం వల్ల ఏ ప్రయోజనమో నాకు అర్థం కావడం లేదు. ధర్మాధర్మ విచక్షణకు దూరమైన నేను కర్తవ్యాన్ని నిర్ణయించుకోలేకున్నాను. నాకు నిజంగా ఏది మంచిదో తెలియడం లేదు.

నేను నీవాడను స్వామీ! నాకు ఏది మంచిదో తెలపండి! మిమ్ము శరణు వేడుచున్నాను. నాకు వేరే గత్యంతరం లేదు. మీరు ఉపదేశించినా లేదా ఆదేశించినా నేను శిరసావహిస్తాను. నా దుఃఖాన్ని పోగొట్టే మార్గం బోధించండి. దుఃఖం వల్ల మిగతా ఇంద్రియాలన్నీ పనిచేయడం లేదు. ఏమీ తోచకున్నది. ఎంత శ్రీమంతం, ఎన్ని సుఖాలున్నా ప్రయోజనం ఏమాత్రం లేదు. నాకు ఇప్పుడు కావలసింది ఒక్కటే నా దుఃఖం దూరం గావటమే. దానికి మీరొక్కరే తగినవారు. తొందరగా ఆ ఉపాయం సెలవియ్యండి!

**ఆత్మ:** ఓ ప్రియమైన మనసా! శ్రద్ధగా విను!

నీవు ఏడువదగని వారికై ఏడుస్తున్నావు. పైగా ఎంతో తెలిసినవారివలె మాట్లాడుతున్నావు. జ్ఞానులు అనగా బాగా తెలిసినవారు చనిపోయినవారి

గూర్చి ఏడవరు. అంతేగాదు బ్రతికియున్న వారి గూర్చి కూడా ఏడవరు. నీవూ, నేనూ, ఈ కనిపిస్తున్న వారందరూ, ఇంతవరకు పోయినవారూ కూడా ఎప్పుడూ ఉండేవారే సుమా! మనమంతా ఇంతకు ముందున్నాం, ఇకముందుంటాం. అన్ని కాలాల్లోనూ మనం ఉన్నాం. ఇది బాగా దృష్టిలో పెట్టుకుని ఏడవడం మానుకో!

**మనస్సు:** ఆత్మదేవా! మీరు చెపుతున్నది ఎంతవరకు సమంజసం? ఎలా నమ్మమంటారు? నాతోనున్న శరీరం నశిస్తుంది కదా! చనిపోయిన తర్వాత ఈ శరీరాన్ని కాల్చడమో లేదా పూడ్చడమో చేస్తారు. ఇది మనందరికీ తెలిసిన విషయమే. మరి మీరేమో మనమందరం ఎల్లప్పుడూ ఉంటున్నాం అని అంటున్నారు. అది ఎలా సాధ్యం? దయచేసి నా సందేహాన్ని నివారించండి!

**ఆత్మ:** ఓ మనసా! నీవు అడిగిన ప్రశ్న సమంజసమైందే. నీ సందేహాలను తీర్చడానికే కదా నేనున్నది. జాగ్రత్తగా విను మరి. నీ శరీరానికి పసితనం, యవ్వనం, ముసలితనం ఎలా ఉన్నాయో, అలాగే మరొక శరీరం కూడా ఉంది. ఈ విషయాన్ని నమ్మినవారే సుఖపడతారు. ధైర్యవంతులకు వ్యామోహం అనేది ఏమాత్రం ఉండదు.

అసలు ఏం జరుగుతుందంటే? ఇంద్రియాలకు ప్రకృతిలోని విషయాలు కలవడం వల్ల చలి, వేడి, సుఖం, దుఃఖం మొదలగునవి అన్నీ కలుగుతున్నాయి. ఇవి వస్తుంటాయి, పోతుంటాయి. ఎల్లప్పుడూ ఉండవు. వాటిని అనుభవించాలే తప్ప, బాధపడవద్దు. తెలిసినవారెవరైనా సుఖదుఃఖాలను సమానంగా చూస్తారు. వీరికి ఇంద్రియ, విషయాల కలయిక వల్ల ఎలాంటి బాధలుండవు. మోక్షం పొందడానికి కూడా వీరే అర్హులౌతారు. ఎల్లప్పుడూ ఉండేవి నిజమైనవి. ఉండనవి నిజం కావు. ఎల్లప్పుడూ ఉండేది ఏది? ఉండనివి ఏవి? అనే విషయా లను బాగా అవగాహన చేసుకున్నట్లయితే నీకిక ఎలాంటి దుఃఖం ఉండదు. ఇది బాగా తెలిసినవారినే జ్ఞానులంటారు.

**మనస్సు:** అయ్యా! మీరు ఎల్లప్పుడూ ఉండేది, ఉండంది అని చెబుతున్నారు కదా. అవి ఏవేవో నాకు అర్థమయ్యేట్లు సవివరంగా చెప్పండి. వినాలని ఎంతో

ఉత్సాహంగా ఉన్నాను. ఇంతవరకు నాకు విపులంగా ఎవ్వరూ చెప్పలేదు. మీరే తప్పక అన్ని విషయాలు వరుసగా సెలవియ్యండి.

**ఆత్మ:** నేను పరమాత్మ అంశనైనా, నాకూ, పరమాత్మకు తేడా లేదు. నేనూ పరమాత్మ ఒక్కటే. పరమాత్మ సృష్టి అంతా వ్యాపించి ఉంది. నేను జీవాత్మగా సకల ప్రాణుల్లో చైతన్యంగా ఉన్నాను. పరమాత్మకు గాని, పరమాత్మ అంశనైన నాకు గాని నాశనం లేదు. ఎల్లప్పుడూ ఉండే నన్ను ఎవ్వరూ నాశనం చేయలేరు. నాయనా! ఇంద్రియాలకు కనిపించేవన్నీ, ఈ శరీరాలన్నీ ఎల్లప్పుడూ ఉండవు. తప్పక నశిస్తాయి. ఇందులో సందేహమే లేదు. కాని నేను మాత్రం ఎట్టి పరిస్థితుల్లోనూ నశించను. ఎల్లప్పుడూ ఉంటాను. నా గురించి చెప్ప డానికి ఎవరికీ సాధ్యం కాదు. ఇప్పుడు నీ పని నీవు చేయాల్సిందే. నేను నీకు సాక్షిగా మాత్రమే ఉంటాను.

ఇంకా విను! నేను ఎవ్వరినీ చంపను. ఎవ్వరి చేత చావను. ఇది తెలియనివారే అజ్ఞానులు. నాకు పుట్టుక లేదు. చావులేదు. నేను పుట్టి ఉండను. నాకు నీలాగా ఎలాంటి మార్పులుండవు. ఎల్లప్పుడూ ఉంటాను. అనాదిగా అనగా ఎప్పటినుండో ఉంటూ వస్తున్నాను. శరీరం పోయినా, నేను మాత్రం పోను. నాకు నాశనం అనేదే లేదు. మార్పులు లేనివారికి చావు పుట్టుకలుండవు. తెలిసిందా!

ఇదే విషయం నీకు సులభంగా అర్థం కావడానికి, ఉదాహరణలతో వివరిస్తాను. నీవు బాగా అర్థం చేసుకుంటే ఇక ఎప్పుడూ కూడా నిన్ను ఏ దుఃఖం బాధించదు. నీ పని నీవు సక్రమంగా చేస్తావు. ఇంకా తెలుసుకోవాల్సింది చాలా ఉంది. నీకు ఏమాత్రం సందేహమున్నా నన్ను నిర్భయంగా అడుగు! సాధ్యమైనంత త్వరగా నీ సందేహాలన్నీ పటాపంచలవుతాయి. ముఖ్యంగా సమయం వృథా చేయకు సుమా! సందేహాలున్నాయి గనుక నీవు మనస్సైనావు. అన్నీ తెలుసు కాబట్టి నేను ఆత్మను.

**మనస్సు:** ఆత్మదేవా! ఎల్లప్పుడూ ఉండే నిజమైన దాని గూర్చి వివరంగా చెపుతామన్నారు. నాకు సులభంగా అర్థమగుటకు ఉదాహరణలతో వివరిస్తామన్నారు కదా! నేను దుఃఖంలో ఉన్నా కూడా మీరు చెప్పే విషయాలు ఆశ్చర్యాన్ని కలిగిస్తూ, ఆసక్తిని పెంచుతున్నాయి. దయచేసి సంపూర్ణంగా తెలపండి!

**ఆత్మ:** మనసా! నిజమే. నీకు నిజమైన విషయాలను బాగా అర్థం చేయించుట నా బాధ్యత. శ్రద్ధగా విను! చినిగిన బట్టలు తీసేసి, కొత్త బట్టలు వేసుకున్నట్టే, నేను పాత శరీరం వదిలి, కొత్త శరీరంలోకి వెళ్తాను. దీనికి ఇంతకంటే ఉదాహరణ ఇంకొకటి లేదు. నన్ను తూటాలు కాల్చలేవు. బాంబులు పేల్చలేవు. నిప్పు కాల్చదు. నీరు తడపదు. గాలి ఆర్పేయదు. నేను వీటన్నింటికీ అతీతుడను. నేను మళ్ళీ నీకు ఘంటాపథంగా చెబుతున్నాను. నేను ఎల్లప్పుడూ ఉంటాను. నన్ను కాల్చడానికి, పేల్చడానికి, తడపడానికి, ఆర్పివేయడానికి, తగ్గించడానికి, పెంచడానికి ఎవరికీ సాధ్యం కాదు. నాకు చలనం లేదు. స్థిరంగా ఉంటాను. అనాదిగా ఉన్నాను.

**మనస్సు:** అయ్యా! మిమ్ము ఎలా చూడగలం? మీ నివాసం ఎక్కడ? ఏవిధంగా తెలుసుకోగలమో తొందరగా చెప్పండి?

**ఆత్మ:** మనసా! నేను ఎవరికీ కనిపించను. నీ ఇంద్రియాల ద్వారా నన్ను చూడలేవు. తెలుసుకోలేవు. నాలో ఎలాంటి మార్పులుండవని ఇంతవరకు చెప్పాను. కనుక నీవు దుఃఖపడవద్దు. ఒకవేళ నీవు నాకు చావుపుట్టుకలు కలవని అనుకున్నా ఏడ్చుట మాత్రం పనికిరాదు. ఎందుకంటే పుట్టినవారు చావక తప్పదు. చచ్చినవారు తిరిగి పుడతారు. ఇది సృష్టి నియమం. నాయనా! దీని గూర్చి ఏడ్చిన ఏ ప్రయోజనం ఉండదు. పుట్టిన ప్రాణులన్నీ పుట్టకముందు కన్పించవు. చచ్చిన తర్వాత కూడా కన్పించవు. ఈ చావుపుట్టుకల మధ్య కాలంలోనే కన్పిస్తాయి. కేవలం కొద్దికాలమే కలిసి ఉండేవారికై బాధ ఎందుకు? బాధపడినా ప్రయోజనం లేదు కదా!

**మనస్సు:** అయితే మిమ్ము ఎవరెవరు ఎలా చూస్తారు? ఆ చూసే వారిని ఏమంటారు? వారిపుడున్నారా? నేను అలా కాగలనా? అయినా చెప్పండి! శ్రద్ధగా వింటాను.

**ఆత్మ:** మంచి ప్రశ్న వేసావు. మనసా! ఇది తప్పకుండా వినవలసిందే. అందరిలో ఏ కొందరు మాత్రమే నన్ను ఆశ్చర్య కరంగా చూస్తారు. మరికొందరు నా యొక్క తత్త్వాన్ని వర్ణిస్తారు. ఇంకొందరు ఆశ్చర్యకరంగా వింటారు. ఆ విన్న

వారిలో కొందరు మాత్రమే నా గూర్చి తెలుసుకుంటారు. అనగా నన్ను చూచుట అందరికీ సాధ్యం కాదు. ధ్యానసాధనచే జ్ఞానులు మాత్రమే నన్ను చూడగలుగుతారు. ఈ విషయాలు ముమ్ముందు నీవు తెలుసుకోగలుగుతావు.

అన్ని శరీరాలందున్న నన్ను ఎవ్వరూ చంపలేరు. కనుక ఎవ్వరికొరకైనా ఏడ్వవద్దు. నీ ధర్మాన్ని నీవు సక్రమంగా పాటించాలి. ధర్మమార్గంలో నడవాలి. నీ భాధ్యతలు నీవు విడిచి పెట్టరాదు. పూర్వజన్మ పుణ్య విశేషం చేత ఇప్పుడు నీకు ఈ అవకాశం లభించింది. దీన్ని సద్వినియోగం చేసుకోవాలి. సంసార బాధ్యతలు సక్రమంగా నిర్వర్తించకుంటే పాపం వస్తుంది. నరకానికి వెళ్తావు. లోకంలో అపకీర్తి వస్తుంది. లోకమంతా నిన్నే చూస్తుంది. నీ బంధువులు, మిత్రు లు, ఇతరులంతా నీ అపకీర్తిని మరిచిపోరు. యోగ్యులైన వారికి అపకీర్తి ఎక్కువ బాధ కలిగిస్తుంది. ప్రస్తుతం నీకు కొంత యోగ్యత లభించింది. ఈ లభించిన యోగ్యతను కాపాడుకో! పిరికివాడివై పారిపోతే ఎలా? నీ మీద ఆధారపడ్డ వారు ఏమవుతారు? వారి గతి ఏంటి? సంసార బాధ్యత సక్రమంగా నిర్వర్తిస్తే స్వర్గం లభిస్తుంది. ఇక్కడ కావలసినంత సుఖం ఉంటుంది. నీవు లాభనష్టాలను, సుఖదుఃఖాలను, గెలుపు ఓటములను సమానంగా చూడాలి. దీనివల్ల పాపాలు నీకు కలగవు. భయం ఉండదు. ఇదంతా జ్ఞానానికి సంబంధించిన విషయమన్నమాట. దీన్నే కర్మమార్గ పద్ధతిలో కూడా నీకు అర్థమయ్యేట్టు చెబుతాను విను!

**మనస్సు:** ఓ ఆత్మగురుదేవా! మీరు చెప్పింది విన్న తర్వాత కొంత జ్ఞానం లభించింది. కాని ఇంకా కర్మవైపు వెళ్ళాలనిపించడం లేదు. ఇందాక మీరు చెప్పిన కర్మమార్గం కూడా తెలుపండి స్వామీ!

**ఆత్మ:** మనసా! నీకు కర్మమార్గమే మూలం. దీనికి వ్యతిరేక ఫలితాలుండవు. దీన్ని సాధన చేస్తే ఈ సంసార మహాభయం నుండి రక్షింపబడతావు. కర్మమార్గానికి కావలసింది నిశ్చయబుద్ధి ఒక్కటే. కాని సంసార సుఖాలకే బానిసలైన వివేకహీనుల బుద్ధి చంచలం అవుతుంది. కోరికల వెంట పరుగులు తీస్తే ఎలా? ఒక ఆధారం లేకుండా, లెక్కలేనన్ని కోరికల వెంబడి వెళ్తావు. సంసార సుఖాలందే

తలమునకలవుతావు. వేదాల్లో చెప్పే కర్మఫలాలు కావాలని ఇష్టపడతావు. పైకి చెప్పే అర్థం గాకుండా, అంతరార్థం తెలుసుకోవాలి.

స్వర్గసుఖమే గొప్ప అనుకుంటున్నావు. ఈ లోకంలో లభించే ఐశ్వర్యాలే ఎల్లప్పుడూ ఉంటాయనుకుంటావు. ఈ క్షణిక సుఖాలైన ఆస్తిపాస్తులు, మిద్దెమేడలు, కామసుఖాలు నిన్ను ఆకర్షిస్తున్నాయి కదూ! ఇవి ఎల్లప్పుడూ ఉండవు. వీని గూర్చి సకామకర్మలు అనగా యజ్ఞయాగాదులు, నోములు, వ్రతాలు, తీర్థయాత్రలు, దేవాలయ దర్శనాదులు చేస్తావు. ఇవన్నీ నన్ను తెలుసుకొనేవిగావు. వేదాలు ఏం చెబుతున్నాయో విను! సత్త్వం, రజస్సు, తమస్సు అనే మూడు గుణాలతో కూడిన సమస్త సుఖాల గూర్చి, వీటిని పొందడానికి కావలసిన ప్రక్రియల గూర్చి తెలుపుతున్నవి. నీవు ఆ సుఖభోగాలు గాని అవి పొందడానికి చేసే ప్రక్రియలనూ వదిలిపెట్టు.

సుఖ దుఃఖాలకు అతీతుడవు కమ్ము. ఎల్లప్పుడూ ఉండే నా యందే నీవుండు. నీ యొక్క బాగోగోలకై ఆందోళనపడకు. నిన్ను నీవే స్వాధీనం చేసుకో. నిన్ను నీవే లోబరుచుకో.

**మనస్సు:** అయ్యా! అంతా వింతగా ఉంది. మీరు చెప్పేది నాకు పూర్తిగా అర్థమయ్యే విధంగా వివరించండి స్వామీ!

**ఆత్మ:** అయితే శ్రద్ధగా విను! అన్నివైపులా నీటితో నిండియున్న పెద్ద జలాశయం అందుబాటులో ఉన్నవారికి చిన్న చిన్న నీటి గుంటల వల్ల ఏమి ప్రయోజనం? అలాగే నన్ను పొంది పరమానందాన్ని అనుభవించు బ్రహ్మజ్ఞానానికి కూడా వేదాల వల్ల అంతే ప్రయోజనం. నీవు నీకున్న ఇంద్రియాలతో చేయవలసిన పనిని తప్పక చేయవలసిందే. ఎప్పటికీ వాటి ఫలాలందు అధికారం లేదు. కర్మఫలానికి నీవు హేతువుకారాదు. కర్మలను మానుటకు వీల్లేదు. ఫలితాలందు ఆసక్తి లేకుండా, పనియందే బుద్ధి నుంచి, పనులను చేస్తుండాలి. ఈ స్థితి నీకు రావాలంటే ముందుగా యోగస్థితుడవు కావాలి. అనగా నీవు ఎల్లప్పుడూ నన్ను మరువకుండా ఉంటే యోగస్థితుడవు అవుతావు. ఈ సంసారంనందు ఆసక్తిని విడిచిపెట్టాలి. లభించిన దానితో తృప్తిపడాలి. లభించని దాని గురించి

ఆరాటపడవద్దు. రెండింటియందు సమభావమే కలిగియుండాలి. చేయవలసిన పనులను వదిలిపెట్టకుండా ఉండడాన్నే 'యోగం' అంటారు.

కోరికలతో చేసే పనులకంటే, సమత్వబుద్ధియోగం చాలా శ్రేష్ఠమైంది. మనసా! నీవు ఈ సంసారంలో ఉన్నంతకాలం సమత్వబుద్ధి, యోగాన్నే అభ్యాసం చేసుకో! దీనికి మించిన వేరే ఉత్తమ మార్గం లేదు. ఎందుకంటే? కోరికలను దృష్టియందుంచుకుని చేసే పనుల యొక్క ఫలితంపైనే ఆసక్తి కలిగి పనులు చేయువారు అత్యంత దీనులు.

**మనస్సు:** ఓ ఆత్మదేవా! ఈ సమత్వబుద్ధి యోగాన్ని ఎలా సాధించాలి? దీనివల్ల మోక్షం లభిస్తుందా? దయతో తెలపండి?

**ఆత్మ:** మనసా! చాలా మంచి ప్రశ్న వేసావు. నేను నీకు ముందు అదే విషయం చెబుదామనుకున్నాను. ఇంతవరకు చెప్పిన సమత్వబుద్ధి యోగం సాధించినచో పుణ్యపాపాలు రెండూ ఈ లోకంలోనే విడిచిపెడతాం. అంటే నీకు కర్మఫలాలు అంటవు. నీవు చేసిన పనుల వల్ల వచ్చే మంచి, చెడు ఫలితాలు నిన్ను బాధించవు. ఇదియే కర్మ కౌశలం. ఎవ్వరైనా దీనిని ఆశ్రయించవలసిందే. నీవు కూడా శ్రద్ధగా విను. మెల్ల మెల్లగా సమత్వబుద్ధి యోగాన్ని ఆశ్రయించు. కర్మబంధం నుండి విడుదలగుటకు ఇది రాజమార్గం. సమబుద్ధిగల జ్ఞానులు కర్మఫలాన్ని వదిలి ఈ జనన, మరణ రూప సంసారం నుండి ముక్తులవుతారు.

నీవు తప్పక సమత్వయోగం ద్వారా మోక్షాన్ని పొందగలవు. ఇందులో సందేహమే లేదు. ఇంకా నీవు వికారం లేని పరమ పదాన్ని పొందుతావు. కర్మయోగ రహస్యమే ఇది. సమత్వబుద్ధి గలవారే జ్ఞానులు. చేసే పనుల వల్ల వచ్చే ఫలితంపైనే ఆసక్తి కలిగి యుండడమే మోహం. ఈ మోహం అనే ఊబి నుండి నీవు బయటపడాలి.

మోహాన్ని వదిలితే ఇంతవరకు నేను చెప్పినవి, ఇకముందు నేను చెప్పబోయేవి ఇహపరలోక సంబంధమైన సమస్త భోగాల నుండి విడుదల కాగలవు. ఈ సమత్వయోగం సాధించాలంటే అయోమయాన్ని వదలాలి. పలురకాలైన మాటలు వినడంవల్ల చలించిన నీవు నా యందు నిశ్చలంగా,

స్థిరంగా ఉండాలి. నాతో నీకు శాశ్వతమైన సంయోగం ఏర్పడాలి. అప్పుడే నీకు సమత్వబుద్ధి యోగం వస్తుంది. నిన్ను సంసార బాధలు ఏమీ చేయలేవు.

**మనస్సు:** ఆత్మదేవా! నిన్ను చేరిన వారి స్థితి ఏవిధంగా ఉంటుంది? అట్టివారి లక్షణాలు ఏవి? అతను ఏవిధంగా మాట్లాడతాడు? ఏవిధంగా అతని ప్రవర్తన ఉంటుందో తెలుసుకోవాలనుంది స్వామీ!

**ఆత్మ:** ఓ మనసా! ఇది చాలా ముఖ్యమైన విషయం. తప్పక నీకు తెలియాలి. నీలో కోరికలు పూర్తిగా లేక నాయందు నీవున్న స్థితిలో ఆత్మానందం లభిస్తుంది. ఆత్మద్వారా ఆత్మను పొందే స్థితి ఇది. ఇదియే స్థితప్రజ్ఞ స్థితి. ఈ స్థితిలో దుఃఖాలకు క్రుంగిపోరు. సుఖాలు కలిగినప్పుడు పొంగిపోరు. దేనిపైనా ఆసక్తి లేకుండా ఉంటారు. భయాన్ని, కోపాన్ని వదిలి ఉంటారు. ఎల్లప్పుడు మనస్సులో ఆత్మనే గుర్తుంచుకుంటారు. ఒకదాని యందు ప్రేమ, మరొకదాని యందు ద్వేషం ఉండదు. అనుకూల పరిస్థితుల్లో సంతోషం ఉండదు. వ్యతిరేక పరిస్థితులందు దుఃఖం ఉండదు. ఇట్టి స్థితిలోనున్న వారిని స్థితప్రజ్ఞులని అంటారు. ఇంకా ఈ లక్షణాలను ముమ్ముందు తెలుసుకుందాం.



# 25. ఈశావాస్యమిదం సర్వం

"భగవంతుడు పరిపూర్ణుడు. ఈ లోకం పరిపూర్ణమైంది. పరిపూర్ణుడైన భగవంతుని నుండే పరిపూర్ణమైన ఈ లోకం ఉద్భవించింది. పరిపూర్ణం నుండి పరిపూర్ణతను తీసివేసిన తర్వాత కూడా పరిపూర్ణమే మిగిలి ఉంటుంది."

మార్పు చెందే స్వభావం గల ఈ లోకంలో ఉన్న సమస్తమూ శక్తివంతమైన చైతన్యంతో నింపబడింది. ఈ భావంతో లోకాన్ని అనుభవించాలి. ఎవరి ధనాన్ని ఆశించవద్దు.

శక్తివంతమైన చైతన్యాన్నే పరమాత్మ అని, భగవంతుడు అని, ఈశ్వరుడు అని అంటున్నాం. శక్తివంతమైన చైతన్యం మార్పు చెందదు. ఈ శక్తివంతమైన చైతన్యం నుండి ఉద్భవించిన సృష్టి అంతా ఎల్లప్పుడూ మార్పు చెందుతుంది.

సమస్త సృష్టిలోని మనమూ మార్పు చెందుతూనే ఉన్నాం. మార్పు చెందే సృష్టిని ఆశ్రయించి దుఃఖాలను అనుభవిస్తున్నాం. సృష్టి మనకు ఎల్లప్పుడు సుఖాన్నిస్తుందని అనుకుంటున్నాం. సృష్టిలో జరిగే మార్పులు మనకు కొన్ని సుఖాన్నిస్తున్నాయి. కొన్ని దుఃఖాలను కలుగజేస్తున్నాయి. కాని మనం కోరుకునేది ఎల్లప్పుడూ సుఖంగా ఉండాలని కదా! అయితే సృష్టిలో మనకు ఎల్లప్పుడూ సుఖాన్నిచ్చే మార్పులుండవు.

ఎల్లప్పుడూ సుఖాన్ని పొందే మార్గం ఒక్కటే! మార్పు చెందని శక్తివంతమైన చైతన్యం నుండి ఏర్పడిన సృష్టిని ఆశ్రయించకుండా, నమ్ముకోకుండా మనం ఎల్లప్పుడు మార్పు చెందని శక్తివంతమైన చైతన్యాన్ని ఆశ్రయిస్తే, నమ్ముకుంటే మనకు ఎల్లప్పుడు సుఖం లభిస్తుంది. మనం ప్రశాంతంగా ఉండగలం.

మార్పులు చెందే ప్రపంచంలో జీవిస్తూనే దీన్ని వదిలి వేయాలి. ఇది ఎలా సాధ్యం? అనిపిస్తుంది. కాని మన మహాత్ములంతా ఇది సాధించి చూపించారు.

సృష్టిలోని ప్రతి అణువులో శక్తివంతమైన చైతన్యం నిండి ఉందని భావించమంటారు. మనకిక మార్పులు చెందే సృష్టితో బాధ ఉండదు.

మనలో కూడా శక్తివంతమైన చైతన్యమే దాగి ఉంది. సృష్టిలోని చైతన్యమే వ్యక్తి చైతన్యమైంది. ఈ రెండింటికీ ఏమాత్రం తేడా లేదు. రెండూ ఒక్కటే. అంతా ఒక్కటే అయినపుడు బాధలు, దుఃఖాలుండవు. రెండవది ఉన్నప్పుడే మనకు బాధ. అంతా మనమే అయిన తర్వాత మనం దేన్ని ఆశించలేం. ఇతరులున్నారనే భావనుంటే కదా! వారి ధనాన్ని ఆశించడానికి? ఈ భావనను మనం మన మనస్సులో అనుక్షణం దృఢపరచుకుంటూ జీవిస్తే, మనం ఎవరి ధనమూ ఆశించం. సృష్టిలోని ప్రతి అణువణులో పరమాత్మ ఉన్నాడనే భావనను నిరంతరం దృఢపరచుకోవడమే శాశ్వత సుఖానికి మొదటిమెట్టు.

సృష్టి అంతా పరమాత్మ నిండియున్నాడనే భావన దృఢమైనప్పుడు మనం ఎవరి ధనాన్ని కాని, వస్తువుగాని కోరుకోకుండా ఉండడం రెండవది.

మనం నివసించే లోకంలో కొన్ని కర్మలు చేస్తున్నాం. కొన్ని బాధ్యతలు నిర్వహిస్తున్నాం. తద్వారా కొన్ని ఇబ్బందులను ఎదుర్కొంటున్నాం. మనం చేయవలసిన కర్మలను మాత్రమే చేయాలి. ధర్మబద్ధమైన కర్మలు మాత్రమే ఆచరించాలి. ప్రస్తుత కాలానుగుణంగా, ఇతరులకు ఏమాత్రం ఇబ్బందిని కలుగ జేయని కర్మలే ధర్మబద్ధమైనవి. మనం ఇతరులకు ఉపకరించే కర్మలు చేయలేకపోయినా, ఇబ్బందిని కలిగించే కర్మలు చేయుటనే అధర్మమవుతుంది. ఇవి చేయకుండా ఉండగలగాలి.

ధర్మబద్ధమైన కర్మలను ఆచరిస్తూ, నూరేండ్లు జీవించడమే మన కర్తవ్యం. ధర్మబద్ధమైన కర్మల వల్ల మనకు ఎలాంటి ప్రమాదం లేదు, అవి మనల్ని బాధించవు. బంధానికి కారణం కానే కావు. ధర్మబద్ధమైన కర్మల వల్ల లోకానికి ఉపకారమే జరుగుతుంది, కాని అపకారం మాత్రం జరగదు.

ఈ లోకంలో జన్మించిన మనకు ఇది తప్ప వేరే మార్గం లేదు. సంసారంలో కర్తవ్యాలు కొన్ని మనకు తప్పవు. విధిగా వానిని చేయవలసిందే. కర్తవ్యాలను నిర్వహిస్తూనే, విహిత కర్మలను ఆచరించుటయే ధర్మం. ఈవిధంగా లోకాన్ని

అనుభవిస్తూ జీవితం గడపాల్సిందే. జీవితంపై నిరాశ, నిస్పృహలు పనికిరావు. అత్యాశ, దురాశలు కూడా పనికిరావు. ఎల్లప్పుడూ ఏదో ఒక పనిలో నిమగ్నమై ఉండితీరాలి. సోమరితనాన్ని తరిమికొట్టాలి. సత్ఫలితం తప్పక లభిస్తుంది.

సృష్టిలో అంతా మంచే ఉండదు. మంచి, చెడు రెండూ ఉంటాయి. చెడు అంతా రాక్షస స్వరూపమే. రాక్షసులుండే స్థలాలన్నీ కూడా దట్టమైన చీకటితో ఉంటాయి. అవినీతిపరులు, ఆత్మహంతకులు, ఇతరులను మోసం చేసేవారు, ఇతరులను ఇబ్బందులకు గురిచేసి ఏడ్పించేవారు, అబద్ధాలాడేవారు, ఆడినమాట తప్పేవారంతా రాక్షసులే. వారంతా దట్టమైన చీకటి ఉండే ప్రాంతాలకు చేరుకుంటారు.

తమ శరీరాన్ని మాత్రమే సుఖపెట్టాలనుకునే వారంతా రాక్షసులు, దుర్మార్గులనబడతారు. వీరు ఆత్మ గూర్చి ఆలోచించరు. ఆత్మనే శరీరం అనుకుంటారు.

ఆత్మకు చలనం లేదు. మనస్సు కంటే వేగవంతమైంది. అది ఒక్కటిగానే ఉంటుంది.

ఇంద్రియాలతో ఉంటుంది, కాని ఇంద్రియాలతో దానిని పొందలేం. అది స్థిరంగా ఉంటూనే అన్నింటికన్నా ముందు వెళుతుంది.

కదిలే వస్తువులన్నింటికన్నా వేగవంతమైన కదలిక ఉన్నందున మనం గుర్తించడం కష్టం. స్థిరంగా ఉండడం వల్ల ప్రాణాన్ని రక్షిస్తుంది, పని చేయిస్తుంది. ఆత్మ చలిస్తుంది. కదలకుండా ఉంటుంది. దూరంగా ఉంటుంది. దగ్గరగా కూడా ఉంటుంది. అది అన్నింటి లోపలా ఉంది. అన్నింటి వెలుపల కూడా ఉంది.

**యస్తు సర్వాణి భూతాన్యాత్మన్యేవానుపశ్యతి ।**
**సర్వభూతేషు చాత్మానం తతో న విజుగుప్సతే ॥**

ఎవరు సకల జీవరాశులను ఆత్మలోను, ఆత్మను సకల జీవరాశులలోను దర్శిస్తారో వారు ఎవరినీ ద్వేషించరు.

అంతా చైతన్యమే అవహించి ఉందని తెలిసిన తర్వాత ఏకాత్మభావం వస్తుంది. ఈ భావంలో స్థిరపడినచో మనం ఎవరినీ ద్వేషించం, ఎవరినీ బాధించం. ఎప్పుడూ దుఃఖించం. దేనిపై వ్యామోహం ఉండదు.

ఇది ఒక దివ్యమైన అనుభూతి. దీన్ని అనుభవంలోకి తెచ్చుకుంటే తెలుస్తుంది. ఇతరులకు చెప్పడానికి, వ్రాయడానికి తేలికగానే ఉంటుంది. కాని స్వానుభవంలోకి రావడం చాలా కష్టం. పూర్వజన్మ సుకృతం కావాలి. మహానుభావుల ఆశీస్సులుండాలి. దైవానుగ్రహం పొందాలి.

ఈ విషయం చెప్పేవారికి, వ్రాసేవారికి అనుభవంలో ఉండాలని లేదు. కాని అందరం చేయాల్సిన పని అదేనని గుర్తు చేసుకోవడం అవసరం. మనకు శాంతి కావాలంటే మనం మన పరివారం అంతా శాంతంగా ఉండాలి. వ్యక్తి శాంతి కావాలంటే లోకశాంతి కావాల్సిందే.

ప్రపంచం అంతా శాంతియుతంగా ఉండాలని కోరుకుంటే, తప్పక శాంతి లభిస్తుంది. శాంతియుతమైన వాతావారణం నెలకొనడానికి మనమే కారణం. మనం ముందుగా ఆత్మశాంతికి ప్రయత్నించాలి. ముందుగా మన భావంలో మార్పు రావాలి. తర్వాత ఎదుటివారి భావంలో తప్పక మార్పు వస్తుంది. సృష్టి మార్పులతో కూడి వుండడం వల్ల మనకు మార్పులు సహజం. మంచి మార్పు కోసం మనం ప్రయత్నించాలి.

శక్తివంతమైన చైతన్యాన్ని ఆశ్రయిద్దాం. శాశ్వత సుఖాన్ని పొందుదాం!



## ౨౬. శ్రీ పరంధామ రహస్యం

శ్రీమద్భగవద్గీతలోని 18 అధ్యాయాల్లో అత్యంత రహస్యమైన అధ్యాయంగా 15వ అధ్యాయమైన "పురుషోత్తమ యోగాన్ని" శ్రీకృష్ణ భగవానుడు స్వయంగా మన కోసం బోధించాడు.

**శ్లో ॥ ఇతి గుహ్యతమం శాస్త్రం ఇదముక్తం మయానఘ ।**
**ఏతద్బుద్ధ్వా బుద్ధిమాన్ స్యాత్, కృతకృత్యశ్చ భారత ॥**

(శ్రీమద్భగవద్గీత - 15 అ. 20 శ్లో.)

శ్రీకృష్ణ భగవానుడు అర్జుననుద్దేశించి-

"అనఘా! నేను నీకు ఈ అతి రహస్యమైన శాస్త్రాన్ని బోధించాను. అర్జునా! ఈ తత్త్వాన్ని గ్రహించిన యోగి బుద్ధిమంతుడు, కృతకృత్యుడు అవుతాడు" అన్నాడు.

14వ అధ్యాయమైన గుణత్రయ విభాగ యోగాన్ని పూర్తిగా వివరించిన తర్వాత 15వ అధ్యాయమైన ఈ పురుషోత్తమ యోగాన్ని బోధించాడు. ఇందులోగల అత్యంత రహస్యమైన విషయాలేమిటో సంపూర్ణంగా తెలుసుకుని మనం కృతకృత్యులమవుదాం!

"సాక్షాత్తూ పురుషోత్తముడే సెలవిచ్చిన పురుషోత్తమ యోగమిది"

**శ్లో ॥ ఊర్ధ్వమూల మధశ్శాఖం అశ్వత్థం ప్రాహురవ్యయమ్ ।**
**ఛందాంసి యస్య పర్ణాని యస్తం వేద స వేదవిత్ ॥** (15-1)

అనే శ్లోకంతో 'పురుషోత్తమ యోగం' ప్రారంభమైంది. ఇందులో కేవలం 20 శ్లోకాలు మాత్రమే ఉన్నాయి. గీతసారమంతా ఇందులోనే ఇమిడి ఉంది. ఇదియే **పరమపద సోపానం.**

జగత్ సృష్టికి, జీవసృష్టికి కారణాన్ని, విధానాన్ని మనకు సులభంగా అవగాహన యగుటకు భగవానుడు ఒక చక్కని ఉదాహరణను తెలియజేశాడు. అదియే అశ్వత్థ వృక్షం అనగా రావిచెట్టు. దీన్ని మనం అందరం చూచియే యున్నాం. చూస్తూనే ఉన్నాం. సహజంగా లోకంలో, రావిచెట్టేగాదు ఏ చెట్టైనా భూమిలో వ్రేళ్ళుంటాయి. పైకి కాండం, కొమ్మలు, ఆకులు, చిగుళ్ళుంటాయి. కాని పరమాత్మ చెప్పిన వృక్షం మాత్రం –

పైకి వ్రేళ్ళున్నాయి. క్రిందకు కాండం కొమ్ములున్నాయి. ఈ చెట్టు ఎప్పుడు పుట్టిందో తెలియదు. ఎప్పుడు పోతుందో తెలియదు. కర్మలను బోధించే వేదాలన్నీ ఆకులుగా తెలుసుకున్నవారే వేదార్థాలను తెలిసినవారవుతారట.

ఇక్కడ పైకి వ్రేళ్ళంటే (మూలం) 'పరమాత్మ'. జగత్తును సృజించుటకు అవ్యక్తమైన మాయాశక్తితో కూడిన పరబ్రహ్మమే. ఇక జీవ సృష్టికి మూలం ఆత్మ. పరబ్రహ్మం యొక్క అంశనే జీవాత్మ. ఇది మనలో పైననే ఉంటుంది కదా! ఇక కాండం అంటే జగత్తుకు సృష్టికర్తయైన 'బ్రహ్మ' అవుతాడు. మనలో 'బుద్ధి' అవుతుంది. ఈ చరాచర జగత్తుగాని, జీవులు గాని ఎప్పుడు మొదలైందో తెలియదు. ఎప్పుడు ముగుస్తుందో తెలియదు. మన కర్మలకు కారణమైన వేదాల్లోని 'కర్మకాండ' అంతా కూడా ఈ వృక్షానికి ఆకులని అన్నారు. 'బుద్ధిః కర్మానుసారేణ' అన్నట్లుగా బుద్ధి ద్వారా వచ్చే కర్మలన్నీ ఆకులే అవుతాయి.

వృక్షానికి గల కొమ్మలన్నీ జగత్తులో జీవులు, జీవునిలో ఇంద్రియాలు. వీనికి గుణ సమ్మేళనం వల్ల అనగా సత్త్వ, రజో, తమోగుణాలైన గుణత్రయం వృద్ధి అవుతున్న కొలదీ ఇంద్రియ ప్రవృత్తులైన రూపరసాది విషయాలనే చిగుళ్ళు పుట్టుకొస్తున్నాయన్నారు. ఇవి పైకి, క్రిందికే పాదుకొని ఉంటున్నాయి.

ఈ వృక్ష స్వరూపాన్ని ఎవరూ సరిగా అర్థం చేసుకోవడం లేదు. మనకు సంపూర్ణంగా బోధపడడం లేదు.

ఈ వృక్షానికి చివరగాని, మొదలుగాని, మధ్యగాని, స్థితిగాని లేవు. తెలుసుకోలేం. ఈవిధంగా అంతులేకుండా ఎదుగుతున్న వృక్షాన్ని 'అనాసక్తి' అనే అయుధంతో త్రెంచివేయమన్నాడు భగవానుడు.

తర్వాత ఎక్కడకు చేరితే మనం తిరిగి రామో, ఆ బ్రహ్మ పదం, 'పరంధామం' అన్వేషించాలి. అలాగే ఎవరి నుండి అనాదియైన ఈ సృష్టి ప్రవాహం మొదలైందో ఆ మొట్టమొదటి పరమపురుషుణ్ణి ఆశ్రయించాలి. అట్టి 'పరమపదం' అందరికీ లభించదు.

అహంకారం, దురభిమానం లేనివారు, అవివేకాన్ని జయించినవారు, ప్రపంచ విషయాలందు ఏమాత్రం ఆసక్తి లేనివారు, పరమార్ధ జ్ఞాననిష్ఠులైన వారు, ఏ కోరికలు లేనివారు, సుఖదుఃఖాలకు అతీతులైన వారు, జ్ఞానులు మాత్రమే ఆ అక్షయమైన 'పరమపదాన్ని' పొందుతున్నారు.

"దేనిని పొందితే తిరిగి రారో అదే పరంధామం" శ్రీకృష్ణ భగవానుడే పరంధామం యొక్క స్వరూపం. ఆ పరమపదాన్ని రవి, చంద్రుడు, అగ్ని మొదలగునవేవి ప్రకాశింపచేయజాలవు.

**శ్లో ॥ మమైవాంశో జీవలోకే జీవభూతః సనాతనః ।**
**మనః షష్ఠానీంద్రియాణి ప్రకృతి స్థాని కర్షతి ॥** (15-7)

"ఈ మనుష్య లోకంలో సనాతనమైన నా అంశయే జీవులలోని ఆత్మయైంది. మనస్సుతో కలిసి జ్ఞానేంద్రియాలైన ఐదు, మొత్తం ఆరు ఇంద్రియాలను ప్రకృతిలోని విషయస్థానాలు ఆకర్షిస్తున్నాయి" అని భగవానుడన్నారు. జీవులలోని అనగా మనలోని ఆత్మ విషయవాసనలను ఆకర్షింపబడినపుడు మనస్సుగా మారుతుంది. మనస్సు ఇంద్రియాలను ప్రేరేపిస్తుంది. ఇంద్రియాలు వాటి విషయాలకు బానిసలవుతున్నాయి. ఆత్మకు విషయ వాసనలంటవు. మనస్సే మలినమవుతుంది. శరీరానికి స్వామియైన జీవుడు ఎప్పుడు దేహాన్ని పొందినా, ఎప్పుడు వదిలినా, గాలివలె అనగా మంచి వాసన వచ్చే కేంద్రాల నుండి గాలి ఏవిధంగా సువాసనను గ్రహించి అందిస్తుందో అదే మాదిరిగా ఆత్మరూపంలో ఉన్న జీవుడు ఇంద్రియాలను గ్రహించి వెలువడుతున్నాడు.

ఈ జీవాత్మ చెవిని, కన్నును, చర్మాన్ని, నాలుకను, ముక్కును, మనస్సును ఆశ్రయించి రూప, రసాది విషయాలను ఆస్వాదిస్తున్నాడు. ఇది మనకు నిత్యానుభవమే.

దేహాన్ని వదిలిన, వదులుతున్న జీవుణ్ణి, శరీరంలో ప్రకాశవంతమైన జీవాత్మను, ప్రకృతిలోని విషయాలను అనుభవిస్తున్న జీవుణ్ణి, గుణత్రయాలలో నిమగ్నుడైన జీవుణ్ణి అజ్ఞానులు చూడజాలరు. కేవలం జ్ఞానదృష్టి కలవారు మాత్రమే చూడగలరు. జ్ఞానదృష్టి కలవారినే యోగులంటారు. అట్టి సమాహిత చిత్తులైన యోగులే ఈ ఆత్మను తమ ఆత్మగా, సాక్షిరూపంగా దర్శిస్తారు.

అశుద్ధచిత్తులైన అవివేకులు ఎంత ప్రయత్నించినా ఈ ఆత్మను చూడజాలరు. ఎల్లప్పుడు ఆత్మను దర్శించువారే యోగులనబడతారు.

'నేను' ఎవరనుకున్నావు? "సూర్యుని యందు గల ఏ తేజస్సు విశ్వాన్నంతటినీ ప్రకాశింపజేస్తుందో, చంద్రునిలో ఏ చల్లదనం ఇచ్చే ప్రకాశం కలదో, అగ్నిలోని ఏ తేజ పుంజం ప్రకాశిస్తుందో ఆ 'జ్యోతి'ని 'నాది'గా తెలుసుకోమంటాడు" భగవానుడు.

అట్టి పరమాత్మనే ఐశ్వర్యమైన శక్తితో భూమిలో ప్రవేశించి, ఈ చరాచర ప్రపంచాన్ని ధరిస్తున్నాడు. అంతేగాదు రసస్వరూపియైన చంద్రుడై, సకల ఓషధులను పోషిస్తున్నాడు. అందుకే మనం భోజనం చేసే ముందు ఈ శ్లోకాన్ని పఠిస్తుంటాం.

**శ్లో ॥ అహం వైశ్వానరో భూత్వా ప్రాణినాం దేహమాశ్రితః ।**
**ప్రాణాపాన సమాయుక్తః పచామ్యన్నం చతుర్విధమ్ ॥** (15-14)

ఈ శ్లోకాన్ని సాక్షాత్తూ శ్రీకృష్ణ పరమాత్మ మనల్ని ఉద్ధరించడానికి ఉపదేశించాడు.

"నేను జఠరాగ్నినై జీవుల శరీరాన్ని ఆశ్రయించి, ప్రాణాపాన సమాన వాయువులతో కూడి భక్ష్య, భోజ్య, లేహ్య, చోష్యాలనే నాలుగు విధాలైన అన్నాన్ని స్వీకరిస్తున్నాను (భుజిస్తున్నాను)" అని భగవానుడే స్వయంగా సెలవిచ్చాడు. తన్ను తాను మన ద్వారా తెలుసుకోవడానికి చేసే నిత్య ప్రయత్నమిదియని మనం తెలుసుకోవాలి.

"నేను అందరి హృదయాల్లో ప్రకాశిస్తున్నాను. 'పిపీలికాది బ్రహ్మ పర్యంతం' సర్వ ప్రాణుల్లో విరాజమానమై ఉన్నాను. నా నుండి మరపు, తెలివి, జ్ఞాపకం

కలుగుతున్నాయి. నేనే నాలుగు వేదాలుగా ఉన్నాను. తెలుసుకోబడదగినవాణ్ణి నేనే. వేదాంత స్వరూపాన్ని నేనే. వేదార్థవేత్తను కూడా నేనేనని స్పష్టం చేశాడు పరమాత్మ."

ప్రతిది మనం 'నాది' యని, ఏది చేసినా 'నేనే'నని అనుకోవడం అవివేకమే. మనం సృష్టికర్తలంగాదు. సృష్టి పోషకులంగానే గాదు. లయకర్తలం ఎంతమాత్రం గాదు. ఇది పరమాత్మ దయతో ఇచ్చిన 'తోలుబొమ్మ'. ఆయన ఆడించినంతసేపు ఆడవలసిందే. మనచేతిలో ఏమీలేదు గాని మనం చేయవలసింది, నేర్చుకోవల్సింది చాలా ఉంది. మన జీవిత సమయంలో పరమాత్మను చేరకపోతే జన్మ వృథా అవుతుందని మరచిపోవద్దు. మనల్ని మనం తెలుసుకోవడమే సాధన.

లోకంలో పురుషులు రెండు రకాలు. పురుషులు అనగానే మనం వాడుకలో ఉన్నట్లుగా లింగ భేదంతో వాడే స్త్రీపురుషులు కాదు. మగవారిని మాత్రం పురుషులనడం సహజంగా ఉంది. పైన తెలిపిన పురుషులంటే శరీరం అనే పురంలోనున్న జీవులను పురుషులంటారు. ఈ పురుషులు క్షరులు, అక్షరులు అని రెండు విధాలుగానున్నారు. లోకంలో నశించేవారంతా క్షరులని, నశింపని కూట రూపంలో స్థిరంగా ఉన్న పురుషుడు అక్షరుడని అర్థం.

ఈ క్షరాక్షరులకంటే వేరైన 'పురుషోత్తముడు' (పరబ్రహ్మం) పరమాత్మయని పిలుస్తాం. ఆ పురుషోత్తముడు నశింపడు, చరాచర సృష్టిని పోషిస్తాడు. ముల్లోకాల్లో అంతర్యామిగా ప్రవేశించి పాలిస్తున్నాడు. పురుషోత్తముడు నశించే పురుషులకు అతీతుడు. ఈ సృష్టికి మూలకారణమైన కూటస్థ రూపంలో ఉన్న అక్షర పురుషుని కంటే శ్రేష్ఠుడైనందువల్లనే లోకంలోను, వేదాల్లోను, పురుషోత్తముడని ప్రసిద్ధుడైనాడు. ముందు చెప్పిన అశ్వత్థమనే సంసార వృక్షం మాయామయమైంది. దీనికి మూలకారణం పురుషోత్తముని మాయాశక్తి. ఈ రెంటినీ మనం నమ్మి మోసపోకుండా ఈ రెంటి ద్వారానే మనం పురుషోత్తముణ్ణి చేరుకోవాలనేది 'పురుషోత్తమయోగసారం'.

మొట్టమొదట మనం అభిమానాన్ని వదిలివేయాలి. అనాసక్తితో ధర్మబద్ధమైన కర్మలనాచరిస్తుండాలి. ప్రాణమున్నంతవరకు కాలానుగుణమైన వ్యవహారం

సాగిస్తూ, మనల్ని మనం పోషించుకుంటూ, మనపై ఆధారపడిన కుటుంబాన్ని చక్కగా పోషించాలి. ఆ పరమాత్మ స్వరూపమైన పరంధామాన్ని చేరుకోవడానికి ఇంతకంటే సులభోపాయం, రహస్యం వేరేలేదు.

ఆత్మరూపంలో పురుషోత్తముడున్నాడు. ఇందులో సంశయం వద్దు! నశిస్తాం! ఏమాత్రం భ్రమపడవద్దు. మోసపోతాం. అడుగడుగునా జాగ్రత్త అవసరం.

ఆత్మలో పురుషోత్తముణ్ణి దర్శించువారే ఎల్లప్పుడు పరమాత్మను భజిస్తారు, సేవిస్తారు. చివరకు సర్వజ్ఞత్వాన్ని పొంది, పరమపద సోపానం ద్వారా 'పరంధామాన్ని' చేరుకుంటారు.

శ్రీమద్భగవద్గీతలోని 15వ అధ్యాయమైన పురుషోత్తమ యోగసారమే 'శ్రీ పరంధామ రహస్యం'. దీన్ని ప్రతినిత్యం పఠనం చేస్తూ, మననం చేస్తూ సాధన నిరంతరం చేసే వారికి శాశ్వతానందం లభిస్తుంది. అవసరానికి కావలసినవన్నీ సమకూరుతాయి. సమస్యలన్నీ పటాపంచలవుతాయి. శత్రువులు మిత్రులవుతారు. మనశ్శాంతి సంపూర్ణంగా లభిస్తుంది. ఆరోగ్యంగా ఉంటాం. లోకకళ్యాణ మవుతుంది.



# 27. శ్రీ మహాకాల మాహాత్మ్యం

**శ్లో ॥ కాలాదుత్పద్యతే సర్వం కాలాదేవ విపద్యతే ।**
**న కాల నిరపేక్షం హి క్వచిత్కించిద్ధి విద్యతే ॥**

(శ్రీశివమహాపురాణము)

సర్వం కాలం వలన పుట్టి, కాలం వల్లనే నశిస్తుంది. కాలసంబంధం లేంది ఏదైనను, ఎక్కడైనను లేదు. కాల యొక్క నోటిలో చిక్కుకున్న బ్రహ్మాండ మండలం అంతయు సృష్టి మరియు ప్రళయం అనే రెండు అవధుల మధ్యలో చక్రంవలె నిరంతరంగా తిరుగుతుంది.

కాలాన్ని నిర్ధారించే భాగ్యాభాగ్యాలను బ్రహ్మ, విష్ణువు, రుద్రుడు మరియు ఇతరులగు దేవతలు, రాక్షసులు కూడా అతిక్రమింప సమర్థులు కారు. మిక్కిలి భయంకరమగు కాలం తనను తాను భూత, వర్తమాన, భవిష్యత్తులనే మూడు విభాగాలుగా చేసి మనలను ముదుసలిగా మార్చి సర్వాధికారాలను చేజిక్కించుకున్న పాలకునివలె యధేచ్ఛగా ప్రవర్తిల్లుతుంది. ఈ కాల భగవానుడు ఎవరు? ఈ కాలం ఎవరి వశంలోనుంది? దీనికి వశం కానివారు ఎవరు? అనే ప్రశ్నలు వచ్చినపుడు వీటికి సరియైన సమాధానాలను పరిశీలించాలి.

**శ్లో॥ కలాకాష్ఠానిమేషాది కలా కలిత విగ్రహమ్ ।**
**కాలాత్మేతి సమాఖ్యాతం తేజో మహేశ్వరం పరమ్ ॥**

పరమేశ్వరుని సర్వో త్కృష్టమగు తేజస్సే కళ, కాష్ట, నిమేషం, ప్రస్తుత కాలంలో సెకను, నిమిషం, గంటలు మొదలైన కాలావయవాలతో విరాజిల్లుచూ 'కాలాత్మ' అని పిలువబడుతూంది. ఈశ్వరుని బలం అనదగిన కాలం సమస్తమైన చరాచర జగత్తు నిరాకరించ శక్యం కాని, ఈశ్వరుని ఆదేశమై యుంది. కాలమే సకల జగత్తును నియంత్రిస్తుంది. ఆ పరమేశ్వరుని శక్తి యొక్క అంశంలోని

అంశమే నిప్పులను గ్రక్కే ఇనుప ముక్కవలె ఆయన నుండి బయటకు వచ్చి గొప్పదియగు కాలపురుషరూపంగా సంక్రమించింది. కావున జగత్తు కాలం యొక్క ఆధీనమై యుంది.

**"కాలాఽధీనం జగత్సర్వమ్"**

కాలం జగత్తు వశంలో లేదు. కాని కాలం పరమేశ్వరుని వశంలో ఉంది. ఆ పరమేశ్వరుడే మహాకాలుడు. మహాకాలుడు మాత్రమే కాలం వశంలో లేడు. ప్రతిఘటింప శక్యం కాని పరమేశ్వరుని తేజస్సు కాలంనందు ప్రతిష్ఠితమైంది. కాలం యొక్క పరిధి చాలా గొప్పది. మనం ఎవరం కాలాన్ని అతిక్రమించలేం.

మన సూక్ష్మబుద్ధి యొక్క ప్రభావం చేత కాలాన్ని అతిక్రమించ సాధ్యం కాదు. కాలంచే సంక్రమించు కర్మఫలాన్ని ఎవ్వరం తప్పించుకోలేం. ఎవరైనా తన పరాక్రమంతో భూమండలాన్నంతటిని ఏకచ్ఛత్రాధిపత్యంగా పాలించినను, సముద్రాలు చెలియకట్టనువలె కాలాన్ని వశం చేసుకోలేరు. ఇంద్రియ సమూహాన్ని నిగ్రహించి, సకల జగత్తును జయించినవారైనను కాలాన్ని మాత్రము జయించలేరు. కాలమే అట్టివారిని జయిస్తుంది. వైద్య, విజ్ఞాన విద్వాంసు లెవరైనను, గొప్ప రసాయనాలను తయారుచేస్తారు కాని కాల స్వరూపమైన మృత్యువును అతిక్రమించలేరు. కాలం ఎంతటివారికైనను ఏ పరిస్థితుల్లోను చిక్కదు గాక చిక్కదు. మనము ఐశ్వర్యం, సౌందర్యం, శీలం, బలం, కులం, సంఘం మొదలైన వానిని ఆధారంగా చేసుకుని ఒకటి తలిస్తే, కాలం బలవంతంగా మరొకటి చేయిస్తుంది.

మహాకాలుడైన పరమేశ్వరుడు మనందరకు ప్రియమైనవి, అప్రియమైనవి అగు వస్తువులతో లేదా వ్యక్తులతో అను కోకుండా సంబంధమేర్పరచి, తిరిగి వియోగాన్ని కలిగిస్తున్నాడు.

ఒక కాలంలో కొందరు దుఃఖిస్తున్నారు. అదే కాలంలో మరికొందరు సుఖిస్తున్నారు. ఆహా! కాల ప్రభావము ఎంత విచిత్రంగా ఉందో చూడండి! బాలురు యువకులగుతున్నారు. యువకులు వృద్ధులగుతున్నారు. బలవంతుడు దుర్బలుడగుతున్నాడు, ధనవంతులు దరిద్రులవుతున్నారు. కాలంయొక్క

మార్పులు చిత్రంగా ఉన్నాయి. ఒక వ్యక్తి జన్మించిన వంశం యొక్క మహిమగాని, శీలం, బలం, నైపుణ్యం, మహాత్మ్యంగాని ఒక కార్యాన్ని సాధించుటకు సరిపోవు. కాలాన్ని ఆపగలవారు లేరు. ఇకముందు ఉండబోరు.

గొప్ప దాతలు, సంగీత విద్వాంసులు, మహాత్ములు, అనాథలు, భిక్షాటన చేయువారందరియందు కాలం సమానంగా తన ప్రభావాన్ని చూపిస్తుంది. శాస్త్రీయంగా తయారుచేయబడిన ఎంత గొప్ప ఔషధాలైనా, కాలం పరిపక్వం కానిదే పనిచేయవు. కాని, కాలం కలిసి వచ్చినపుడు అవే ఔషధాలు వెంటనే ఆరోగ్యాన్ని కలిగిస్తాయి.

మనం కాలం కలిసిరాకుండగా పుట్టం, మరణించం, బలాన్ని పొందలేం. సుఖంగాని, దుఃఖంగాని కలుగవు. ఈ చరాచర ప్రపంచంలో కాలాన్ని పరిపక్వం చెందకుండా ఏ వస్తువు అయినా వ్యక్తి అయినా లభించవు. కాలాన్ననుసరించే చలి గాలులు వీస్తాయి. వర్షాలు కురుస్తాయి. వేడి ఏర్పడుతుంది. పంటలు పండుతాయి. పాడి సమృద్ధిగా ఉంటుంది. పాడిపంటలు లేకుండా పోవడానికి కూడా కాలమే కారణం. మనందరి సుఖ దుఃఖాలకు మూలకారణం కాలమే.

**శ్లో ॥ ఇత్థం కాలాత్మనస్తత్త్వం యో విజానాతి తత్త్వతః ।**
**కాలాత్మానమతిక్రమ్య, కాలాతీతం స పశ్యతి ॥**

ఎవరైతే కాలపురుషుని యొక్క తత్త్వాన్ని, యథార్థాన్ని బాగుగా తెలుసు కొంటారో, వారు పరమేశ్వరుని స్వరూపమైన కాలాన్ని అతిక్రమించి, కాలా తీతుడైన మహాకాలుని దర్శిస్తారు.

ఎవరికి కాలంగాని, బంధంగాని, మోక్షంగాని లేవో, ఎవరు పురుషుడు గాని, ప్రకృతి గాని, జగత్తుగాని కారో, అట్టి విచిత్రమగు విశ్వరూపం గలవాడు మంగళకరుడు, సర్వాతీతుడు, పరమాత్మయగు మహాకాలునికి నమస్కారం!

**కాలతత్త్వం**

**శ్లో ॥ భక్త్యాచ భవతోర్జ్నానం ప్రీతోఽహం సురసత్తమౌ ।**
**పశ్యతం మాం మహాదేవం భయం సర్వం విముంచతమ్ ॥**

ఓ బ్రహ్మ! విష్ణుమూర్తులారా! మీ భక్తికి సంతోషం కలిగింది. మహాదేవుడనగు (మహాకాలుడనగు) నన్ను చూచి, భయం చెందనవసరం లేదు. పరమాత్మునగు నా కుడివైపు నుండి లోకానికి పితామహుడగు ఈ బ్రహ్మయు, ఎడమవైపు నుండి నీవు (విష్ణువు) జన్మించితిరి. మీ యందు నేను మిక్కిలి ప్రసన్నుడనైతిని. మీరు కోరిన వరాన్ని ఇస్తారు. మీ ఇద్దరికీ నా శాసనంచే నా యందు దృఢభక్తి కలుగుగాక!

ఈ చరాచర జగత్తు యొక్క సృష్టి, స్థితి, లయకర్తను నేనే. నేనే నిర్గుణ పరబ్రహ్మనే అయినను, సగుణుడను. నేను వికారాలు లేని సచ్చిదానంద స్వరూపుడను. హే! విష్ణుమూర్తి! నేను సృష్టి, స్థితి లయాలను చేయు బ్రహ్మ, విష్ణు, రుద్ర రూపాలతో ముగ్గురిగా విడిపోయాను. కాని, నాయందు ఏనాడు ఆ అంశలు లేవు. నీవు, బ్రహ్మ కలిసి నన్ను అవతరించమని స్తుతించితిరి. భక్తుల యందు ప్రేమగల నేను మీ ప్రార్థనను సత్యం చేసాను. నా శ్రేష్ఠ రూపము బ్రహ్మ దేహం నుండి ప్రకటమై లోకంలో రుద్రుడను పేర ప్రసిద్ధి చెందింది.

**శ్లో ॥ మదంశాత్తస్య సామర్థ్యం న్యూనం నైవ భవిష్యతి ।**
**యోహం సోऽహం న భేదోऽస్తి పూజావిధి విధానతః ॥**

నా అంశయగుటచే రుద్రుడు సామర్థ్యంలో నా కంటె తక్కువ కానే కాదు. నేనే రుద్రుడు. రుద్రుడే నేను. పూజా విధిలో కూడా మాలో భేదం లేదు. కలయికచే నీరు వేడి యగునేగాని, అది నీటియొక్క స్వరూపం గాదు. అలాగే నిర్గుణుడను, నాకు ప్రకృతి సంయోగంచే జగత్తు సృజింపబడింది. కాని, నాకు బంధం లేదు. ఈ రెండింటి యందు భేద బుద్ధిని కలిగియుండరాదు. ఒకే మహాకాలుడనే, పరమాత్మ బ్రహ్మ, విష్ణు రుద్రులుగా ప్రకటమైంది. వీరిలో ఏనాడు భేదభావన చేయరాదు.

**శ్లో ॥ సువర్ణస్య తథైకస్య వస్తుత్వం నైవ గచ్ఛతి ।**
**అలంకృతికృతే దేవ నామభేదో న వస్తుతః ॥**

బంగారంతో చేయబడు అనేక ఆభరణాలకు నామ రూపాలు వేరుగా నుంటాయి. కాని, వాటి స్వరూప భూతమైన వస్తువులో భేదమేమియు లేదు.

అదేవిధంగా మట్టితో వివిధ పాత్రలు చేయబడినను, వాటి మూలవస్తువు ఒక్కటే. సర్వకార్యాలయందు ఒకే కారణమై అనువృత్తమై యుంటుంది. కావున తెలిసినవారు ఎల్లప్పుడు కారణదృష్టిని కలిగియుంటారు. మనం కూడా ఈ సత్యాన్ని తెలుసుకుని భేదదృష్టిని వదిలివేయాలి. కనిపించే సృష్టి అంతా ఒకే వస్తు స్వరూపంగా భావించాలి.

నా నుండి ఉద్భవించిన మీ ముగ్గురిలో ఎవరైతే భేదభావన కలిగియుంటారో వారికి బంధం తప్పదు. మీ ముగ్గురి స్వరూపం సనాతనుడైన నేనే. సత్యం, జ్ఞానం, అనంత స్వరూపమగు పరబ్రహ్మమే ఈ బ్రహ్మాదులకు మూలకారణమని తెలుసుకుని మనసులో ఆ పరబ్రహ్మను ఎల్లప్పుడూ ధ్యానించాలి.

నేను చెప్పింది అత్యంత రహస్యమైన విషయం. మీరిద్దరు (బ్రహ్మ, విష్ణువులు) ప్రకృతి నుండి జన్మించితిరి. కాని రుద్రుడు ప్రకృతి నుండి జన్మించడు. రుద్రుడు బ్రహ్మ యొక్క కనుబొమ్మల నుండి జన్మిస్తాడు, తామసుడని అంటారు. కాని ప్రకృతి వికారమగు అహంకారమే తామసం. ఈ గుణభేదం నామరూపాలందు మాత్రమే యుంటుంది. తత్త్వమునందు లేదు. రుద్రుడూ తామసుడు కానేకాడు.

ఓ బ్రహ్మా! నీవు సృష్టిని చేయాలి. విష్ణువు ఈ జగత్తును పాలిస్తాను. నా అంశయగు రుద్రుడు లయాన్ని చేస్తాడు. పరమేశ్వరియగు శక్తి ఉమ. బ్రహ్మను సేవించే శక్తి సరస్వతి. లక్ష్మి అనే శక్తి విష్ణువును ఆశ్రయిస్తుంది. ఉ
మా దేవియే కాళి రూపం ధరించి రుద్రునకు లయకార్యమందు సహకరిస్తుంది. నీచే సృష్టించబడు జగత్తు నాలుగు వర్ణాలతో, నాలుగు ఆశ్రమాలతో, వివిధ పదార్థాలతో కూడి సుఖదుఃఖాలు కలుగజేస్తుంది.

"మా పరబ్రహ్మ స్వరూపమైన మహాకాలాన్ని అనుసరించి కాలం ప్రధానంగా మూడు విభాగాలైంది. ఆ మూడు విభాగాలే బ్రహ్మ, విష్ణు, మహేశ్వరులు. సృష్టిస్తున్న కాలానికి బ్రహ్మ అనే పేరు. పాలన, పోషణ, రక్షణకు సంబంధించిన కాలానికి విష్ణువు అని, సంహరిస్తున్న లేదా లయింపజేస్తున్న కాలానికి హరుడని అనిరి. సృష్టి కాలానికి కావలసింది సరస్వతీ రూపంతోనున్న జ్ఞాపకశక్తి. పాలన, పోషణ, రక్షణ కాలానికి లక్ష్మీ రూపంలోనున్న క్రియాశక్తి. ఇది ధనాన్ని ప్రధానంగా

చేసుకుని మిగతా కార్యక్రమాలు జేయిస్తుంది. ఇక లయ కాలానికి ఇచ్ఛాశక్తియైన ఉమా స్వరూపం.

కాలం మరియు శక్తి కలయికతో ఈ చరాచర జగత్తంతా సృష్టి, స్థితి, లయ కార్యాలను పరబ్రహ్మయైన మహాకాల పరమాత్మ చేయుచున్నాడు. మనం కాలంనే ఆధారంగా చేసుకుని, శక్తిమేరకు తగిన సాధనతో మహాకాలాన్ని ఆశ్రయించుట చేయాలి. ప్రకృతితో, ప్రకృతిలో రమించుట బంధం అవుతుంది. ప్రకృతిలోనే కాల, శక్తి సాధనతో మహాకాలుని చేరుట 'మోక్షం' అనబడుతుంది."

హే విష్ణో! నీవు జ్ఞాన విజ్ఞానాలు కలిగి లోకానికి హితం చేయుచూ, నా ఆజ్ఞచే ముక్తిని ప్రసాదించాలి.

**శ్లో ॥ ముక్తి దోఽత్ర భవానద్య భవలోకే మదజ్ఞయా ।**
**మద్దర్శనే ఫలం యద్వత్త దేవ తవ దర్శనే ॥**
**ఇతి దత్తో వరస్తేద్య సత్యం సత్యం న సంశయః ।**
**యమైవ హృదయే విష్ణుః, విష్ణోశ్చ హృదయేహ్యాహమ్ ॥**

నన్ను దర్శించినచో ఏ ఫలం లభిస్తుందో, నిన్ను దర్శించినను అదే ఫలం లభిస్తుంది. నేను నీకు ఈ వరాన్నిస్తున్నాను. ఇది ముమ్మాటికి నిజం. సందేహం లేదు. నీవు నా హృదయంలో ఉన్నావు. నేను నీ హృదయంలో ఉన్నాను. ప్రకృతి కంటె, పురుషుని కంటె అతీతమగు మహాకాలమను పరబ్రహ్మను నేనే.

నేను అద్వితీయుడను, నిత్యుడను, అనంతుడను, పూర్ణుడను, అసంగుడను, గుణాతీతుడను. ముల్లోకాలను సృష్టించిన బ్రహ్మకు లోపల మరియు బయట రజోగుణం. పాలించే విష్ణువునకు లోపల తమోగుణం. బయట సత్త్వగుణం. ఈ లోకాలన్నింటినీ లయంచేయు రుద్రునకు లోపల సత్త్వగుణం వెలుపల తమోగుణం. ఈ రుద్రుడు నా యొక్క పూర్ణావతారం.

**శ్లో ॥ ఆయుర్బలం శృణుష్వాద్య, త్రిదేవానాం విశేషతః ।**
**సందేహోఽత్ర నకర్తవ్యో, బ్రహ్మ విష్ణు హరాత్మనామ్ ॥**

బ్రహ్మ, విష్ణు, రుద్రులనే మీ త్రిమూర్తుల ఆయుర్దాయం, బలాన్ని వివరిస్తాను. దీని విషయంలో మీకు సంశయం వద్దు. వేయి మహాయుగాలు బ్రహ్మకు ఒక

పగలు. అంతే కాలం ఒక రాత్రి. అట్టి ముప్పది రోజులు ఒక నెల. పంద్రెండు నెలలు ఒక సంవత్సరం. వంద సంవత్సరాలు బ్రహ్మ యొక్క ఆయుర్దాయం. బ్రహ్మ యొక్క ఒక సంవత్సరం విష్ణువునకు ఒక దినం అవుతుంది. ఈవిధంగా వంద సంవత్సరాలు విష్ణువు ఆయుర్దాయముంటుంది. విష్ణువు యొక్క ఒక సంవత్సరం రుద్రునకు ఒక దినం. వంద సంవత్సరాలు రుద్రుడుంటాడు. ఈ కాలం నాకు ఒక ఉచ్ఛ్వాసతో సమానం.

తర్వాత రుద్రుడు నాలో నిశ్వాసకాలం వరకు శక్తిలో లీనుడై ఉంటాడు. సర్వప్రాణులకు బ్రహ్మ, విష్ణు రుద్రులకు, గంధర్వులకు, పాతాళ వాసులకు మరియు రాక్షసులకు 21,600 ఉచ్ఛ్వాస నిశ్వాసలు ఒకరోజవుతుంది. నా యొక్క ఉచ్ఛ్వాస, నిశ్శ్వాసలకు పరిగణన లేదు. అందుకే అక్షయుడను. మహాకాలుడనైన నేను రుద్రుని రూపంలోనున్నను, నన్ను పూజించు వారి నిమిత్తము లింగ స్వరూపంగా దర్శనమిస్తాను.

**శ్లో ॥ లింగవేదిర్మహాదేవీ, లింగం సాక్షాన్మహేశ్వరః ।**
**లయనాల్లింగమిత్యుక్త, తత్రైవ నిఖిలం జగత్ ॥**

ఈ లోకంలో లింగపూజా విధి మిక్కిలి ప్రశస్తమై ఉంది. భక్తిని, ముక్తిని ఇచ్చే మహాకాలుడు లింగంలో సుప్రతిష్ఠితుడై ఉన్నాడు. లింగం యొక్క వేది మహాదేవియగు ఉమ. లింగం సాక్షాత్తుగా మహేశ్వరుడు. దీనియందు జగత్తు అంతయు లయమగుటచే 'లింగం' అనే పేరు వచ్చింది. నిర్గుణరూపుడైన మహాకాలుడు 'లింగం' ద్వారా సగుణ రూపంగా పూజింపబడుచున్నాడు కాని. లింగం సాక్షాత్తూ నిర్గుణ పరబ్రహ్మ గుర్తుగా సదా భావన చేయుచూ పూజించాలి. ఈ శివలింగ సమీపంలో ఏ ధర్మకార్యాన్ని ఆచరించినను విశేష పుణ్యఫలం లభిస్తుంది.



# ౨౮. 'నవ' సంఖ్యా వైభవం

సంఖ్యా శాస్త్రం కూడా జ్యోతిశ్శాస్త్రంలోని భాగమే. సంఖ్యాశాస్త్రం కేవలం అంకెలపై ఆధారపడి ఉంది. నవగ్రహాలే అంకెలకు మూలం. 1వ సంఖ్య నుండి 9వ సంఖ్య వరకు గల 9 అంకెలకు తొమ్మిది గ్రహాలు అధిపతులుగా ఉన్నాయి. జ్యోతిశ్శాస్త్రంలో 9వ సంఖ్యకే మిక్కిలి ప్రాధాన్యముండడం విశేషం. 9వ సంఖ్యకు అధిపతి కుజుడు. గ్రహాలన్నింటిలోనూ కుజుడే ముఖ్యం. రాశుల్లో మొదటి రాశియైన మేషరాశి అధిపతి కుజుడు. గ్రహాల రాజైన రవికి మేషరాశి ఉచ్ఛస్థానం. జ్యోతిశ్శాస్త్రంలోని నవగ్రహాల నుండి యుగప్రమాణాల వరకు కనిష్ట సంఖ్య 9 రావడం వల్ల 9వ సంఖ్య విశిష్టత తెలుస్తుంది.

- నవ గ్రహాలు తొమ్మిది = 9
- నవ ధాన్యాలు తొమ్మిది = 9
- నవ రత్నాలు తొమ్మిది = 9
- నవ రాత్రులు తొమ్మిది = 9
- నవ పాషాణాలు తొమ్మిది = 9
- నవ వ్యాకరణాలు తొమ్మిది = 9
- నవ నారసింహులు తొమ్మిది = 9
- నవ రహస్యాలు తొమ్మిది = 9
- నక్షత్రాలు 27 = 2+7 = 9
- నక్షత్ర పాదాలు 27×4=108 = 1+0+8=9
- లగ్నాలు 12, నవాంశ 12×9=108 1+0+8=9
- ఒక సంవత్సరం 360 రోజులు = 3+6+0=9

- ఒక రోజు = 60 ఘడియలు, ఒక ఘడియ = 60 విఘడియలు. 1 విఘడియ=60 లిప్తలు = 60×60×60=21,600 లిప్తలు. = 2+1+6+0+0=9 (ఇది మన ఉచ్ఛ్వాస, నిశ్వాసల సంఖ్య)
- మొత్తం 60 సంవత్సరాలు, ఒక సంవత్సరం = 360 రోజులు = 60 × 360=21,600 రోజులు = 2+1+6+0+0=9.
- అష్టోత్తరి దశాకాలము = 108 సం॥ = 1+0+8=9.
- జాతకంలోని ద్వాదశ భావాల్లో భాగ్యస్థానం అత్యంత ప్రాధాన్యమైంది = భాగ్యస్థాన సంఖ్య = 9.
- ఒక సంవత్సరం = 12 నెలలు, 1 నెలకు = 30 తిథులు = 12×30=360 తిథులు= 3+6+0=9.
- 12 నెలలు (1 ఋతువు, 2 నెలలు)= 6 ఋతువులు = 12×6=72= 7+2=9.
- 1 అయనము = 6 నెలలు = 6×30=180=1+8+0=9.
- 12 నెలలు, 6 ఋతువులు, 2 అయనాలు = 12×6×2=144 = 1+4+4=9.
- జపమాల పూసల సంఖ్య = 108= 1+0+8=9.
- యోగాల సంఖ్య 27 =2+7 = 9
- తిథులు 30, నెలలు 12, రోజులు 360 = 30×12×360=1,29, 600= 1+2+9+6+0+0=9.
- ఋతువులు 6, నక్షత్రాలు 27, తిథులు 30, యోగాలు 27, కరణాలు 11, వారాలు 7 మొత్తం = 6+27+30+27+11+7=108 1+0+8=9.
- నెల 30 రోజులు, 2 పక్షాలు, 15 తిథులు= 30×2×15=900= 9.
- తారాబలంలోని తారల సంఖ్య = 9.
- మహర్దశల సంఖ్య = 9.

- వాస్తు భాగంలోని అష్టదిశలు=8+మధ్య బ్రహ్మస్థానం = 9.
- ప్రతిష్ఠా కార్యక్రమంలో కుండ సంఖ్య = 9.
- వాస్తు శాస్త్రంలో ఆయముల సంఖ్య = 9.
- ముహూర్త భాగంలో పంచక రహితంలోని పంచకాల సంఖ్య = 9.
- ఒక రోజు 24 గంటలు, నెలకు 30×24=720= 7+2+0=9.
- 60 సెకనులు = ఒక నిమిషం, 60 నిమిషాలు = 1 గంట, 24 గంటలు= ఒక రోజు = 24×60×60=8640 సెకనులు = 8+6+4+0=9.
- ఘటాభిషేకంలో అష్టోత్తర శత కలశాలు = 108 = 1+0+8=9.
- మానవ శరీరంలో నవరంధ్రాలు = 9.
- ఆరోగ్యంగా ఉండే మన హృదయస్పందన 72 సార్లు 7+2=9.
- ఏకాదశ ఇంద్రియాలు = 11, కామక్రోధాది అరిషడ్వర్గం = 6 గుణాలు, ఆత్మ 1 కలిపి=11+6+1=18=1+8=9.
- ఒక రోజు 24 గంటలు, ఒక గంటకు 60 నిమిషాలు = 24 × 60 = 1440 = 1+4+4+0=9.
- హోమకుండ ప్రమాణం 18 అంగుళాలు = 1+8=9.
- ప్రశ్నాశాస్త్రంలోని అంకెల సంఖ్య = 108= 1+0+8=9.
- నవగ్రహాలు, అధిదేవతలు, ప్రత్యధిదేవతలు మొత్తం = 27 = 2+7=9.
- ఒకరోజు 12 లగ్నాలు, ఒక సంవత్సరం 360 రోజులు = 360×12=4,320 లగ్నాలు = 4+3+2+0=9.
- సంవత్సర కాల లగ్నాలు 4,320, వంద సంవత్సరాలకు = 100×4,320=4,32,000 = 4+3+2+0+0+0=9. (ఇది కలియుగ ప్రమాణం)
- ఒక రోజు 12 లగ్నాలు, నవాంశలు 9, ఒక సంవత్సరం 360 రోజులకు= 360×12×9=38,880 = 3+8+8+8+0=27= 2+7=9.

- నవాంశ కాల లగ్నాలు 38,880, వంద సంవత్సరాలకు = 100×38,880=38,88,000 = 3+8+8+8+0+0+0=27= 2+7=9. (ఇది కృతయుగాది ద్వాపర యుగాంతం వరకు గల మొత్తం ప్రమాణ సం॥లు.)
- మొత్తం నాలుగు యుగ ప్రమాణాల సంఖ్య 38,88,000+ 4,32,000=43,20,000=4+3+2+0+0+0+0=9.
- కృతయుగ ప్రమాణ సంఖ్య=17,28,000= 1+7+2+8+0+0+0=9.
- త్రేతాయుగ ప్రమాణ సంఖ్య=12,96,000= 1+2+9+6+0+0+0=9.
- ద్వాపర యుగ ప్రమాణ సంఖ్య = 8,64,000= 8+6+4+0+0+0=9.

ప్రస్తుత కాలంలో కూడా 9వ సంఖ్యకు చాలా ప్రాధాన్యమిస్తున్నారు. ఎవరికైనా 9 సంఖ్య అదృష్టమని అందరి విశ్వాసం. కాని 1 నుండి 9 వరకు గల 9 సంఖ్యలు అన్ని దేనికది శ్రేష్ఠమైనవే. దీనిని పైన సూచించిన విషయాలు బలపరుస్తున్నాయి. కాని అదృష్ట సంఖ్య అనేది వారి వారి జన్మతేదీ ప్రకారం లేదా జన్మనక్షత్రం లేదా జాతకం ప్రకారం నిర్ణయించబడుతుంది. ఎవరెవరి విశ్వాసాన్ననుసరించి వారు ఆయా విధానాలను అనుసరిస్తారు. అన్ని విధానాలు శాస్త్ర సమ్మతమైనవే. ఇందులో ఎలాంటి సందేహం లేదు. సందేహాలు లేకుండా చేయడానికే శాస్త్రమేర్పడింది. సంఖ్యల్లో మొదటిదైన ఒకటి పరబ్రహ్మం అద్వైతమైతే, చివరిదైన తొమ్మిది ఈ చరాచర సృష్టి అని సారాంశం.



# 29. ధర్మసూక్ష్మాలు

**శ్లో ॥ ధర్మాదర్థః ప్రభవతే, ధర్మా త్ప్రభవతే సుఖం ।**
**ధర్మేణ లభతే సర్వం, ధర్మసార మిదం జగత్ ॥**

(శ్రీరామాయణం-అరణ్య కాండ- 8-30)

ఈ ప్రపంచంలో ధర్మం వల్లనే ధనం, సుఖం, సర్వం, సంభవిస్తున్నాయి. జగత్తంతా, 'ధర్మమే' సారభూతమైంది.

మన నిత్య జీవితంలో లౌకిక కార్యకలాపాలతో పాటు, దైవ కార్యాలు భక్తిశ్రద్ధలతో చేస్తుంటాం. సంప్రదాయబద్ధంగా వచ్చేవి కొన్నయితే, మన ఇష్ట ప్రకారం జరుపుకునేవి కొన్ని ఉన్నాయి. ఇందులో మనకు అడుగడుగునా అనేక ధర్మ సందేహాలు కలుగుతుంటాయి. వానికి సరియైన సమాధానాలు లభించక తికమక పడుతుంటాం. అందుకే మనకు పురాణాల్లో కథా ఘట్టాలతో పాటు అనేక 'ధర్మసూక్ష్మాలు' తెలిపారు. కాలానుగుణంగా వచ్చే మార్పులను దృష్టియందుంచుకొని, మనకు ప్రస్తుతం అవసరమయ్యే 'ధర్మసూక్ష్మాల'ను తెలుసుకోవాలి.

ముందుగా శ్రీ వ్యాసభగ వానునికి కృతజ్ఞతాపూర్వక నమ స్కారాలు చేస్తూ, శ్రీ శివపురాణంలోని ధర్మసూక్ష్మాలను తెలుసుకుందాం!

- కాలసర్పం నుండి వచ్చే గొప్ప దుఃఖాన్ని నశింపజేయు ఉత్తమ సాధనం శ్రీ శివమహాపురాణం.
- పశ్చాత్తాపానికి మించిన పాప ప్రాయశ్చిత్తం మరొకటి లేదు. పశ్చాత్తాపంవల్ల పాపాలనుండి విముక్తులవుతారు.
- పాప ప్రాయశ్చిత్త విధులు మనకు ధర్మశాస్త్రాల్లో లభిస్తాయి. ఏ పాపానికి ఏ ప్రాయశ్చిత్తం చేయాలో తెలుసుకుని విధివిధానంగా ఆచరించాలి.

- పఠన, శ్రవణ, మనన, నిధి ధ్యాసాదుల వల్ల చిత్తశుద్ధి ఏర్పడుతుంది.
- కామక్రోధాది షడ్వికారాలను, బ్రాహ్మణులను, పతివ్రతలను, సత్పురుషులను ఎప్పుడూ నిందించరాదు.
- **శ్లో॥ శ్రోత్రేణ శ్రవణం తస్య వచసా కీర్తనం తథా ।**
  **మనసా మననం తస్య, మహాసాధన ముచ్యతే ॥**

(శ్రీశివపురాణం. విద్యేశ్వర సంహిత 3/21-22)

చెవులతో భగవంతుని నామగుణాలను, లీలలను వినాలి, నోటితో వానిని కీర్తించాలి, భజించాలి, మనస్సుతో ఎల్లప్పుడూ చింతించాలి. ఎవ్వరికైనా ముక్తినొందుటకు శ్రవణ, కీర్తన మననాలే గొప్ప సాధనలు.

- వంచన, కపటం లేకుండా శక్తి కొలది ధనాన్ని సంపాదించి దైవా రాధనకు వినియోగించాలి.
- శివలింగానికి ప్రతిరోజు భక్తిశ్రద్ధలతో రాజోపచార పూజ చేయాలి.
- శివలింగ పూజ వల్ల సంసార బంధ విముక్తి త్వరగా లభిస్తుంది.
- శివలింగం పరమాత్మ యొక్క సాకార, నిరాకార స్వరూపం.
- మార్గశిర మాస పూర్ణిమ లేదా ఆర్ద్రా నక్షత్రంతో కూడిన రోజున శివుని దర్శించి పూజించాలి.
- ఒక శివరాత్రి రోజు ఉపవసించి, భక్తిశ్రద్ధలతో అభిషేకం చేసిన వారికి సంవత్సరమంతా పూజించిన ఫలం వస్తుంది.
- శివలింగ దర్శనం, స్పర్శ, ధ్యానం అనేవి ముఖ్య సాధనలు.
- సృష్టి, స్థితి, సంహారం, తిరోభావం, అనుగ్రహం అనేవి శివుని పంచకృత్యాలు.
- ప్రాణులను వెనుకకు తీసుకుపోవుటయే తిరోభావం.
- మోక్షార్థమై భక్తులను అనుగ్రహించుట ముఖ్యమైంది.
- పంచ కార్యాలు- పంచభూతాల రూపంలో శివుని పంచముఖాల ద్వారా జరుగుతాయి.

| | | | | |
|---|---|---|---|---|
| 1) సృష్టి | – | భూమి | – | బ్రహ్మ |
| 2) స్థితి | – | నీరు | – | విష్ణువు |
| 3) సంహారం | – | అగ్ని | – | రుద్రుడు |
| 4) తిరోభావం | – | గాలి | – | మహేశ్వరుడు |
| 5) అనుగ్రహం | – | ఆకాశం | – | ఓంకారం |

- ఓంకారమే శివుని స్వరూపం. ప్రతిరోజు, ఎల్లప్పుడూ ఓంకారం స్మరించుటవల్ల శివుని అనుగ్రహం లభిస్తుంది.
- ప్రణవం చేతనే పంచాక్షరీ మంత్రం ఏర్పడింది. దీని చేత కోరిన కోరికలు సిద్ధిస్తాయి.
- ఆర్ద్రా నక్షత్రంతో కూడిన చతుర్దశిన చేసిన ప్రణవజపం అక్షయ ఫలాన్నిస్తుంది.
- సూర్య సంక్రమణంతో కూడిన మహా ఆర్ద్రా నక్షత్రమందు ఒక్కసారి ప్రణవం జపిస్తే–కోటి ప్రణవజప ఫలితం వస్తుంది.
- మృగశిరా నక్షత్ర చివరి భాగం, పునర్వసు నక్షత్ర మొదటి భాగంలో శివపూజ, హోమం, తర్పణాదులు చేసిన అవి ఆర్ద్రా నక్షత్రమందు చేసిన వానితో సమానం.
- ప్రతి రోజు ప్రభాత సమయం అనగా మధ్యాహ్నానికి ముందు శివలింగ దర్శనం చేసుకోవాలి.
- శివపూజలు, అభిషేకాలకు ప్రదోష కాలంలో చతుర్దశి గాని, అర్ధరాత్రి చతుర్దశి గాని శ్రేష్ఠం.
- శివుని యొక్క విగ్రహమూర్తి కంటె శివలింగమే గొప్పది.
- శివలింగ దర్శనం కంటే శివపూజ శ్రేష్ఠం. శివలింగపూజ కంటే శివలింగ ప్రతిష్ఠ ఉత్తమం. శివలింగ ప్రతిష్ఠ కంటె శివాలయ నిర్మాణం అత్యంత శ్రేష్ఠమైంది.

- పరివార సహితంగా శివుని పూజించాలి.
- 1) ఆవాహనం 2) ఆసనం 3) అర్ఘ్యం 4) పాద్యం 5) ఆచమనం 6) స్నానం 7) వస్త్రం 8) యజ్ఞోపవీతం 9) గంధం 10) పుష్పం 11) ధూపం 12) దీపం 13) నైవేద్యం 14) తాం బూలం 15) నీరాజనం 16) నమస్కారం... ఈ షోడశ (16) ఉపచారాలతో శివుని పూజించాలి.
- మానవులచే ప్రతిష్ఠించబడిన శివలింగం కంటె ఋషుల ద్వారా లేదా దేవతల ద్వారా స్థాపించబడిన శివలింగం శ్రేష్ఠం. దీనికంటె స్వయంభువు శివలింగం మిక్కిలి శ్రేష్ఠం.
- స్వయంగా పూజించిన ఎంత ఫలితమో, పూజించేవారికి భక్తిపూర్వకంగా పూజా సామాగ్రి సమర్పించిన వారికి అంతే ఫలితం లభిస్తుంది.
- దేహధర్మాలననుసరించి శుచిగా ఉన్న స్త్రీలు పంచాక్షరీ జపాన్ని 'శివాయ నమః' అని జపించాలి.
- మంత్రంలో అక్షరాలు ఎన్ని ఉన్నాయో, అన్ని లక్షల జపం చేస్తే మంత్రసిద్ధి కలుగుతుంది.
- శివుని క్షేత్రమందు ఐదు రోజులు గాని లేదా ఒక రాత్రియైనా గడపాలి. (కాశీక్షేత్ర విషయం వేరుగా ఉంటుంది.)
- పుణ్య క్షేత్రాల్లో ప్రధానంగా స్నానం, దానం, జపం చేయాలి.
- **శ్లో ॥ క్షేత్రే పాపస్య కరణం దృఢం భవతి భూసురాః ।**
  **పుణ్యక్షేత్రే నివాసే హి పాపమణ్వపి నాచరేత్ ॥**

(శి.పు. వి.సం. 12/7)

పుణ్యక్షేత్రాలందు పాపకర్మలు చేస్తే కఠినమైన నరకం తప్పదు. అందువల్ల పుణ్యక్షేత్రాల్లో నివసించు సమయాన ఏ కొద్దిపాటి పాపమైనను చేయరాదు.

- పుణ్యక్షేత్రాలతో పాటు పుణ్య నదులు కూడా పుణ్యతీర్థాలుగా పవిత్రమైన ప్రసిద్ధి చెందాయి. ఒక్కొక్క నదికి కొన్ని ముఖాలున్నా ముఖం అనగా ఆ నది యొక్క ప్రత్యేక ధారలు.

1) సరస్వతీ నది – 60 ముఖాలు – బ్రహ్మపద ప్రాప్తి

2) గంగా నది – 100 ముఖాలు – కైవల్యపద ప్రాప్తి

(దీని ఒడ్డును కాశి, ప్రయాగ మొదలైన పుణ్యక్షేత్రా లున్నాయి. మకర రాశిలో సూర్యుడు ప్రవేశించు సమయంలో గంగానదిలో స్నానం మిక్కిలి ప్రశస్తం.)

3) శోణభద్రా నది – 10 ముఖాలు – అభీష్ట ఫలప్రాప్తి

(బృహస్పతి మకరరాశిలో ప్రవేశించు సమయం విశేషం.)

4. మహానది నర్మద – 24 ముఖాలు – వైకుంఠ ప్రాప్తి

5. తమసా నది – 12 ముఖాలు – పుణ్యప్రదం

6. రేవా నది – 10 ముఖాలు – దుఃఖ నివారణం

7. గోదావరి నది – 21 ముఖాలు – రుద్రలోక ప్రాప్తి (గోహత్యా దోష పరిహారం)

8. కృష్ణా నది – 18 ముఖాలు – సకల పాప విముక్తి. విష్ణు లోక ప్రాప్తి.

9. తుంగభద్రా నది – 10 ముఖాలు – బ్రహ్మలోక ప్రాప్తి

10. స్వర్ణముఖి నది – 9 ముఖాలు – సుఖ ప్రాప్తి

11. కావేరి నది – 27 ముఖాలు – అభీష్ట సిద్ధి

- సూర్యుడు మరియు బృహస్పతి (గురుడు) ఒక్కొక్క రాశిలోకి మారినపుడు ఒక్కొక్క నదికి పుణ్య విశేషం ఉంటుంది. దీన్నే పుష్కర అంటాం. లేదా మేళా అని పిలుస్తారు.
- మానసిక పాపాలు ధ్యానం చేత, వాచిక పాపాలు జపం ద్వారా, శారీరక పాపాలు ఉపవాస, దేవతారాధన, దానాల చేతనే నశిస్తాయి.
- వేదాధ్యయనం ఎంత ముఖ్యమో, సదాచారం కూడా అంతే ముఖ్యం.
- స్నానం చేసి విడిచిన వస్త్రాలను నదీ తీర్థాల్లో ఉతకరాదు.

- వస్త్రాలను పిండుటచే క్రిందపడెడి నీరు ఒక తరగతికి చెందిన పితరులకు తృప్తినిస్తుంది. (జాబాలి ఉపనిషత్)
- స్నానం చేసిన వెంటనే తప్పక తిలకంగాని, భస్మంగాని ధరించాలి.
- ప్రతిరోజు స్నానానంతరం సూర్యభగవానునికి అర్ఘ్యం మూడుసార్లు ఇవ్వాలి.
- గాయత్రీ మంత్రోపదేశం అయినవారు ఆ మంత్రంతోనే సూర్యునికి అర్ఘ్య ప్రదానం చేయాలి. (దోసిలితో వ్రేళ్ళ కొనల నుండి.)
- వ్రేళ్ళ సందుల నుండి శ్రీ సూర్య భగవానున్ని దర్శించి, నమస్కరించాలి.
- దుర్వ్యసనాలు లేనివారు మాత్రమే గాయత్రీ మంత్రానుష్ఠానానికి అర్హు లవుతారు.
- ప్రణవార్థం తెలుసుకుని జపానుష్ఠానం చేసిన వారికి జపసిద్ధి వెంటనే లభిస్తుంది.
- ధర్మ సంపాదనతో జీవనం చేసేవారికి మాత్రమే జపానుష్ఠాన ఫలం లభిస్తుంది.
- కోరికలను వదిలివేసిన వారికి చిత్తశుద్ధి ఏర్పడుతుంది. చిత్తశుద్ధి ఏర్పడితేనే జ్ఞానం లభిస్తుంది. జ్ఞానం కలిగినవారే ఆనందాన్ని పొందుతారు.
- కలికాలంలో ప్రస్తుతం ద్రవ్యంతో కూడిన ధర్మం అనగా దానం వల్లనే చిత్తశుద్ధి కలుగుతుంది.
- ఈ కలియుగంలో విగ్రహారాధనతో చిత్తశుద్ధి కలిగి 'జ్ఞానోదయం' అవుతుంది.
- సంతృప్తితోనే సుఖం లభిస్తుంది. అసంతృప్తి వల్లనే దుఃఖాన్ని పొందుతారు.
- ప్రతిరోజు ఎంత శక్తి ఉంటే అంత, ఏదైనా సరే దానం చేయడానికి ప్రయత్నించాలి.
- మనం చేసే దానం సద్వినియోగం జరుగుతుందనే నమ్మకం కలిగిన చోటునే దానం చేయాలి.

- దప్పిక తీర్చుటకు నీరు, ఆకలిని తొలగించుటకు అన్నం, ద్రవ్యం లేనివారికి ధనాన్ని దానం చేయాలి.
- ధర్మ సంపాదన చేసిన దానిలో పదవ భాగం దానధర్మాదులకు వెచ్చించాలి.
- విద్వాంసులు ఇతరుల దోషాలను గణించరు. పరుష వాక్యాలను పలుకరు. సదా సంతృప్తితో జీవిస్తారు.
- సకల ప్రాణులను తృప్తిపరచుట కొరకు చేసే ప్రతి పని యజ్ఞమే అవుతుంది. ధర్మ సందేహాలుండవు. పురాణాల్లో అనేక ధర్మ సూక్ష్మాలున్నాయి.
- గృహస్థులందరూ తప్పక యజ్ఞాలు చేయాలి.
- యజ్ఞాలు అనేక రకాలు. అందులో సకల ప్రాణులకు మేలు చేకూర్చే పనులు చేయుట ముఖ్యమైన యజ్ఞం.
- యజ్ఞ యాగాదులు పగటికాలమందే ఆచరించాలి. అగ్నిదేవుడు సూర్యునియందు ప్రవిష్టుడై ఉంటాడు.
- సూర్యభగవానునకు సమర్పించిన యజ్ఞ ఆహుతులు మన ఆయుష్షును వృద్ధి చేస్తాయి.
- **ఏడు వారాల రహస్యం–** శ్రీ మహాకాలుడు సకల లోకాలకు హితం చేయడానికి వారాలను కల్పించాడు.

1. ఆ పరమాత్మ పరమశివుని రూపంలో సంసార రోగాన్ని తొలగి స్తాడు. ఆ స్వామి సమస్తం తెలిసిన వైద్యుడు. అన్ని ఔషధాలకు దివ్యౌషధం. ఆరోగ్యం ప్రసాదించే వారం 'ఆదివారం'.
2. పరమాత్మ తన మాయాశక్తి స్వరూపిణి అయిన అమ్మవారికి సంబంధించింది 'సోమ వారం'. ఇది సంపదలను ఇస్తుంది.
3. జనన కాలంలో బాలారిష్టాలను అనుభవించే చిన్న బాలల రక్షణార్థం ఆ స్వామి 'మంగళవారం' (కుమార వారం) ఏర్పరిచాడు.
4. సోమరితనం తొలగడమే కాక సకల పాపాలు తొలగించు విష్ణువారమే 'బుధవారం'.

5. బలం మరియు రక్షణ కొరకు ఏర్పరచిన ఆయుఃకర్తయైన బ్రహ్మావారమే 'గురువారం'.

6. మన పుణ్యపాపాల ఫలితంగా కలిగే శుభాశుభాలననుభవించుటకు ఇంద్రవారంగా 'శుక్రవారం' ఏర్పడింది.

7. మనకు మృత్యుభయాన్ని తొలగింపజేయుటకు యమధర్మరాజు వారంగా 'శనివారం' ఏర్పరచాడు మహాదేవుడు.

◆ పరమాత్మ స్వరూపమైన ఏడు గ్రహాలే ఈ ఏడు వారాలకు అధిపతులుగా నియమించాడు.

| **వారం** | **దేవత** | **అధిపతి** |
|---|---|---|
| ఆదివారం | శివుడు | సూర్యుడు |
| సోమవారం | సోముడు | చంద్రుడు |
| మంగళవారం | కుమారుడు | కుజుడు |
| బుధవారం | విష్ణువు | బుధుడు |
| గురువారం | బ్రహ్మ | గురుడు |
| శుక్రవారం | ఇంద్రుడు | శుక్రుడు |
| శనివారం | యముడు | శని |

దీనిని అనుసరించే గ్రహాలకు అధిదేవత, ప్రత్యధిదేవతలేర్పడ్డాయి.

- ఆయా వారాల్లో ఆయా దేవతలను భక్తిశ్రద్ధలతో సేవించిన వారికి సుఖశాంతులు లభిస్తాయి.
- సూర్యుడు– ఆరోగ్యాన్ని, చంద్రుడు– సంపదలను, కుజుడు– రోగ నివారణను, బుధుడు– బలాన్ని, గురుడు– ఆయుష్షును, శుక్రుడు– సకల సుఖాలను, శని– మృత్యువును నివారిస్తాడు.
- ఏ దేవతనైనా ప్రసన్నం చేసుకోవడానికి జరిపే పూజా పద్ధతులు ఐదు విధాలు. 1. జపం. 2. హోమం 3. దానం. 4. ధ్యానం. 5. పూజ.

- ఏ దేవతను గాని, దేశ, కాల, పాత్రల ననుసరించి శక్త్యానుసారం, భక్తి శ్రద్ధలతో సేవించిన సంపూర్ణ ఫలం కలుగుతుంది.
- ధర్మబద్ధమైన సేవల వల్లనే దేవతలు తృప్తి చెందుతారు. ధనికులు దానం చేత సేవించాలి. నిర్ధనులు మిగతా పద్ధతులను అనుసరించాలి.
- శక్తి ఉన్నా శ్రద్ధగా సేవించనివారికి ఆయా ఫలితాలు కలగకపోగా పాపాన్ని పొందినవారవుతారు.

**ప్రదేశ నిర్ణయం :**

- దేవ యజ్ఞాది కర్మలు చేయుటకు శుద్ధమైన గృహం సమమైన ఫలాన్నిస్తుంది.
- గృహం కంటే గోశాల పది రెట్లు అధిక ఫలాన్నిస్తుంది.
- గోశాల కంటే జలాశయ తీరం, లేదా నదితీరం 10 రెట్లు ఎక్కువ మహత్త్వం కలిగి ఉంటుంది.
- బిల్వం, మారేడు, తులసి, మర్రిచెట్టు సమీపం నదీ తీరం కంటే 10 రెట్లు ఎక్కువ ఫలం కలిగి ఉంటుంది.
- వీనికంటే దేవాలయం 10 రెట్లు ఎక్కువ ఫలాన్నిస్తుంది.
- తీర్థక్షేత్రం (పుణ్యక్షేత్రం)లో దేవాలయం కంటే 10 రెట్లు అధిక ఫలం లభిస్తుంది.
- తీర్థంతో కూడిన నదీతీరం సాధారణ పుణ్యక్షేత్రం కంటే 10 రెట్లు ఎక్కువ ఫలాన్ని కలుగ జేస్తుంది.
- గంగ, గోదావరి, కావేరి, తామ్రపర్ణి, సింధు, సరయు, నర్మద అను ఏడు నదులను సప్తగంగ అంటారు.
- దేవ యజ్ఞాది కర్మలు నదీతీర పుణ్య క్షేత్రం కంటే ఈ సప్తాంగ నదుల తీర్థస్థాన మందు 10 రెట్లు అధిక ఫలాన్నిస్తుంది.
- సప్తగంగ కంటే 10 రెట్లు అధిక ఫలం సముద్రతీరం నందు లభిస్తుంది.
- సముద్రతీరం కంటే పర్వత శిఖర ప్రదేశం 10 రెట్లు అధిక ఫలాన్నిస్తుంది.
- అన్నింటికంటే మన మనస్సు ఏకాగ్రమైన స్థలం దేవ యజ్ఞాది కర్మలు చేయడానికి ఉత్తమమైంది.

**కాల నిర్ణయం :**

- ఈ కలియుగంలో మనం చేసే యజ్ఞ, దానాదుల ఫలం మొత్తం నాల్గింటిలో ఒక భాగ ఫలమే లభిస్తుంది.
- ఈ కలియుగం సగం పూర్తి అయిన తర్వాత ఆ నాల్గవ భాగంలో నాల్గవ అంశ ఫలమే లభిస్తుంది.
- పరిశుద్ధమైన అంతఃకరణ గలవారికి శుద్ధమైన పవిత్ర దినం సమఫలాన్నిస్తుంది.
- సూర్య సంక్రమణ రోజు చేసిన సత్కర్మల ఫలం పరిశుద్ధ దినం కంటే 10 రెట్లు ఎక్కువ వస్తుంది.
- విషువత్పుణ్యకాలం నందు చేసిన సూర్య సంక్రమణం కంటే 10 రెట్లు ఎక్కువ ఫలం లభిస్తుంది.
- సూర్యుడు విషువత్ రేఖపై వచ్చే కాలాన్ని 'విషువత్పుణ్య కాలం' అంటారు. ఈ సమయంలో రాత్రి పగలు సమానంగా ఉంటాయి. ఇది సంవత్సరంలో రెండుసార్లు వస్తుంది. 1) మార్చి 21వ తేదీ 2) సెప్టెంబర్ 22వ తేదీ.
- పై విషువత్పుణ్యకాలం కంటే దక్షిణాయన ఆరంభం రోజున కర్క సంక్రాంతి రోజున 10 రెట్లు అధిక ఫలం ఉంటుంది.
- కర్క సంక్రాంతి కంటే మకర సంక్రాంతి 10 రెట్లు ఎక్కువ ఫలితం లభిస్తుంది.
- మకర సంక్రాంతి కంటే చంద్రగ్రహణ కాలం 10 రెట్లు అధిక యోగ్యమైంది.
- సూర్యగ్రహణ సమయం చంద్రగ్రహణ కాలం కంటే 10 రెట్లు ఉత్తమ ఫలాన్నిస్తుంది.
- అన్నింటికంటే సూర్యగ్రహణ కాలం చాలా ఉత్తమమైంది.
- జన్మనక్షత్ర దినం, వ్రతాలు ఉద్యాపన చేసిన రోజు సూర్యగ్రహణంతో సమానం. మహాపురుషుల సాంగత్య సమయం కోట్ల కొలదీ సూర్య గ్రహణాలతో సమానమైంది, మరియు పవిత్రమైంది.

**పాత్ర నిర్ణయం :**

(పూజలు, దానాదులకు అర్హులు)

- తపోనిష్ఠులగు యోగులు, జ్ఞాన నిష్ఠులగు యతీశ్వరులు పూజించుటకు అర్హులు.
- గాయత్రీ మంత్రానుష్ఠానం కలిగిన బ్రాహ్మణులందరు యోగ్యులైనవారు.
- దానం చేయువారి పాపాల నుండి రక్షింపజేయుదురు కావున 'పాత్ర' అని చెప్పబడింది.
- సదాచారాలను పాటించు విద్వాంసులగు బ్రాహ్మణులే బ్రాహ్మణ నామాన్ని ధరించుటకు అర్హులు.
- ఎవరైనను సూర్యోదయానికి వీలైనంత ముందుగా నిద్ర నుండి మేల్కొనాలి.
- నిద్ర లేచిన వెంటనే భూదేవికి నమస్కరించిన తర్వాతనే కాళ్ళు భూమిపై పెట్టాలి.
- జన్మనిచ్చిన తల్లిదండ్రులకు ప్రత్యక్షంగా లేదా మానసికంగా స్మరించి నమస్కరించాలి.
- కాలకృత్యాలు తీర్చుకుని, స్నానం ముగించిన తర్వాత వెంటనే నుదుట తిలకం, భస్మం లేదా ఊర్ధ్వపుండ్రం ధరించాలి.
- ప్రతిరోజు స్నానానంతరం పురు షులు సూర్యభగవానునికి అర్ఘ్య మునిచ్చి నమస్కరించాలి. స్త్రీలు తులసిని పూజించాలి.
- ఉతికి, ఆరవేసిన వస్త్రాలను ధరించి పూజా గదిలోకి గాని దేవాలయ దర్శనానికి గాని వెళ్ళాలి.
- అల్పాహారం గాని భోజనం గాని కూర్చుని మాత్రమే స్వీకరించాలి.
- మనకంటే పెద్దవారు తెలిసిన వారైతేనే నమస్కరించాలి. కొత్తవారైతే పరిచయం చేసుకుని నమస్కరించాలి.
- సాయంకాలం సూర్యాస్తమయం అయిన తర్వాత సూర్యునికి నమస్కరించి, తిరిగి అర్ఘ్య ప్రదానం చేయాలి.

- ఏ పదార్థం స్వీకరిస్తున్నా తమ ఇష్టదైవాన్ని స్మరించుకోవాలి.
- కులదైవానికి ముందు ప్రాధాన్యత ఇచ్చిన తర్వాతనే ఇష్టదైవాన్ని పూజించాలి.
- ఆచారాలు, ఆరోగ్యం కొరకు కాకుండా, ఆరోగ్యం ద్వారా ఐశ్వర్యాన్ని చివరకు ఆత్మ జ్ఞానాన్ని కలిగిస్తాయి.
- ఏ వృత్తిలో ఉన్నా ఆ వృత్తికి సరియైన న్యాయం చేయడానికి ప్రయత్నించాలి.
- ఏ పని చేస్తున్నా పూర్తి శ్రద్ధ కలిగివుండాలి. ఆ పని పూర్తి అయ్యేవరకు వదిలి పెట్టకూడదు.
- అన్యాయం, అధర్మం ద్వారా సంపాదించిన ద్రవ్యంతో ఎక్కువ కాలం సుఖాలను పొందలేం.
- మన తాత్కాలిక సుఖం కొరకు అధర్మ మార్గాన్ని అనుసరించి అమూల్యమైన జీవితకాలాన్ని వృథా చేసుకోరాదు.
- కాలం చాలా విలువైంది. ఒక్క క్షణం కూడా వృథా చేయరాదు. గడచిన కాలం తిరిగి పొందలేం.
- ప్రతి క్షణం విలువైందిగా భావించి ఏదో ఒక మంచి పనిలో నిమగ్నమవ్వాలి.
- మనకు దానం కోరువారు లభించినపుడు యథాశక్తి సమర్పించాలి తప్ప విమర్శించకూడదు.
- యజ్ఞ యాగాదులు జరిగే స్థలాలకు ఆహ్వానం లేకపోయినా వెళ్ళి, దర్శించి, సేవించాలి.
- పరాధీనమైన పనులను వీలైనంత వరకు తగ్గించుకోవడం మంచిది.
- మనం ఎంతవరకు ఏయే పనులు చేయగలుగుతామో, వాటిని మాత్రమే సంపూర్ణ శ్రద్ధతో పూర్తి చేయాలి.
- పవిత్రమైన, పరిశుద్ధమైన భోజనాన్నే స్వీకరించాలి. ఎప్పుడు పడితే అప్పుడు, ఎక్కడ పడితే అక్కడ ఏది దొరికితే అది తినకూడదు.
- సరియైన వేళ ప్రకారం భుజించడాన్ని అలవాటు చేసుకోవాలి.

- దేవతలను పూజించకుండా గృహంలో నివసించరాదు.
- ప్రతిరోజు భోజనానికి ఎంత ప్రాధాన్యం ఇస్తామో దైవసేవకు కూడా అంతకంటే ఎక్కువ ప్రాధాన్యతనివ్వాలి.
- పూజాపద్ధతులు అనేక విధాలుగా ఉంటాయి. మన పెద్దలు చెప్పిన పద్ధతిలోగాని, సాంప్రదాయ పద్ధతిలోగాని చేయవచ్చు.
- మట్టితో తయారుచేసిన దేవతామూర్తులను పూజించిన వారికి కోరిన కోరికలు వెంటనే నెరవేరతాయి.
- మట్టితో చేసిన దేవతామూర్తులను స్త్రీలు, పురుషులెవరైనను పూజించడానికి అర్హులు.
- షోడశోపచారపూజ చాలా శ్రేష్ఠమైంది. మనం పూజించే దేవతలకు 16 ఉపచారాలతో చేసే పూజను 'షోడశోపచారపూజ' అంటారు.
- ఏయే ఉపచారం వల్ల ఏయే ఫలితాలు కలుగుతాయో మనం తెలుసుకుని చేయాలి.
- దేవతలకు అభిషేకం చేస్తే ఆత్మశుద్ధి కలుగుతుంది. గంధం సమర్పిస్తే పుణ్యప్రాప్తి. నైవేద్యం వల్ల ఆయుర్వృద్ధితో పాటు సంతృప్తి లభిస్తుంది. ధూపనివేదన వల్ల ధనప్రాప్తి. దీపం వల్ల జ్ఞానోదయం కలుగుతుంది. తాంబూల సమర్పణతో భోగభాగ్యాలుంటాయి. నమస్కారం వల్ల సమస్తం లభిస్తాయి.



# ౩౦. సులభ మోక్షసాధన

"సోపాన భూతం మోక్షస్య మానుష్యం ప్రాప్య దుర్లభమ్"

మోక్షానికి సోపానభూతమైన మానవజన్మ లభించుట చాలాకష్టం. జన్మ లేకుండా యుండుటకు, ఈ జన్మలోనే మోక్షసాధన ప్రారంభించాలి. మోక్షసాధన వల్ల ప్రస్తుతం కూడా ఆనందానుభూతి లభిస్తుంది. మనం జీవితంలో కోరుకునేది ఒక్కటే. ఎల్లప్పుడూ ఎలాంటి దుఃఖం లేకుండా సుఖంగా ఉండాలనుకుంటాం! ఎల్లప్పుడూ సుఖానుభవాన్నిచ్చేది "మోక్షం". మోక్షాన్ని పొందుటకు సాధన అవసరం. మనం సులభసాధనకే ప్రాధాన్యం ఇస్తాం. మోక్షఫలాన్నిచ్చే సాధనలో మూడు విషయాలు బాగుగా అర్థం చేసుకోవాలి.

ఈ మూడింటిలో మొదటిది ఉపనిషత్తులు. ఇవి మనకు రహస్యవిజ్ఞానాన్ని బోధిస్తాయి. ఇందులో కలిగిన సందేహాలను తీర్చుటకుగాను రెండవది బ్రహ్మసూత్రాలు. సందేహాలు లేని రహస్యవిజ్ఞానాన్ని ఎల్లప్పుడు అనుభవించుటకు మూడవదైన భగవద్గీత అవసరమవుతుంది. అందరికి ఈ మూడు తప్పనిసరికావు. వారివారి శక్త్యానుసారం అర్హతననుసరించి ఉపయోగించుకోవచ్చు. ఉత్తమాధికారులకు ఒక్క ఉపనిషత్తులే సరిపోతాయి. ఈ మూడు దేనికదైనా, లేదా కలసియైన మనకు ప్రసాదించేది మోక్షమే.

ఉపనిషత్తులు మొదలుకొని భగవద్గీతవరకుగల విషయాలన్నీ చక్కగా, ఓపికతో అవగాహన చేసుకోవడానికి ప్రయత్నిద్దాం. మనకున్న అధికారా న్ననుసరించి, శక్తిననుసరించి, జ్ఞానాన్ననుసరించి ముందుకు వెళ్లడమే ప్రస్తుత కర్తవ్యం. సులభ మోక్షసాధనకు ముందుగా కావలసింది రహస్య విజ్ఞానం. మనకు ఉపనిషత్తులద్వారానే రహస్యవిజ్ఞానం తెలుస్తుంది. అసలు 'ఉపనిషత్తు' అంటేనే 'రహస్యవిజ్ఞానం' అని అర్థం. మన అదృష్టమేమిటంటే! జగద్గురు శ్రీ శంకర భగవత్పాదులవారు అందించిన విజ్ఞానాన్ని పెద్దలు మనకందిస్తూ

ఉన్నారు. వారికి మనం ఎల్లప్పుడు ఋణపడి ఉంటాం. ఈ విషయాలన్నీ మన జీవితంలో సద్వినియోగపరచుకుంటేనే వారి ఋణం తీరుతుంది.

సహజంగా మనకు కొంత జ్ఞానం ఉంది. పైగా విశేషజ్ఞానం గూర్చి ప్రయత్నిస్తూనే ఉన్నాం. అయినా రహస్యవిజ్ఞానం ఏమిటి? అనే ప్రశ్న కలుగుతుంది. "మన అనుభవంలో ఏది లేదో అదే రహస్యం". దీని గూర్చిన విషయాలన్నీ "రహస్య విజ్ఞానమే".

**రహస్యవిజ్ఞానం :**

'ఆత్మ' అనేది ఒకటి ఉంది. అది తప్ప దానికి భిన్నంగా వేరొకటి ఏది లేదు. ఈ రెండు విషయాలు వాస్తవానికి మన అనుభవంలోలేవు. ఉన్నదన్న ఆత్మ మనకంటికి కనపడదు. ఆత్మ తప్ప వేరే ఏది లేదనే ఈ ప్రపంచం అంతా ఎక్కడ పడితే అక్కడ కనిపిస్తూనే ఉంది. ఇవి లోకదృష్టికిగాని, శాస్త్రదృష్టికిగాని అందే విషయాలు కావు. కాని ఉపనిషత్తు చెప్పే ఈ రెండు విషయాలు సత్యాలే, రహస్యాలే.

మన అనుభవంలో లేని విషయాలను మనం ఎలా నమ్మటం? అనే ప్రశ్న వస్తుంది. అయితే మన అనుభవంలో ఉండటం, లేకపోవడం అనేదానితో నిమిత్తంలేదు. మన అనుభవంలో ఉన్నదంతా సత్యమని చెప్పలేం. ఒకప్పుడు సత్యం అసత్యంగాను, అసత్యం సత్యంగాను అనుభవానికి వస్తుంది. ఆకాశంలో ఎంతో పెద్దగా వున్న నక్షత్రాలు మన కంటికి చాలా చిన్నవిగా కనిపిస్తాయి. ఎండమావుల్లో నీళ్లనేవి లేకపోయినా పొంగి పారుతున్నట్లే కనిపిస్తాయి. ఒకవేళ అనుభవమే ప్రమాణమైతే, ఈ రెండు ఉదాహరణలు నిజం కావాల్సిందే. అంటే మన అనుభవం వేరు, సత్యం వేరు. అనగా కేవలం అనుభవాన్ని బట్టి సత్యాన్ని తెలుసుకోలేం. సత్యాన్ని తెలుసుకోవాలంటే సహేతుకంగా విచారణ చేయుట ఒక్కటే మార్గం. విచారణ చేయగా, చేయగా చివరికి ఏది నిలుస్తుందో అది మనకు ప్రమాణం. మిగిలినదంతా తాత్కాలికంగా అనుభవానికి వచ్చినా అది అప్రమాణమే. పైన తెలిపిన ప్రస్తుత విషయాలు కూడా మనం బాగుగా విచారణ చేసి నిర్ణయించవలసిందేనని సారాంశం.

ఆకాశం మొదలుకొని భూమి వరకు మనం చూసే ఈ ప్రపంచం అంతా ఒక పెద్ద జడపదార్థం. ఈ జడపదార్థానికి తాను ఉన్నాననే జ్ఞానం లేకపోతే ఉండటానికి వీల్లేదు. ఏదిగాని ఒకటి ఉండాలంటే ఆ ఉనికికి ఒక సాక్షి కూడా ఉండి తీరాలి. సాక్షి లేని ఉనికి సృష్టిలోనే అసంభవం. సాక్షి లేకున్నా ఒక పదార్థం ఉందని చెప్పామంటే కండ్లు లేకుండానే నాకు నీవు కునబడుతున్నావని చెప్పినట్టు అవుతుంది. కావున పదార్థం ఉంటే 'సాక్షి' ఉండి తీరవలసిందే. మరి సాక్షి అనేది ఏదో కాదు. అది 'జ్ఞానమే'. ఇది అచేతనమైన ప్రపంచానికి స్వతస్సిద్ధంగా లేదు. ప్రపంచం యొక్క అస్తిత్వాన్ని కనిపెట్టగల విశేషం ఏది లేదు. విశేషం ఏదైనా చూపగలిగితే అవి నామ, రూప, క్రియలు అనేవి మూడే.

ఈ మూడింటిని బాగుగా విమర్శించి చూస్తే, ఇవి సత్తు, చిత్తులకన్నా వేరుగావు. వేరు అయితే వాటికి ఉనికి లేదు. ప్రకాశత్వం అంతకన్నా లేదు. నామ, రూప, క్రియలనేవి మూడు నామమాత్రమేగాని, వాస్తవానికి అవి సత్తు, చిత్తులే. ఈ సత్తు, చిత్తులనేవి ఆత్మస్వరూపం. ఆత్మస్వరూపానికి, కనిపించే ప్రపంచం వేరుగా లేదు. ఇవి రెండు ఒకటే అయితే. ఉన్నది ఒకే ఒక అఖండమైన 'ఆత్మతత్త్వం'.

పై విషయాలననుసరించి ఉపనిషత్తులు చెప్పినవి నిజమే అని ఋజువైంది. కాని మనకున్న అనుభవం సరియైంది కాదని తెలుస్తుంది. వాస్తవం ఒకవిధంగా ఉంటే, దాన్ని మరొకవిధంగా చూస్తున్నాం. వాస్తవంగా ఉన్నది ఏకాత్మభావం. మనం 'నేను' అని, 'ప్రపంచం' అని అనేకాత్మకంగా చూస్తూన్నాం. దీన్నే 'అజ్ఞానం' అంటారు. అజ్ఞానంవల్ల సత్యం అసత్యంగా, అసత్యం సత్యంగా కనిపిస్తుంది. త్రాడును చూసి పాము అని అనుకుందాం! సత్యమైన త్రాడు లేక, అసత్యమైన పాము కనిపిస్తుంది. ఇది తొలగడానికి వెలుతురులో చూస్తే నిజం తెలిసిపోతుంది. అదేవిధంగా మనం అజ్ఞానంతో సత్యమైన ఆత్మస్వరూపాన్ని గ్రహించక, అసత్యమైన అనాత్మ ప్రపంచాన్ని అనుభవానికి తెచ్చుకుంటున్నాం. మనకు మోక్షం రావాలంటే, ఎప్పటికైనా సత్యమైన ఏకమైన అఖండమైన ఆత్మను దర్శించాల్సిందే.

ఆత్మను దర్శించాలంటే అడ్డువచ్చే అనాత్మ ప్రపంచాన్ని వదలుకోవాలి. ఎలా సాధ్యం. మనకు ఈ అనాత్మ ప్రపంచంతో గాఢమైన సంబంధాలున్నాయి

కదా! కాని ఇవి అజ్ఞానంవల్ల కలిగినవేగాని వాస్తవంకాదు, అనే విషయాన్ని మరచిపోవద్దు. ఒకవేళ ప్రపంచం వాస్తవమే అనుకుందాం! అది మనం ఎంత పోరాడినా తొలగిపోవద్దు. కాని తొలగిపోతున్నాయి కదా! పైగా దుఃఖం మిగులుతుంది. అయితే మనం ప్రపంచాన్ని వదలిపెట్టనవసంరలేదు. దీనికి కారణం అజ్ఞానం అని తెల్సింది కాబట్టి, ఇది తొలగడానికి చేయవలసింది ఒక్కటే! దృష్టి దోషంవల్ల కలిగిందేగాని, వస్తుసిద్ధం కాదు. కావున మనం దృష్టి మార్చుకుని చూడాలి. "సృష్టి మారదు, దృష్టి మారాలి" ఉపనిషత్తులు బోధించే ప్రధాన విషయమిదే.

ఉపనిషత్తులు బోధించే విధానం చాలా చిత్రంగా వుంటుంది. చెప్పవలసింది అభేదం అయినా చెప్పే తీరు మాత్రం భేదరూపం. భేదరూపంగా చెప్పడంవల్ల మనకు సులభంగా అర్థమవుతుంది. మనం భేదరూప ప్రపంచంలో ఉన్నాంకదా! మనం ఎన్నో జన్మలనుండి భేదరూపం చూసి, చూసి, దృఢపడిపోయాం. ఒక్కసారిగా అవి అభేదం చెప్పేసరికి అర్థం చేసుకోలేం. పైగా విశ్వాసం పోతుంది. విశ్వాసం చాలా ముఖ్యం. అందుకే ఉపనిషత్తులు ముందుగా భేదం అనేది లేకపోయినా, ముందు దాన్ని ఆరోపించి చెబుతుంది. తర్వాత సహేతుకంగా విచారించి, దాన్నే కాదని త్రోసిపుచ్చుతుంది. మనం జాగ్రత్తగా అవగాహన చేసుకుంటూ పోతే, అసలైన విషయం మన అనుభవానికి వచ్చి తీరుతుంది. ఇందులో ఎలాంటి సందేహం లేదు. స్వానుభవమే సరియైన సమాధానం.

మనకు కనిపిస్తున్న, కనిపించని ప్రపంచం అంతా ఈశ్వరచైతన్యంతో నిండి వుంది. మనం ఆ ఈశ్వర చైతన్యాన్ని ఆత్మతత్త్వంగా స్వీకరిస్తూ, నామరూపమైన ప్రపంచాన్ని వదిలివేస్తూ ఉండాలి. నామ, రూపాలను వదులుతూ ఉంటే, సచ్చిద్రూపమైన 'ఆత్మతత్త్వం' అనుభవానికి వస్తుంది. నామ, రూపాలనేవి వాస్తవంలో లేవు. లేకపోయినా అవి ఉన్నట్టు భావిస్తున్నాం. దీనివల్ల మనల్ని ఆకర్షిస్తుంది. అర్థంమీద మనసుంటే పరమార్థం లభించదు. అది ధనం కాదు, మనం దాన్ని ఆశించవద్దు. మన మనస్సులో నామ, రూపాలను రానీయకూడదంటే, వాటిని మన స్వరూపంగా దర్శించాలి. అలా దర్శించగలిగితే అంతా ఆత్మస్వరూపమే. మనకు ఇక దుఃఖం ఉండదు. మోహం ఉండదు. ఇలా

చెప్పడం తేలికేగాని, అనుభవంలో అందరికీ సాధ్యమవుతుందా? ఏకత్వదర్శనం అందరికి సాధ్యం కాకపోవచ్చు. కాని సాధన చేస్తూ ఉండాలి.

ఏకత్వ దర్శనం సాధ్యంకాని కొందరు అవిద్యను, కొందరు విద్యను పట్టుకొంటున్నారు. అవిద్య అంటే కర్మ. విద్య అంటే ఉపాసన. కొందరు అవిద్యనాశ్రయించి జీవితమంతా కర్మలు చేస్తూనే ఉంటారు. వీరు మృత్యువును దాటిపోతారు. మృత్యువును దాటడం అంటే మోక్షంకాదు. స్వాభావికమైన కర్మ మృత్యువు. దీన్ని శాస్త్రోదితమైన కర్మాచరణతో నిర్మూలించి, స్థూలదేహం పతనం అయిన తర్వాత, సూక్ష్మదేహంతో ధూమయానం చేసి, పితృలోకాన్ని చేరతారు. ఇంతకుమించి కర్మలవల్ల మోక్షాన్ని పొందలేం. **"విద్యయా మృత మశ్నుతే".**

విద్యవల్ల అమృతత్వం వస్తుంది. ఇది కూడా మోక్షం కాదు. ఇంద్రావరుణాదులైన దేవతలను ఉపాసన చేసి, వారి సాయుజ్యాన్ని పొందుతారు. తద్వారా వారి లోకాల్లో కొంతకాలం సుఖాలను అనుభవిస్తారు. ఈ సుఖాలన్నీ తాత్కాలికమేగాని శాశ్వతం కావు. కర్మకాండలను ఆచరించువారు, దేవలోకాలకు వెళ్లే ఉపాసకులు తిరిగి జన్మించాల్సిందే. **'పునరపి జననం, పునరపి మరణం'** అన్నట్లుగా వీరికి జనన, మరణాదులు తప్పవు. కావున విద్య, అవిద్యలు రెండూ మోక్షానికి ఉపయోగపడవు.

పై రెండు కూడా నామ, రూపాలను పరిధిని దాటిపోలేవు. నామ, రూపాలను దాటిపోనంత వరకు మనం ఆత్మస్వరూపాన్ని దర్శించలేం. ఎవరెవరి యోగ్యతానుసారం వారు కర్మలను ఆచరించవలసిందే, ఉపాసన చేయవలసిందే. అయితే మోక్షసాధనకై కర్మలను, ఉపాసనలను చేయకూడదని గాకుండా, ఇవి చేస్తూనే మోక్షసాధనకు ప్రయత్నం చేయాల్సిన అవసరం వుంది. నామ, రూపాలను మనం వదలివేస్తూ, మన స్వరూపంగా భావిద్దాం.



# అనుబంధం

# శ్రీ మహాకాల మందిర విశేషం

హైదరాబాద్ ఉప్పల్ బస్‌డిపో దగ్గరవున్న మేడిపల్లి - విశ్వంవిహార్‌లో శ్రీమహాకాల మందిరం నిర్మంచబడింది.

ఈ మందిరంలో 'శ్రీమహాకాల విశ్వరూపుడే' ప్రధానదైవం. మూల విగ్రహం సుమారు రెండున్నర (2½) అడుగుల ఎత్తులో పంచలోహాలతో సర్వాంగసుందరంగా మలచబడింది. ఇట్టి మూలమూర్తి మనకు ఎక్కడా కనిపించదు. ఎక్కడైనా 'శివలింగం' చూస్తాం. కాని ఒకే శివలింగానికి అనేక మూర్తులను చూడలేం. శివుడియొక్క అనేక రూపాలలో ఏకాదశరుద్రులేవిధంగా వున్నారో అదేవిధంగా శ్రీమహాకాల విగ్రహంలో ఏకాదశమూర్తులున్నారు.

**శ్రీమహాకాలవిశ్వరూపం :**

**శ్లో॥ శ్రీవిఘ్నేశ్వర కాలభైరవ విభో శ్రీసిద్ధ కుంజీశ్వరీ ।**
**సుబ్రహ్మణ్య మనఃప్రసన్న గరుడ ధ్యానాంజనేయప్రభు ।**
**జ్ఞానాదిత్య ఫణీంద్ర దివ్య బదరీనారాయణాద్యైః సురైః ।**
**భాస్వంతం సముపాస్మహే హృది మహాకాలం సుకూర్మాసనమ్ ॥**

శివలింగం ప్రధానంగా రెండు భాగాలు. దిగువభాగాన్ని పానవట్టం అంటారు.

శ్రీమహాకాల శివలింగం వృత్తాకార గర్భాలయ మధ్యభాగంలోని కమలంపై వుంది.

1. శ్రీకూర్మ నారాయణమూర్తితో శివలింగం యొక్క పానవట్టం ప్రారంభమవుతుంది.
2. శ్రీకూర్మంపై రెండు నాగేంద్రులు (అనంతుడు, వాసుకి) కలిపి మిగతా పానవట్టంగా అల్లుకుపోతాయి.

3. పానవట్టానికి తూర్పువైపున శ్రీయోగగణపతి దర్శనమిస్తాడు.

4. పానవట్టం యొక్క దక్షిణభాగాన కాలభైరవుడు కూర్చుని యున్నాడు.

5. పానవట్టం పడమరవైపు అనగా శివలింగం వెనుక భాగాన ధ్యానాంజనేయమూర్తి.

6. పానవట్టానికి ఉత్తరాన సోమసూత్రం దిగువన ప్రసన్న గరుత్మంతుడు కొలువైయున్నాడు.

7. శివలింగం పైభాగాన్ని బాణం అంటారు. ఈ బాణానికి తూర్పున శ్రీసిద్ధకుంజికాదేవి ఉంది.

8. దక్షిణభాగాన ఆరు ముఖాలతో శ్రీసుబ్రహ్మణ్యస్వామి దర్శనమిస్తాడు.

9. బాణానికి పడమరవైపున కర్మసాక్షియైన శ్రీసూర్యభగవానుడే జ్ఞానాదిత్యుడు.

10. బాణం యొక్క ఉత్తరాన ధ్యానముద్రలో వున్న శ్రీబదరీ నారాయణుడు కొలువై వున్నాడు.

11. బాణంయొక్క పైభాగం సాక్షాత్తు పరమేశ్వరుడు శ్రీమహాకాల విశ్వరూపుడుగా అనుగ్రహిస్తాడు.

పై ఏకాదశ మూర్తులలో శివపంచాయతనంతో పాటు శివపరివారం వుంది. శ్రీమహావిష్ణు వాహనమైన గరుడుడు, శ్రీశివాంశ సంభూతుడైన ఆంజనేయుడు ప్రత్యేకంగా యున్నారు. ఏ ఉగ్ర అవతారంలోనైనా రుద్రాంశ ఖచ్చితంగా వుంటుంది. అలాగే శ్రీకూర్మ నారాయణ అవతారంలో కూడా శివాంశ యున్నట్లుగా శ్రీశివమహాపురాణంలో వుంది.

**శ్రీ సిద్ధకుంజికాదేవి :** మన ప్రాంతంలో శ్రీసిద్ధకుంజికాదేవి ఎక్కువ ప్రచారంలో లేదు. కాని ప్రత్యేకంగా చండీసప్తశతికి ఎంత ప్రాధాన్యం వుందో శ్రీసిద్ధకుంజికా స్తోత్రానికి అంత ప్రాధాన్యత యుంది. శ్రీమహాకాళీ, మహాలక్ష్మీ, మహాసరస్వతీ రూపాలతో విరాజమానమైంది శ్రీసిద్ధకుంజికాదేవి.

**శ్లో॥ శ్రీదేవీం వరదాభయకరీం, శూలం వహంతీం అసిం ।**
**త్రాస్యాం షడ్భుజ రూపిణీం మహాకాళీం ప్రసన్ననాం ।**
**దివ్యజ్ఞాన విదగ్రణీనుత మహాలక్ష్మీం జగన్మాతరం**
**వీణాపాణిం అహంభజే, వాణీం సిద్ధకుంజీశ్వరీమ్ ॥**

మూడు ముఖాలు, ఆరు భుజాలతో, తగిన ఆయుధాలతో ప్రసన్నురాలైన మహాకాళీ, మహాలక్ష్మీ, మహాసరస్వతీ స్వరూపిణియైన సిద్ధకుంజికాదేవి మనల్ని అనుగ్రహిస్తుంది. అట్టి పరమేశ్వరిని ఎల్లప్పుడు భజిస్తున్నాను.

అర్ధనారీశ్వరుడైన శివునిలో పరమేశ్వరిగా శ్రీసిద్ధకుంజికాదేవి దర్శనమిస్తుంది. ఏకమూర్తిలో అనేకరూపాలను దర్శించుకోవడమే శ్రీమహాకాల విశ్వరూప విశేషం. కేవలం దర్శనమాత్రం చేతనే మన సకల కోరికలు సిద్ధిస్తాయి. సర్వవిఘ్నాలు నశిస్తాయి.

జ్యోతిర్మయ మహాపీఠంలో శ్రీమహాకాల విశ్వరూప మందిరమే ప్రధానం.



# దివ్యజ్ఞాన సేవా కేంద్రమ్

జ్యోతిర్మయ మహాపీఠంలో అంతర్భాగంగా **'దివ్యజ్ఞాన సేవా కేంద్రమ్'** రూపొందించబడింది.

**1) దైవసేవ :** దైవసేవయే ప్రధానంగా గైకొని శ్రీమహాకాల మందిరం నిర్మించబడింది. ఇందులో నిరంతరం అనగా ప్రతిరోజు ఉత్సవంలాగా నిత్యోత్సవంగా దైవసేవా కార్యక్రమాలు జరుగుతాయి.

లోకకళ్యాణార్థం, సమాజ సేవయే లక్ష్యంగా దివ్యజ్ఞాన సేవాకేంద్రం కృషి చేయుటకు సిద్ధంగా వుంది.

**2) జ్ఞానసేవ :** ప్రతి సంవత్సరం సమాజానికి నిరంతరం ఉపయోగపడే పంచాంగం, క్యాలెండర్లను, దివ్యజ్ఞాన పంచాంగ, క్యాలెండర్లుగా ప్రచురించి అందిస్తున్నాం. ఇంకా ఆధ్యాత్మిక, ధార్మిక, జ్యోతిష, నైతిక విషయాలకు సంబంధించిన సద్గ్రంథాలను అనుకూలాన్ననుసరించి ప్రచురింపజేయుట జరుగుతోంది.

**3) గో సేవ :** జ్యోతిర్మయ మహాపీఠంలో ఎల్లప్పుడు 'గో సేవ' జరుపుటకు ప్రత్యేక ఏర్పాటు చేయడమైంది.

శ్రీమహాకాల మందిరానికి కుడివైపున గోశాలను నిర్మించడమైంది. ఇందులో **'సవత్సధేనువు'** అనగా దూడతో కూడిన ఒక ఆవును మనం రోజు పూజించుకోవచ్చు. దీని పాలు శ్రీమహాకాల విశ్వరూప మూలమూర్తికి నివేదనం మరియు స్ఫటిక శివలింగ ఉత్సవమూర్తి అభిషేకానికి ఉపయోగపడతాయి.

గోమయంతో స్థలశుద్ధి, గోమూత్రంలో ఆలయశుద్ధి కార్యక్రమాలు జరుగుతాయి.

4) **యజ్ఞశాల (అగ్నిసేవ) :** శ్రీమహాకాల మందిరానికి ఎడమవైపున ఈశాన్యభాగంలో ప్రత్యేకంగా నిర్మించిన యాగశాలలో ప్రతి ఆదివారం మరియ మాసశివరాత్రి పర్వదినాల్లో ప్రత్యేక హెూమకార్యక్రమాలు జరుగుతాయి.

   సంపూర్ణ శ్రద్ధాసక్తులతో సంప్రదించువారికి వ్యక్తిగతంగా ఒకే కుటుంబం గూర్చి మండలదీక్షా విధానంతో నిత్యపూజా, అభిషేక, హెూమకార్యక్రమాలు ఉంటాయి.

5) **అతిథిసేవ (సమాజసేవ) :** ఎవరైనా సరే! భోజన సమయంలో వచ్చినవారికి, ఆకలిగొన్నవారికి మహాప్రసాద రూపంలో ఆహారం, దప్పిక గొన్నవారికి మంచినీరు అందించు ప్రయత్నం జరుగుతుంది.

సుదూర ప్రాంతం నుండి దర్శనార్థమై లేదా అనుష్ఠానం గూర్చి (పూజా, హెూమకార్యక్రమాలకు) వచ్చువారికి ప్రత్యేక వసతి ఏర్పాటు చేయబడింది.

**విశేషసేవలు :**

'దివ్యజ్ఞాన సేవాకేంద్రమ్' ద్వారా అనాథబాలురకు వసతి, భోజనం, విద్య మొదలగు ఏర్పాట్లు జ్యోతిర్మయ మహాపీఠ ఆత్మీయ అభిమానులతో ఏర్పాటు చేయబడుతుంది. ప్రస్తుతం విశ్వంవిహార్‌లో 11 మంది అనాథ బాలబాలికలు ఆశ్రయాన్ని పొంది సేవలందుకొనుచున్నారు.

జ్యోతిర్మయ మహాపీఠం ద్వారా అభిమానులు ముందుకు వచ్చి సమీపంలో ఉచిత అనాథవృద్ధాశ్రమం నిర్మాణానికి శంకుస్థాపన చేయుట కూడా జరిగింది.

**॥ సర్వేజనా స్సుఖినో భవంతు ॥**



# బ్రహ్మశ్రీ గౌరీభట్ల విట్ఠలశర్మ సిద్ధాంతి (దివ్యజ్ఞాన సిద్ధాంతి)



**జననం** శ్రీక్రోధి ఆషాఢ బ॥పంచమి, బుధవారం

**జన్మస్థలం** గ్రా॥ నెమిల, జిల్లా నల్లగొండ

**తల్లిదండ్రులు** కీ॥శే॥ గౌ॥కృష్ణమూర్తిశర్మ గారు,
శ్రీమతి రాజేశ్వరీ దేవి గారు

**సతీమణి** శ్రీమతి గౌ॥ రమాదేవి

**తోబుట్టువులు**

సోదరి శ్రీమతి మదునూరి రమాదేవి, బ్రహ్మశ్రీ రామానందశర్మ గారు

**అత్తమామలు**

కీ॥శే॥ మహాత్మ అప్పాల విశ్వనాథశర్మ, శ్రీమతి కాత్యాయని దేవి గారలు

**సంతానం**

1. గౌ॥రామకృష్ణశర్మ శ్రీమతి వాసవి – చి॥ అభిజ్ఞ, 2. గౌ॥ బాలకృష్ణశర్మ,
3.శ్రీమతి కాశావర్ఝుల కృష్ణప్రియాదేవి,బ్ర.శ్రీ సత్యరాజరామచంద్రమూర్తిశర్మ–చి॥ బృహతి

**విద్యాభ్యాసం**

డ్రాయింగ్ డిప్లమా, ఎం.ఎ.(సంస్కృతం), ఎం.ఎ.(జ్యోతిషం)

**వృత్తి**

చిత్రలేఖనోపాధ్యాయులు, జిల్లా మెదక్ (2010లో స్వచ్ఛంద పదవి విరమణ)

**విశేషాలు**

గత 20 సం॥ల నుండి దివ్యజ్ఞాన పంచాంగం, క్యాలెండర్‌ల రచన.
హైదరాబాద్‌లో జ్యోతిర్మయ మహా పీఠమ్, దివ్యజ్ఞాన సేవా కేంద్రమ్‌ల స్థాపన.
నిరంతరం శ్రీ సిద్ధకుంజికా విశ్వరూప మహాకాల ధ్యాన సాధన, వేదాంత చింతన.
దర్శనమ్ ఆధ్యాత్మిక వార్తామాసపత్రిక ద్వారా జ్యోతిష, ఆధ్యాత్మిక, ధార్మిక వ్యాసాల రచన.
జగద్గురు శ్రీ ఆదిశంకరుల అద్వైత సిద్ధాంత బోధలను వ్యవహార శైలిలో
ప్రస్తుత కాలానుగుణంగా భావాద్వైత సిద్ధాంతమ్ అను పేర ప్రచారమునకు శ్రీకారం.

## దివ్యజ్ఞాన సేవా కేంద్రమ్

(జ్యోతిర్మయ మహా పీఠమ్)

విశ్వం విహార్, మేడిపల్లి (ఔదుంబరపురి), ఉప్పల్ బస్‌డిపో తర్వాత, హైదరాబాద్–98,
ఫోన్ – 040–6544 3313, 98495 67669







పదేళ్ళ ప్రస్థానంలో...

120 సంచికలు...

10 విశిష్ట సంచికలు...

మహాత్ములకు గురువందనాలు....

అనేక ఆధ్యాత్మిక కార్యక్రమాలు..







మహాత్ముల దివ్యాశీస్సులు... పాఠక దేవుళ్ళ ఆదరణతో ...







పది వసంతాలు పూర్తిచేసుకున్న దర్శనమ్